ఓం

శ్రీకృష్ణ నిజగురు పరబ్రహ్మణేనమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్త్వ కందములు

అను

శ్రీ మద్బృహద్వాశిష్ఠ సిద్ధాంత నిర్ధారణోద్ధారకులగు
శ్రీ శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయిక
శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే రచింపబడి,
శ్రీ మత్పరశురామ సీతారామస్వాములవారిచే పరిష్కరింపబడి
ఏతత్పీఠ సాంప్రదాయకులైన
శ్రీ నిర్గుణానంద పేరూరు రామలింగాచార్యుల ప్రియశిష్యులు
భూమానంద్
శ్రీ దువ్వాడ నారాయణమూర్తిచే తాత్పర్యములనే

# భావార్థ ప్రకాశిక

వ్రాయబడి, శ్రీ నరసన్నపేట అచలగురు పీఠాధ్యక్షులగు
శ్రీ కూరాకుల రంగనాథ పంచదశీ స్వామిచే పరిచూడబడి
శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తిచే
ప్రచురింపబడియె.

1986

మూడవ కూర్పు 500

 ★ [వెల : రు. 20-00

ఓం

శ్రీకృష్ణ నిజగురు పరబ్రహ్మణేనమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్త్వ కందములు

ఇతి

శ్రీ మద్బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులగు
శ్రీ శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయక
శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే రచింపబడి,
శ్రీ మత్పరశురామ సీతారామస్వాములవారిచే పరిష్కరింపబడి
ఏతత్పీఠ సాంప్రదాయకులైన
శ్రీ నిర్గుణానంద పేరూరు రామలింగాచార్యుల ప్రియశిష్యులు
భూమానంద్
శ్రీ దువ్వాడ నారాయణమూర్తిచే తాత్పర్యములనే

# భావార్థ ప్రకాశిక

వ్రాయబడి, శ్రీ నరసన్నపేట అచలగురు పీఠాధ్యక్షులగు
శ్రీ కూరాకుల రంగనాథ పంచదశీ స్వామిచే పరిచూడబడి
శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తిచే
ప్రచురింపబడియె.

**1986**

మూడవ కూర్పు 500

 ★ [వెల : రు. 20-00

284,85,86
170
119,118
116,115
Missing Pages

ఓం

శ్రీకృష్ణ నిజగురు పరబ్రహ్మణేనమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్త్వ కందములు

ఇతి

శ్రీ మద్బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులగు
శ్రీ శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయక
శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే రచింపబడి
శ్రీ మత్పరశురామ సీతారామస్వాములవారిచే పరిష్కరింపబడి
ఏతత్పీఠ సాంప్రదాయకులైన
శ్రీ నిర్గుణానంద పేరూరు రామలింగాచార్యుల ప్రియశిష్యులు
భూమానంద్
శ్రీ దువ్వాడ నారాయణమూర్తిచే తాత్పర్యములనే

# భావార్థ ప్రకాశిక

వ్రాయబడి, శ్రీ నరసన్నపేట అచలగురు పీఠాధ్యక్షులగు
శ్రీ కూరాకుల రంగనాథ పంచదశీ స్వామిచే పరిచూడబడి
శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తిచే
ప్రచురింపబడియె.

**1986**

మూడవ కూర్పు 500

 ★ [వెల: రు. **20-00**

నిజగురు పరబ్రహ్మణేనమః

శ్రీ శివరామదీక్షిత పీఠసాంప్రదాయకులకు విజ్ఞప్తి.

శ్రీ యచలపరిపూర్ణ జిజ్ఞాస యశరీరసద్గురు సార్వభౌములారా !
శ్రీ పరమార్థ పారాయణ శిష్య భక్తాగ్రగణ్యులారా !
అహం పదార్థరహిత మహాశయులారా !

శ్లో॥ జ్ఞానమజ్ఞానసం దృష్ట్వా । ద్వయో స్త్యజతినిశ్చయం
ద్వయో స్త్యజతియత్ జ్ఞానం । తత్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥
అను నార్యోక్తి ననుసరించి :—

శ్రీ మద్బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారక పరమ గురు దేవులైన శ్రీమద్రా మడుగు శివరామదీక్షిత యచలగురు పీఠ సాంప్రదాయక పీఠాధిపతులగు శ్రీ మత్పరశురామ శీతారామస్వాములవారి ప్రియశిష్యరత్న శ్రేష్ఠులగు శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువరులచే రచియింపఁబడిన శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థ దర్వులున్నూ, క్షరాక్షరోపాది ద్వయదోష రహిత పరమతత్వ కంద పద్యములున్నూ, వీటియొక్క గూఢార్థ భావామృతమైన సారాంశము తేటతెల్లముగా తెలియజేయ నెంతవారికి అలవికాదు, యేమన యెంత వారి కంత యర్థమే యగునట్లు యొప్పుచున్నవి. యేతత్ కృష్ణ దేశికులవారంత వారై తేనేగాని వారియొక్క నిజభావామృతము అపారముగా గ్రోలి వాటియొక్క నిజసారాంశమును గ్రహించి, సంపంగి సూనము జేరిన బృంగముతీరుగా అనుభవరహిత విశేష సారాంశము ఖండ చక్కెర నోటనిడుకొన్న చందంబుగా వ్రాయుట కెంతయో అసమంజసము. కావున యేతత్ ప్రభువారి నిజగూఢార్థ భావాంతరార్థంబుల తత్వార్థ లక్ష్యార్థంబుల నంతయు, చెరుకుమేయు అడవిఘుర్ఘురము పోల్కెవున్నంత గూఢార్థ సారాంశమూ టీకాతాత్పర్య సహితంబుగా వ్రాయవలెనంటే 50 వందల పేజీల యుగ్రంథంబౌను, అందునుగురించి

గొప్పయూగాక కొద్దియూగాక మెప్పునూ లేక యొప్పుగా నొప్పుందగు నటుల యేతత్ పీఠ సాంప్రదాయకులగు పేరూరువంశాబ్ధి పూర్ణచంద్రు డైన శ్రీరామలింగాచార్య జ్ఞానానందులవారి ప్రియ శిష్య రత్న శ్రేష్ఠుడు శ్రీ దువ్వాడ వంశపయః పారావార రాకా సుధాకరుండగు (శ్రీ భూమానంద) నారాయణమూర్తి కవిగారు శ్రీ కృష్ణదేశిక ప్రభువు రచియించిన కందార్థములకు కందపద్యములకూ తాత్పర్య భావార్థ ములు వ్రాయబడినది, గాన యేతత్ప్రీఠ సాంప్రదాయక సద్గురు బృంధ ముల ప్రోత్సాహము చేరనున్న యూవన్మంది సద్గురు శిష్య భక్త మండలీ కావలయునని కోరుటచేతనూ యీ సద్గ్రంథము కూర్చ చేయించవలసివచ్చినది. యీ సద్గ్రంధ పారాయణ మహాశయులందరూ యిందు మంచిని గ్రహించి యిందలి లోపములను హంసక్షీరోదక న్యాయముగా గ్రహించగలరని భావిస్తూయున్నాను.

ఇట్లు, అచలగురు పుత్రులు శ్రీ కూరాకుల రంగనాధ పంచదశీస్వామి,
నరసన్నపేట.

---

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ దువ్వాడ నారాయణమూర్తి భూమానంద స్వాములవారికి
భక్తులు ప్రేమతో సమర్పించిన, నవరత్న పద్యమాల.

శా॥ శ్రీ మద్దివ్యరమాలలామ నుతుల న్సేవింప జే న్పొందుచున్
వేమారు న్బుధభక్తశ్రేణి గొలువ న్వంచేసి దీపించు స
ద్యోమా తీత పరం వశీకరుడు శ్రీ దువ్వాడ వంశాబ్ధికిన్
భూమానంద యశ ప్రభాను దలతున్ పూర్ణాత్మునారాయణున్. 1

సీ॥ శ్రీ గౌతమీనదీ చేరువయుండను వసుధ పందలపాక వనరుసదన
విఖ్యాంతిగాంచిన విశ్వబ్రాహ్మణవర్ణ దువ్వాడవంశచంద్రుండుసుజన
వరసోమలింగాఖ్య వ్రతశీల సాధ్విసన్యాసాంబ సుకృత గుణాత్మసూన

పేరూరు వంశాబ్ధి శ్రీరామ యచల జ్ఞా । నా నందస్వామి శిష్యాగ్ర
నిపుణ ।
ప్రావిధ్య తీతమౌ । భవజిత పరమార్థ । ప్రియసత్కవిత పూర్ణ
పెన్నిదాన ॥

గీ॥ సమత సన్మాన । భూమదీక్షాభిదాన । పరమపావన భక్తుల భవ
విహరణ ॥
దీనజన శరణ । యుదారదానకరుణ । నవని నారాయణమూర్తి
నామకరణ ॥ 2

చ॥ పుడమిని గామలోభ మభమోహతి మింగిల నక్రజాలముల్
గడవగ రానిదై కడు నగాధము నౌభవఘోర వారధిన్
బడయుగ నీక నౌకవలె భారము లేక తరింపజేయుగా
విడువని పూర్ణసింధు భ్రమవీడ నయంబు భయంబు దీర్చిమా
వడిదుడు కెల్లబాపిన ప్రభావయతీత శుభ ప్రభూమమా ॥ 3

సీ॥ రమ్యశుద్ధాచల రత్నాకరంబను । గ్రంధంబు ప్రథమముద్రణము జేసి
ప్రేమ యతీతమౌ । రామయాచలడింది । మముక్షువుల
ముదమునుగూర్చి ॥
గురుధర్మముల భక్తి । గురునిల్పు కొనరక్తి । సద్గురు గీతా
మృతము రచించి ॥
స్థిరమొనగూర్చెడు । పరిపూర్ణబోధను । గీతారహస్యంబు కేలమర్చి

గీ॥ భక్తులకు పరముజేకూర్చి । రక్తిదేర్చి । భాగవత కృష్ణదేశికు
పరమకంద ॥
పద్యములకును కందార్థ । దర్వులకును । తగిన భావార్థములు వ్రాసి
తనియుగ్రోలు । భక్తుల తరింపజేసిన పరమ కవిత ॥ 4

ఉ॥ ధీరుడు రామలింగ గురుదేవుని దీవనలందె సజ్జనో
ద్ధారుడు కర్మపాశ దురితాటవి నిర్మల వాహ్ని చేత సం

హారుడు శిష్యకోటి వరహాటక మానస రత్నపీఠ సం
చారుడు సర్వధర్మ సువిచారణ భక్తులగోఁల జేయు స
ద్వీరుడు కేవలాత్మునకు వేరగునా పరిపూర్ణ నైపుణిన్ ॥ 5

మ॥ నికరంబైన పరంబు నమ్మి త్వరలో నిర్వ్యాడి నిత్యాత్మమున్
నకళంకంబగు ధర్మబోధ వెలయన్ నాశక్తి సశ్శిష్యులన్
వికలంబౌ భ్రమవీడ జేతువుసదా వేదాంతసద్బోధచే
సకలం దెల్పిన సర్వసాక్షి రహితున్ సర్వాత్మ సంసేవితున్ ॥ 6

ఉ॥ దంబజితాదీ జిష్ణు జగదాత్మిక నిర్జిత కృష్ణు శిష్య సం
రంబితదీక్ష హృత్కమల రమ్యచరిష్ణు సురాళిమౌని రా
డింబు సమానభూష్ణు తరదీనుల బ్రోవ సహిష్ణు ధీని రా
లంబున దృష్ణు మజ్జగము లాదర విష్ణు భవిష్ణు భూమమున్ ॥ 7

మ॥ పురుషార్థంబను ధర్మమార్గతతులన్ పూర్ణప్రభారాసి భా
స్కరు తేజంబున నుద్ధరింప నళినీ సద్ధర్మ సూనావళిన్
నరయన్ వేపుగ వృద్ధిబొంది వికసింపన్ జెయునట్లెంత యో
పరమార్థంబును దెల్పి శ్రోతువుగదా ప్రాతీత నారాయణా ॥ 8

మ॥ లలితావేధ కలాకలాపములచే శ్లాఘింపగా నొప్పు వా
రలలో నిర్మల సత్వశీలుడగు నీ నారాయణమూర్తి కో
మల సత్కీర్తుల రంజిలన్ దశదిశామార్తాండ సంత్యులమై
వెలయుంగాది త్రివేద బృందముల దేవేంద్రాది నివాసముల్
గల బూషాంబర షోటకాధి సిరున్ గాంతి ప్రమోదాంశమున్
వెలయన్నీకివె మంగళారతులు సద్విఖ్యాతి సౌఖ్యోన్నతుల్ ॥ 9

ఇట్లు, రచయిత
శ్రీ శ్రీలామంతుల సూర్యనారాయణ
బాలభారతీ నమూలస్వామి, మండపేట
అల్మకాం కు తు కు లూ రు.

## శ్రీ శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయక భక్తమండలీవారు

| | |
|---|---|
| శ్రీ గుండా ఈశ్వరయ్యగారు | సికింద్రాబాదు |
| ,, కొండోజు బ్రహ్మనందంగారు | సికింద్రాబాదు |
| ,, రామేన ఆదినారాయణగారు (పూర్ణానంద) | రాజమండ్రి |
| ,, మాదాబత్తుల అప్పారావుగారు (అచలానంద) | రాజమండ్రి |
| ,, కోన సూర్యనారాయణగారు (వాస్తుసిద్ధాంత) | తాడేపల్లిగూడెం |
| ,, వచ్చిపులుసు సత్యంగారు (నిర్మలానంద) | తాడేపల్లిగూడెం |
| ,, సజ్జా రామమూర్తిగారు (బోధానంద) | ఆచంట |
| ,, కూరాకుల రాంబాబుగారు (నిశ్చలానంద) | నరసన్నపేట |
| ,, పొన్నగంటి రామమూర్తి (బ్రహ్మనందం) గారు | కన్నప్పదొరవలస |
| ,, పొన్నగంటి చినబాబుగారు | కన్నప్పదొరవలస |
| ,, నల్లమిల్లి గంగిరెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, నల్లమిల్లి లక్ష్మణరెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, సత్తి నారాయణరెడ్డిగారు | కొమరపాలెం |
| ,, మురమళ్ళ పేరాచార్యులుగారు (సమరసనిర్మలానంద) | వెదురుపాక |
| ,, దార్ల సూర్యనారాయణగారు (పూర్ణానంద) | కొమరపాలెం |
| ,, వఝ్ఝల శ్రీరామమూర్తి గారు (అచలానంద) | వెదురుపాక |
| ,, ముమ్మిడి మల్లయ్యగారు (పూర్ణానంద) | ద్వారపూడి |
| ,, పడాల పాపారెడ్డిగారు | పందలపాక |
| ,, కరణం లక్ష్మణరావుగారు | శ్రీకాకుళం |
| ,, పడాల సూర్యనారాయణగారు | శ్రీకాకుళం |
| ,, పడాల సత్యన్నారాయణగారు | శ్రీకాకుళం |
| ,, కానూరు కొండాచార్యులగారు | తాపేశ్వరం |
| ,, కానూరు వెంకటరమణగారు | తాపేశ్వరం |
| ,, కానూరు సత్యంమూర్తిగారు | రామచంద్రపురం |

## స్త్రీలు

| | |
|---|---|
| శ్రీమతి కూరాకుల పార్వతమ్మగారు (విమలాంబ) | నరసన్నపేట |
| ,, పడాల రసనయ్యమ్మ (అచలాంబ) | శ్రీకాకుళం |
| ,, కొవ్వూరు మంగయ్యమ్మ | పందలపాక |
| ,, ద్వారంపూడి సుబ్బయ్యమ్మ | పందలపాక |
| ,, కానూరు కాంతమ్మ (విమలాంబ) | పందలపాక |
| ,, మల్లిడి చింతల్లమ్మ | పందలపాక |
| ,, మల్లిడి మాణిక్యమ్మ | పందలపాక |
| ,, పడాల వెంకయ్యమ్మ | పందలపాక |
| ,, పడాల మునమ్మగారు | పందలపాక |
| ,, పడాల చెల్లయ్యమ్మగారు | పందలపాక |
| ,, పడాల సూర్యకాంతమ్మ | పందలపాక |
| ,, నల్లమిల్లి సుబ్బయ్యమ్మగారు | పందలపాక |
| ,, సత్తి సత్యవతి | కొంకుదురు |
| ,, కొవ్వూరు బాపయ్యమ్మ | కొంకుదురు |
| ,, చిన్నం సరోజిని | కొంకుదురు |
| ,, చిన్నం జయలక్ష్మి | కొంకుదురు |
| ,, కర్రి రాజేశ్వరి | కొమరిపాలెం |
| ,, దార్ల లక్ష్మీకాంతమ్మ | కొమరిపాలెం |
| ,, వెలగల బుల్లి సూరమ్మ | గొల్లలమామిడాడ |
| ,, నల్లమిల్లి సీతయ్యమ్మ | |
| ,, కొవ్వూరు మహలక్ష్మమ్మ | |
| ,, కరిశి అదియ్యమ్మ | |
| ,, కొవ్వూరు శేషగిరి | |

| | |
|---|---|
| శ్రీమతి నల్లమిల్లి కాంతమ్మ | |
| ,, నల్లమిల్లి జియ్యమ్మ | |
| ,, పులగం రాజేశ్వరమ్మ | |
| ,, సత్తి సీతయ్యమ్మ | |
| ,, సత్తి మంగయ్యమ్మ | |
| ,, సబ్బెళ్ళ మంగయ్యమ్మ | |
| ,, సబ్బెళ్ళ సావిత్రి | గొల్లలమామిడాడ |
| ,, సత్తి సుబ్బయ్యమ్మ | పొలమూరు |
| ,, సబ్బెళ్ళ బుల్లి వెంకయ్యమ్మ | అనపర్తి |
| ,, కర్రి ఆదియ్యమ్మ | అనపర్తి |
| ,, ముఠమళ్ళ వీరభద్రమ్మ | వెదురుపాక |
| ,, ముఠమళ్ళ వరహాలమ్మ | వెదురుపాక |
| ,, పట్నాల సత్యవతమ్మ | వెదురుపాక |
| ,, పల్లి పాపమ్మ, | రాజమండ్రి |
| ,, వంజరాని పైడమగుర్విణీ | రాజమండ్రి |
| ,, రామేన సన్యాసాంబ | రాజమండ్రి |
| ,, బండారు సత్యవతమ్మ | రాజమండ్రి |
| ,, రెడ్డి గంగాభవానీ | రాజమండ్రి |
| ,, ఈర్లు రాజేశ్వరమ్మ | అన్నవరం |
| ,, తాడి సీతయ్యమ్మ | కొప్పవరం |
| ,, కర్రి వీరయ్యమ్మ | కొప్పవరం |
| ,, మహారోజు గంగయ్యమ్మ | కొప్పవరం |
| ,, కొరిపిల్లి సీతయ్యమ్మ | రాజమండ్రి |
| ,, కానూరు సూర్యకాంతమ్మ | అత్తమూరు |
| ,, మల్లిడి గంగరాజమ్మ | పందలపాక |

శ్రీమత్ శివరామ దీక్షిత
అచలగురు పీఠాధిపతి



శ్రీ మద్రాజాధిరాజ రాజయోగీంద్ర
శ్రీమద్భాగవత
శ్రీకృష్ణదేశ కేంద్రులవారు

శ్లో॥ శ్రీ భూమానంద దువ్వూడ నారాయణమూర్తి గురుం
బోధామృత చరణపాన మత్తీకృత సచ్ఛిష్యం
సగుణ నిర్గుణాతీతం కేవలాత్మ ప్రబోధకం
శ్రీ బొద్దూరు వంశీయం అచలాంబ గుర్వీణీం భజే



శ్రీ తారకుల రంగనాథ పంచదశీస్వామి ) ( శ్రీ భూమానంద దువ్వూరి నారాయణమూర్తి

శ్లో॥ శ్రీ సత్యమాంబ సరస్వతి అమలాంబ సమేత ॥
శ్రీ రంగనాథ పంచదశీస్వామి గురుచరణం ।
శ్రీ విమలాంబ పార్వతీపాన భృంగం సచ్ఛిష్యకం ।
శ్రీ కేవలాత్మ స్వరూపం పరిపూర్ణ గురుం భజే ॥

## శ్రీ గురుభ్యో నమః

శ్లో॥ శ్రీధరస్వామి యోగీంద్ర । శివరామాఖ్య దీక్షితం ।
అప్ప బ్రహ్మం । సీరాతామం । భాగవత కృష్ణంభజే ॥

శ్లో॥ ఫీలుఖానా శంకర ప్ర । భు దేశిక పాదామృతం ।
పిపన్మత్త భృంగరాజ । హీరామాన్ సద్గురుంభజే ॥

శ్లో। శ్రీమాన్ ప్రసాద్గురు । వీరయాచార్య దేశిక ।
రామయాచల సద్గురు । నారాయణమూర్తిం భజే ॥



భావార్థముల రచయిత :

శ్లో॥ పూర్ణబోధోపదేశికం । సుగుణాకర భూమానంద్ ।
దువ్వాడ్వంశాబ్ధిజం చంద్రం । నారాయణమూర్తింభజే ॥

శ్రీమత్ప్రభ్లానా శంకరాయ మంత్రికృత
హిందుస్తాని భజనవైరాగ్య పద్ధతి.
తన మనస్సునకు చెప్పుకోబడిన నీతి.

కెం గఫులత్మే పడాదివానా కెం గఫులత్మేపడా ॥ప॥ ౧

ఆరేగురూ శెకొయి నహిబడాదివానా కెం గఫులత్మేపడా ॥ ౨

కర్ కేమాఫక్ కర్ లియ్యా తూకర్ కర్ కెం పస్తాతా హై - మరన్ కాలకూకోయి భీయాకర్ బచాతెనై కెం హస్తాహై । కెం గఫులత్మేపడా । ౧

బాలక్ హోకర్ చెందురోజువో బాలక్ పన్ మే ఖోయా - బాద్‌జవాని బుఢా పఅకర్ పూమర్ సారీఖోయా ఆరెతూ ॥ కెం గఫులత్మేపడా ॥ ౨

భాయిబిరాదర్ కొయినైయూతా ఖాతేసబ్ కొయిజాతేహై - ఘెంఘీషక్కర్ లాయనైతో తమూందిన్ సబ్ రోతె - హై । కెం గఫులత్మేపడా ॥ ౩

యార్‌దోస్తు మురీదాం సబ్‌కొయి మత్లబు అప్నా చహతెహై - కారెజురూరీ తుఝే పడాతో బహునాకర్ కేజాతేహై । కెం గఫులత్మే పడా । ౪

హాతి ఘోడామ్యానాగినా సబ్ పైసేకేసాతీరే - జాతీపైసా రహ్నేనపాతీ జాతీనర్‌వర్ ఆతరే । కెం గఫులత్మేపడా । ౫

బేటా ఛోటా పైదా హోకర్ లూటాహైసో మాౢలమాం - అరేతూ అయిసాకర్ తాకెంరేకహెతొ లడ్తాసాౢలమాం । కెం గఫులత్మే పడా । ౬

ఝూటాజొకొయె హోతాహై సోమీఠా మీఠా రహతాహై - మీ ఖాతై సఫ్‌రాహోకర్ జమీన్ పర్‌గిర్ లిడ్తాహై । కెం గఫులత్మే పడా । ౭

బాల్‌బడాకర్ జటాబనాకర్ ధూనిలగాతా కచ్చాహై - హోలు

౧౭. పుండ్రేక్షుకార్ముకభృతేనమః - భ్రూయుగ్మంపూజయామి
౧౮. కరుణాకటాక్షవీక్షణాయనమః - నేత్రౌపూజయామి
౧౯. కృష్ణకర్ణాయనమః - కర్ణౌపూజయామి
౨౦. రాకాసుధాంశువదనాయనమః - ముఖంపూజయామి
౨౧. సులలాటాయనమః - లలాటంపూజయామి
౨౨. నీలకుంచితమూర్ధ్నజాయనమః - కేశాన్పూజయామి
౨౩. సువృత్తశిరస్కాయనమః - శిరఃపూజయామి
౨౪. సర్వాత్మనేనమః - సర్వాంగానిపూజయామి

అధపత్రపూజా.

౧. అచింత్యాయనమః - బిల్వపత్రం సమర్పయామి
౨. బృదారకవందితాయనమః - తులసీదళంసమర్పయామి
౩. భువనరక్షణతత్పరాయనమః - వకుళపుష్పంసమర్పయామి
౪. భూరివిభవాయనమః - పున్నాగపుష్పంసమర్పయామి
౫. జగజ్జననకారణాయనమః - కేతకీపత్రంసమర్పయామి
౬. చరాచరగురవేనమః - చామంతికాపుష్పంసమర్పయామి
౭. సుప్రభావాయనమః - చంపకపుష్పంసమర్పయామి
౮. సుప్రసన్నాయనమః - పాటలీపుష్పంసమర్పయామి
౯. అపవర్గప్రదాయనమః - శతపత్రపుష్పంసమర్పయామి
౧౦. అనంతాయనమః - జాజీపుష్పంసమర్పయామి
౧౧. మోహనర్జితానమః - కరవీరపుష్పంసమర్పయామి
౧౨. ముకుందాయనమః - రసాలపుష్పంసమర్పయామి
౧౩. ప్రకృతిపురుషవిలక్షణాయనమః - మాలతీపుష్పంసమర్పయామి
౧౪. నిత్యాయైనమః - కల్హారపుష్పంసమర్పయామి
౧౫. ఆజ్ఞేయచక్రనిలయాయనమః - అతశీపుష్పంసమర్పయామి
౧౬. నాదబిందుకళాతీతాయనమః - పారిజాతపుష్పంసమర్పయామి
౧౭. భూతాత్మనేనమః - అశోకపుష్పం సమర్పయామి
౧౮. మండలత్రయాతీతాయనమః - నీలోత్పలపుష్పంసమర్పయామి
౧౯. అనంతాయనమః - అతసీపుష్పం సమర్పయామి

౧౦౮ అథ అష్టోత్తరశతనామాని.

౧. సద్గురవేనమః ... ...
౨. పూర్ణాయనమః ... ...
౩. సర్వాధారాయనమః ... ...
౪. స్వచ్ఛాయనమః ... ...
౫. శుద్ధాయనమః ... ...
౬. నిర్మలాయనమః ... ...
౭. విశ్వోదరాయనమః ... ...
౮. నిరాలంబాయనమః ... ...
౯. రమ్యాయనమః ... ...
౧౦. నిర్లేపాయనమః ... ...
౧౧. నిర్వాసనాయనమః ... ...
౧౨. నిర్గంధాయనమః ... ...
౧౩. స్వప్రకాశాయనమః ... ..
౧౪. నిత్యతృప్తాయనమః ... ...
౧౫. అనంతాయనమః ... ...
౧౬. అద్వితీయాయనమః ... ...
౧౭. వేదవాచామవేద్యాయనమః ... ...
౧౮. పరంజ్యోతిషేనమః ... ...
౧౯. ప్రణవాతీతాయనమః ... ...
౨౦. అచలాయనమః ... ...
౨౧. అపరిమితాయనమః ... ...
౨౨. అప్రమేయాయనమః ... ...
౨౩. అవ్యయాయనమః ... ...
౨౪. అచ్యుతాయనమః ... ...
౨౫. అహంకారవివర్జితాయనమః ... ...
౨౬. విశ్వాత్మనేనమః ... ...
౨౭. ప్రపంచాతీతాయనమః ... ...
౨౮. మాననీయాయనమః ... ...

౨౯. క్షరాక్షరవిలక్షణాయనమః ... ...
౩౦. దృగ్దృశ్యాతీతాయనమః ... ...
౩౧. ద్వైతాద్వైతవినిర్ముక్తాయనమః ... ...
౩౨. అఖండాయనమః ... ...
౩౩. ఖండాఖండవిరహితాయనమః ... ...
౩౪. ఆదిమధ్యాంతశూన్యాయనమః ... ...
౩౫. నిరంజనాయనమః ... ...
౩౬. నిర్వికల్పాయనమః ... ...
౩౭. నరాకారాయనమః ... ...
౩౮. నిరాఖ్యాతాయనమః ... ...
౩౯. పరమానందస్వరూపాయనమః ... ...
౪౦. సగుణనిర్గుణాతీతాయనమః ... ...
౪౧. సర్వసాక్షిణేనమః ... ...
౪౨. సాక్ష్యతీతాయనమః ... ...
౪౩. త్రిగుణాతీతాయనమః ... ...
౪౪. సర్వభూతాంతరస్థాయనమః ... ...
౪౫. సుఖదుఃఖవిరాహితాయనమః ... ...
౪౬. జన్మజరామరణవర్జితాయనమః ... ...
౪౭. క్షేత్రజ్ఞాయనమః ... ...
౪౮. సర్వోపనషత్సారాయనమః ... ...
౪౯. నిష్కళంకాయనమః ... ...
౫౦. నిరాభాసాయనమః ... ...
౫౧. స్వప్రకాశాయనమః ... ..
౫౨. సృష్టిస్థిత్యంతకారణాయనమః ... ...
౫౩ కర్తృత్వరహితాయనమః ... ...
౫౪ సచ్చిదానందాతీయనమః ... ...
౫౫. అపరోక్షాయనమః ... ...
౫౬. సకలమంత్రస్వరూపాయనమః ... ...

౫౭. ఆకాశతనవేనమః ... ...
౫౮. నిరాధారాయనమః ... ...
౫౯. నిస్తేజసేనమః ... ...
౬౦. అవికారాయనమః ... ...
౬౧. అమలాయనమః ... ...
౬౨. పరతత్త్వాయనమః ... ...
౬౩. పరంధామ్నే నమః ... ...
౬౪. అజాయనమః ... ...
౬౫. అగమ్యాయనమః ... ...
౬౬. షడ్గుణైశ్వర్య సంపన్నాయనమః ... ...
౬౭. సనాతనాయనమః ... ...
౬౮. త్రిమూర్త్యాత్మనేనమః ... ...
౬౯. అనాద్యంతాయనమః ... ..
౭౦. సర్వోపాధివినిర్ముక్తాయనమః ... ...
౭౧. భక్తాభీష్టఫలప్రదాయనమః ... ...
౭౨. భవరోగభేషజాయనమః ... ...
౭౩. సహస్రారచక్రమధ్యస్థాయనమః ... ...
౭౪. నవనాథమునివందితాయనమః ... ...
౭౫. కామక్రోధాదిశత్రునికృంతనాయనమః ... ...
౭౬. కరుణారసార్ద్రహృదయాయనమః ... ...
౭౭. బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతాయనమః ... ...
౭౮. బ్రహ్మాండజనకాయనమః ... ...
౭౯. పరమపావనాయనమః ... ...
౮౦. దీనజనానుగ్రహాయనమః ... ...
౮౧. దివ్యపురుషాయనమః ... ...
౮౨. ప్రసన్నపారిజాతాయనమః ... ...
౮౩. పురాణపురుషాయనమః ... ...
౮౪. నిరుపద్రవాయనమః ... ...

౮౫. నిత్యకల్యాణాయనమః ... ...
౮౬. సర్వోపనిషత్పంజరకీరాయనమః ... ...
౮౭. శబ్దాతీతాయనమః ... ...
౮౮. జగన్నాథాయనమః ... ...
౮౯. జగద్గురవేయనమః ... ...
౯౦. విష్ణవేనమః ... ...
౯౧. సర్వతోభద్రాయనమః ... ...
౯౨. నిగమార్థ ప్రతిపాదకాయనమః ... ...
౯౩. నిస్సంగాయనమః ... ...
౯౪. సహజానందాయనమః ... ...
౯౫. చిన్మయాయనమః ... ...
౯౬. శ్రీమతేయనమః ... ...
౯౭. సహజామనస్కాయనమః ... ..
౯౮. సాయుజ్యప్రదాయనమః ... ...
౯౯. పంచబ్రహ్మమయాయనమః ... ...
౧౦౦. అజడాయనమః ... ...
౧౦౧. జడాజడవిలక్షణాయనమః ... ...
౧౦౨. భావాభావమధ్యస్థాయనమః ... ...
౧౦౩. అమనస్కాయనమః ... ...
౧౦౪. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకాయనమః ...
౧౦౫ సర్వోదయేనమః ... ...
౧౦౬. పరాత్పరాయనమః ... ...
౧౦౭. లక్ష్యాతీతాయనమః ... ...
౧౦౮. మనోవాగగోచరాయనమః ... ...

నానావిధపరిమళపత్రపుష్పాన్ సమర్పయామి.

శ్లో॥ చందనాగరుకర్పూర । శర్కరాజ్యసమన్వితం । ధూపోయం
గృహ్యతాం స్వామిన్ । త్వమిదంతే మయార్పితం ॥
శ్రీమ॥ ధూపమాఘ్రాపయామి ॥

శ్లో॥ వహ్నినాయోజితం సాజ్యం - దీపంవర్తిత్రయాన్వితం ।
గృహాణజ్ఞానతిమిర - హరజ్ఞానప్రవర్తనం ॥ ౧౬
శ్రీమ॥ దీపం దర్శయామి

శ్లో॥ శాల్యన్నంషడ్రసోపేతం - పంచభక్ష్యాదిసంయుతం ।
నైవేద్యం దేవదధ్యాజ్య - సమ్మిశ్రం ప్రతిగృహ్యతాం ॥ ౧౭
శ్రీమ॥ మహానైవేద్యం సమర్పయామి.

శ్లో॥ పానీయం శీతలంస్వచ్ఛం - మధ్యేమధ్యేమయార్పితం ।
సుగంధయుక్తం మధురం - పిబత్వం పురుషోత్తమ ॥ ౧౮
శ్రీమ॥ మధ్యేమధ్యే ఉదకపానీయం సమర్పయామి.

శ్లో॥ సుపక్వాన్యనేకాని - రంభామ్రజంబూ సఖర్జూరసారంగ
ద్రాక్షాదికానిత్వమేతాని సంగృహ్యతాం స్వప్రకాశఫలాని
ప్రదేయానిసర్వాణితేఽద్య । ౧౯
శ్రీమ॥ ఫలోపహారనైవేద్యం సమర్పయామి.

శ్లో॥ తాంబూలంగృహ్యతాంపూగి - ఫలకర్పూరసంయుతం ।
నాగవల్లీదళాద్యంతం - గురోతుభ్యం మయార్పితం ౨౦
శ్రీమ॥ తాంబూలం సమర్పయామి.

శ్లో॥ సువర్ణోదరగర్భస్థం స్వర్ణబీజం మయార్పితం ।
అనంతపుణ్యదం స్వామిన్ తేగ్రహాణాత్వమచ్యుతం ౨౧
శ్రీమ॥ సువర్ణపుష్ప దక్షిణాన్ సమర్పయామి.

శ్లో॥ నీరాజనం మయాదత్తం - రాటరాజేశపోజితం - గృహాణ
జగదుత్పత్తి - హేతుభూతాఘనాశన । ౨౨
శ్రీమ॥ మంగళనీరాజనం సమర్పయామి.

శ్లో॥ సుజాతకీపాటలపారిజాత - చాంపేయకంజాత రసాలమల్లికా ।
చామంతికానంయుత మంత్రపుష్పం ॥ గృహ్ణామివిష్ణోశివశంక
రాచ్యుత ॥
శ్రీమ॥ దివ్యసువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ జన్మాంతరకృతాన్యాని - యానిపాపానిమేప్రభో ॥
నశ్యంతు తేతానితాని - ప్రదక్షిణపదేపదే ॥ ౨౪
శ్రీమ॥ ఆత్మ ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

శ్లో॥ యస్య స్మృత్యాచనామోక్త్యాతపఃపూజా క్రియాదిషు
న్యూనంసంపూర్ణతాంయాతి - సద్యోవందేతమచ్యుతం ॥ ౨౫

శ్లో॥ మంత్రహీనంక్రియాహీనం - భక్తిహీనంజనార్ధన ॥
యత్పూజితంమయాదేవ - పరిపూర్ణంతదస్తుమే ॥ ౨౬

శ్లో॥ అజ్ఞానమూలహరణం - జన్మకర్మనివారణం-జ్ఞానవైరాగ్య
సిధ్యర్థం - గురుపాదోదకంపిబేత్ ॥ ౨౭

శ్లో॥ గురుపాదోద్ధితంతీర్ధం - పీత్వాత్రిపుటినాశనం - సర్వ
ద్వంద్వవినాశంచ - విద్యతేవ పునర్భవం ॥ ౨౮

శ్లో॥ గచ్ఛాద్యపునర్గాగచ్ఛ - స్వామకాభీష్టసిద్ధయె - గురోర్య -
కృపయావీక్ష్య - పూజాస్వీ కురుమత్కృతం ॥ ౨౯

శ్లో॥ భాగవతఃకృష్ణభూసురరచితమిదం - దేశికస్యపూజార్ధం
పూజావిధానాంశమతులం - వక్త్యశోత్యద్వయోశ్చ
మోక్షకరం ॥ ౩౦

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత గురుపూజా విధానం సమాప్తః
యీ ప్రకారము నిజగురుస్వాములవారిని పూజించి శ్రీమత్ఫల్గునా
శంకరమంత్రి నిటిలతటి ఘటితాంజలియై నిలిచియున్న నిజగురు
నాధుండు కరుణాకటాక్షవీక్షణముచే బోధింపన్ నొడగెను -
యెట్లన్నను ॥

—✱—

వుతాకర్ ఝోలిబాందకర్ ఫిర్తావోయేక్ ఉచ్చాహై । కెం గఫులత్మే
పడా । ౮

హిందూహోకర్ మాలాజప్తావోభీహై దిల్మేరఘూటా - ఫంది
హై సబ్‌కొయి దున్యామె పార్ నహి - హోతెబేటా ।। కెం గఫులత్మే
పడా । ౯

ఖురాన్ పడ్కర్ కల్మాపడ్కర్ మాధక్ వుస్కేచల్తాహై -
ఖురాన్ పడ్కర్ చల్తాహై సోవుస్నా హేబ్‌సేమిల్తాహై । కెం గఫులత్మే
పడా । ౧౦

పీరొపయంబర్ సభీగయే యిన్ దున్యాకె చెక్కర్మేసే - తేరా
మేరాక్యావజూదుహై బచ్‌కర్ జానేచక్కర్‌సే ।। కెం గఫులత్మేపడా । ౧౧

ఆజిస్ ఘర్మెకల్ వుస్‌ధర్మే దోనో బరాబర్ గినీకర్ - కాజి
ఖుదాబన్‌కర్ పూఛాతా జవాబ్ దేతా క్యాదేకర్ । కెం గఫులత్మే
పడా । ౧౨

తగ్గిరచ్చె శబ్‌దిన్ మేరేకర్ కెతూకెంఘుస్తాహై - జగ్ మె
కొయిఅబ్ తగ్మెబచానై తూకెంఖావీఫస్‌తాహై । కెం గఫులత్మేపడా । ౧౩

జనన్ మరన్ కావద్ధిబహితహై తూగోతాఖావొనకొ - జాన్‌తీ
రనే జల్ది జల్ది బహితీతూడుబ్ జావొనకొ । కెం గఫులత్మేపడా । ౧౪

మూసానద్ది గిసానద్దియిన్ నద్దిసేబడానహి - బడేబడే అవుతా
రోం కూభీయిన్ నిద్దికాఖబర్ నహీ ।। కెం గఫులత్మేపడా । ౧౫

దున్యామెకుచ్‌నై హైకర్ కర్‌రోజుబోల్తా నహిసహీ బన్యాసే
తూజ్యాదాకర్ కర్ పైసారక్తా కహీ కహీ ।। కెం గఫులత్మేపడా । ౧౬

అఫురత్ దౌలత్ పషంబరాబర్ దేకాసోవో అచ్ఛాహై -
అయిసాకెం నైరక్తాతూదిల్ రోజులోజుక్యా బచ్చాహై । కెం గఫులత్మే
పడా । ౧౭

హిరన్ తేరామర్ నైజాతా పర్ పర్ సోటాఘాహచేగా -

హరకతుకుచ్‌నై ఫాశిలగాకర్ రూహుబరాబర్ ఛీచేగా - కెం గఫులత్మే పడా ॥ ౧౮

హైసోఅల్లాః సైసోమైసున్ జగ్ సారీయేఝూటారే - అయిసా తూకెంకహతాసై హై జబాన్ కుక్యాకుచ్ కాటారే ॥కెం॥ ౧౯

ఫూల్ ఫలూంకే మోసంహోతా ఝూడు ఝూడు కేకదురా కదర్ - తూ యిన్‌సానొ మేహైదాఖల్ జనాకెంనైక ద్రొకదర్ ॥ కెం గఫులత్మేపడా ॥ ౨౦

కుచ్‌నై కుచ్‌నై హువాఖ్యరాబాఅయితు ఝుకంబఖీరే బచన్ కియాన్యసోనజర్ గయాకహిసుధార్‌క్యా హోసక్తీరే ॥ కెం ॥ ౨౧

తన్‌న్మనధన్మామాలక్ బైరానిగాః బరాబర్ ఆగేలాఖు - వొ హినిఖాలెగయాతొ జనాఅగేరస్తా నహిమూరఖు ॥కెం॥ ౨౨

ధ్యానధరోగురు చెరణకమల్ వర్ పలక్ భర్మెతుహోగాపార్ - యేరస్తా జో బత్తాపేగా వొహిజాన్ కాయార్ అరెతూ ॥కెం॥ ౨౩

మిల్లె వొజల్దికర్ లెవుబాతేన్ యేదిన్ కాకుచ్ ఖబర్ నహి - దల్లాలి జాతూన్ కూలేకర్ బైరాకెంరే ఖబర్ నహి ॥ కెం ॥ ౨౪

ఝుటాదున్యాకారంగ్లాయా మాయా మోటాగాటాహై గురూ జికెచరణా సత్తాసేకూపర్ యిస్కాతూటాహై ॥ కెం ॥ ౨౫

హుకుం గురూకా హువ్వాహై అయిసాబోలే రేకర్ కర్ జోకం సున్‌తాహై సోపాతాసాహెబు ముజుకుక్యాఫికర్ ॥ కెం ॥ ౨౬

హర్కత్ మత్కర్ సద్దేశికవర్ పూజాకర్ జల్దీ జల్దీ - భాగ్వతా క్రిష్ణాగురుజికె పాయపతో జల్దీ జల్దీ ॥ కెం గఫులత్మేపడా ॥ ౨౭

తూనేకిసేఫిర్ నేఫర్ జోజోల్తా హైసోనాస్ - హోనేకూకుచ్ నై హైదేరబ్ హోతాస త్తేనాసుఅరేతూ ॥ కెం ॥ ౨౮

శంకర్‌దాసు బడావ్యాపారిపాయా గురుజీకేసత్తా - మాయా మోహికాన్యకర్ సక్తీసబ్‌కువుడా యావోసత్తా కెం ॥ ౨౯

## శ్రీమత్ప్రల్హానా శంకరరాయ మంత్రికృతము.

### ౨ - జగల్ - పారశీ - యిందర్ సభధాటి

సర్‌యూర్ ముర్షద్ కేక్కదంపర్ రాఖలే అజీక్యాపికర్॥ మన్ కూతో సబ్‌తుము జానకర్ ఖీదుమాత్కరో అబ్। క్యాఫికర్ ॥

క్యాకహూంమైకిస్కేతై యమ్ - ఆషకాంకై ఆగయే ॥ దిల్‌నేక్ సేతుల్ షాహమేహమ్ జాకేమైకానికాలెగై ॥సర్॥ ౨

యేజహాఁదోనోమెసబ్ కొయిపేష్కర్నే చహతెహైఁ షుబాసె సబ్‌కుచ్ భూలకర్ ఖామోష్‌హోకర్ జాతేహైఁ ॥ సర్॥ ౩

రాజాజోగ్‌కహెలాత హైఏక్ భాగవతక్రిష్ణ ॥ ప్రభో వున్‌పాక్ కామిల్ కేకదంబోసి సెశంకరదాస్‌నే ॥సర్॥ ౪

### ౩ - జగల్ - పారశీ - యిందర్ సభదాటి

మేరెచెష్మఖుల్ గైత స్తలాగ్ నజర్ మేనూర్‌ఖుదాకెధా ॥ కబ్ నాముసై కబ్‌రూపునై । కబ్‌రంగసై । కబ్‌భంగ్‌సై ॥ దిఖ్‌లాయజో కుచ్‌నూర్‌ధా ॥ చౌధాతబకుభర్ పూర్‌ధార్ మెరె ॥ ౧

సబ్ రూపమే । సబ్‌రంగ్‌మే । సబ్‌సంగమే । సబ్‌జంగ్‌మె॥ కుల్‌షాహెమేవోవస్‌లధా అప్నాపరాయకభూనధా ॥ మెరె చెష్మ ఖుల్‌గై ॥

హిల్‌నేకుబిల్ కుల్టహిరన్ నహీ । కహెనేకఃగుంజాయష్ నహీ॥ దిక్‌ధానోగుమ్‌సబ్ హోగయా । ఖుద్‌రత్తుదాతె రహేగయా ॥ మేరే చష్మఖుల్ ॥ ౩

అబిబాగవత క్రిష్ణప్రభూర్‌కకేవలీయేక్ హోగయే ॥ దిఖ్ లాయ అపనేగులామొశంకర్‌దాస్ కహేనేవాలెకో ॥ మేరె చష్మఖుల్‌గైఁత స్త ॥

దోహేరా హిందుస్తాని.

సఖీకహేసంసార్మే బాలరూపబజాయె ।

జిస్కాకహుం బ్రహ్మజ్ఞాను నామరూపమిట్ జాయె । ౧

౨ — కీర్తన.

పధమూజెందాకాను ముక్తిపదవీగలుగాదూ - మంచిబుధుల శేవాలేకా తత్వాబోధ దెలియదూ ।ప।

నిధనోర్భవములు అధికసూక్షములు - క్షుధతృష్ణలనే వ్యధలు లేనిగురు ॥ ౧

కులగోత్రనామధేయాది గురుతూలేకా - యపుడువిలయా వృద్ధి త్వాములాను వెలయాబొందాకా - వలుకూల కందాక యేతలపూలేకా మిగుల - కలిమీ బలిమీలేకాను - చిత్కళలూగాకా - చలనములేక యచలభావమ్మున - గలశిమెలశి సంకల్పశూన్యగుకు ॥ ౨

తరుణీపురుషూడ నేటిభ్రాంతి తనకూకాలే నిరతా - మెరుకామర పూలాకువరమై మరుగూలేకా - గురుతూగ వర్ణావర్ణములా నరయా రాకా - పర్వపరిపూణమై యించుకంతాబాధలేకా - తరతరభావము దగలకకాలాం - తరములేక పరతత్వమైన గురుపధమూ ॥ ౩

యందూజూచినాను యేడసందూలేకా - నిత్యానందమై బుద్ధీ హీనూలకందరాకా - నిందానిందాల కెల్లనూ అందబోకా । నాద - బిందూకళలతోటి యేపొందూలేకా - మందామందములందును దగులమి - నొందక మదినిష్పందియుడగు ।గురు। ౪

పట్టామట్టూరా నీవుత్తబట్టబయలై - వునికి - పట్టూలేక సాధూలకాస్పదము తానెయ్యె - గుట్టూమట్టూలేకాను శ్రీ గురుగోవ్య మయ్యా - యింతా - మటా నేటికొలదికి సమానారహితమై । యిట్టిది యని వచియింపరాక । గన్పట్టనశక్యంబై వెలిగెడుగురు ॥ ౫

నీమాకర్మామూలా నేటినిష్టలేకా - వితత భూమ్యాది పంచా భూతములా బొలుపూలేకా - కామాదిశత్రువగన్ వికారిగాకా - ధర్మా - కామామోక్ష ఫలమూల సత్కాంక్ష లేకా - భ్రామికలను పెంపారని యాత్మా - రాము లైన శివరామదీక్షితుని ॥

పధముజెందాకాను ముక్తి పదవీ గలుగాదూ - మంచి - బుధులా శేవాలేకా తత్వాబోధా దెలియాదూ ॥

## ౩ — కీర్తన.

నటులారా త్వరగాదారయ్యా గురునీ గొల్తాము - అంతః - కరణాయందా గురుమూర్తి నేమరకా తల్తాము ॥ప॥

గురువూలనగా మేనెరుకాల నెరుగానీవారూ - యెట్లు - గురువూ లయ్యేరి బోధాగు త్తెరుగానీవారూ ॥ ౧

భక్తీసల్పా గురునిచే స - ద్యుక్తీవిననౌనూ - యిట్టీ-యుక్తీ వినినామీద బంధాముక్తూలెడలూనూ ॥ ౨

రాజకాటగావించె శివ - రామాదీక్షితులూ - ఆదిమన - మీ జన్మానవింటి యాడివిక మునుపటిగతులూ ॥ ౩

భాగవతకృష్టాభి ధానబ్రాహ్మణుని జేరి - వినెనూ - జాగూ లేకా జాలమాయీ పద్బోధెకోరి ॥ ౪

దోహేరాహిందుస్తాని.

హీరాపణాబజార్మేర హెఖాక్ లప్తాయే —

మూరక్ఫేసోచెలేగయే చాతూల్లిన్యె వుతాయె —

———

# గురుపూజా విధానం.

శ్రీ కృష్ణగురు పరబ్రహ్మణేనమః

శ్రీ మత్ప్రల్హానా శంకరరావుగారు శ్రీ కృష్ణదేశిక
ప్రభువరులకు చేసిన

## • శ్రీ నిజగురు పూజావిధానం •

శ్లో॥ శ్రీమత్కారుణికం మహాగురునిధిం పూర్ణప్రభాభాసురం
నిర్ద్వన్ద్వంనిరపేక్ష కామమమలం నిస్సంగమాధ్యంవిభుం॥
నిత్యానందమయం నిరీహమతులం నిర్ముక్తకర్మాదికం -
శ్రీకృష్ణాఖ్యగురుం భజేహమనిశం శ్రీ చిత్త సంతోషణం ॥ ౧

శ్లో॥ నిత్యంసాంద్ర కృపారసం విదితభావాభావ మత్యున్నతం -
ద్వందాతీతమమత్పరం పరమకల్యాణాత్మతత్వవిభుం -
బ్రహ్మానందమయం సుబోధనిలయం స్వానందభావం సదా -
శ్రీమద్భాగవతాన్వయాబ్ధివిలసత్ శ్రీ కృష్ణచంద్రంభజే ॥ ౬

శ్లో॥ హృత్పుండరీకమధ్యస్థం సకలామ్నాయ సంస్తుతం - ధ్యా
యామ్యహంసదాభక్త్యా - సకలాభీష్టదాయక ॥ ౧
శ్రీ మద్భాగవతకృష్ణ స్వగురుపరమగురు పరమేష్ఠిగురు
సద్గురు జగద్గురు నిజగురు పరబ్రహ్మణేనమః ॥ధ్యాయామి ॥ ౧

ధ్యానం సమర్పయామి.

శ్లో॥ ఆగచ్ఛానంత దేవేశ - భోగమోక్షప్రదాయక - నాకేశ
ముఖలోకేశ - వందితాంఘ్రిద్వయాంబుజ ॥ ౨
శ్రీమ - ఆవాహనం సమర్పయామి ॥

శ్లో॥ రత్నసింహాసనందేవ - సంగృహాణమయార్పితం -
చంద్రమండలసంకాశ - సంస్మితానన పంకజ ॥ 3
శ్రీమ - అనేకమణిమయ రత్న ఖచిత సింహాసనం ॥ సదు

శ్లో॥ పాద్యంగృహాణభోస్వామిన్ మయానీతం శుభప్రదం -
కృష్ణవేణీజలం భక్త్యా - తీర్థపాద జగద్గురో ॥ ४
శ్రీమ - పాదయోః పాద్యం సమర్పయామి.

శ్లో॥ అర్ఘ్యన్దాస్యామ్యహం భక్త్యా - తనపాణితలేవిభో -
గోదావరీజలం హేమ - కలశస్థం సువాసితం ॥ ౫
శ్రీమ - హస్తయోః అర్ఘ్యం - సమర్పయామి.

శ్లో॥ ఆచమ్యతాంమయాదత్తం - హేగురోయమునాజలం -
త్వదర్థంకృపయాభావ - భవబాధనికృన్తన ॥ ౬
శ్రీమ - ముఖే ఆచమనియం - సమర్పయామి.

శ్లో॥ శర్కరాదధిమధ్వాజ్య - క్షీరమిశ్రమిదంవిభో - పంచా
మృతంమయాదత్తం - స్నానంకురుజగత్పతే ॥ ౭
శ్రీమ - పంచామృతస్నానం - సమర్పయామి॥

శ్లో॥ తప్తకాంచన కుంభస్థం - కించిదుష్ణంసువాసితం -
మయానీతం జహ్నుకన్యా జలస్నానంకురుప్రభో ॥ ౮
శ్రీమ - శుద్ధోదకస్నానం - సమర్పయామి.

శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం - త్వదర్థంస్వర్ణతంతునా -
నిర్మితంనిర్మలంస్వామిన్ నిత్యకళ్యాణపావన ॥ ౯
శ్రీమ - అలంకరణార్థం - వస్త్రయుగ్మం - సమర్పయామి.

శ్లో॥ కార్పాసతంతునాసూత్రం - రచితం తేర్పితంమయా -
సంగృహాణమిదంయజ్ఞ - సూత్రంపాత్రందయానిధే ॥ ౧౦
శ్రీమ - యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో॥ కిరీటంకుండలంరత్న - కంకణాదినితేమయా -
సంగృహ్యతాంభూషణాని - అర్పితానినిరంజన ॥ ౧౧
శ్రీమ - సర్వాభరణభూషణాన్ సమర్పయామి.

శ్లో॥ మలయాచలసంభూతం - కర్పూరకలితంవిభో - విలేప
నంత్వద్గృంభో - గృహ్యతామర్పితంమయా ॥ ౧౨
శ్రీమ - గంధం సమర్పయామి.

శ్లో॥ తండులాఽధవళాకారన్ - హరిద్రాచూణఽమి
శ్రితాం - గృహ్యతామక్షతాన్ దేవ - మయాదత్తాన్మ
నోహరాన్ ॥ ౧౩
శ్రీమ - అక్షతాం సమర్పయామి.

శ్లో॥ పుష్పాణ్యనేకానిసుపల్లవాని - సుగంధయుక్తామనోహ
రాణి - త్వంగృహ్యతాందేవ మయార్పితాని - జలాశయస్థా
నిజవాదికాని ॥ ౧౪
శ్రీమ - పుష్పం సమర్పయామి.

అధఅంగపూజా.

౧. తీర్థపాదాయనమః - పాదౌపూజయామి
౨. నిగమమ శిరాయనమః - గుల్ఫౌపూజయామి
౩. స్మరతూణిజంఘాయనమః - జంఘౌపూజయామి
౪. ముక్తి కాంతాసేవితాయనమః - జానునీంపూజయామి
౫. రత్నస్తంభోరుయుగళాయనమః - ఊరూపూజయామి
౬. పులినతలజఘనాయనమః - జఘనౌపూజయామి
౭. మణికాంచికలావశోభితాయనమః - కటిపూజయామి
౮. విశ్వోదరాయనమః - ఉదరంపూజయామి
౯. దయార్ద్రహృదయాయనమః - హృదయంపూజయామి
౧౦. విశాలవక్షాయనమః - వక్షస్థలపూజయామి
౧౧. కంబుగ్రీవాయనమః - కంఠంపూజయామి
౧౨. వరదానధురీణాయనమః - హస్తౌపూజయామి
౧౩. ఉన్నతస్కంధాయనమః - భుజౌపూజయామి
౧౪. స్మితవక్త్రాయనమః - వక్త్రంపూజయామి
౧౫. చంపకనాసాయనమః - నాశికంపూజయామి
౧౬. పల్లవాధరాయనమః - అధరంపూజయామి

శ్రీ సీతారామాయనమః

శక్తిద్వయనిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వ కందార్థదర్పణములు

౧ -• సభా విజ్ఞాపన •- ప॥ ౭1.

కం. జనులారా జననమరణము-లను దొలగన్ ద్రోయుజాలు - లక్షణయుతమై - వినువారికి కనువారికి-తనలా వెరిగించుదీని - తప్పొకవింటే॥ అప్పుడె వార లెప్పుడుగంటే ॥ కనుకా వినబుద్దైతె వినుడి చదివెదమీకె- కనుగొనమనసైతె కనుడీపుస్తకమంత తప్పొకవింటే. అప్పుడెవార లెప్పుడుగంటె. ౧

తా. ఓమనుష్యులారా, జననమరణములను చావుపుట్టుకలు గల్గిన ప్రవాహమునుండి తొలగించగల్గిన అంశములతో నుండిన యీ గ్రంథము విన్నవారలకు చదివిన వారలకు తన నిజస్వరూప లక్షణము తెలియందగునుగాన వినడమునకు చదవడమునకు యిష్టముగల్గినవారలు చదువుడు లేక నేను చదివెదను మీరలు చక్కగా వినుడు, మీరు చదువవలయునని యుండిన యీ పుస్తకమంతయు ఆఖరువరకు చదువుట యుక్తమని భావము ॥ 1

౨. కం. వినవలెనని కనవలెనని - మనసందున కోర్కెకల్గు - మనుజులెవినుడీ - వినజేసెద కనజేసెద - ఘనమగు యీ బోధవిన - గననొల్లనట్టి ।; మనుజులు చను - డొచ్చిన త్రోవబట్టి । తినుమంటే పులివల్ల దనిలోకు లనవింటి - గనుకనే వినవాలె । నన నోరాడదు విన- కననొల్లనట్టి ॥ మనుజులు చను - డొచ్చినత్రోవబట్టి ॥ ౨

తా. ఓ జనులారా! ఈగ్రంథమునునేను చదివిన వినవలయునని కుతూహలులై యిందుగల నిజాంశము గ్రహించవలయునని - మనస్సున యిష్టమున్నవారలే వినుడు వినువించెద. గొప్పదియగు యీ బోధను వినుటకు. చదువుటకు, గ్రహించుటకు యిష్టము లేనివారలు వారివారి

మార్గములను పొందు. ఏలనన. బ్రతుకుటయందిష్టములేక, పులివద్దకు పోయి తన్ను తినుమని కోరగా ఆ పులి తినకుండా అనగా చంపకుండా విడచునను సామెతగా నుండును. గాన యీగ్రంథము వినవలయునని చూడవలయునని యిందుగల రహస్యము గ్రహించవలయునని కోరిక గల్గినవారలే వినుడని భావము. ౭

3. కం. ననుమిము నేగని పుస్తక - మును జేసితి దీన్ని మీరు - ముదమును వినుడం - చనుటయు మిము నను మీరలు గనుగొని విను పించుమనుట - కల యిట్టిమాట ॥ బోధను మేల్క - గనలేదెచ్చోటఁ। ఘనులార యిటువంటి, కలలో ముచ్చటలాడి - గొనకోని మీరు, మేల్కొని మేల్కొల్పుడి నన్ను - కలయిట్టిమాట ॥ బోధను మేల్క - గనలేదెచ్చోట. ౩

తా. ఓ జనులార నా నిజమును నేను మద్గురు స్వాములచే విచారించి తెలిసికొని మిమ్ములనుజూచి యీ గ్రంథము వ్రాసితిని. అందుకై దీనిని మీరు ప్రేమతో వినుడని యనడము, మీరు నన్ను జూచి యీ గ్రంథమును వినుపించుమని యనడము, కలలో ముచ్చట్లు వంటివి. మెలుకువలోనుండి బోదజేయుట కాదనియు, బుద్ధిమంతులు గొప్పవారయిన మీరలు యీ ప్రపంచమనెడి కలలో మిమ్ములను అనగా మీ నిజమును విచారించుకొని మీరు మేల్కొని తరువాత నన్ను మేల్కొల్పుడని భావము. 4

4. కం. ఒరులొరులు నేనునేనని-యొరులను తననెన్ని - డెరుగ కున్న బయలులో - నరుదెంచి తనను తాగని - పరులను గని లెన్పనేను- పరులానియనుచూ ॥ యెరిగేయెరుకే - బయలుండగనుచూ ॥ నిరతాము తానెందు నిలువాకుండుటకూనై - విరచిస్తి దీన్నెరుకా - వినినా నిల్వదునేను - పరులాని యనుచూ ॥ యెరిగే యెరుకే - బయలుండ గనుచూ ॥ ౪

తా. ఓ జనులార తననుతాను యితరులను యెరుగని పరిపూర్ణ మునందు, తనకుతానే యెరుకవచ్చి తనకుతాను యితరులను నెరింగియు సర్వమును యెరిగెటి యెరుకే పరిపూర్ణమును దర్శించి లేక భావించి తాను యెందును నిలువకుండా మటుమాయగా పోవుటకై యీ గ్రంథము వ్రాసితి, గాన యీ గ్రంథము చక్కగా అనగా మనసార వినిన వారలకు, చదివిన వారలకు ఎరుక ఏ మాత్రము యుండనేరదని భావము ॥ 4

5. కం. యెరుకను కలలోపలనే - నరుదెంచితి మీరలట్ల - యరుదెంచితీరి - యెరుక జననేను మీరలు - యెరుకతో జనువార మనుచు - యెరిగేటి కొరకూ ॥ గ్రంథముజేస్తి - నెరిగి యీ వరకూ గురుబోదంచును మేల్క - నరులార చేకొంటె - యెరుకానె కలజోలి, నెరిగున్న నిల్వదం - చెరిగేటి కొరకూ ॥ గ్రంథముజేస్తి - నెరిగి యీ వరకూ ॥ ౫

తా. ఓ జనులార యెరుక (భ్రాంతి) యనెడి కలలోపల నేనును మీరలు వచ్చినారము, భ్రాంతితోడనే పోవువారము గావున యీ పరిపూర్ణబోధ వలన భ్రాంతి యనె యెరుక (కల) తొలగిపోవును. అనగా జనన మరణ బాధలు తొలగిపోవును. యీ అచల గురుబోధ మీరు వినినయెడల ఎరుక యనెడి కల తొలగి పరిపూర్ణమను మేల్కను పొందుదురని యీ గ్రంథము రచించి నాడనని భావము ॥ 5

6. కం. శ్రీమించు నచలబోధను - యే మహనీయుండు జేసి యెగజల్లెనో యీ - భూమిన్ సుజనులకొరకా - రాముడు గన్వయుజ శివ - రామా దీక్షితులన్ ॥ తలచి యప్పారావ్ - గుణతతులన్ ॥ ప్రేమతో బొగడీనే భూమి నిర్జర పరశు - రామా సీతారామస్వామికి మ్రొక్కి - శివరామ దీక్షితులన్ తలచి యప్పారావ్ - గుణతతులన్ ॥ ౬

తా. ఓ జనులార అరువది నాలుగు విద్యలు వుదరపోషణకు లేక పొట్టకూటికి పనికివచ్చును. జనన మరణ బాధలు తొలగించుటకు మహాశ్రేష్టమును వుత్కృష్టమునునైన బ్రిహ్మవిద్యద్భోధను యే అచల మహర్షి గ్రిహించి తత్సారాంశమును యీ ప్రిపంచమునమండు సజ్జనులకై నొసంగి వెదజల్లెనో, అమ్మహనీయుడగు శ్రీమద్రాముడుగు శివరామ దీక్షిత దేశిక చక్రివర్తుల తలంచి, కంబాలూరి అప్పయ్య సద్గురు సార్వభౌముల సద్గుణంబుల బొగడి, వారి ప్రియశిష్యులును పరశురామ వంశోద్భవులగు సీతారామ స్వాములవారికి సాష్టాంగ నమస్కారంబులు గావించితినని భావము ॥ 6

7. కం. శ్రీమత్సీతారామ - స్వామికృపన్ జెప్పనయ్యె - సదసద్రహితం - బేమి పదార్థమో దానిని - యీ మహికందార్థములుగా నివి వినరయ్యా॥ ఓ జనులార - యిటుగనరయ్యా॥ వేమారునే మిమ్ము వేడెదింతియె సుమ్మీ - నామీద కృపజేసి, నను జదువుమని మీర లివి వినరయ్యా॥ వో జనులార - యిటుగనరయ్యా ॥ 2

తా. ఓ జనులార శ్రీమద్గురు ప్రిభువులగు శ్రీ సీతారామ స్వాములవారి కరుణాకటాక్షంబున సత్ మాత్రుండగు ఈశ్వరుండును, చిత్ స్వరూపుండగు జీవుండును (అనగా క్షరాక్షములు) రహితమగు నట్టి యీ అచల పరిపూర్ణ బోధను కందార్థ దరువులుగా రచించి నాడను మీరు నాపై దయవుంచి నన్ను జదువుమని మీరు వినుండు లేదా మీరలే యీ గ్రింధమును జదువుడని భావము ॥ 7

8. కం. శివరామ దీక్షితుల శి - ష్య వరుండప్పయ్య మంత్రి - యతని శిషువుడీ భువి పరశురామ వంశో - ద్భవ సీతారాములతని - భక్తుడసుమ్మీ - తదోభ్ధ ప్రియుక్తుడసుమ్మీ ॥ స్థవనీయులగు మీరు - త్సాహముతో యీ గాధ - వినుండీ నే కందార్థములచే వినిపింతు - భక్తుడసుమ్మీ ॥ తదోభ్ధ ప్ర - యుక్తుడసుమ్మీ ॥ ౨

తా. ఓ జనులార శ్రీరామడగు శివరామ దీక్షితులవారి శిష్యుండు కంబలూరి అప్పయ్య మంత్రియు, వారి శిష్యుండు పరశురామ వంశమునందుబుట్టిన సీతారామస్వాములవారును, ఆ సీతారామస్వాముల వారికి నేను భక్తుండనై వారు బోధించిన అచల పరిపూర్ణ బోధయందు ప్రవర్తించువాడను. సజ్జనులని స్తుతింపదగిన మీరలు సంతోషముతో యీ గ్రంథాంశములను చక్కగా వినుడు. నేను కందార్ధ దరువులుగా అచల పరిపూర్ణ బోధను యివ్వడు మీకు వినుపింతునని భావము 8

9. కం. మనసిచ్చి వినుడి యికనొక - మన విది నా పాలి గురుని - మది లోపలనే - నునుచుకొని పెద్దలాజ్ఞను - పనిబూనుక చేస్తినిట్టి - పద్యాములిన్నీ॥ తప్పొప్పులే-ర్పడ దిద్దుండన్నీ॥ ఘనమతి మంతులు, గను కా నే ప్రార్థిస్తీ - నను మీ కటాక్షేక్ష - ణముల వీక్షింపూచు - పద్యములిన్నీ ॥ తప్పొప్పులే-ర్పడ దిద్దుండన్నీ ॥ ౯

తా, ఓ జనులార ! నేను వినుపించు వాక్యములయందు మనస్సు లగ్నపరచి అనగా మనస్సులో యితర చింతలుమాని చక్కగా వినుడని మనవి చేసికొనుచున్నాను. నాకు అధికారులగు మద్గురుస్వాములవారిని మనంబున నిల్పుకొని, పెద్దలాజ్ఞను శిరసావహించి, నేను వ్రాసిన కందార్ధముల యందలి తప్పులను, ఒప్పులను మహాబుద్ధిమంతులు, గుణవంతులునగు మీరలు దిద్దుదురని ప్రార్థించి, నన్ను మీ కరుణా కటాక్షణములతో జూచుచు వినుడని భావము. 9

10. కం. విని మీ రివినిదిద్దుండని - పనిబడి ప్రార్థించనేల - వరు సము నిను మి - ట్లనునె స్వర్ణముజై మని - తనకై తానౌను సన్ని - ధానామందుంటె ॥ తెల్పుడియను - మానామిందుంటే ॥ మనవీ జేసునె పాలిమ్మని లేగతల్లికి - తనకై తానిచ్చును దయజేసి తా - సన్ని ధానామందుంటె॥ తెల్పుడియను - మానా మిందుంటె. ౧౦

తా. ఓ జనులార ! ఈ కందార్ధములను మనసార విని దిద్దుడని నేను ప్రార్ధించుటెందులకు, ఇనుము పరుసవేది సాన్నిధ్యమున నుండీన తానే బంగారమవును. తనను బంగారము చేయుమని ప్రార్ధించ నక్కరలేదు. అటువలెను ఆవు తనదూడ తన్ను పాలిమ్మని ప్రార్ధింపక యే సమీపమున దుండిన తనకు తానె దయగలిగి దూడకు పాలిచ్చునట్లు, మీవద్ద నేనుయుండి చదువుచున్న యీ పద్యములలో తప్పులు మీకు మీరే సవరింతురని భావము. 10

11. కం. అప్పకవీ య్యాద్యాంధ్రము - లొప్పగు మాఘాది కావ్య - మొగి జదివీ కృతిన్ - తప్పని కవులకు సమముగ - తప్పులు లేకుండజెప్ప - తరమౌనకృతినీ॥ ఊహనుజేస్తి - మరి నే నీ కృతినీ ॥ గొప్పపక్షులతోటి - కొదువపక్షులు సాటె - కుప్పార వీధిని, కూడ్యా డేటందూకు - తరమేనా కృతినీ ॥ ఊహనుజేస్థి - మరి నే నీకృతినీ. ౧౧

తా. ఓ జనులార ! అప్పకవీయము, భారవి. రఘువంశము. మేఘ సందేశము, మొదలగు మాఘాది పంచవాక్యములు జదివిన కవులతో, నేను సమముగా తప్పులులేకుండా కవిత్వము చెప్పుటకు శక్యమగునా, కాదు అయినను, శ్రీ మదచలగురుని అనుగ్రహముచే బోధింపబడినదియు, ఆ బోధచే నామదికందిన వాటిలో గలిగిన వూహచే యీ గ్రంధను వ్రాయుగలిగితిని. ఆకాశమునందు యెగిరెడి గండభేరుండ రాబందు, గ్రద్ద మొదలగు గొప్పపక్షులతో చిన్నపక్షులగు చిలుక గోరింక, పిచ్చుక మొదలగు పక్షులు సమముగా నెగురజాల నటువలె గొప్పకవులతో సమానముగా కవిత్వ పటుత్వము వుండదనే భీతిలేకనే యీ గ్రంధము వ్రాయుగలిగితినని భావము. 11

12. కం. చందం బెరుగక పద్యము - లెందుకు జేసెదవటంచు యెందరనినవే - సందేహింప చేసితి - నిందుల తప్పంటె మీర - లివి దిద్దెరనుచూ ॥ నే జదివితే చెవి యొగ్గి వినుచూ ॥ అందముగా చిత్త

మందిట్లు తలపోసి - కందార్థములను మీ ముందార బెట్టితి - యివి దిద్దేదరనుచూ ॥ నే చదివితె - చెవి యొగ్గి వినుచూ ॥ ౧౨

తా. ఓ జనులార ! కవిత్వమునకు ముఖ్యమయిన సులక్షసారం బగు చందోశాస్త్రము చదువుట నెరుంగక యీ పద్యము లెందుకు జేసెద వని కొందరు ఆక్షేపించినను నేను సందేహించక యీ గ్రంథమును వ్రాసితిని. బుద్ధిమంతులైన వారలు మీరలు గనుక యీ గ్రంథము యందు తప్పులున్న యడల దిద్దుదురనియు, నేను చదివిన జెవియొగ్గి కర్ణానందముగా వినియెదరనియు నా చిత్తమునందు తలంచి యీ గ్రంథము బుద్ధిమంతులగు మీ యెదుట బెట్టితినని భావము॥ 12

13. కం. పునరుక్తి గలిగి యుండిన - విని కోపము శాయ వలదు - వేడుకొని యెదన్ - వినువారు దూరపర్థము - గనవలె దగ్గర నటంచు - గల్పించినానూ తెలియకకాదీ - గ్రంథములోనూ॥ - జననీ జనుకులు - తమ తనయూల పునరుక్తి వినగోరుదురు - తప్పంచనకానే నది తెలిసి - కల్పించినానూ॥ తెలియకకాదీ - గ్రంథములోనూ॥ ౧౩

తా. ఓ జనులార ఈ గ్రంథమునందు జెప్పిన పదములనే మాటలను మరల మరల జెప్పుట కవిత్వముయొక్క లక్షణము గాదని అయ్యుది పునరుక్తి దోషమని యెంచి నా యందు కోపగించవలదు. ఏమనిన దూరముగానుండు అర్థమును అనగా ఆది మధ్యాంత రహిత మగు పదార్థమును చదువరులు దగ్గరలో తెలియుటకై యిటుల రచించితినేగాని తెలియకకాదు. అది యెట్లనిన తలిదండ్రులు తమ పసిపిల్లలు పల్కెడు ఎంతకఠిన వాక్యములనైనను అనేక పర్యాయములు ఆ పలుకులునే పల్కించుచు సంతసింతురేగాని కోపమానసులుగా యుండరని తలంచి యిటుల వ్రాయగల్గితినని భావము ॥ 13

14. కం. ఇది యాంధ్ర కవిత్వంబని - మదిరోయుండగదు దీని మర్మమరయుడీ - పదియారు వన్నె పసిడిని - ముదమున తోల్పెట్టినుంచ

ముట్టకుండుదురా॥ లోకులుచాత - బట్టాకుండుదురా॥ యిది గాకకుల హీను - డిచ్చిన దవ్యాము - విదితాముగా యెంత వేత్తలైనను దాన్ని ముట్టాకుండుదురా॥ లోకులుచాత - బట్టాకుండుదురా॥ ౧౪

తా. ఓ జనులార ఈ గ్రంధము తెమగు కవిత్వమగు కందార్ధములుగా వ్రాయబడినదని సంస్కృతము గాదని మీ మనంబున అసహ్యము పొందక దీనియందుగల రహస్యమును దెలియుడు. పదహారు వన్నెగల్గిన బంగారమును తోలుపెట్టెలో పెట్టినను లోకులు తీసుకొనక యుందురా, ఇదియునుగాక కులహీనుండు యిచ్చిన ధనమును కులమునందు యెంత ఆచారవంతులుగా, శ్రేష్టులుగా యున్న ఆయుతాజ్ఞ బ్రాహ్మణులైనను పుచ్చుకొనక యుండరని భావము॥ 14

15, కం. అసాంతంబీ గ్రంథము - ప్రాసయుతుల్ శబ్దగణము - భావముయుక్తుల్ - జూచిసరిపడని చోటను - యీసభలో పెద్దలెల్లా - యిది దిద్దవలెనూ॥ దిద్ది యిదేనా - మదిక ద్దవలెనూ॥ మీసాటివారికి వ్యాసాట లేదుంటే - నాసాటివారి బ్రత్కే సాటిగాకుండు - నిదిదిద్ద వలెనూ॥ దిద్దియిదేనా - మదికద్దవలెనూ॥ ౧౫

తా. ఓ జనులార! ఈకందార్ధదరువులను పద్యములకు ఆది మధ్యాంతములయందు యతి గణ ప్రాసలును, శబ్దములును, పదములును, భావములును, యుక్తులును లేక యుపమాన ఉపమేయములును చక్కగా విమర్శించి సరిపడని చోటను, యీ సభయందుండెడి అచల పరిపూర్ణులగు గురువులు సరిగా దిద్దవలయును. మీరలు దిద్దెడి సంగతులు నాకు దెలుపవలయును. మీరు దిద్దిన హంశములు నామనస్సునకు లేక భావమునకు సరిపడియుండవలెను. గొప్పవారలైన పండితులగు మీవంటివారికి యీ గ్రంధము దిద్దుటకు విసుపుపుట్టిన యెడల నావంటివారల బ్రతుకు యేమాత్రమని భావము. 15

16. కం. తప్పొప్పులు రెంటెన్నరుగని - తప్పుతనందుండి దీన్ని - తప్పనికూసే - తప్పాడు నరునకు జెప్పెద - చప్పాడు చాలించుమనుచు సభవారు వినగా॥ సరెసరె నాని - సభవారిట్లనగా॥ చెప్పిన వినకుంటే తప్పు వానిదెసుమ్మీ॥ తప్పుగలిగిన వెనుక - గొప్పొవాడెట్లౌను - సభవారు వినగా॥ సరెసరెవాని - సభవారిట్లనగా॥

తా. ఓ జనులార ఈ పద్యములగు కందార్థ దరువులయందు తప్పులను వొప్పులను అగు రెండును నెరుంగని మనుజుడు తప్పు తన యందుంచుకొని యీపద్యములను తప్పులనిజెప్పెడు మనుష్యునకు లేక కుచ్చితునకు అట్లనకూడదని సభవారు వినుచుండగా జెప్పెద, నీవు చెప్పినమాటయే మంచిదని ఈ సభవారు మెచ్చునట్లుగాజేసెద ఆలాగు జెప్పినను వినక వాదించిన యడల తప్పు వానిదేగదా, అట్లు తప్పు గలిగినవెనుక గొప్పవాడని ఎట్లు అనబడును. అట్టివాడు యెప్పటికి గొప్పవాడు కానేరడు యని భావము॥

17. ఇలుజొచ్చి గ్రామ సింహము - కలదొంతులగూల్చి నింటి గరిత లోరుగు దొం - తులు చక్కజేతుర్లనే - యిల సుకవి జనోక్తి తప్పు - లెంచూ దుర్జనుడూ॥ తప్పొప్పుగా-వించు సజ్జనుడూ॥ తులలేనిబుద్ధివంతులు, సర్వజ్ఞులుమీరు - తెలుసూనా తలపునే - దెలి పేదే మికతప్పు - లెంచుదుర్జనుడూ - తప్పొప్పుగా - వించు సజ్జనుడూ॥

తా. ఓ జనులార; గృహములో కుక్కప్రవేశించి దొంతులుగా పెట్టిన కుండలను పడద్రోసిన యటుల దుర్జనుడు దొంతులుగా యుండిన కుండలను పడద్రోసెడి కుక్కచందంబున మంచికవులువ్రాసిన గ్రంథ ములలో వొప్పులనెల్లను తప్పులుగా భావించుచు విపరీతార్థములు చెప్పును, అయింటి కులకాంతలు ఆ పడద్రోసిన కుండలను యెప్పటి

యట్లు చక్కపరచినట్లు సజ్జనులగు ఉత్తమపురుషులు తప్పులను వొప్పులుగా భావించి సవరింతురు. మీరు సర్వమును దెలసినవారును, సుగుణవంతులునై మీబుద్ధితో సమానులెవ్వరు నుండరని, నా వుద్దేశ్యము మీరు గ్రహించగలరని భావము.

18. కం. తనగొప్ప నెంచరేమో - జనులని తలపోసి సాధు - జనకృత కవితల్ - విన డితరులు వినగోరిన-వినకనరాదనుచు మనసు-విరచూ దుర్జనుడూ॥ విని వినిపించు - వేడ్క సజ్జనుడూ॥ కనవొచ్చే ముంజేతి - కంకణాలకువేరే - ఘన నిల్వు టద్దాము - గావాలెనా మనసూ-విరచు దుర్జనుడూ॥ వినివినిపించు-వేడ్క సజ్జనుడూ॥ ౧౮

తా. ఓ జనులారా ! దుర్జనుడు తనబోధను తన గ్రంధమును గొప్పగా జనులు చూడకుందురని మనంబున తలంచి అచలగురువులు రచించిన గ్రంధములను వినవలదని, జదువవలదని, యితరులకు, శిష్యులకు చెప్పుచుండును, సజ్జనుడు పెద్దలువ్రాసిన గ్రంధములువిని చదివి ప్రజలకుతాను వినిపించును. ముంజేతి కంకణములు జూచుటకు నిలువు టద్దము అక్కరలేనటుల సూక్ష్మముగా అచలపరిపూర్ణమును బోధించి యెరుకను విడిపించును. దుర్జనుడు తాను జెడుటయేగాక యితరుల యొక్క మనస్సులనుకూడా జెరుపును. సజ్జనుడు యితరులకు గురుపుత్రులకు తగినవిధంబున పరిపూర్ణమునుబోధించి మంచిస్థితిని పొందించునని భావము.

19. కం. ఆగామికధ యెట్లన - బాగుగ వివరింతు చెవుల - పండువుగాగన్ - ఆగమనిగమో పనిషత్సాగర - మదితార్థ మవల - సాంగో పాంగముగాన్॥ దయుతో వినుడీ - సాంగోపాంగముగాన్॥ ప్రాగర్థ చరమార్ధ - యోగాములకును॥ । సం యోగముగావించి - నే గుర్తెరిగినదంత - సాంగోపాంగముగాన్॥ । దయుతోవినుడీ - సాంగో పాంగముగాన్॥ ౧౯

తా. ఓ జనులార! ఇటుపైని రాబోవు జననమరణములనే అంశమునుగురించి నేను సర్వమంత్ర సంయుతమైన వేదములను, వుపనిషత్తులను, శృతిస్మృతులునైన మహాసముద్రమును తరచి తీసుకొనిన సారాంశమను అమృతమును మద్గురువాక్యమునకు జతపరచి కందార్థములుగా వ్రాసితిని. ఇట్టి గ్రంధమును మీశ్రోత్రముల కానందముగా ఆఖరువరకు వినిపించెద. మీరు దయతో వినుడు. ప్రాగర్ధంబ నెడి యీ స్థూలశరీరంబును చరమార్ధంబనెడి సూక్ష్మమైన ఆత్మయును కలశి యొక్కటేయని, నేనుమద్గురుస్వాములచే తెలుసుకొనినదంతయుమీకు బోధించెద, యితరచింతలుమాని చక్కగా వినుడని భావము. 19

20 కం. మోదమున ప్రొద్దుపోకకు - వాది ప్రతివాదులగుచు-
పరగురుశిష్యుల్ వాదించి రనుచునొక సం - వాదము గల్పిస్తి
కలగా - వదలాక వినుడీ॥ మొదటినుంచి-తుదవెళ్ళాగనుడీ॥ వేదాం
తార్థతీత - వేత్తాలు మీరిందు - యేదేది సవరించు - డిదే నా విజ్ఞా
పాన - వదలాకవినుడీ ॥ మొదటినుంచి - తుదవెళ్ళాగనుడీ॥ ౨౦

తా. ఓ జనులార! సంతోషముతో ప్రొద్దుపోవుటకై వాది ప్రతివాదులవలె గురుశిష్యులిద్దరు వాదించునటుల ప్రశ్నోత్తరములను సంవాదమును కలిపించి, కలలో ముచ్చట్లవలె యీ గ్రంధమును వ్రాసితి, మొదటినుంచి ఆఖరువరకు యీ గ్రంధమును చూడుడు, లేక వినుడు, వేదమునకు అంత్యార్థము లేక సారాంశమగు మహావాక్యార్థ విచారణచేసి, అయ్యదినిజమైనవిచారణకాదని, అందులకు అతీతమైన అచలపరిపూర్ణ బ్రహ్మవేత్తలైన గురుస్వాములగు పెద్దలు మీరలే యని తలచి, యీకందార్థములను మీరువిని వీటిలో తప్పులుగలిగిన చోట సవరింతురని మనవి చేయుచున్నానని భావము. 20

21 కం. కొంచములో సరిపుచ్చక - పెంచినవీ గ్రంథమనుచు-పెద్దలలుగకన్ - మించిన వేడ్కతోవినుడీ - పెంచినయర్థంబు నే. దె-ల్చెద లోకులెల్లా॥ అర్థముదెలసి-మది నుల్లాసిల్లా॥ పెంచీతి పెంచీతి-గొంచాము వెడలూపు - వుంచుండె నది లోతంచెంచీ నామదిని దె-ల్చెద లోకులెల్లా॥ అర్థముదెలసి - మదినుల్లాసిల్లా॥ ౨౧

తా. ఓ జనులార ! ఈఅచలపరిపూర్ణ బోధను కొంచములో సరిపుచ్చి వ్రాయకుండా, పెద్దగ్రంథముగా వ్రాసితినని పెద్దలగుమీరు నాయందు అసహ్యముగా నుండకుడు, ఎందులకన లోకములోనుండు వేదాంతులు నా మనోధర్మమును అనగా స్థిరపరచుకొనిన అంశమును, చక్కగా తెలుసుకొని వుత్సాహము పొందుదురని విరివిగా, పెంచి వ్రాసితిని. అచలపరిపూర్ణముయొక్క స్థితి రహస్యాతి రహస్యమైనది గావున, అద్దానిని తేటతెల్లముగా తెలియుటకై జక్కగా మీకు బోధ పడి ఆనందము పొందుటకై విరివిగా యీ గ్రంథమును రచించితినని భావము॥ 21

ఇతి॥ శ్రీమద్భావగత కృష్ణవిరచిత ద్వైతాద్వైతరహితపరమతత్వేన శ్రీభూమానంద దువ్వాడ నారాయణమూర్తి విరచిత తాత్పర్య భావార్థే సభా విజ్ఞాపన ప్రథమోధ్యాయః

• ౨ • - గురుశిష్యన్యోన్యదరిశనం • ప. ౧౦-10 •

20 కం. సాధన సంపత్తియుగల - సాధకుడొక నరుడు ఘోర సం - సారమునన్ - బాధపడలేక తన పు-ణ్యోదయమున గురుని గాంచి - యురుతరభక్తిన్॥ శరణని మ్రొక్కి - మరిమారియుక్తిన్॥ బోధాజేయుము పుణ్య - పురుషా మాబోట్లాకు - సాధించదగు ముఖ్య, సాధనానిపల్కె - నురుతరభక్తిన్॥ శరణనిమ్రొక్కి - మారిమారియుక్తిన్॥ ౧

తా॥ ఓ జనులార ! సాధన చతుష్టయ సంపత్తియనగా, నిత్యానిత్య వస్తువివేకము, అనగా బ్రహ్మము సత్యము, జగత్తు మిధ్య లేక అసత్యమని తెలిసికొనుట, యిహ మూత్రార్థ ఫల భోగ విరాగము అనగా ప్రపంచసంబంధమగు కోర్కెలు స్రక్చందన వనితాదిభోగములు పరసంబంధమగు రంభాసంభోగాది సాలోక్యాది పదవులు కోరకుండుట, పాపపుణ్యములుబడయకుండుట, శమాది షట్కసంపత్తియనగా శమము అంతరింద్రియ నిగ్రహము, దమము, బాహ్యేంద్రియ నిగ్రహము, శాంతి, అరిషడ్వర్గజయము అనగా కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరములను ఆరును జయించుట. తితిక్ష యనగా శీతోష్ణాది సుఖదుఃఖ ద్వందములను సహించుట. శ్రద్ధయనగా గురువులయందును, గురువాక్యములయందును వేదాంత శాస్త్రముల యందును విశ్వాసము కలిగియుండుట, ఉపరతి యనగా కర్తృత్వము లేక కర్మలుచేయుచు సద్గురూపదిష్ట మహావాక్యార్థములను మనస్సున దృఢపరచుకొని ఆత్మనెరిగి చరించుట, ముముక్షత్వమనగా, సంసారము నందలి తాపత్రయాగ్ని చేత యనగా గృహముకాలుచుండ నందుండు పురుషుడు అగ్నిబాధకు సహించ లేక నీటికై వెదకులాడినభంగి. జనన మరణములతో గూడిన ఆద్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవికములనెడి తాపంబులను తొలగించు సద్గురుమూర్తు లెవరుయని, దీనికి సాధనము లేవి కావలయునని తపించుచుండు చిత్తవృత్తితోగూడి అన్య ముపేక్షింపకుండుట మోక్షేచ్ఛయని పేరు

యిట్లు నాలుగుసాధనసంపత్తులుగల్గిన పుణ్యపురుషుడు పిపీలికాది బ్రహ్మపర్యంతము నేనైన ఆత్మస్వరూపమే అన్నిస్వరూపముయందు వున్నది. నాయందే అన్నిస్వరూపములు వున్నవి. మమాత్మ సర్వభూతాత్మయని శృతి వున్నది. అన్నియు నేనే అయియుండగా నాకు మోక్ష మెట్లుగల్గును, తన్నివృత్తిర్మోక్షః అని శృతివున్నది. గావున

నేను లేకపోవునప్పుడు మోక్షముగాని, నేనువుండగా మోక్షమెట్లు గల్గును, నేనే ఆత్మస్వరూపుడను శివోహం నేనే ఈశ్వరుడను గాన గొప్పసంసారినై యున్నాను నాకు మోక్ష మెట్లుకల్గును. అని విచారించి యిందువలన వుత్తమజన్మ కల్గునేకాని జననమరణములు రహితముకావని యిట్టిజననమరణప్రవాహము నీదజాలక తనపుణ్యవశంబున అచలగురుసార్వభౌముని జూచి యోమహాత్మా ! పుణ్యపురుషా యని స్థుతించి శరణువేడుకొని ద్వాదశ నమస్కారములుజేసి జననమరణ ప్రవాహముమండి దరిజేరుటకు అనగా నేను లేకపోవుటకు సాధించవలసిన ముఖ్యమైన సాధనయెద్దియో అద్దానిని బోధించి నన్ను రక్షింపుడని భయభక్తులతో ప్రార్థించెనని భావము. 1

23. కం. శరణాగతుడగు శిష్యుని - కరుణామృత దృష్టిచేత - గనిమోదము ము - ప్పిరిగొన మృదువాక్యములను - పరమదయాళుండుగురుడు-భక్తావినుమనెనూ॥ సంశయామింక - బాధింపదనెనూ॥ పరిపూర్ణమొకటీ - లేనెరుకానెదొకటి - పరిపూర్ణ మెరుకాల, నెరిగి యెరుకనుమాను - భక్తావినుమనెనూ॥ సంశయమిక - బాధింపదనెనూ. ౨

తా॥ జననమరణములనే బాధనుండి తప్పించుకొనునుద్దేశముతో అచలగురుమూర్తిని శరణుజొచ్చి సాష్టాంగద్వాదశ నమస్కారములు జేసి అంజలికట్టుకొని నిలుచున్న శిష్యుని శ్రీమదచలగురుమూర్తి కరుణామృతదృష్టిచేత శిష్యుని యాదరించి కూర్చుండనియమించి, భక్తుడా వినుము నీకు సంసారమనెడి ఆధ్యాత్మిక, అదిభౌతిక, అదిదైవికముల చేత కలిగెడి తాపత్రయాగ్నులు నిన్ను బాధింపవు. ఆధ్యాత్మికమనగా పంచవింశతి తత్వములే ఆధ్యాత్మికములు. ఆదిభౌతికములనగా పంచ వింశతితత్వముల విషయములే ఆధిభౌతికములు, ఆదిదైవికములనగా పంచ వింశతీ తత్వముల అది దేవతలే ఆది దైవకములు, యిట్లు యిరువదియైదు తత్వముల ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములతో కలసి

యున్నది. యీదేహము వేరొకవిధమెట్లనినయీస్థూల దేహముయందు కలుగుచున్న వాతపిత్తశ్లేష్మాదులనెడి త్రివిధ రోగములు అనగా మూడువందల ఎనభైఅరు వ్యాధులవలన కలిగిన తాపము లేక దుఃఖము ఆధ్యాత్మికము. సర్పవృశ్చిక వ్యాఘ్రములు చోరులు మొదలగువాటిచే కలిగిన తాపము లేక దుఃఖము ఆదిభౌతికము, వర్షము, పిడుగులు, వాయువు, అగ్ని వడగళ్ళు, చెట్లు. గోడలు వీట్లవల్ల కలిగిన తాపము లేక దుఃఖము ఆదిదైవికము. యిట్టి తాపములు నిన్ను అంటకుండుటకై ముందు నేను బోధించెడి రాజయోగ బోధాలక్షణమును చక్కగా గ్రహించుమని యిట్లు చెప్పదొడంగెను. అచల పరిపూర్ణ మనియు, లేని యెరుక యనియు రెండు గలవు. ఆ రెంటిలో పరిపూర్ణముయొక్క నిజమును, లేని యెరుక యొక్కలేమిని తెలుసుకొని పరిపూర్ణమును తెలిసికొని పరిపూర్ణమును గ్రహించి లేని యెరుక లేనిదని దృఢనిశ్చయము పొందుము. అట్లు పొందితివేని లేనియెరుక యొక్క యింద్రియములు గుణములు చేష్టలు, సంశయములు స్థూల దేహమునకు సంభవించెడి ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆది దైవికములు వలన కలిగెడి ఏ బాధలు నిన్ను బాదింపనేరవని భావము॥ 2

24॥ కం. ఏ సాధన నీకెందుకు - వీసానికి పనికిరాదు - వినుమా యయ్యా - నే సాధులచే విన్నది - ఏ సాధనలేని బోధ నెరిగింతుపోకూ॥ సాధనలందు - మరిగితేరాకూ॥ ఏ సాధలజోలి - యే నొల్లననినీవు బాసా జేసితివేని - పరిపూర్ణబోధనే - నెరిగింతుపోకూ॥ సాధనలందు - మరిగితె రాకూ॥

తా. బిడ్డా - యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులనెడి అష్టాంగ యోగములను షణ్ముఖి శాంభవి ఖేచరి భూచరి మధ్యమ వైఖరి మొదలగు ముద్రలును, మూలబంధ

జాలంధర వొడ్యాణబంధములను మంత్రయోగ లయయోగసాధనలను వీరాసన, స్వస్థికాసన, పద్మాసన, మతాంతర పద్మాసన, యోగాసన, కూర్మాసన, ఉత్థానకూర్మాసన, భద్రాసన, సిద్ధాసన, మతాంతసిద్ధాసన సింహాసన, కుక్కుటాసన, గోముఖాసన, ధనురాసన, మయూరాసన కపాలాసన, ముక్తాసన, టిట్టిభాసన, పశ్చిమతాణువాసన, పూర్వతాణువాసనఅర్భకాసన, కామదహనాసన మొదలగు యెనుబదినాల్గుఆసనములును హఠయోగ సాధనలన్ని జననమరణ ప్రవాహమునుపోగొట్టనేరవు. జననమరణ ప్రవాహమును పోగొట్టుటకు నేను సాధువులగు మద్గురువరేణ్యులచే విన్నది. ఏ సాధనలులేని రాజయోగమును అచల పరిపూర్ణబోధ నీకు దెల్పెద దీనిని విడువకుము. పై సాధనలయందు నీకు అపేక్షయున్న యడల యీ బోధను వినకుము, యిటుపై యే సాధనలు నీవు చేయనని నాతో ప్రమాణికముచేసిన యడల జన్మరాహిత్యమగు అచల పరిపూర్ణ బోధను నీకు బోధించెద సాధనలయందు నీకు భ్రాంతియున్న యెడల నాయొద్దకు రావలదని భావము॥ 3

యమ మనంగా॥

అహింసా, సత్యము, అస్తేయము, దొంగలింపకుండుట, బ్రహ్మచర్యము, భూతదయ ఋజు ప్రవర్తన అనగా త్రికరణముల ఏకత్వ ప్రవృత్తి, క్షమా, సుఖదుఃఖములకు ఓరిమి ధైర్యము, మితాహారము సౌచము, బాహ్యంతర శుద్ధి వీటికి యమమని పేరు॥

నియమ మనంగా

తపస్సు. సంతోషము, ఆస్తిక్యముఅనగా గురుదైవములయందు విశ్వాసము, దానము, ఈశ్వరపూజ, సిద్ధాంతవాక్య శ్రవణము

వేదాంత విచారణ, అధర్మమార్గముల ప్రవేశింపక లజ్జ గల్గియుండుట, మతినిర్మలమగు బుద్ధి, జపము, ప్రణవాది మంత్రపురశ్చరణము, వ్రతము అనగా తాను బ్రహ్మచర్యాది వ్రతమును ప్రాణాంతము వరకు సౌరక్షించుకొనుట యివి అన్నియుచేరి నియమ మనబడును॥ యమ నియమములు రెండును రెండు నేత్రములుగా భావించుకొని ఆచరించ నగును॥

25. కం. గురువర పరిపూర్ణంబన - నెరుకనవిని రెండు యెట్టి - వెరుకోద్భవమెం - దెరుకదనుచోటుయెయ్యది - యెరుకను నేనెట్లు విడచే - డెరుగించుమనెనూ॥ అట్లనెగురు - డెరిగింతుననెనూ॥ చరణా ధూళిని రెండు - కరములగొని తన - శిరమూన ధరియించి - శరణాని యాశిష్య - డెరుగించుమనెనూ॥ లట్లనెగురు - డెరిగింతుననెనూ॥ ౪

తా. సద్గురుప్రభూ ॥ పరిపూర్ణమనియు లేనియెరుక యనియు రెండుగా శెలవిచ్చితిరి. లేనియెరుక యెట్లుపుట్టెను, ఎరుకలియ్యె (లయ) మయ్యేడు చోటు యెయ్యది. ఎరుకను నేను ఎట్లు విడువగలను, యీ యంశములన్నియు నాకు విపులముగా శెలవియ్యవలయును. యని శ్రీసద్గురు పాదకములయందలి ధూమ్రమును శిష్యుడు తన శిరమున ధరియించి, పరిపూర్ణమెరుకల బోధింపుడని పాదములపైబడి శరణని ప్రార్థింపగా, శ్రీనిజగురుస్వామి శిష్యునియందు కరుణారసాంమృతము గల్గినవారలై లేవనెత్తి అభయ స్తంబిడి అట్లే బోధించెద వినుమని భావము. 4

26. కం. మొదలచలము తెరిగించెద - విదితముగా లేనియెరుక వివరింతువయిన్ - తుద కెరుకను విడిపించెద - మదిలో నామాట నమ్మి- మరివింటివేని॥ చంచలబుద్ధి - మానుంటివేని॥ పదుగూరు నినుజూచి - భళి శభాసితోప్రవ - కెదురూ లేదనెటట్టూ - యిదిగో నే జేసెద - మరి వింటివేని॥ చంచలబుద్ధి - మానుంటివేని॥ ౫

తా. శిష్యా ! నీకు ముందుగా అచలపరిపూర్ణమును యెరిగించి బోధించెద, తర్వాత లేనియెరుకను వినిపించెద, అటుతర్వాత తుదను ఆ లేనియెరుకను విడిపించెద, నామాటయందు సంశయంబులేక నీ మనస్సులో నమ్మినవాడవైతివేని, అనేకులు నిన్నుజూచి భళిభళి భాసు యీ అచలపరిపూర్ణ మార్గమునకు బోధకు సాటియగునట్టియు, మించిన బోధ ఎదియును లేదని నిన్ను జనులు, పెద్దలు, అందరు మెచ్చుకొనునటుల బోధించెద. చక్కగా వినుమని భావము. 5

27 కం. మీ రంతవారుగనుకనే - చేరితి మీ పాదసేవ - సిద్ధించుటకై - యేరింతవారు జగమున - లేరని నా మదికిదోచె - లెస్సాగవినుడీ॥ ఆజ్ఞకుమీర - లేదు కనుగొనుడీ॥ యేరీతివినుమంటే- నారీతివినియెద - మీ రానతివ్వండి-తోరామౌయీబోధ - లెస్సాగ వినుడీ॥ ఆజ్ఞకుమీర - లేదూకనుగొనుడీ. ౬

తా. శ్రీగురు, మీరు నామనస్సుకు చక్కగా బోధింపగలిగి నంతటి ప్రభావముగల అచల పరిపూర్ణ బోధాచార్యులని, తెలుసుకొని మీ పాద సేవ కుండనైతిని, లోకమున మీతో సమతుల్యమగు బోధకులు లేరని నామనంబున జక్కగా దెలసెను. మీకు నన్ను ఎట్లా ఆజ్ఞాపించి నడచుకొనుమనిన ఆరీతిగా మనస్సును కదలనివ్వక వినియెదను, సాటిలేని యీ అచల పరిపూర్ణ భోధను చక్కగా బోధచేయుడు బాగుగా విని యెదనని భావము. 6

28 కం. మొద్దులనైనను దొల్తురు - బద్ధుల బద్ధత్వమడవి - పొల్జేతురు మీ - వద్దికి వచ్చినగని - పరి - శుద్ధపు బోధోక్తమైన - సూక్తులుగుప్పీ॥ అందుకుతగిన - యుక్తూలుజెప్పీ॥ పెద్దాలచే మీ ప్రసిద్ధిని వినివస్తి-దిద్దూడీ సేవట్టి - బుద్ధిహీనుడనన్ను-సూక్తూలుగుప్పీ॥ అందుకు తగిన - యుక్తూలుజెప్పీ॥ ౭

తా. శ్రీ గురుదేవా ! మీరలు యెంతటి మందబుద్ధిగలవారి కైనను పరిపూర్ణబోధ బోధించి మందబుద్ధిని వదలించగలరు. సంసార మున బద్ధత్వము నొందిలవారల బత్తత్వము లేక కర్తృత్వమనె బంధము, నరులతో కూడిన సంసారమును అడవిపాలు గావింతురు. మీదగ్గర జేరినవారలకు పరిసుద్ధమైన అచలబోధను బోధించుచు, అందుకుతగిన ఉపమాన ఉపమేయములగు సాటువలను జెప్పెదరు. పెద్దలవలన మీ యొక్క ప్రఖ్యాతిని విని దేశికచక్రవర్తియైన మీ సన్నిధానమున జేరు కొంటిని, బుద్ధిహీనుండగు నన్ను గడతేర్చెడిభారముమియ్యదియేయని, భయభక్తులతో శిష్యుడు ప్రార్థించెనని భావము. 7

29 కం. నూటిగను బోధనామది - నాటినదిక చాలుచాలు - ననినీకై నీ - నోట నివుబల్కుదాకను - సాటువలన జెప్పుచుందు - సరెరా నామాటా॥ రాగోరుచూ - మరి నే నీమాటా। నూటికొక్కటి శేలు - మాటాని తెలియురామూ, మాటిమాటిక, వట్టి-పాటాలేమిటింకా - సరెరా నామాటా॥ రాగోరూచూ - మరి నే నీమాటా॥ ౮

తా. ఓ శిష్యుడా ! ఈ అచలపరిపూర్ణబోధ నా మనస్సునకు సంశయము లేకుండా బోధపడినదని, యీ బోధ యిక చాలుచాలని నీ నోటితోనీవు పల్కునంతవరకు వుపమానములు, ఉపమేయములు చెప్పు చుందును, జాగ్రతగా వినుము, నీనోటివెంబడి ఏమాటపల్కెదవో యని చూచుచుంటిని, నూరుమాటలకు యీమాట ఒక్కటియే సరిపోవునుయని నీమనస్సులో భావించుము. ప్రతిమాటమాటకు ప్రయోజనము లేనటు వంటి పాటలను పాడుటమానుము. నీనోట నీవు యిప్పటికి బోధించిన బోధ చాలునని పల్కునంతవరకు బోధించెదనని భావము. 8

30 కం. తానే ననకను నిండిన - దానికిపేరేమి బయులు తానే ననుచున్ - నేననియెద నేనెవ్వరు - లేనెరుకవు వుంటివుంటి - లేనేలే

ననుమీ॥ అంటిని అంటె - లేనెలేవుసుమీ॥ లేనె లేననినేను - లేక పోయిన వెనుక, తానుండుగద వుంటె - దాన్నెట్లరిగెద వీవు - లేనెలేననుమీ॥ అంటినియుంటే - లేనేలేవుసుమీ॥ ౯

తా. శిష్యా ! తానున్నానని తనకు తెలియబడక నేననిపలుకక సర్వసర్వాంతర్యామియై నిండి పూర్ణాత్పూర్ణమై రూపనామక్రియలు లేక యున్నదే యీ వుత్తబట్టబయలు. నీవు వున్నావని నీకు తెలియును, నేనని పలుకుచున్నావు, నేననగా నీవు యెవ్వరవు? నేననగా లేనియెరుకవు, యీ లేనియెరుక లేనేలేదని నమ్మకనమ్మినయెడల నీవు లేనేలేవు. నేనులేనని అన్ని వేళలయందు అంటూవుంటే, యీబోధదృఢమై ఎరుక లేకుండాపోవును. అలాగు ఎరుకపోయిన తర్వాత అచల పరిపూర్ణమగు, ఈ వుత్తబట్టబయలు వున్నదని యనుటకు, దానిని నీవు యెట్లు యెరుగుదువు. నేను అను యెరుక ఎల్లప్పుడు లేనిదని తలంచుచుంటివేని లేకుండా అగుదువని భావము. 9

31. కం. మీరాజ్ఞయిచ్చివుంటిరి - నేరుపుతో బయలుయెరుక - నెరిగించి పయిన్ - పేరణతు యెరుకనని యి - ట్లారీతిని యెరుకపరచు - మయ్యా మ్రొక్కెనూ॥ అనుమానము - జెయ్యా కియ్యేడనూ॥ సారెకు మీపాద - జలజాయుగ్మము నాహృ - త్సారాసమున నిల్పి - సల్పాచూ పూజానో - యయ్యా మ్రొక్కెనూ ॥ అనుమానము - జెయ్యా కియ్యేడనూ. ౧౦

తా. శ్రీ సద్గురు చంద్రమా ! మీరు ముందుగా బట్టబయలనెడి అచల పరిపూర్ణమును, లేనటువంటి యెరుకను, వేర్వేరుగా రెంటిని నెరిగించి అటు తర్వాత ఎరుకను తీసివేయుదునని సెలవిచ్చితిరి. అదె ప్రకారము ముందు అచల పరిపూర్ణమనెడి బట్టబయలను నెరిగించి, యెరుక యెట్టిదో తదుపరి బోధించి, ఆ తర్వాత ఎరుకను తీసి వేయుడు. నేను యే సంశయములు లేకుండా వినియెద నేను యేమను

కొందునో యని నా యందు మీరు ఏ లనుమానము వుంచకుండా బోధింపుడు. నాప్రభువులగు మీ పాదపద్మములు నా హృదయ కమల మందున లేక మనస్సులోని నిలుపుకొని నిరంతరము షోడశోపచార పూజలు జేసికొనుచు సాష్టాంగ నమస్కారములు గావించుచుందును. నా యందు ఏ సంశయము పడకుండా బోధింపుడని భావము॥ 10

ఇతి॥ శ్రీ మద్భాగత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి విరచిత తాత్పర్యం భావార్థే గురుశిష్యన్యోన్య దరిశనం ద్వితీయోధ్యాయః

---

• 3 • అచలలక్షణం • ౧౩ ప॥ 13 •

౨౨. కం. పుట్టుట గిట్టుట లేకను - పుట్టేగిట్టేటియెరుక - పోడి మెరుగకన్ - చట్టువలె కదలకుండును - బట్టబయుల్ యిట్టిదెరిగి - భావింపదగునూ॥ యెరుకలేక - సేవింపదగునూ॥ వట్టి యాశల చాత పట్టూబడకను యీ - గుట్టూ దేశికునోట గట్టిగ దెలుసూక - భావింప దగునూ॥ యెరుకలేక - సేవింపతగునూ॥ ౧

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయులగు అచల పరిపూర్ణము పుట్టుటయు చచ్చుటయులేక పుట్టుచు చచ్చుచు యుండెడి యెరుక పుట్టినదో చచ్చినదో నెరుంగక చట్టు అనగా నీళ్ళలోనుండెడి చట్రాయి లేక పరుపుబండ. నీళ్ళు తనపై నుంచి పోవుచున్నవో లేక యినికిపోయి నవో తెలియనటుల కదలక రాకపోకలు లేక, రాకపోకలు గలి గిన యెరుక జాడ నెరుంగక ఒకే విధముగా యుండును. అట్టి పరిపూర్ణ మును తెలిసి ఎల్లప్పుడు భావించుము. ఎరుక నేకుండా సేవింపదగు ననగా ప్రపంచ దేహేంద్రియాది భ్రాంతియు, అహంభావము వదలి పరిపూర్ణమును సేవింపవలెను. లేనటువంటి వృత్త భ్రాంతులచేత

అనగా గ్రంధ పరిచయముచేతగాని, ఎవరైనా బయలు బయలని అనుకోగాగాని ఈ పరిపూర్ణము పట్టుబడదు. ఈ రహస్యము అచల గురుస్వాములవారినోట చక్కగా దెలుసుకొని భావింపవలెనని భావము॥ 1

33. కం. యెరుకైన రీతినుండును - యెరుగ నశక్యం బటంచు యెన్నిన ఎరుకన్ - యెరుగుదు ననినను యెరుకకే - యెరుగుట దుర్లభము సుమ్మి - యీ వృత్తబైలూ॥ యెరుగనె యెరుగ - దెరుకానీ బైలూ॥ పెరుగాదు - విరుగాదు వొరుగాదు తరుగాదు - అరుగాదు కరుగాదు - తిరుగాదు మొరుగాదు - ఈ వృత్తబైలూ॥ ఎరుగనె ఎరుగ దెరుకానీ బైలూ॥

తా. శిష్యా ! ఎరుక ఏ భ్రాంతిని పొందునో తానట్లగును. నేను ఎరుంగుదునని యున్నది ఎరుకే, నాకు ఎరుగుట శక్యముగాదని యున్నది ఎరుకే నేను తెలుసుకున్నానని అనినను ఎరుకే యిట్టి గుణములతోనుండెడి ఎరుక యీ వృత్త బట్టబయలు ఎరుంగదు యీ వృత్త బట్టబయలు పెరుగదు, విరిగిపోదు, దేనిని ఎరుగదు, తరుగదు, అరగదు, కరుగదు, చైతన్యము కలిగి తిరుగదు, మాట్లాడదు, సర్వకాలముల నొక్కరీతిగా యుండునని భావము॥ 2

34. కం. పలుకున బలుగక రాకను - తలపోయుదమనిన మదికి - దగులక ఎపుడున్ - ములుగృచ్ఛసంధిలేకను కలిగున్నది. బట్టబయలు - గదరా మాయన్నా॥ యిదిగోచూడు - కదులాదోయన్నా॥ పలుకన్నా బలుకాక - తలపన్నా దెరుగాక - చలియెండ వానాల - నలయాక నిలుచుండు - గదరా మా యన్నా॥ యిదిగో చూడు - కదులాదో యన్నా॥ 3

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయులు మనము మాట్లాడెడి మాటలకు బదులు చెప్పదు ప్రతిధ్వనియులేదు, యిట్టిదని అట్టిదని తలపోయుటకు మనస్సుకు దగులదు. ముల్లు గ్రుచ్చునంతటి సందైనను లేకుండా నిండి నిబిడీకృతమై యున్నది. యిటువంటి బట్టబయలును గురు ప్రభుపుల కరుణచేత జూడుము. యీ అచల పరిపూర్ణము కదలదు. పలుకైనను అనగా నేను అనే మాటయైనను అనదు, మనము తలంచెడి తలపులనైనను తెలుసుకొనదు తనకు ఏతలపులు లేవు. చలికి వణకదు, ఎండకు ఎండదు, వానకు తడియదు, వడగండ్లకు నొవ్వదు. సర్వకాలములయందేకరీతిగా అవాఙ్మానస గోచరమై చలించక యున్నది యిదిగో చూడుము యని భావము॥ 3

౪౫. కం. సామర్థ్యమేమి జూపదు కామక్రోధాదికముల - గలయదనిశమే - బాము లెరుంగదు యితరులు - యేమనినను మారు బల్క - దీ బట్టాబయులూ ॥ దీనికి మ్రొక్కే - రితర జేజేలూ ॥ నామ రూప క్రియా నటనాలన్నియు మీరి - యేమానియనరాక - యేకమై యున్నాది ॥ యీ బట్టాబైలూ ॥ దీనికి మ్రొక్కే - రితరజేజేలూ ॥ ౫

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయులు యే సామర్థ్యము లేక ప్రజ్ఞను చూపించదు. కామ క్రోధ లోభ మోహ మద మత్సరము లనెడు అరిషడ్వర్గములతో కలియదు. ఏవిధమగు కష్టములుపొందదు. యితరులు తనను నిందించనను, స్తుతించినను, బదులు పల్కదు. ఈ వృత్త బట్ట బయలునకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, సర్వదేవతలు ఎల్లప్పుడు నమస్కరింపుదురు. ఈ వృత్త బట్టబయలు రూపము, నామము, క్రియ ప్రవర్తనలు లేక అనగా తనయందు దేవృత్తియు లేక యిట్టిదట్టిదని నిర్దేశించుటకు శక్యముగాక సర్వకాల సర్వదేశ సర్వవస్తువులయందు నిండి పూర్ణమై యువ్నదని భావము ॥ 4

36. కం. దానము ధర్మము సుగుణ - ధ్యానము ప్రతిమార్చ నంబు - తజ్జప తీర్థ - స్నానము లివిముక్తిదమని - మానవులొనరించ బయలు - మాటాడదేమీ॥యెరుకేలేదు - మాటాడేదేమీ॥ఔనూ కాదన కానీ - వనక నేననకొక్క - మేనైన తాగాక - మితిమీరియున్నాది - మాటాడదేమీ॥ ఎరుకేలేదు - మాటాడేదేమీ॥ ౫౪

తా. శిష్యా ! షోడశ మహాదానములు చేయుట. అధితి అభ్యాగతులకు ధర్మముచేయుట, సగుణధ్యానము చేయుట, లేక ప్రతిమలను అర్చించుట, శేవించుట, మంత్రోపాసనాది జపములు చేయుట, అష్టాంగయోగములచేతతపస్సుచేయుట, తీర్థయాత్రలు చేయుచు నదీనదముల యందు స్నానంబు చేయుట, మొదలగునవన్నియు మోక్షములని యీ నరులు చేయుచుండిన ఈవృత్త బట్టబయలు యిదిమోక్ష మార్గముగావని గాని, అవుననిగాని. మాట్లాడుటలేదు. ఎందువల్లననగా దానియందు (ఎరుక) గుర్తెరుగుటలేదు. అందువలన ఏమియు అననేరదు నేననియు నీవనియు అనదు, అదియునుగాక యీవృత్త బట్టబయలునకు స్థూలశరీరముగాని, సూక్ష్మశరీరముగాని, కారణశరీరముగాని, మహాకారణ శరీరముగాని, ఈశ్వరతనుచతుష్టయముగానిగలిగి యుండలేదు. అనగా యీ అష్ట తనువులలో ఏదియు అదికాదు. ముందు కాలేదు. యిప్పుడు అయి యుండలేదు. యిటుపై కాబోదు. యీ వృత్త బట్టబయలు మితిమేరలు లేక అంతటానిండి యున్నదని భావము.

37 కం. ఇంతంతని యనరాదని - వింతలు తాయునిది యన్ని విధముల గనినన్ - చింతలెరుంగని - దీబయు - లెంతని వినిపింతు నేనీ - కేమిరపృథుకా॥ తెల్పుట వినుట - మికపెద్ద కథగా॥ సంతాత మొకరీతి - సకల దేశములాయం - దంతాట నిండున్న - దదుగోపరి పూర్ణాము - యేమిర పృథుకా॥ తెల్పుట వినుట - మికపెద్ద కథగా. ౬

తా. శిష్యా ! ఈ వుత్త బట్టబయలు, యింతా అంతా యని అనగా, అణువు కంటే అణువైనది యనిగాని మహత్తుకంటే మహత్తైనది యనిగాని చెప్పరానిది. అద్దానిని ఎన్నివిధములచే విచారించినను, ఏమహాత్తులు ఏకార్యములు చేయనిది, ఏచింతలు చేయనిది యనగా ఏసంకల్పములు చేయనిది. అటువంటి యీ వుత్త బట్టబయలును కట్టుకథలవలె నీకు నేనెట్లు వినిపింతును. నీ వెటుల వినియెదవు. సకలదేశములయందును. భూతభవిష్య ద్వర్తమాన కాలముల యందును, సర్వవస్తువుల యందును, ఎల్లప్పుడు నొక్కరీతిగానిండి నిబిడీకృతమై పూర్ణాత్పూర్ణమైయున్న, కేవల అచల పరిపూర్ణ బ్రహ్మము యిదిగో చూడుమని భావము. 6

38. కం. ఆకాశాధికభూతా - నీకాత్మకమగుచు యెరుక - యీ జగమయ్యెన్ - రాకడపోకడ దీనికి - ప్రాకటముగ దేనిలోనో - బట్టాబయలదిరా ॥ కాదనియంటే - వట్టిపల్కదిరా ॥ లోకత్రయము - తనలోపల దిరుగాక - జోకా తోడుతదాని - జోలెరుగనిదియెదో - బట్టాబయలదిరా ॥ కాదనియంటే - వట్టిపల్కదిరా. ౭

తా. శిష్యా ! అవ్యక్తము మహత్తు మహదహంకారము పంచతన్మాత్రలు ఆకాశమున వాయువు అగ్ని జలము పృధివియగు పంచమహాభూతములు కలసి యెరుక ఆయెను, యీ ఎరుకయే ఆత్మ, యీఆత్మయే సర్వమును గుర్తెరుగునది యగు మహాకారణ శరీరము. ఈ ఎరుకచే సర్వప్రపంచము ఆయెను. యీ ఎరుకకు సహజముగా రాకపోకడలు గలిగియున్నది. యీ ఎరుక ఉత్త బట్టబయలు లోపల వచ్చుచు పోవుచు నుండును. యీ వుత్త బట్టబయలగు కేవలాత్మ నిజమైనది. యిదినిజమైనది కాదని లోకులు అంటే వారల మాటలు నిజమైనవికావు. ఎరుకవల్లపుట్టిన అండపిండ బ్రహ్మాండములు మూడు లోకములును యీ వుత్త బట్టబయలులో పుట్టుచు పెరుగుచు చచ్చుచుయుండును. యీ వుత్త బట్ట

బయలుకు, ఎరుకయగు మూడులోకముల యొక్క సమాచారములు యేమియు తెలియదు, యీవుత్తబట్టబయలుకు, ఎరుకయేమియు లేదని భావము. 7

39. కం. తండోప తండములుగా - దండిఝుషాదికములన్ని - తనలోపల ను-ద్దండతనుండిన పోయిన - నుండు సముద్రంబుయరుగా కుండూ నెప్పటికీ॥ పరిపూర్ణమి - ట్లుండూ నెప్పటికీ॥ యండా మావుల రీతి నుండేటిబ్రహ్మాండ - ముండిన పోయిాన - రెండూ గుర్తెరు గానీ దుండూ నెప్పటికీ॥ పరిపూర్ణమి - ట్లుండూ నెప్పటికీ. ౮

తా. శిష్యా ! వేలు లక్షలు కోట్లు అద్భుతములుగా చేపలును, తాంబేళ్ళును, తిమి, తిమింగలములను, మొదలుగాగల అనేక విధము లైన జలచరసమూహములు, తనయందు పుట్టినను, పెరిగినను, చచ్చి నను, సముద్రమునకెటుల తెలియనేరదో, సముద్రము పెరుగక తరగక యుండునో, అటువలెనే, అచలపరిపూర్ణ బ్రహ్మమగు యీవుత్తబట్ట బయలులో, ఎండమావులవంటి పిండ బ్రహ్మాండములుగా కనబడెడి ఎరుకవుండినను పోయినను యీ రెంటిని, యీవుత్తబట్టబయలు గుర్తె రుంగక, సముద్రమువలె తరుగు పెరుగులులేక సర్వకాలములయందు ఒకే విధముగా యుండునని భావము. 8

40. కం. ఎరుకతో వచ్చిన విశ్వము - యెరుకతొాజనుగావి - నిల్వదీబయలైతే - యెరుక తొారా, దెరుకతో బో-దెరుక తనందేమి లేదు-యిది నిశ్చయమురా॥ వుండుంటే యీ - ఎరుకే తానౌరా। ఎరుకా యెరిగిన వస్తు - వెరుకాని తెలియుము - ఎరుకా ఎరుగదు బయలు - నిట్టి దట్టిదియన - నిది నిశ్చయమురా॥ వుండుంటె యీ ఎరుకే తానౌరా॥ ౯

తా. శిష్యా! ఎరుక (మనస్సు) వలన పుట్టిన ప్రపంచము ఎరుక వల్లనే నశించును గాని ఎల్లకాలములయందు శాశ్వితముగా నిలిచి యుండనేరదు. ఈ వృత్త బట్టబయలుకు ఎరుక వలన రాలేదు, ఎరుక వలన నశించిపోవ నేరదు. ఈ వృత్తబట్టబయలుకు ఎరుకగాని ఎరుక యొక్క సంపర్కముగాని, యేమియులేదు. యిది నిజమైన వాక్యము, ఆలాగు ఎరుక ఏమాత్రమైనా యీ వృత్త బట్టబయలున కుంటే యీ ఎరుకయే తానుగా యుండును. అట్లులేదు గావున ఎరుక నెరిగినది, తన్ను తానెరిగినది ఎరుకయేగాని బట్టబయలు కానేరదు. యీవృత్త బట్టబయలును, యిట్టిది అట్టిదియని ఎరుక నిర్దేశింపలేక, తానే లేకుండా పోవునని భావము॥ 9

41. కం. రవితమసమున్న దెరుగునె - ప్రవిమల దావాగ్ని చెదలుబట్టుదెరుగునా-దివమునురాతిరి రాత్రిని - దినమెరుగునె। లేమి లక్ష్మి - దేవీ ఎరుగునా॥ అన్నమునూ భూ - దేవీ ఎరుగునా॥ భవనాశస్థితులు - రాపాడేటి ఎరుకాను - భవనాశస్థితిలేని - బయలల్లెరుగదు లక్ష్మిదేవీ ఎరుగునా॥ అన్నమునూ భూ - దేవీ ఎరుగనా॥ ౧౦

తా. శిష్యా! సూర్యునకు చీకటి ఎట్టిదో తెలియదు, మంటలు మండుచుండెడి మహా అగ్నికి చెదలు పట్టుకొనుట తెలియదు, పగలు రాత్రిని ఎరుంగదు, రాత్రికి పగలెట్లుండునో తెలియదు. ఆలాగుననే దారిద్ర్యమును లక్ష్మిదేవి ఎరుంగదు, అన్నమును తనయందు పండిన ధాన్యమే యీ అన్నమని భూదేవి ఎరుంగదు. అటువలెనే చావు పుట్టుకలు కలిగి అనేక పర్యాయములు చచ్చుచూ పుట్టుచుండెడి ఎరుకను చావుపుట్టుకలులేని బట్టబయలు ఎరుంగజాలదని భావము॥ 10

42. కం. ఎరుకైన భూత పంచక - మెరుకకు చరణములు కటియు - హృదయము గళ్వముస్ - శిరమునయ్యెను క్రిమమున -

ధరణి మొదల్ జేసి యిట్లు - తనయాగుర్తెరుగూ ॥ గగనము బయలంచన రాదీ మరుగూ ॥ ఎరుగాకాశామె - పరిపూర్ణమనుచు - కొందరు బల్కిరిది విని-గురిదప్పి యుండేవు-తనయాగుర్తెరుగూ॥ గగనము బయలంచన రాదీ మరుగూ ॥ ౧౧

తా. శిష్యా ! ఎరుకే పంచభూతములు అయెను. పంచభూతముల వలన యీ శరీరము అయెను. అది యెట్లాగనిన పృధివి వలన కాళ్ళు, చేతులును, జలము వలన నడుమును అగ్నివలన హృదయమును వాయువు వలన కంఠమును ఆకాశమువలన శిరస్సును వరుసగా కలసి స్థూల దేహముగా అయ్యెను. వీటియొక్క సూక్ష్మాంశములు సూక్ష్మ శరీరము, కారణ శరీరము, మహాకారణ శరీరము అయెను. మొత్తము యివి అన్నియు ఒక్క ఎరుకే అయెను, ఆకాశమునకు శబ్దమను గుణమున్నది. యీ ఆకాశమువల్లనే నాలుగు భూతములు పుట్టెను. యిట్టి ఆకాశము బట్టబయలని పరిపూర్ణమని చెప్పరాదు విచారణ చేయని వివేక శూన్యులు ఆకాశము యెట్టిదో తెలియనేరక అదియే పరిపూర్ణమని జెప్పుదురు. నీవు అట్టి చీకాకైన, అనృతమైన మాటలను విని నేను జెప్పిన యీ వుత్త బట్టబయలును గురిదప్పి యుండకుమని భావము ॥ 11

43. కం. విత్తే చెట్టయి పుట్టును - విత్తే విత్తనము రీతి - వెలయును ధరపై విత్తుకు చెట్టుకు వేరే - విత్తన మొకటున్నదనిన- వినగూడదోయీ ॥ తనకు దా - బుట్టును వినవోయీ ॥ విత్తూ చెట్టుల రెంటి - విధ మీ భూమెరుగా న - ట్లుత్తా బయలెరుగాదు - సత్తు చిత్తుల రెంట్ని - వినగూడదోయీ ॥ తనకు దా బు - ట్టును వినవోయీ ॥ ౧౨

తా. శిష్యా ! విత్తనమువలన చెట్టు పుట్టును ఆ చెట్టునందు మరల ఆ విత్తనమె పుట్టుచుండును విత్తనమునకు చెట్టునకును వేరే

యింకొక విత్తనము వున్నదని చెప్పు మాటలు నమ్మకూడదు. అట్టివి వినకూడదు. ఆ విత్తనము తనకుదానే పుట్టును. విత్తనమును చెట్టును భూమి యెట్లు యెరుంగదో అటుల యీ వృత్త బట్టబయలు సత్తుచిత్తులను, జీవేశ్వరులను లేక దేహి దేహములను రెండింటిని యెరుంగదు. యీ దేహి దేహములు దేహిని దేహమును, దేహమును దేహియును సృజించుకొనునుగాని యీ రెండింటిని సృజించుటకు యింకొకటి లేదని భావము॥ 12

44. కం. చెట్టే మూలము విత్తుకు - చెట్టుకు మూలంబు విత్తు - క్షితిపై రెండున్ - పుట్టిన చచ్చిన రెంటిని - ఘట్టిగ తానెరుగ కుండు - గదరా యీనేలా॥ నీ వీరీతి - గనుగొనవేలా॥ పుట్టుచూ గిట్టుచూ - పొలుపొందు తను వెరుక - లిట్టి విచిత్రాము లెన్నా - డెరుగదు బయలు - గదరా ఈ నేలా॥ నీ వీరీతి - గను గొనవేలా॥ ౧౩

తా. శిష్యా ! విత్తనమునకు మూలము చెట్టున్నూ చెట్టునకు మూలము విత్తున్నూ యైనని ఈ రెండున్నూ వుండినను, నశించినను, ఈ భూమికి తెలియదు. యిట్లాగునే ఈ వృత్త బట్టబయలు యెరుక యగు దేహి దేహములు పుట్టినను చచ్చినను ఎరుగజాలదని తెలుసు కొనుము. సర్వమును గుర్తెరిగెడి యెరుకయగు దేహియును షడ్భావ వికారంబులు గల దేహమును ఈరెండును దేహికి దేహము మూలమై దేహముకు దేహి మూలమై ఒకదాని కొకటి సృజించుకొనును. యిట్లు సృజన జేసుకొనుచుండెడి రెండింటిని ఈ వృత్త బట్టబయలు నెరుంగదని భావము॥ షడ్భావ వికారము లనగా అస్తితే, జాయతే వరిణమితే, వర్ధతే, అపక్షీ య్యతే, వినస్యతే అనునవి యని భావము॥ 13

ఇతి॥ శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైతరహిత పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి విరచితతాత్పర్య భావార్థే అచల లక్షణం తృతీయోధ్యాయః

---

• ४. యెరుక లక్షణం - ం • 20 •

45. కం. యెరుకేదేహేంద్రియములు - యెరుకేవర్ణాశ్రమములు యెరుకే శృతులున్ - యెరుకే నీవును నేనును-యెరుకే సతి సోదరాదు లెరుగుము వత్సా॥ । నేదీర్చెద-నిదుగో నీయిచ్చా॥ హరిహర బ్రహ్మాది సుర నరగిరి సరి - త్తరుమృగ ముఖచరా - చరమూలు యెరుకాని- ఎరుగుమువత్సా॥ నేదీర్చెద - నిదుగో నీయిచ్ఛా. ౧

తా. శిష్యా ! ఎరుకే దేహిదేహములు, ఎరుకే యింద్రియములు ఎరుకే బ్రహ్మ క్షత్రియ వైశ్య సూద్రాది కులములు, ఎరుకె బ్రహ్మ చర్య గృహస్థు, వానప్రస్త, సన్యాసాశ్రమములు, ఎరుకే శృతి స్మృతులు, ఎరుకేనీవును, ఎరుకే నేనును, ఎరుకే భార్యయును, ఎరుకే అన్నదమ్ములును, అని తెలియుము. నేను నీ మనోసంశయములగు భ్రాంతులనెల్లను దీర్చెద, బ్రహ్మవిష్ణు మహేశ్వరులను, రుద్రసదాశివులును, ఇంద్రాది సర్వదేవతలును, నరులును, కొండలును, సరస్సులును, చెట్లును, నదులును, మృగములు, పక్షులును మొదలుగాగల కదిలిక గలిగినవియు, కదిలిక లేనివియునగు చరాచర ప్రపంచమంతయు ఎరుకయని తెలిసి భ్రాంతిని విడుమని భావము. 1

46. కం. ఎరుకే విద్యావిద్యలు ఎరుకే ప్రణవంబునాద-మెరుకే కళయున్ - ఎరుకే బిందువుచిత్స-త్తెరుకే అనందమిది నీ - వెరుగూ సద్బుద్ధి॥ నీనామట - లెరుకే నిబద్ధీ॥ లెరుకే నిర్గుణ సుగుణా - లెరుకే ఎరుకకుయంత - ఎరుకోనే నిదియంత - ఎరుకాజేసితి నీవి - ట్లెరుగు సద్బుద్ధీ॥ నీనామాట - లెరుకే నీబద్ధీ. ౨

తా. శిష్యా ! ఎరుకే విద్యయనెడి ఈశ్వరుండును. ఎరుకే అవిద్య యనెడి జీవుండు. అరువది నాలుగు విద్యలు ఎరుకే ఈ దృష్టికి గోచరమగు అవిద్యయగు ప్రపంచమంతయు ఎరుకే. ఎరుకే ప్రణవంబనెడి ఓంకారము లేక సోహంభావమనెడి అహంభావము, ఎరుకే దశవిధనాదము ఎరుకే బిందువు, ఏరుకే కళయును, ఎరుకే సత్తును, చిత్తును, ఆనందమని, సమత్వమైన బుద్ధిచేత తెలియుము. నీయొక్క మాటయును, నాయొక్క మాటయును, ఎరుకేయని యదార్థముగా నమ్ముము, నిర్గుణము యన్నను సగుణము యన్నను ఎరుకే, సర్వమును గుర్తెరుంగుచున్నది ఎరుకే యని తెలియుము. ఇట్లు ఎరుకైన వన్నియు వేర్వేరుగా నీకు జెప్పితిగాని యివి అన్నియు ఒక్క ఎరుకేయని భావము. 2

—• అరువది నాలుగు విద్యలు లేక చతుష్టష్టి కళావివరం •—

శ్లో॥ యితిహాసాగమౌచైవ॥ కావ్యాలంకార నాటకం । గాయకత్వం కవిత్వంచ। కామశాస్త్ర దురోదరం । దేశ భాషాలిపిజ్ఞానం । లిపి కర్మచవాచకం।సర్వాణి చావధానాని। స్వరశాస్త్రంచశాకునమ్। సాముద్రికం రత్నశాస్త్రం। రథాశ్వగజ కౌశలమ్। మల్లశాస్త్రం సూదకర్మ। భూరుహాణాంచ దోహదం।గంధవాదో ధాతువాదః । ఖనివాదో రసస్యచ। జాలవాదోగ్ని సంస్థంభో॥ ఖడ్గస్థంభోజలస్యచ । వాచస్థంభోవశ్యాకర్షణ మోహనం। విద్వేషణోచ్చాటనంచ । మారణంకాలవంచనమ్ । పరకాయ ప్రవేశశ్చ॥ పాదుకాసిద్ది రేవచ॥ వాక్సిద్ధి ఘుటికాసిద్ధి॥ ఇంద్రజాలిక మేవచ। అంజనం పరదృష్టిస్తు। వంచనం స్వరవంచనమ్। మణిమంత్రౌషధాదీనాం సిద్ధయశ్చోరకర్మచ। చిత్రలోహశ్మ మృద్దారు। వేణు చర్మాంబర క్రియాః। అదృశ్యకరణం దండకరణం మృగియావిధిః వాణిజ్యంపాశుపాల్యంచ కృషిరాసవ కర్మచ। లావకుక్కుటమేషాది॥। యుద్ధకారక కౌశలమ్। చతుష్టష్టికలాస్త్వేతాః। కలావిద్భిః ప్రకీర్తితాః।

ఈ అరువదినాలుగు విద్యలు ఉదరపోషణకున్నూ అరువది యైదవది బ్రహ్మ విద్యయైనందున యియ్యది జన్మరాహిత్యమునకు పనికివచ్చును.

47. కం. యెరుకే ఇహపరసౌఖ్యము - లెరుకే జ్ఞానంబు జ్ఞేయము యెరుకే మోక్షం - బెరుకే భక్తి విరక్తులు యెరుకే సంకల్పమనినీ- వెరుగు సత్కీర్తి॥ యెక్కడికౌర - యెరుకా సంపూర్తి॥ యెరుకే జీవుండీశు - డెరుకే తదేకత - యెరుకే సర్వమునే - గుర్తెరిగి చెప్పితి యీకీ లెరుగూ సత్కీర్తి - యెక్కడికౌర - యెరుకా సంపూర్తి। 3

తా. శిష్యా! ప్రపంచ సౌఖ్యములును పరసౌఖ్యములును ఎరుకే యని తెలియుము. జ్ఞాతయనినను, జ్ఞానమనినను, జ్ఞేయమనినను యెరుకే, మోక్షమనినను యెరుకే నవవిధ భక్తియనినను విరక్తియని నను యెరుకే సంకల్పమనినను యిచ్ఛయనినను భ్రాంతియనినను ఆశ యనినను యెరుకే ఓ కీర్తివంతుడా యిన్నింటిని ఎరుకే యని ఎరుంగుటచే సుగుణమనే మంచిపనియగును. ఎరుకను ఎంత విచా రించినను పరిపూర్ణమును దర్శించక ఎరుక పోనేరదు. ఎరుకే జీవుడు, ఎరుకే ఈశ్వరుడు ఎరుకే ఏకమై అనేకముగా కనుపించుచున్నది. ఈఒక్క ఎరుకే యని నేను గుర్తెరింగి నీకు ఈ రహస్యము చెప్పితిని. గాన ఈ రహస్యము తెలిసి సుగుణవంతుడవై మంచి కీర్తి పొందుము యని భావము॥ 3

48. కం. చింతల తోటన నెరుకే - వింతల పుట్టిల్లనంగ - వెలసిన దెరుకే- తంతుల పేటన ఎరుకే - పంతములకు చూడ మూల- బలమన్నా నెరుకే॥ జగజ్జనన స్థలమన్న నెరుకే॥ భ్రాంతూలకెల్లాను- పట్టాణ మనజెల్లి - కాంతాదిరూపులు గల్పించుటకు మూల - బల మన్న నెరుకే॥ జగజ్జనన - స్థలమన్న నెరుకే॥ ౪

తా. శిష్యా! ఈ ఎరుకే సమస్త తలంపులనెడి సంకల్పములతో కూడి చింతనలనే తోటవంటిది. చిత్రవిచిత్రమగు సర్వ వింతలకు ఈ ఎరుకే పుట్టినిల్లువంటిది. ఈ ఎరుకే అనేక విధులనబడు చింతలతో కలసిన పట్టణమువంటిది. యీ యెరుకే పంతములనెడి వాదోపవాదముల కన్నిటికి మూలమై అహంకారమై బలముగా యున్నది. యీ యెరుకే జగజ్జాలమనెడి ప్రపంచముకు కార్యములకు కారణమైయున్నది యీయెరుకే సర్వభ్రాంతులతో కూడిన పట్టణముగా చెప్పవచ్చును. యీ యెరుకే స్త్రీలను పురుషులను పుట్టించుటకు మూలమై సర్వ ప్రపంచము తానెయై తనయందు సర్వప్రపంచము కల్పించుకొనుచున్నదని భావము॥ 4

49. కం. అన్నియు తానై తనకవి - పన్నుగవేరనుచునోట - బలుకుచు మరితా - నన్నిటినెరిగే యెరుకై - యున్నానని యెరుకే యెరుక - నూహింపుచుండూ॥ తనలో తానే - మోహింపుచుండూ॥ యెన్నో విచిత్రాలీ - యెరుకాశాతలువింటే - వున్నాది లేదు - లేకున్నాది కలదాని - వూహింపుచుండూ॥ తనలోతానె - మోహింపుచుండూ। 

తా. శిష్యా! ఈయెరుకే సర్వస్థావర జంగమాత్మక ప్రపంచము తానై తనకు చరాచర జగత్తంతయు వేరనినోట బలుకుచు తాను సర్వమును ఎరిగెడి ఎరుకై సర్వసాక్షిగా యున్నానని ఎరుక తనకు తానె వూహించుచుండును. తన రూపములగు స్త్రీ పురుషాది రూపములను తనకంటె యితరమని వేరని భ్రమించి మోహభ్రాంతులను అహంకార మమకారములను పొందుచుండును. ఈ యెరుకే చిత్ర విచిత్రములతో అనేక వ్యవహారికమగు చర్యలను చేష్టలను జేయుచుండును. వున్నదానిని లేదనుచుండును, లేనిదానిని వున్నదని భ్రమించి

పల్కుచుండును. లేక వూహించుచుండును. తన రూపమును జూచు
కొని తానే మోహభ్రాంతులను పొందునని భావము॥ 5

50. కం. వినుమూర్ణనాభితా - బుట్టినమీదట సృజనజేయు -
దినముహరించున్ - ఘనమగుపటశత కోట్లను - తనలోపలి ధారము
నను - తానట్టె చనునూ॥ అట్లనే యెరుక - తాబుట్టికనునూ,
పవిబూని బ్రహ్మాండ - భాండనంతములాను - క్షణములోపలదృంచి -
కనరాకవేవేగ - తానట్టెచనునూ॥ అట్లనెయెరుక-తాబుట్టికనునూ. ౬

తా. శిష్యా! వినుము, సాలెపురుగు పుట్టి తనలోపల దారముచే
అనేకములగు పెద్దపెద్ద పటములను అల్లుకొని, కొంతసేపు ఆపటములపై
దిరుగుచు, ఆనందించుచు తర్వాత ఆపటములనుచించి, తానులేకుండా
మటుమాయుగా పోవును. అదే ప్రకారము మూలంలేని యీాగు రైరిగే
శరీరమను యెరుక తనకుతానె పుట్టి తనలోపల సంకల్పములనెడి వూహ
లచే చిత్రవిచిత్రమగు పిండబ్రహ్మాండ ప్రపంచము సృష్టిజేసుకొని,
ఆనందించుచు దుఃఖించుచు యుండును. యిట్టిప్రపంచమును, మరొక్క
సమయమును సర్వమును హరింపజేసి, తాను యెటు కానరాకుండా
మటుమాయుగా పోవునని భావము. 6

51. కం. తలిదండ్రులు జీవేశులు, యిలవ్యోమములేను మేను-
లెరుకమరపులున్ - కల మేల్కలు శుక్లాశ్రం - బులు నీరాన్నములు
ప్రకృతి - పురుషాడాల్మగడూ॥ గానై యెరుక-కెరుకెకానబడూ॥ తెలసీ
బయలున్నాదీ - దెలసీ యీా తెలివిని - తెలివి చాతనెపట్టి - తీసి
వెయ్యుము ప్రకృతి - పురుషూడాల్మగడూ॥ గానై యెరుక - కెరుకె
కానబడు। ౭

తా. శిష్యా! తల్లియు దండ్రియు - జీవుడుఈశ్వరుడు-భూమి
ఆకాశము - నేను మేను - యెరుకమరపు - పాపము పుణ్యము - దరి

ద్రము ఐశ్వర్యము - సుఖము దుఃఖము - కల మెలకువ - శుక్లము శోణితము - నీరు అన్నము - ప్రకృతి అనగా దేహము - పురుషుడు అనగా దేహి-భార్యాభర్తలు-యిటువంటి ద్వయదోషము లైనవాటిని యేఎరుకచేత తెలిసితివో, ఆఎరుకచేతనే బట్టబయలున్నదని తెలసి తెలసినఎరుకను తెలివిచేతను లేకుండా పట్టితీసివేయుమని భావము. 7

52. కం. వొక దేహధారి తనువున - సకలావస్తలు జనించి చనిన విధమునన్ - అకలంకమైన బయలులో-ప్రకటంబై లేని ఎరుక బయలుండజూచీ॥ తన ముచ్చట-పరికించిలేచీ॥ వొక కొంత సేపైవ వుండేటందుకు లేక - సకలాము తనవెంట జనుదేర జను బట్ట-బయలుండజూచీ॥ తన ముచ్చట - పరికించిలేచీ॥ ౮

తా. శిష్యా ! ఒక మనుష్యుని దేహమునందు అనేకములగు వ్యాధుల బాధలు గలిగి ఔషధశేవ చేతవ్యాధులు బాధలు తగ్గి నివర్తించినటుల ఏ కళంకములేని ఈ వుత్త బట్టబయలునందు మూలము లేకుండా తనకుతాను వచ్చిన ఈ ఎరుక అచల పరిపూర్ణమగు ఈవుత్త బట్టబయలును చూచి తన నిజము ఎంతవరకోయని విచారించుకొని తాను లేనిదాననని తెలసి క్షణకాలమైనను తానెందును నిలుచుటకు తావులేక సకలమైన తన యింద్రియ సమూహము వెంటరాగా తన ప్రవర్తనలు తాను తన సంకల్పములతో సర్వము మటుమాయగా పోవునని భావము॥ 8

53. కం. మేలుక సుషుప్తి లోపల - నేలీలం తనకుదాను యే తెంచునో - గుర్తాలీల బయలు లోపల - వాలాయము తనకుదానె - వొచ్చునోయన్నా॥ వొచ్చిహెచ్చి - చచ్చునోయన్నా॥ ఈ లోపలనెబట్ట - బయలున్నా దెరిగితే - యే లోకమున నిల్వజాల - దెరుగకుంటె - వొచ్చునోయన్నా॥ వొచ్చి హెచ్చి - చచ్చునోయన్నా॥ ౯

తా. శిష్యా ! సుషుప్తిలోనుండి మెలకువ తనకు తానెటుల వచ్చునో అటువలెనో అచల పరిపూర్ణమగు ఈ వృత్తి బట్టబయలు నందు ఈ గుర్తెరిగె శరీరమను ఎరుక అగంతుకముగా తనకుతానే వచ్చెను. యిటుల వచ్చి యింద్రియ సుఖములచేత సతిసుతాది బంధు వర్గములచేత గృహారామక్షేత్ర ధనధాన్య పశుగజాశ్వ వాహనాదుల ఆనందము పొందుచు దుఃఖములచేత నొచ్చుచు చచ్చుచు పుట్టుచు నుండును. యిట్లు మరణము సంభవించక ముందుగనె అచల పరిపూర్ణ బ్రహ్మమగు బట్టబయలును సద్గురుమూర్తి కరుణచేత గనిన ఎడల అట్టి ఎరుక మరల జన్మమునకు రాదు. అలాగు తెలియనిఎడల ఆ ఎరుక జనన మరణములు పొందుచుండునని భావము॥ 9

54. కం. ఆటాడి యాడకుండును - ఆటాడిన మేనిబొమ్మ - యాటాడకనే - ఆటాడు నెరుకయనియెడి - యాటాడించేటివాడు - యతడేరా కర్తా॥ అంతటకి యీ-యచలమాకర్తా॥ చేటూపాటుల రెంటి - చేవచ్చు ఫలము - ముమ్మాటి కనుభవించి - మరణ జననము లొంద - నతడేకర్తా।అంతటికి ఈ-యచలమాకర్తా॥ ౧౦

తా. శిష్యా ! ఈస్థూల శరీరములనెడి బొమ్మలు, కొంతసేపుఆడి కొంతసేపటికి ఆటాడక పడిపోవును. యీస్థూల శరీరము ఆట్లాడుటకు యీమేను లోపలనేను అనిపలుకుచున్నటువంటిన్నీ, ఆటాడు చున్నటు వంటిన్నీ, చైతన్యరూపకమగుఎరుకయే ఈగొప్పదైనటువంటి బ్రహ్మాం డములో, పంచభూతములను అణువులగాయితు, బ్రహ్మపర్యంతము జీవులను, సృజించుకొని అందుల హంసయనెడి సూత్రధారియై, తాను ప్రతిఘటములోను యుండి, ఆడుచు పాడుచు ఏడ్చుచునవ్వుచు, ఈమే నులనే బొమ్మలను ఆటాడించును. సర్వమునకు యితడే కర్తయు, భోక్తయునైయున్నాడుగాని, ఆటాడించుటకు ఆటమాన్పుటకు, అచల పరిపూర్ణమగు ఈవృత్తబట్టబయలు, కర్థయుభోక్తయుకాదని తెలియుము

చేటుపాటులనెడి వృద్ధి క్షీణంబులను, పాపపుణ్యంబులును, పాటివాటి ఫలంబులకు, భోక్తయై అనుభవించుచు, జననమరణములను రెండును, నేననేఎరుకయే పొందుచు, కర్తయై యుండునుగాని, ఈవుత్తబట్టబయలు ఎన్నడూ కానేరదని భావము. 10

55. కం. దేహమును జూచు కన్నులు - దేహమునకు వేరులేని తీరున ఎరుకే - కోహంకస్త్వం తవదా - సోహంసోహం బటంచు - చూచుచుండుసుమీ॥ తనకుతానె - తోచుచుండుసుమీ॥ దేహిదేహములనె - తెరగూనప్రసరించి - దేహముగాని వి - దేహిగతననూతా జూచుచుండుసుమీ॥ తనకుతానె - తోచుచుండుసుమీ॥ ౧౧

తా. శిష్యా ! మేననెడి దేహమును జూచుచుండెడి కన్నులు - దేహమునకు వేరుగాక కలసియే చూచుచున్నటుల నేననేఎరుక మేను లోవుండి మేనుకు నేనువేరని పలుకుచు నేనని నీవని యనుచు సోహం సోహం యని అహర్నిశములందు దేహమందుండి పలుకుచుండును. ఈఎరుకే దేహిదేహములు రెండుగా కనిపించుచు దేహముతానుగా ననియు దేహియే తాననియు తానుసర్వమునకు సాక్షిననియు, తన్ను తానుగనుటయే మోక్షమనియు, తనకుతానే యోచింపు చుండును యని భావము. 11

56. కం. పిండబ్రహ్మాండంబులు - రెండును యారెంటిలోని- రెండహములు ఈ - ఖండములు నాల్గుగూడి యు - ఖండంబగు ఎరుకే రూపు - గనరామాతండ్రీ॥ యిది దెల్పిన - ఘనుడెతలిదండ్రీ॥ ఖండా ఖండములుగ గనుపించె ఎరుకానె - దండిదనెటి యు - ద్దండూలకల నైన- గనరా మాతండ్రీ॥ యిదిదెల్పిన - ఘనుడెతలిదండ్రీ. ౧౨

తా. శిష్యా ! పంచభూత సమన్వితమై యిరువది నాలుగు తత్వములతో కలసి స్థూల దేహమే నేననుకొని సర్వకర్మలకు నేను కర్తను భోక్తను సుఖదుఃఖములు అనుభవించుచున్నాను. నేను జీవుడను అను

కొని అహంకార మమకారములతో నున్న జీవమాలిన్యము ఒక అహముపై యిరువది నాలుగు తత్వములు నా ఆజ్ఞ ప్రకారము సంచరించును నేను యిరువది ఐదవవాడను ఈస్థూల శరీరము మాయా స్వరూపము నేను మహాకారణ స్వరూపుడను శాశ్వితుడను దేహేం ద్రియముల కదిష్ఠాతనై చైతన్యమగు ఆత్మనై వర్వసాక్షినై కర్తృత్వ భోక్తృత్వములు లేనివాడనై సుఖదుఃఖములకు విలక్షణుడనై అఖండ స్వరూపమై ఈశ్వరుండనై యున్నానునట యిది ఒక అహము స్థూల సూక్ష్మ కారణ మహాకారణ తనువులు నాలుగును కలసి యెరుక యొక్క పిండరూపమని మేననే జీవుడని తెలియుము. విరాట్టుహిరణ్య గర్భ అవ్యాకృత మూలప్రకృతులు నాలుగును యెరుకయొక్క బ్రహ్మాండ రూపమని నేనని ఈశ్వరుడని తెలియుము. పిండాండాభిమాని యైన నేను జీవుడననే అహంభావము ఒకటిన్నీ, బ్రహ్మాండాభిమాని యెన నేను శివుడననే అహంభావము ఒకటిన్నీ పిండాండమగు స్థూల శరీరము బ్రహ్మాండమగు సూక్ష్మ శరీరముపై పిండ బ్రహ్మాండాభిమానులు రెండున్నూ కలసి నాలుగును అఖండమగు యెరుకయొక్కరూపము. వీటిని పిండాండ విచారణ లేక సాంఖ్యవిచారణ, బ్రహ్మాండ విచారణ లచే యీ ప్రపంచమనెడి కలలో ఏమహానుభావుడు వుత్పత్తిస్థితి లయములనుచెప్పి నేతి నేతీత వాక్యములచే నిరసించి యీ యెరుక గొప్పదికాదనియు అచల పరిపూర్ణమే గొప్పదనియు బోధించునో అతడే తల్లిదండ్రియని తెలియుము యని భావము॥

అతీతభావము॥ ఎర్రగ్రుడ్డు, తెల్లగ్రుడ్డు, నల్లగ్రుడ్డుఅకారము ఉకా రము మకారము మాతృకలై ఈమూడుఅండములు పిండాడమై స్థూల దేహమగు మేనై నేను జీవుడననే భావముతో జీవోహమనె అహమై యున్నది యిదియె క్షరము. బ్రహ్మాండమనగా కర్రిదియనెడి సునీలము లేక బిందువు అచిద్బిందువుతో హంసయగు కళ యింద్రనీలమున్నూ,

కలసి యీ రెండున్నూ అర్ధ మాత్రృకయై నేను శివుడననె భావముతో శివోహమను అహమై యున్నది యిదియే అక్షరము. యిట్టి పిండ బ్రహ్మాండములు రెండును జీవోహం శివోహం అను అహములు రెండును కలసి నాల్గు కండములై అఖండముగా యీ యెరుక కన్పించుచున్నది. యిట్టి ఖండము అఖండములు రెండుగా కనుపించె యెరుక గొప్పది కాదనియు అచల పరిపూర్ణమే గొప్పదనియు శ్రీఅచల గురుస్వాములను యీ ప్రపంచమనెటి కలలో చూచి వారిచే పరిపూర్ణ బోధను తెలుసు కొనుమని భావము॥ 12

57. కం. పరిపూర్ణమొకటి దక్కని - తరమైన ప్రపంచమెల్ల తగ దెలియు ము నీ - వెరుకేనని మదిలోపల - యెరుకే పరిపూర్ణ మెరిగే-దెరుకా రిగే॥ యింకొక్కటిలే - దీ రెంట్నెరిగేది॥ ఎరుకా పుట్టువుమూల-మెరుగాని దీ - యెరుకే - యెరుకే తాఋట్టిన - దెరు గాబోయితె లేదం - చ్చెరుకా నెరుగేది॥ యింకొక్కటిలే - దీ రెం ట్నెరిగేది॥ ౧౩

తా. శిష్యా! అచల పరిపూర్ణ బ్రహ్మమగు యీ వుత్తబట్ట బయలు తప్ప దీనికి వేరైన పంచభూత సంబంధమగు సర్వ చరాచర ప్రపంచమంతయు ఎరుకయని అనగా మాయయని నీ మనస్సున తెలి యుము. యీ యెరుకే అచల పరిపూర్ణము నెరుగుచున్నది. యీ ఎరు కను అచల పరిపూర్ణమును రెంటిని యెరుగుటకు యింకొక యెరుక లేదు. యెరుకయొక్క వుట్టుక అనగా తన మూలమును తానెరుగనిదె ఎరుక తన పుట్టుకతాను ఎరుగబోయిన యడల తానే లేకుండా పోవు నని భావము। 13

58. కం. పాపములు పుణ్యములు - భువి బ్రాపించును యెరుక చాత॥ భ్రమసిన వారిన్ - ప్రాపింపవెరుక నెడశిన - తాపసులను చిత్తమందు - తగదెల్సు కొనుమీ॥ ఆగామిబో - ధనుతెస్సా వినుsss

మీ॥ పాపలలోశుద్ధ - స్ఫటికాసన్నిభమైన - ఆపోజ్యోతిని ప్రత్య - గాత్మనీమదిలోన - తగదెల్పుకొనుమీ॥ ఆగామిబో - ధనులెస్సా వినుమీ॥ ॥౧౪॥

తా. శిష్యా ! కంటిపాపల నడుమను శుద్ధస్ఫటిక రూపమైన ఆపోజ్యోతియే ప్రత్యగాత్మ అదియె యెరుకయని నీమనస్సులో తెలియుము. యీప్రపంచమును ఆఎరుకచేత చూచుచు భ్రమించి పుణ్యపాప కర్మలాచరించు వారికి పాపములు పుణ్యములు ప్రాప్తింపుచుండును. ఏఎరుక చేత పాపపుణ్యములు ప్రాప్తించునో అట్టిఎరుకను తీసివేసెటి అచల పరిపూర్ణులగు గురువులను నీమనస్సు యందున తెలిసి శేవించుము. ముందుచెప్పబోయెడు అచల పరిపూర్ణబోధను యితర చింతలు విడచి బాగుగా వినుమని భావము. 14

59. కం. యెరుకన్నను మరుపన్నను - యెరుకకు ఎరుకన్నదేహి యనమాయయనన్ ॥ గురుతన సాక్ష్యస్ఞప్త్యస - స్ఫురణయనన్ ద్రష్టయనిన-చూడు మొక్కటిగా॥ యిదిలేకుంటే - చూడా మొక్కటిగా॥ మరి చలాచలమూల - మర్మమెరిగెటిదన్న - ఎరిగితాలేనాని ఎగిరిపొయ్యెటిదన్న - చూడుమొక్కటిగా॥ యిదిలేకుంటే - చూడా మొక్కటిగా॥ ॥౧౫॥

తా. శిష్యా ! ఎరుక యనినను మరుపు యనినను సర్వ ప్రపంచ మనే ఎరుకను తెలుసుకుంటూయున్న తెలివియనినను, దేహియనినను మాయ యనినను గుర్తించు గుర్తుయనినను సర్వసాక్షియనినను స్ఫురించే వూహ లేక సంకల్పమనినను చూచేవాడు యనినను యివి అన్నియు మాటల భేదమేగాని ఒక్క ఎరుకేయని తెలియుము. అట్టి ఎరుక లేకుంటే చూచేది వినేది కనేది తినేది యింకొకటి లేదు. అదిగాక కదలికలేని ఉత్త బట్టబయలును కదలిక కలిగిన చలనమగు ఎరుకను ఈ రెండింటి మర్మములు తెలుసుకొనునది ఈ ఎరుకే అచల

పరిపూర్ణము శాశ్వితముగా యున్నదనియు తాను యే కాలమందు లేనిదాననని తెలుసుకొని ఈ ఎరుక తానే లేకుండా పోవును. ఈఎరుక పోయిన తర్వాత దేనిని చూడజాలవని తెలియజాలవని భావము. 15

60. కం. అనుమానము మదినుంచక-వినుమింకను యెరుక పేర్లు వివరించెద బుద్యన చిత్తంబన మానస - మనిన - అహంకారమనిన నంతఃకరణనినన్॥ సంకల్ప మంచని - నాయిచ్ఛనినన్॥ తననితరులనే-తానని గుర్తెరిగెటిదన్న - తననేకాని తరుల - తననూదెలసెటిదన్న - నంతఃకరణనినన్॥ సంకల్పమంచని - నాయిచ్ఛనినన్॥ ౧౬

తా. శిష్యా! నీమనంబున సందేహము వుంచకవినుము. మరిన్ని యెరుకపేర్లు విశేషముగా జెప్పెదను. బుద్ధియనినను, చిత్తమనినను, మనస్సుయనినను, అహంకారమనినను, అంతఃకరణలనినను, సంకల్ప మనినను, యిచ్ఛలేక కోరికయనినను, నేననియు నీవనియు గుర్తించుచు పలుకుచున్నదియు, తెలుసుకొను చున్నదియు, తనకు అన్యమని యిత రులను భావించి తనను తెలుసుకొను చున్నది యీ యెరుకే యని భావము. 16

61. కం. వినుమితరులు యెరుకనుసా-క్ష్యనిపల్కిరి నేనుసాక్షిన హమినినీతో - వినజెప్పితి నింతియే వే - రనకూడదు రెంటినొక్క - టిని తెలుసుకోరా॥ మాటలబేధ - మనికనుక్కోరా॥ అనరాని వినరాని కనరాని బయలందు - తనకైతా నరుదెంచి - తనకైతాజనునీ - సాక్ష్యని తెలుసుకోరా॥ మాటలభేద - మని కనుక్కోరా॥ ౧౭

తా. శిష్యా! విను ద్వైత్వఅద్వైతవిశిష్టాద్వైత మతస్థులు యెరు కను సర్వసాక్షియని చెప్పిరి, నేనునీతో ఆసాక్షియే అహంకారమని జెప్పితిని, సర్వసాక్షియనినను అహమనినను రెండుమాటలు ఒక్కయెరుకేగాని వేరనిగూడదు. యీ రెండున్నూ వేర్వేరని సందేహించకుము

ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిదియు అనుటకు వినుటకు జూచుటకు నలవి గాని అచల పరిపూర్ణబ్రహ్మమునందు, నేననెడి అహము లేక ఎరుక తనకు తానెవచ్చి తనమూలము తానెరిగి నప్పుడు తనకుతానె మటు మాయగా పోవును అనగా మరల జననమునకు రాదని భావము॥ 17

62. కం. వన్నియలై దొకచోటను - పన్నుగ గలసినది. హృదయ - పద్మంబనుచున్ - యెన్నుదురు జనులు యెరుకం - దున్నా దనిశృతులుబల్కుచున్నా విసుమీ॥ తెలుసుటెమోక్ష - మన్నా వినుమీ॥ వొన్నెలన్నియుమీరి - వున్నవస్తువుజూడ - నెన్నడెరుంగాక - ఎన్నో రీతులబల్క - చున్నా విసుమీ॥ తెలుసుటేమోక్ష - మన్నావి సుమీ॥

తా. శిష్యా ! వన్నెయలు అయిదు అనగా ఎర్రది తెల్లది నల్లది కర్రిది సునీలము దానిమధ్య ఇంద్రనీలము యీ అయిదును కలసినది నేత్రము, యీ నేత్రముకే హృత్కమలమనియు, హృదయగ్రంధి యనియు, హృదయపద్మమనియు, లోకులు చెప్పుదురు, సర్వభ్రాంతులు వాసనలు యిమిడియుండుటచేత హృదయగ్రందియని యనబడును. ఎరుక ఆహృదయ పద్మమందున్నదని స్మృతిశృతులు చెప్పుచున్నవి యీ ఎరుకను తెలుసుకొనుటే మోక్షమనికూడా శృతులుపలుకు చున్నవి. అన్నిరంగులకు అన్నివర్ణములకు, మీరియున్న అచలపరిపూర్ణ మగు యీ వుత్తబట్టబయలు యొక్క రహస్యము జనులెరుంగక, ఆఎరుకయే అచలమని పరిపూర్ణమని బట్టబయలని అనేకవిధములుగా పలుకుచుందురు. అట్టిభ్రాంతిని నీవు పొందకుమని భావము॥ 18

63. కం. చులకన యుక్తిగ నొక్కటి - తెలిపెదవిను సందియంబు - దీరును దీనన్ - పలుకున గలిగిన యర్థము - పలుకును విడనాడి నిల్వ - బడుచోటింకేది॥ రెండుగనొక్క - పలుకే అయినాది॥ తెలియుమీలాగున - తెలివిదేహములయ్యె - తెలివేతనువును బాసి -

తెలివిస్థిరముగ నిల్వ - బడుచోటింకేది॥ రెండుగనొక్క - పలుకే అయినాది॥ ౧౯

తా. శిష్యా ! యెరుక యెట్టిదో నీకు సులభముగా తెలియుటకు వొక్క ఉపమానము వినిపించెద గ్రహించుము. అట్టి వుపమానము వినినయెడల నీ సంశయములన్నియు విడిచిపోవును. పలుకుఅనగా మాట ఆమాటకుయుండు అర్థము ఆ మాటను విడచిపోయి యింకొకచోట నిలుచుటకు చోటులేదు. మాటయు ఆ మాటకున్న అర్థము రెండూ ఒక్క మాటేయని తెలిసినటుల చరాచర ప్రపంచమంతయు తెలుసుకొనుచున్న తెలివే యీ దేహము. యీ దేహమే ఆ తెలివి. దేహమును విడచి తెలివిగాని, తెలివిని విడచి దేహముగాని వేర్వేరుగా వుండుటకు యింకొక చోటులేదు. గాన రెండూ ఒక్క యెరుకేయని భావము॥ 19

64. కం. యెరుకైన భూతముల నీ - వెరుగుము ఆకసము గాడ్పు - యింగిలమును నీ-ళ్ళురవందనేలయని - నేనెరిగిన పద్ధతిని నీకు నెరిగించినానూ॥ ముజ్జగము లయ్యేను - వీట్లతోనూ॥ పరిపూర్ణమందు క - న్పడుచు తమకుదామె - మరికాన రావిట్టి-మార్గముకల వీటి - నెరిగించినానూ॥ ముజ్జగములయ్యేను - వీట్లతోనూ॥ ౨౦

తా. శిష్యా ! పంచమహాభూతములు యెరుకేయని తెలియుము అవి యెవ్వియనిన ఆకాశము వాయువు అగ్ని జలము పృధివి యనినే నెరింగిన ప్రకారము నీకు జెప్పితిని - యీ పంచ మహా భూతముల వల్లనే స్వర్గ మర్త్య పాతాళములనే లేక అండపిండ బ్రహ్మాండములనే లోకములు మూడును అయెను. అచల పరిపూర్ణమను బట్టబయలు నందు పంచభూతములు, పంచభూత సమన్వితమగు మూడు లోకములు తమకుతామె కనుపడి మరల మటుమాయుగాపోవును. అటువంటి రాక

పోకలుగల ఎరుక లోకములు నిజమైనవి కావని యీ వుత్త బట్ట బయలే నిజమైనదని నే నెరింగి నీకు వినిపింతునని భావము॥ 20

ఇతి॥ శ్రీ మద్భాగవత కృష్ణ విరచితద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీభూమానంద దువ్వాడ నారాయణ
మూర్తి విరచిత తాత్పర్యభావార్థె ఎరుక
లక్షణన్నామ చతుర్థోధ్యాయః

— • ౫ ఎరుకోత్పత్తి లక్షణం ౧౯ • 19 • —

65. కం. ఎరుకోత్పత్తిని దెలియగ - సరసిజ గర్భాదులైన చాలరనేటిచో నరుడెంతవాడు వాడది ఎరుగుదు నవవట్టిమాట - లివి వింతగాకా॥ తప్పదు వాని - కికరాకపోకా॥ అరమర లేక సద్గురు మూర్తి చరణా పం - క్కరు హద్వయార్చాన - సెరుగాని నరుమాట లివి వింతగాకా॥ తప్ప దువాని-కికరాకపోకా ౧

తా. శిష్యా ! ఎరుక పుట్టుకను తెలియుటకు బ్రహ్మాదులకు నైనను యలవి కాదని చెప్పుచుండగా బ్రహ్మాదులకంటె నరుడు ఎంత గొప్పవాడై తెలిసినాడు, యీ నరుడు ఎరుక పుట్టుక ఎరుగుదునని చెప్పెటి మాటలు దబ్బర మాటలేకాని నిజముకావు. అట్టి మాటలు వింత మాటలనికూడా చెప్పవచ్చును. అట్టి మనుష్యునకు జనన మరణ ములు తప్పక కలుగును. యే సంశయములు లేకుండా శ్రీ సద్గురు మూర్తిని కేరి వారియందు భయభక్తి విశ్వాసములు కల్గి వారి పాద పద్మములకు పూజలు గావించి పరిపూర్ణబోధ పొందక యుండెడి పామర జనుల మాటలు మిగుల ఆశ్చర్యములై యుండును. అట్టి మను జులకు జనన మరణములు తప్పవని భావము 1

66. కం. లే నెరుక బయులులోపల-తానెట్లు జనించెననిన తగవినువంధ్యా - సూనునిగతి వియబబ్జ వి - భానంబున యక్షరాజ

ధాని విధమునన్-రజ్జువు సర్పమైనా విధమునన్ । స్థాణుపూరుషుని చందాన మృగజల - శశివిషాణము - స్వప్నానందముగ - రాజధాని విధమునన్ । రజ్జువు సర్పమై - నా విధమునన్॥ ౨

తా. శిష్యా ! మూలము యేమియు లేనటువంటి ఈ ఎరుక అచల పరిపూర్ణమునందు తాను ఏలాగు జన్మించెననిన వినుము. గొడ్రాలుకు బిడ్డ పుట్టినాడనిన చందంబును ఆకాశ పుష్పమనియు, గంధర్వ నగరము ఆకాశము నందున్నదని నటులను, త్రాడును చీకటిలో చూచి సర్పమని భ్రమించినటులను యండమావులయందు జలముండునని భ్రమించినటులను. చీకటిలో మొద్దును (దారువును) జూచి దొంగవాడని భ్రమించినటులను స్వప్నము లేనిదైనను అందు పొందిన ఆనందము చాలా గొప్పదని భ్రమించుట ఎట్లో అట్లే ఎరుకపుట్టినదనవచ్చును. భ్రాంతియే కాని అచల పరిపూర్ణమునందు ఎరుక పుట్టలేదని భావము. 2

67. కం. లేనెరుకను ఎరుకనియన - లేనెరుకెట్లా యనవినలెస్సగ వినుమా - లేని మృగజలము వంధ్యా - సూనులు గలిగుండి వెదకి-చూడాలెనట్లూ॥ యీా లేనెరుక యాడాలేదిట్లూ॥ స్థాణుపూరుషూడు - శశవిషాణము - గగన సూనామునరుని - స్వప్నానందమివి వెదకి - చూడాలెనట్లూ । యీా లేనెరుక - యాడాలేదిట్లూ॥ ౩

తా. శిష్యా లేనిఎరుక యని ఎట్లు చెప్పవచ్చుననిన ఎండమావుల యందు నీరు లేనిదే నీరు వున్నటుల పేరువచ్చెను. బిడ్డలు లేకపోవుట చేత గొడ్రాలు అనబడుమ. బిడ్డలులేకనే గొడ్రాలుబిడ్డయని పేరువచ్చినది. ఎండమావులయందు నీరును గొడ్రాలు బిడ్డను ఎంత వెదకినను చూడ లేము. అలాగుననే ఈ లేనటువంటి ఎరుక ఎచ్చటనులేదు. దారుపురుషుడు కుందేటికి కొమ్ములును ఆకాశమందు పుష్పము మనుష్యునిస్వప్నానందము ఎంత వెదకినను చూడలేనట్లు అచల పరిపూర్ణమునందు లేని

ఎరుకకు వున్నటుల పేరువచ్చినది. గాని నిజము విచారించిన యడల పైని జెప్పినవానివలె ఎరుక లేనిదెయని దృఢమగునని భావము. 3

68. కం. యెరుకోద్భవ మెట్లన్నను - సరళంబగు నారికేళ - సలిలముభంగిన్ - యెరుకెట్లు బోవునన్నను - కరిమ్రింగిన వెలగపండు కరణిగ నెరుగూ॥ తిరిగిరాని కర - ణింకో టెరుగూ॥ పరిపూర్ణము న్నాది - యెరుకా తానెరిగితే - యెరుకే మ్రగ్గును - భస్మాసురుడు మ్రగ్గిననాటి - కరణిగ నెరుగూ॥ తిరిగిరాని కర - ణింకోటెరుగూ॥ ౪

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయలులో ఎరుక పుట్టిన విధము ఎల్లాటిదంటె కొబ్బరికాయలలోని జలము తనకు తా నెట్లువచ్చునో అట్లు వచ్చును. ఎరుక ఏలాగు పోవుననిన ఏనుగు తినిన వెలగకాయ లోని గుంజు హరించినటుల అనగా కాయ కాయవలెయుండి అందువుం డెడి గుంజు ఎట్లు హరించిపోవునో-అటువలెనే పోవును. యీవిధముగా యెరుకయొక్క రాకపోకలు తెలియుము యిట్లుగాక యెరుక జనన మును రానిపద్ధతి యింకొకటి వినుము. అచల పరిపూర్ణము వున్నదని యెరుక ఏక్షణములో ఎరుగునో ఆక్షణమె భస్మాసురుడు తనచేతులను తన నెత్తిపై నుంచుకొని చనిపోయినటుల తాను నశించిపోవును. అట్టి యెరుక మరల జననమునకు రాదని భావము. 4

69. కం. సంతోషా సంతోషము - లంతంలో గనవచ్చి పిదప నరుగు నెచటకో - వింతైయ్యున్నది చూచితె - యింతియెసుమి యెరుకపుట్టు - వికతెల్సుకోరా॥ సంశయమేల - యిది నమ్ముకోరా॥ యంతాని దెలుపూదు యీ దేవ మార్గమం - దంత్తాట బహు వాన్నెలగుపడి అగుపడ - విక తెల్సుకోరా॥ సంశయమేల - యిది నమ్ముకోరా॥ ౫

తా. శిష్యా ! నీకు సంశయము లేకుండుటకై ఒక వుపమానము చెప్పెదవినుము ఆనందము కలిగిన వెంటనె దుఃఖమును దుఃఖము కలిగిన వెంటనే ఆనందమును ఒకానొక సమయములో లేక యొకక్షణములో చూస్తుండగనె వచ్చి పోవుచుండును, యీలాగునే యెరుక పుట్టుక యనికూడా తెలుసుకొనుము. సంశయమును విడచి నేను బోధించినటుల చక్కగా నమ్ముము. ఈదేవుని రహస్యము మరి ఎన్ని విథములుగా నీకు జెప్పుదును. ఈ అచల పరిపూర్ణమగు దేవునియందు ఒక్క క్షణములో యీ యెరుక అనేక చిత్రవిచిత్రములగు వింతలతో కనబడి వెంటనే కనబడకపోవుచుండునని తెల్సుకొనుము. సంశయ విపరీతములులేని వాడవై యీ అచల పరిపూర్ణమగు యీ దేవుని నమ్మి దాని యందు లేని ఎరుకను నమ్మకు మని భావము. 5

70. కం. రాకడ పోకడలేకను - యేకస్థితి యుండునట్టి - యీ బయలందున్ రాకడ పోకడ గలిగి య - నేకముగా దోచులేని - ఎరుకా సుశీలా॥ ప్రతిమలలో లేని - పెరుమాళ్ళలీలా॥ లేకా దోచిన ఎరుక - లేనే లేదనుచు నీ - కీకీలు గురునిచే ఎరుకైతె జాలుళ్ళ - కెర్కరుకా సుశీలా॥ ప్రతిమలలోని - పెరుమాళ్ళలీలా॥ ౬

తా. శిష్యా ! పుట్టుట చచ్చుట యనెడి రాక పోకలు లేక ఈ వుత్త బట్టబయలగు అచల పరిపూర్ణము సర్వకాల సర్వదేశ్యముల యందు సర్వ వస్తువులయందు సర్వసర్వాంతర్యామియై సర్వము నిండి నిబిడీకృతమై ఒకే విధముగా అంతటా నిండియున్నది. ఎరుక రాకడ పోకడలు గలిగినదై అనేకములైన భిన్న భిన్న రూపములతో అచ్చటచ్చట విగ్రహములలో లేనటువంటి దేవుడువలె లేనిదై నామ మాత్రమును కల్పించుకొనుచుండును. లేకుండా తొచిన ఈ ఎరుక లేనేలేదను రహస్యము నిజగురునిచే నెరింగిన యడల లేని ఎరుకయు,

ఈ యెరుకయొక్క కల్పిత ప్రపంచము నిశ్చయముగా వుళ్ళక్కియని భావము. 6

71. కం. వనిగల్లుదకములోపల - తనకై తావొచ్చి తనకు - తానేగు విధం - బును పరిపూర్ణములోపల - తనకై తా వొచ్చి ఎరుక తనకై తాజనునూ॥ అచలం బున్నదని - తానెరిగిననూ॥ తన లేమి నిజమాని తనకే తోచును తోచి - తన కల్మిమృషగా - భావన జేసి నిలువాక తనకై తాజనునూ॥ అచలంబున్నదని-తానెరిగిననూ॥ ౭

తా. శిష్యా ! వుదకములోనుండి వడగండ్లు తమకు తామేవచ్చి, మరలకొంతసేపటికి తమకుతామె నశించిపోవును అదే ప్రకారము అచల పరిపూర్ణబ్రహ్మమను బట్టబయులునందు యెరుక తనకుతానెవచ్చి తనకు తానెపోవుచుండును. అచలపరిపూర్ణమున్నదని తెలసిన యెరుక మరల జన్మమునకురాదు యెరుక తానుశాశ్వితముగా వుండుదాననుకానని తన అబద్ధత తనకేతోచి తనకలిమి తనబలిమి మాయయని భావించు కొని సిగ్గుపడి తాను ఎందును నిలువక తనకుతానేపోవునని భావము॥ 7

72. కం. పరిపూర్ణములో దోచుచు - ఎరుకేచను తనకుదానె యేర్పడు వినుమీ - తొరటలు తొమ్మిదిగలదై - తరితీపులనొందు చుండి - తను వానదగుచూ॥ అచలంబున్నా - దని తా లేననుచూ మరుగిడ్డెరుకకు దెలియు - ఎరుకె నిల్వదుగాని - పరిపూర్ణముండు - దాన్నెరిగే దెట్లికగుర్తు - తనువాన దగుచూ॥ అచలంబున్నా - దని తాలేసనుచూ॥ ౮

తా. శిష్యా ! అచల పరిపూర్ణమునందు లేని ఎరుక తనకుతానె యున్నటుల తోచుచు పోవుచుండును. నవరంధ్రములు గల స్థూల శరీరాత్మలై పుట్టుచు భ్రాంతులనెడి సుఖదుఃఖములు అనుభవించుచు చచ్చుచు పుట్టుచుండును. అచల పరిపూర్ణమున్నదని తెలసిన ఎరుక

తానులేనిదానవని తెలసి నిల్వకుండా పోవును. యిట్టి రహస్యము ఎరుకకు తెలసిన యడల ఆ ఎరుక మరల జననమునకురాదు. ఈగుర్తు అనే ఎరుక పోయిన తర్వాత అచల పరిపూర్ణము వున్నదని తెలియుటకు యింకొక యెరుక ఏమియు లేదని భావము. 8

73. కం. తొలుకారు మెరుపుకై వడి - పొలుపుగ - నీళ్ళందు దోచు - బుగ్గల రీతిన్ అల సూర్య కిరణ మందున - గల నీర్ళంబలెనె యెరుక - గనుపించునయ్యా॥ అంతలో యచట - గనిపించదయ్యా॥ కలకాల మొకరీతి - గలిగుండ దీ యెరుక - తిలకింప పగలు - రాత్రిరి దిరుగు విధమున-గనిపించునయ్యా॥ అంతలో యచట - గనిపించదయ్యా॥ ౯

తా. శిష్యా! తొలకరి వానలలో మెరసెడు మెరుపు తీగల వలెను నీళ్ళయందు కన్పించెడి బుడగల వలెను సూర్యకిరణములందు తోచుచుండెడి నీల పీతాది వర్ణముల వలెను. తీవ్రమైన ఎండలో సూర్యకిరణములచే కన్పట్టుచుండెడి యెండమావుల నీళ్ళవలెను. యీ ఎరుక ఒక క్షణములో కనుపించుచు యింకొక క్షణములో మటు మాయుగా కనుపించకుండా పోవును. ఎరుక నిజము యింతియేకాని యెల్ల కాలములయందు వొక్కరీతిగా వుండునదికాదు. అదియునుగాక పగలు రాత్రి యేలాగు వస్తూ పోతూ వుండునో ఆలాగుననే ఒక క్షణ కాలములో యీ యెరుక కనుపించి మరొక క్షణకాలములో కనుపించ కుండా పోవునుయని భావము. 9

74. కం. కట్టెందు నిప్పులేకనే - కట్టెయనొక సమయమందు కనుపడు బహుగా మిట్టిపడి తుదకు గనుపడ - దట్టిదెనుమి యెరుక పుట్టు - వమల విచారా॥ తనకుదానె - యురుదెంచెనౌరా॥ పుట్టు గిట్టుటలానె - నట్టేట నిలుచుండి-బట్టాబయులు పొడ - గట్టిన గను పొడ - దమల విచారా॥ తనకుదానె-యురుదెంచెనౌరా॥ ౧౦

తా. శిష్యా ! నిజమును గ్రహించిన శిష్యుడా కర్రలయందు నిప్పుకనుపించక, మరియొక సమయమున అనగా ఆకర్రను యింకొక కర్రచే మదించినయడల నిప్పుకనుపించును. ఆనిప్పు ఆకర్రను కాల్చి తాను నశించును. యీవిధముగా ఎరుక తనకు తానె పుట్టి పెరిగి తనకు తానె నశించుచుండును. ఇట్లు పుట్టిన ఎరుక చావుపుట్టుకలతో కూడినదై, సంసారమనెటి యేటిలో (నదిలో) నిలచుండి, అచల పరిపూర్ణబ్రహ్మమును దెలుసుకొనినఎడల, పుట్టుట గిట్టుటవలనే నది (యేరు) యింకిబోవును యని భావము. 10

75. కం. తనమూలము తలిదండ్రులు - తనవలెనే వారివారి-
తలిదండ్రులకున్ - తనవలెనె గాని యన్యము - గన జననస్థానమొకటి-
గలదాన తరమా॥ బ్రహ్మాదుల కది-దెలియ తరమా॥ వినుము యీ
బ్రహ్మాండ - జననాము నీ నా యం దునసైన దిదియుగా - దని
వేరె యింకొక్కటి - గలదనతరమా॥ బ్రహ్మాదుల కది - దెలియ
తరమా॥ ౧౧

తా. శిష్యా ! ఈతను పుట్టుటకుమూలము తన తల్లిదండ్రులు వారు పుట్టుటకు మూలము వారి తలిదండ్రులు, వారికి మూలము వారి తల్లిదండ్రులు, యీలాగుననెగాని వేరె యింకొకరు పుట్టించుచున్నారని చెప్పు మాటలు సరిపడవు. యీలాగుగాక యింకొకవిధముగా తెలియవలె నన్న బ్రహ్మాదులకైనను అయ్యేది సాధ్యపడదు. వినుము ఈ బ్రహ్మాండము నీవు నేను అని పలుకుచుండెడి ఎరుకవల్లనే పుట్టినదిగాని యింకొక దానివల్ల అనగా యీవుత్తబట్టబయలువల్ల పుట్టినదని చెప్పుటకు తరము కాదు. ఏమనగా ఆ అచలపరిపూర్ణము అవాఙ్మానసగోచరము గావున దానివల్ల పుట్టనేరదు. ఈప్రపంచము దేహములు ఎరుకవల్లనే పుట్టినవని భావము॥

76. కం. కనరాని దానిశూన్యం-బని యనదగుగాని బయులు-ననదగుసుమీ - కనవచ్చుచున్న దిందులో - కనుగొనుటకు ఎరుక లేదు - కనుగొన రాదా॥ ఎరుకను శూన్య - మని యనరాదా॥ కన వచ్చెనాలేదా - కనుగొంటివే దాని - యనరాదా భయమేమి - యనుమానించకు మిగో - కనుగొనరాదా॥ ఎరుకనెశూన్య మని-యనరాదా. ౧౨

తా. శిష్యా ! కనబడకుండా మటుమాయుగా పోవుచున్నటు వంటి యెరుకను సూన్య మనవలయునుగాని - భూత భవిష్యద్వర్త మానకాలములయందు వొకేరీతిగాయుండి కనుపించుచుండెడి యీ వుత్తబట్టబయులును సూన్యమని చెప్పకూడదు. యెరుకనే సూన్యమని చెప్పవలయును. ఆట్టి ప్రత్యక్షముగా కనుపించెడి అచలపరిపూర్ణమును నీవు కనుగొంటివా లేదా అనుమానము భయమునొందక దృఢముగా ఈ వుత్తబట్టబయులును స్తిరమని చెప్పుము. ఎరుకను ఎల్లకాలముల యందు లేనిదని అది శూన్యమని అస్తిరమని సంశయము లేకుండా దృఢముగా చెప్పుమని భావము. 12

77. కం. ఎరుక బయులందు లేమిని - ఎరుకను శూన్యం బటంచు - ఎరిగించబడెన్ ఎరుగుమిదె ఆకసం - బి ట్లెరిగితె ఎరు కాకసములు - యేకామౌగదరా॥ ఆకసము బయు - లేక మెట్టౌరా॥ పరిపూర్ణమిదిగో క - న్పడు శూన్య మనరాదు - ఎరిగుండు మెది రిస్తె - యిక నాచై జూచేవు - యేకమౌగదరా॥ ఆకసము బయు - లేక మెట్లౌరా॥ ౧౩

తా. శిష్యా ! ఈవుత్త బట్టబయులునందు ఎరుకలేనిదగుటచేత శూన్యమని చెప్పబడినది. ఈ ఎరుకయే ఆకాశమని యిదియే జ్ఞాత

యని తెలియుము. ఈ విధముగా తెలిపితే శబ్దబ్రహ్మమగు ఈఆకాశ మునేనని పలుకుచుండెడి ఎరుకయు ఒక్కటే యగుచున్నది. నిశ్చబ్ధ మగు ఈ వుత్త బట్టబయులు, శబ్దబ్రహ్మమగు ఆకాశము ఏలాగు అగును. ప్రత్యక్షముగా కనబడుచు కాలాకాలములయందున్న ఈ వుత్త బట్ట బయలగు అచల పరిపూర్ణము శూన్యమని యనకూడదు. నీ ముఖము నాచెయ్యివంక త్రిప్పి ఈ వుత్తబట్టబయలును చూచి తెలుసుకొనుము యని భావము. 13

78. కం. కనుబడెడి బయలులోపల - కనుగొన లేదయ్యె ఎరుక గావున శూన్యం - బనవలసె దీన్నె ఆకస - మన వలసెను దీన విశ్వ-మాయనో యప్పా॥ యింతకువేరే-మాయయేదప్పా॥ కమకానే ఈ విశ్వ - మును లేనిదని లెస్సా - వినజెప్పనాయెను - కనబోకుండని పోని - మాయనో యప్పా॥ యింతకువేరే - మాయ యేదప్పా ౧౪

తా. శిష్యా! సర్వకాల సర్వ దేశ్యములయందు కనబడుతూ వున్నటువంటి అచలపరిపూర్ణమగు ఈ వుత్త బట్టబయలునందు, యీ ఎరుక కనుపించదాయెను. అందువలన ఎరుకను శూన్యమని జెప్పబడెను గాన ఎరుకను ఆకాశమని యనవలసి వచ్చెను. ఈ ఎరుకవల్లనే సర్వ ప్రపంచము పుట్టెను. అందువల్లను ఈ విశ్వమగు ప్రపంచము పుట్టించు టకు దీనికిమించి వేరొకమాయ ఏమియులేదు. యిట్టి మాయయగు ఎరుక ప్రపంచమును జూడబోకుమని జెప్పితి. అచల పరిపూర్ణమునే జూడుమని దృఢముగా నమ్మమని భావము. 14

79. కం. అహమనదుగదా అచలము - అహమున్నదో లేదో చూడ - దది నిజమేకదా - అహమును పుట్టించదుగదా - అహముద

యించేటివరకె - అదివున్నదిగదా॥ అహమే విశ్వమై నిల్చిందిగదా॥ అహమె ఈముచ్చట్లు - నన్నింటెన్నొరుగునుగద - అహమె తానేతాని- యరిగితె సరిగద-అదివున్నదిగదా॥ అహమెవిశ్వమై-నిల్చిందిగదా॥ ॥అ॥

తా. శిష్యా ! ఈవృత్తబట్టబయలగు అచల పరిపూర్ణము నేను పరిపూర్ణముననని పలుకనేరదు, నేను అని ప్రతిఘటములలోనూ పలుకు చున్న అహము వున్నదోలేదో, యీ అచలపరిపూర్ణము యెరుగదు నిజమేకదా। యీ అచల పరిపూర్ణము నేను అనే అహంకారమును పుట్టించనేరదు. నేను అనే అహంకారము తనలో పుట్టకముందు యీ వృత్తబట్టబయలు వున్నది. నేను అనే అహమే సర్వమైన ప్రపంచముగా యున్నది. యీ అహంకారమే సర్వానందములను చిత్రవిచిత్రములను గుర్తెరుగుచుండును. అట్టి నేనని పలుకుచుండెడి యీ మూలంలేని గుర్తెరిగే శరీరము తానుతేనని నిజగురుస్వాములచే నిజము తెలిసి లేకుండాపుండెడి యీ అచలపరిపూర్ణమే వుంటుంది. యీ గుర్తెరిగే శరీరమను యెరుకయే సర్వప్రపంచమైనదని భావము॥ 15

80. కం. ఆవరణము నాకసము-నిరావరణము నచట మనుచు। అనిరి మహాత్ముల్-ఆవరణము మితిగలిగిన-దావరణములేంది యమిత మని తెలుసుకోరా॥ ఈ రెంట్ని వే - రని కనుక్కోరా। ఆవరణమ్మున నే నిరావరణమును జూచి - యావరణ మెడలిన - నావాలమాట, లేదని కనుక్కోరా। యీ రెంట్ని వే - రని కనుక్కోరా। ౧౬

తా. శిష్యా ! ఆవరణము ఆకాశమనియు నిరావరణము అచల పరిపూర్ణమనియు మహాత్ములైన మనపెద్దలు వచించిరి. ఆవరణము నకు మితి అనగా లెక్కయుండును - ఆవరణముకానటువంటి నిరావరణ ముకు యీ వృత్తబట్టబయలు లెక్కకు అందదని తెలియుము. ఈ రెండును వేరువేరుగా యుండునని తెలుసుకొనుము. ఆవరణమగు

యెరుక చేతనే నిరావరణమైన అచల పరిపూర్ణమును జూచిన యెడల నేననే గుర్తు లేకపోయిన వెనుక ఈ వృత్తి బట్టబయలే వుండునని భావము. 16

81. కం. ఆకాశము శూన్యంబని - లోకులు మొరబెట్టి దానిలో పవనాదుల్ ప్రాకటముగ బుట్టినవని - చీకాకుగ జెప్పినారు - ఛీ వినిరాదూ॥ వంధ్యాసంతీ - క్షితిలోన లేదూ॥ కాకుంటె వినుచోద్యమౌ-కుందేటికొమ్ము - లీకాలముననే మేమే - కంటిమనుమాట ఛీ - వినరాదూ॥ వంధ్యాసంతీ - క్షితిలోన లేదూ॥ ౧౭

తా. శిష్యా ! ఆకాశము శూన్యమని యేమీ లేనిదని కొందరు జనులు చెప్పుచు ఆ యాకాశము వలన వాయువు అగ్ని జలము పృథివి యను నాలుగు మహా భూతములు పుట్టినవని తప్పుడు మాటలు చెప్పిరి. శబ్దగుణముతో నుండునది ఆకాశము ఆ యాకాశము వలన శబ్దస్పర్శ గుణకమగు వాయువు పుట్టెను. ఆ వాయువువలన శబ్దస్పర్శ రూపగుణకమగు అగ్ని పుట్టెను. ఆ అగ్ని వలన శబ్దస్పర్శరూప రసగుణకమగు జలము పుట్టెను. ఆ జలమువలన శబ్దస్పర్శరూప రసగంధ గుణకమగు పృథివి పుట్టెను గాని ఆకాశము యేమీలేనిదై శూన్యమయితే మిగతా నాలుగు భూతములను ఏలాగు పుట్టించును. ఛీఛీ అట్టి అబద్ధపు మాటలు వినరాదు. ఏమందువా గొడ్డురాలకు బిడ్డలు పుట్టరు. అదికాక యింకొకటి వినుము. అందమైనటువంటి చెవులపిల్లికి కొమ్ములు ఈ క్షణమే యిప్పుడే జూచితిమని జనులు వేడుకగా జెప్పిన మాటయేగాని నిజముగా చెవులపిల్లికి కొమ్ములును గొడ్రాలుకు బిడ్డయును యుండుట అసంభవమని తెలియుము. ఆకాశము శబ్దగుణము గలిగినదై ప్రతిఘటములోనూ నేను అని పలుకుచున్నది. అచల పరిపూర్ణము నిశ్శబ్దమైనది పలుకు లేనిదని భావము. 17

శుద్ధనిర్గుణతత్వకందార్థఒదరువులు - భావార్థములు

82. కం. లేనెరుకను బయలందున - లేనే లేదనక యితరులేల పలికిరో - లేనిది కలదని పిదపను - లేనే లేదనుచు సిగ్గు - లేకా యీ లీలా॥ ఛీ విన కీ-చీకాకు నీకేలా॥ మేనంకీదశుద్ధాము - తానల్దుకొని మళ్ళీ - పూని కడిగినరీతి - నౌను సిగ్గొక యింత - రేకా యీ లీలా॥ ఛీవినకీ-చీకాకు నీకేలా! ౧౮

తా. శిష్యా! ఈ వృత్త బట్టబయలునందు లేనటువంటి యెరుకను లేదని నిశ్చయముగా జెప్పక కొంతవరకు యున్నదనియు తరువాత లేనిదనియు కొందరు జనులు సిగ్గులేకుండా ఏలాగు చెప్పిరో ఛీఛీ నీవు అట్టి కల్లబొల్లి మాటలు విని మనస్సులో చీకాకు అనగా సందేహము పడవలదు. తనశరీరముకు అమేధ్యమను చండాలము పూసుకొని వాసనగుచున్నదని ఆ చండాలమును కడుగుకొనినటులగా పామర మానవులు బిడియములేకుండా కొంతవరకు ఎరుక వున్నదనియు, మరికొంత సేపుకు ఎరుకలేదనియుసంశయము గలవారై ఎరుకయొక్క నిజము గ్రహించక యేమియో పలికిరని ఆమాటలు నీవు నమ్మవద్దని భావము. 18

83. కం. అన్నపు సూక్ష్మాంశము మను - సెన్నగ నీరంబు ప్రాణ - మెరుగుము యీరెం డెన్నడు కలియవో నాడే - సున్నసు మీఎరుక మాట - సుగుణసంపన్నా॥ కలసుటె ఎరుక - సుమి యింత కన్నా॥ వున్న దెరుక మూల - మన్నాది వినలేదు-ఎన్నాడు యీ భ్రాంతి - నిన్నంట నివ్వకు-సుగుణసంపన్నా॥ కలుసుటె ఎరుక-సుమి యింతకన్నా॥ ౧౯

తా. శిష్యా! సుగుణములనే సంపత్తుగల్గిన శిష్యుడా! అన్నము యొక్క సూక్ష్మాంశమే మనస్సు. జలముయొక్క సూక్ష్మాంశమె ప్రాణముయని తెలియుము. ప్రాణము మనస్సులనెడి యీరెండును ఒకటిగా

కలియని క్షణమే ఎరుక లేనిస్థితి, మనస్సు ప్రాణము కూడకుండుటే ఎరుకయని దెలియుము. అనగా సంకల్పరూపమైన మనస్సునకు సంకల్పములేకపోవుటయు, వ్యాపనిశ్వాసరూపకమైన ప్రాణముతో మనస్సు కలియుటచే సంకల్పము చేయుచుండును. అట్టి ప్రాణముతో మనస్సు కలియకపోతే ప్రపంచము కలదని సంకల్పించి భ్రాంతిపొందెడి మనస్సు లేక ఎరుక యుండనేరదని తెలియుము. అన్నముయొక్క స్థూలాంశమైన ఆకలి జలముయొక్క స్థూలాంశమైన దాహము యీ రెండును యేక్షణములో తెలియబడవో ఆసమయమే ఎరుక లేని స్థితియని గ్రహించుము. ఎరుక పుట్టుటకు మూలము యేమియులేదు. ఎన్నటికి ఎరుకకు మూలమున్నదనే భ్రాంతిని నీవు పొందకుమని భావము। 19

ఇతి॥ శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైతా రహిత
పరమ తత్త్వేన శ్రీ భూమానంద దుర్వాడ నారాయణ
మూర్తి విరచిత తాత్పర్య భావార్థ యెరుక
దృవన్నామ పంచమోధ్యాయః

---

• ౬ • యెరుకను విడిపించుట ౨౨౭ •

84. కం. పిల్లలు తాట్యాకులతో - పిల్లలు గావించు పెండ్లి పేరంటంబుల్ - కొల్లలుగా జేయువారలంతల్లులుగని పత్యమనుచు - తలచేరా మదినీ॥ నిను నీవిట్లు దలుచరా మదినీ॥ కల్లా సంసారము- గని మానవులు సంతసిల్లగ గురుమంత్రసిద్ధులు నిజమని - తలచేరా మదినీ॥ నిను నీవిట్లు - దలుచురా మదినీ॥ ౧

తా. శిష్యా ! పిల్లలు తాటియాకులతో మగబొమ్మలను. ఆడ బొమ్మలను జేసి వాటికి అలంకారములను జేసి, పెండిండ్లుజేసి, విత్యముల నంది కయ్యములకు డీకొని కలహములనొంది సంతోషము పొందు

చుండుదురు. అట్టి పిల్లలయొక్క తల్లులు పిల్లలు జేసెటి పెండిండ్లు అసత్యమని అనగా అదియొక ఆటయని తలంచి వారల కలహములను వోదార్చుదురు. అటువలెనె ప్రపంచము నిజమని తలంచి యీ మానవుల కల్లయైన సంసారమును సత్యముగా తలంచుచు సుఖదుఃఖములు పొందుచుందురు. నిజగురు మంత్ర ప్రబోధ సెరింగిన సిద్ధులు. శరీర ప్రపంచ వ్యవహారికములు అసత్యమని అనగా లేనివని తలంచుచు సుఖదుఃఖముల యెడ సమరస జ్ఞానము గల్గి నటింతురు. అటువలె నిన్నును నీ వ్యవహారికమును లేనిదని తలంచుచుండుమని భావము. 1

85. కం. మేనెరుకల రెండింటిలో - దానిని యిది దీని నదియు తగసృజియించున్ - మేనెరుక లివియు మూలము-లేనిదె సృజనయ్యె ననుచు - లేనేలేవంటి॥ అంటే తప్పు లేనేలేదంటి॥ - మే నెరుక లిప్పుడూ - దేనందున్న వొచూచి - లేని మే నెరుకల - లేనివనుచు నమ్ము - లేనేలేవంటీ॥ అంటే తప్పు - లేనేలేదంటి॥ ౨

తా. శిష్యా! నేననెడి యెరుకచేత మే ననెడి శరీరమును మే ననెడి శరీరముచేత నే ననెడి యెరుకయు ఒకదాని నొకటి పుట్టించు కొనును. యీ రెండున్ను సృష్టికి తనకుతానె మూలమై యున్నది. యీ రెండింటికంటె వేరె యింకొకటి యీ రెంటిని పుట్టించుటకు మూలమైనది ఏదియులేదు. మూలములేదు గావున యీ రెండును లేనివియని తెలియుము. అందుచేతను యీ రెండును లేనివని యంటే తప్పుమాటకాదు యిది సత్యమైన వాక్యము యీ నేను మేనులనే శరీరాత్మలు రెండును యే బట్టబయులునందు వున్నవోచూచి ఆ బట్టబయులు శాశ్వితమని తెలసి, లేని శరీరాత్మలు రెండును లేనివని నమ్ముమని భావము॥ 2

86. కం. యెరుకపని చేయుదకుము - యెరుగుట మరచుటలు రెండు - యెవ్వరి పనులో - యెరిగింపుము నా ప్రభులను - వెరువను తప్పితివె దెబ్బ - వేసేను చూడూ॥ అట్లనకుండా - జేశేనునేడూ॥ వెరపించుటే దెబ్బ - వేశేన నా తండ్రి - యెరిగించి పై మర్మ - మెరుకాను నే దీసి - వేశేనుచూడూ। అట్లనకుండా - జేశేను నేడూ॥ 3

తా. శిష్యా ! ఈ ప్రపంచ దేహ సంబంధమగు కార్యములు యెరుక చేయుదని చెప్పకుము. యీ ప్రపంచమును దేహమును తెలియుట తెలియకపోవుటలను రెండును యెరుకయే చేయుచుండునుగాని యివి చేయుటకు మరి యెవ్వరునులేరు. ఈ యెరుకగాక మరియెవ్వరు చేయుచుండిరో నాకుం జెప్పుము. భయపడకుము. అలాగు సందేహము లేకుండా చెప్పకున్నయెడల కొట్టెదనని గురుడు భయపెట్టగా శిష్యుడు నా ప్రభు స్వాములగు మీరు కొట్టెదనని భయపెట్టుచున్నారేగాని నన్ను ఒక్క దెబ్బయైనను కొట్టలేదు. నన్ను కొట్టియైనను యెరుక యొక్క రహస్యము నెరిగింపుడని వేడుకొనగా శిష్యునిజూచి గురుమూర్తి కరుణ గలిగినవారై యెరుకను తీసివేయుచున్నాను లేని ఎరుక పనులు ఏలాగు చేయునని యనకుండా జేసెదచూడుమని భావము. 3

87. కం, లేని కలగనినప్పుడు - దానికి దశదిశలయందు-తగ మొదట కొనన్ - తానంటకున్న మేల్కను - లేనికలే చూచెనేని - లేకా పోవుగదా॥ కలతో మేల్కలేకాపోదుగదా॥ లేనెరుక బయులూ లీలగా నీ కెపుడు గానవచ్చితె బోధ - గావలె ననవపుడు - లేకా పోవుగదా॥ కలతో మేల్క - లేకా పోదుగదా॥ ४

తా. శిష్యా ! నిజము కానటువంటి అనగా లేనటువంటి స్వప్నము లేక కల నీకు వచ్చినప్పుడు కలలో స్వరమును నిజముగా జరిగినటులే

కనుపించును ఆస్వప్నముకు ముందు వెనుక ప్రక్కలను క్రిందుమీదు యీ పదిదిశలయందు మెలకువ అంటియుండనేదు చూడుము, మెలకువ వచ్చిన పిమ్మట ఆకల కొంచమైనను వుండక అంతయు కనుపడకుండా మటుమాయగా పోయెను. కలయందు మెలకువలేదుగదా, గావున లేనికల లేదని దృఢమైతే చాలును, యీకల మెలకువలు రెండును ఒకదానినొకటి యేలాగు అంటకున్నవో, ఆలాగున ఎరుక బయలులు రెంజును ఒకదానినొకటి అంటవని తెలసినీ కెల్లప్పుడు దృఢమై గురుమేల్కయందు యుంటే యీ పరిపూర్ణబోధను మరల మరల పొందవలయునని కోరవు యని భావము॥ 4

88. కం. నొంటుకు దాపల బింద్వోం - ట్లంటినకొలది లెక్క- అధికంబగు నా - వొంటకు వలపలబింద్వొక - టంటించిన లెక్క వుళ్ళక్యో - గదనోయీ॥ వొంటుండి లేం - దొగదనోయీ॥ తంటాదీరునుచూడు - ధానివలెనే యెరుక - కంటె బయలు తాను - గలిగుండి తనకుళ్ల క్యొగదనో యీ॥ నొంటొండిలేం - దొ గద నోయీ॥ ౨౮

తా. శిష్యా! ఒక్కటియను అంకెకు కుడివైపున సున్నాను వుంచిన పదియని లెక్క వచ్చును. ఆ సున్నాను ఒక్కటియను అంకెకు యెడమవైపున వుంచిన లెక్కకెటులరాక యున్నదో లెక్కలేనిదియగుచున్నదో అలాగు ఎడమ వైపు సున్నావలెనే ఎరుక అచల పరిపూర్ణమనెడి బట్టబయలును చూచినట్టయితే తానే లేకుండా పోవును. వొక్కటియను పలుకు లేక ఎటుల వుండెనో అటువలె యీ వుత్త బట్టబయలే వుండి ఎరుక లేనిది అగునని భావము. 5

89. కం. ఎరుకొక్కటుండె నేనియు - ఎరుకే ఈ విశ్వరూప మేర్పడ దాల్చున్ - ఎరుకొక్కటి లేకుండిన - ఎరుకైన ప్రపంచ

మున్న - దెవరెరిగేరికనూ॥ లేదనసైన - నెవరుండేరికనూ॥ పరి
పూర్ణమైనట్టి - బయలుండ గనిపెట్టి-గురుని వాక్యముబట్టి గురు
తూబోగొట్టితే - యెవరెరిగేరికనూ॥ లేదనసైన - నెవరుండేరి
కనూ॥ ౬

తా. శిష్యా ! ఎరుకవొక్కటి యున్నయెడల ఆ యెరుకే ఈ ప్రపంచరూపము అంతయు తానెయై పుట్టుచుండును. అట్టి యెరుక లేకపోయిన యడల ఎరుకై నటువంటి ఈ ప్రపంచమును గుర్తెరుగు వారు యెవరు, ప్రపంచము లేదనే టందుకు వున్నదనేటందుకు యెవరు అనుచున్నారు. శ్రీసద్గురుకరుణాకటాక్షంబున అచలపరిపూర్ణమున్నదని గ్రహించిగురువాక్యమనే గురుమంత్రమును బట్టి సర్వమును గుర్తించే గురుతుయనే యెరుక విడచితే ప్రపంచమున్నదని గాని లేదని గాని తెలుసుకొనుటకు యింకొక యెరుక యేమియులేదని భావము. 6

90. కం. తెలుపు మృదుత్వము మధురము - గల వస్తువు
చక్కెరనుచు - గనుగొన్నట్లా - తెలివి శరీర జగంబులు-గల వస్తువు
బిందువనుచు-గనుగొనరాదా॥ నే దెల్పితె విననమ్మరాదా॥ తెలివిచే
బయలుండ దెలసి ఈ తెలివిని - తెలివి చాతనెపట్టి - తీసివెయ్యర
పోనీ-కనుగొనరాదా॥ నే దెల్పితె వినినమ్మరాదా॥ ౭

తా. శిష్యా॥ తెల్లగను మెత్తగను తీపిగను ఈ మూడులక్షణములు గలిగిన పదార్ధమును పంచదారయని నీవు తెలుసుకొంటివి. ఆలాగునె సర్వమును గుర్తించె గుర్తును ఈమేనును ఈ పప్రపంచమును మూడు విధములుగా కనిపించుచున్నది. ఒక్క బిందువె అనగా ఒక్క యెరుకయే యని కనుగొనుము. నే చెప్పిన మాటలయందు సంశయుము లేకుండా నమ్ముము. సర్వమును తెలుసుకొనుచున్న ఈ తెలివి చేతనే అచల పరిపూర్ణమనెడి బట్టబయలును కనిపెట్టి ఈలాగు తెలిసిన తెలివిని తెలివి చేతనే తీసి వేయుమని భావము. 7

91. కం. లేనెరుక బయలు లోపల - తానై తనకేరు పడిన తన మూలమునే-తానెరుగ దలచినప్పుడు - తానేలేకుండు దృష్టాంతము వినుమిచటా॥ కలదోచాదె-తనకై తానెచటా। తానై తోచిన కల-తన మేల్కగనబోతె - తానె తనకులేదు - తగియున్నదీ దృష్టాం - తము - విను మిచటా। కలదోచాదె - తనకై తానెచటా॥ ౮

తా. శిష్యా ! ఈవృత్త బట్టబయలనెడి అచల పరిపూర్ణము నందు లేనటువంటి యెరుక యనంబడు మాయ తనకుతానే వచ్చి అనేకములైన భ్రాంతులను పొంది తానెచ్చటనుండి వచ్చితినని తన మూలమును తానెరుంగ గోరినప్పుడు తానే లేకుండా మటుమాయగా పోవును. అందుకు దృష్టాంతము జెప్పెదవినుము. కలగాంచి మెలకువవచ్చి కలలో వాటిని చూడవలెనన్న ఆ కలకు మూలము యేమియని విచారించిన మూలము లేకనేకల వచ్చి మరల ఎటుల కనుబడదో అటువలెనని గ్రహించి ఈ ప్రపంచ భ్రాంతిని విడువుము తనకు తోచిన కలయు తానును మూలము లేకనే వచ్చెను తన మేల్కలో ఆ కలలో గన్నవాటిని చూడబోతె తనకు అణుమాత్రమైనా కనబడ తానేలేక పోవునని భావము. 8

92. కం. చచ్చుట పుట్టుట మేలుక-వచ్చుటగాఢానుషుప్తి - వచ్చుటలీ నా - ల్గచ్చముగ సహజమెరుకకు-పొచ్చము ఈ ఎరుక నిల్వ-బోదు మా యుప్పా॥ అచలము కిట్లు లేదుగదప్పా॥ మచ్చికతో రెంటి - మర్మము నీకిప్ప - డెచ్చాగ దెల్పితీ - నెరుగు మెరుక నిల్వ - బోదుమాయుప్పా। అచలముకిట్లు లేదుగదప్పా। ౯

తా. శిష్యా ! చచ్చుట, పుట్టుట, మెలకువ వచ్చుట, గాఢనిద్ర జెందుట. ఈ నాల్గుగుణంబులును గలుగుట యెరుకకు నైసర్గికము,

అదిగాక రాకపోకలు గలిగిన ఈ యెరుక సత్యముగా యుండునది కాదు. ఈలాగున అచల పరిపూర్ణమునకు యేగుణంబులు లేనిదియగుటచే యిదియే సత్యమైనది, శాశ్వితమైనది నీయందు ప్రేమతో నీ మనస్సుకుయెరుకపరిపూర్ణముల రెండింటి రహస్యములను విశేషముగా బోధించితి, సత్యమగు అచల పరిపూర్ణమును, అసత్యమగు యెరుకను చక్కగా తెలియుమని భావము॥ 9

93. కం. యెరుకను కలలో పురుషుని - కెరుకే ఈవిశ్వమగుచు యేర్పడు కలగా-యెరుకబయులు గనితాలేం-దెరిగినయెరుకకది మేల్కయిది నమ్ము లెస్సా॥ యెరుకతోపొందు - వదులాదేపిస్సా॥ ఎరుకానె కలనీకు - ఎప్పుడుదోచితె - ఎరుకా లేందనుమేల్క - నెరుగుమప్పుడె చాలు యిది నమ్ము లెస్సా। ఎరుకతో పొందు - వదులాదె పిస్సా। ౧౦

తా. శిష్యా ! కలలోకనిపించిన ఒక పురుషునివంటిది ఈ ఎరుక ఈ ఎరుకే ప్రపంచస్వరూపములను తనకుతానె కల్పించుకొనుచున్నది. ఈ ఎరుక ఈవుత్తబట్టబయలును దర్శించి తానులేనని గురుముఖముగా తెలిసితే ఎరుకకు అదియె మేల్క గాన ఈరహస్యమును బాగుగా నమ్మము. ఎరుకతో కలియక లేక భ్రాంతి వదలుటే మంచిపని, ఎరుక యనె కల నీకు యేక్షణములో కలుగునో అక్షణమే ఎరుక లేనిదని దృఢముగా తలంపుము. అదియే గురు మేల్కవయగును. ఈలాగు నీవు దృఢపడితే చాలును. ఈవిషయము నీవు మరువక బాగుగా జ్ఞప్తిలో నుంచుమని భావము. 10

94. కం. చిత్తరువు రంగుగోడల - నేత్తెరగున దెలిశినావో - నీవిప్పుడు నీ - చిత్తమున జగము నెరుకను-వుత్తబయల్నట్లదెలియు-మూహాతోడుతనూ॥ తెలిసి విడువు మూహజగములనూ॥ అత్తెరగున జేస్తే - ఆవాలిమాటాను - యిత్తెరగని తెలియు - నెవరుండే

రటుమీద - నూహతోడుతనూ॥ తెలిసివిడువు - మూహజగ
ములనూ। ౧౧

తా. శిష్యా! అనేకవిధములగు చిత్రవిచిత్ర పటములను, అనేక రంగులుగల గోడలను, యే యెరుకచేత తెలిసికొంటివో, యీసమయమున ప్రపంచమును యీ తెలివిని యే మనస్సుచేత తెలుసుకొంటివో, ఆ మనస్సుచేతనే కాలాకాలములయందు శాశ్వితమైయున్న ఈ వృత్తి బట్టబయలును తెలియుము, ఆలాగు తెలిసినతర్వాత తెలియబడెడి ప్రపంచమును, తెలిసెడి యెరుకను విడచిపెట్టుము. ఆ విధముగా విడచిన వెనుక యిట్లు ప్రపంచమున్నదనిగాని, ఎరుక ఈలాగు వున్నదనిగాని చెప్పుటకు మరి ఎవ్వరును లేరని భావము. 11

95. కం. పరిపూర్ణములో లేనిదే - యెరుకొక్కటి దోచి
తనను - యెరిగిన మృషగా - యెరుకే విడచునదెట్లన - కరములు
తమ పనులు తామె - గడపూనట్లుగనూ॥ యిది గాకుండె కలదిం
కొక్కటివినూ మరికాని దామాట - మంచిదీ మాటానీ - పరిపారి
విధమూల - పలుకేపలుకుల పని-గడపూనట్లుగనూ॥ యిది గాకుంటె-
కలదింకొక్కటివినూ॥ ౧౨

తా. శిష్యా! అచల పరిపూర్ణములో లేనటువంటి యెరుకకు భ్రాంతిచేత తానున్నటుల తానే తలంచి తన మూలమును గుర్తించి లేనిదాననని తెలుసుకొని తానైన యెరుక యెరిగిపోవును. అది యెట్లనగా చేతులు తమ పనులు తాముచేసి మరి చేయువలసిన పనులు లేక వూరకుండు విధముగా తెలియుము. యిదియునుంగాక యింకొక వుపమానము జెప్పెదను వినుము. మంచిమాటలు చెడ్డమాటలు యీ పలుకే పలికివేసిన తర్వాత పలుకక వూరుకొన్నట్లుగా తెలియుము. యీ యెరుక అలాగుననే లేకుండా పోవునని భావము. 12

96. కం. తలయెత్తి జూడజాలునె - అలచీకటి ఎదుట నిల్చి యబ్జాప్తు కళన్ - కలవచ్చి మేల్కయందున - గల చేష్టలు మొల నిల్చి - గనుగొనగలదా॥ అట్లనె ఎరుక - కనుగొనగలదా॥ యిలలో సద్గురుబోధ - నెరిగిన నరుని చే - ష్టలు గంటె నుళ్ళక్కి - సద్గురు బోదొట - కనుగొనగలదా। అట్లనె ఎరుక - కనుగొనగలదా॥ ౧౩

తా. శిష్యా ! సూర్యునియొక్క కళలను జీకటి యేలాగు జూడ నేరదో అదే విధముగా కలనుగాచి మెలుకువ వచ్చిన తర్వాత ఆకలలో కనబడిన చిత్రములన్నియు లేశమాత్రమైనను కనబడునట్లు తెలియుము ఆచల పరిపూర్ణమునందు యీ ఎరుకయు యీ ఎరుకయొక్క వ్యవహారికమును యేమియులేవు. నిజగురు స్వాములచే పరిపూర్ణ బోధవినిన దృఢప్రజ్ఞులగు నరుని చేష్టలన్నియు లేనివియని తెలియుము. అట్టివారలకు ఎరుక లేదని భావము. 13

97. కం. అంటదుకల మేల్కను మే - ల్కంటదుకల నెన్నటికిని కడు నిశ్చయమీ - రెంటిక్రియగుర్తు బయలుల - రెంటిని రెండంటకుండు రెండ్రెంటిలోనూ॥ కల ఎరుకాలీ - రెండూ మిథ్యేనూ॥ దంటాగ మేల్క బయు - లుంటా వెప్పటి కెరిగి - గెంటూమపై రెంట - రెంటి కల ఎరుకాల - రెండ్రెంటిలోనూ - కల ఎరుకాలీ-రెండు మిథ్యేనూ॥ ౧౪

తా. శిష్యా ! మెలకవను కల అంటనేరదు. కలను మెలుకువ ఎన్నడును అంటదు యిది నిజమేకదా ! ఈ రెండింటి విధముగా సర్వమును గుర్తెరిగెడి ఎరుకయు। అచలపరిపూర్ణంబగు బట్టబయలును ఈరెండును పై రెండింటివలె ఒకదాని నొకటి అంటకుండా యుండును. పై ఎరుకను కలయును సమయుగాపోల్చి మాయగా దెలిసి। మెలకువయును బట్టబయలును నొకటిగాపోల్చి, బట్టబయలు ఎప్పటికి యుండు

నని తెలసి, కలవంటి ఎరుక లేనిదని తెలసి తద్రాంతుల పొందకుండుటే మేల్కయని భావము॥ 14

98. కం. ఎరుగదు సుషుప్తిని జాగ్రత్త! నిరవంద సుషుప్తిరెంటి- నెరుగును మేల్క-ల్లరయగు బయలెరుకల రెం - ట్నెరుగదు బయు లెరుక రెంటి - నెరుగుచు నుండూ॥ గురుముఖమూన - నెరిగి యీ రెండూ॥ తిరమూగ ఎరుకాను - తీసివేసి తెజాలు - పరులు నేననియేటి - పలుకే లేకుండు నిట్లెరుగూచునుండూ॥ గురు ముఖమూన - నెరిగి యీ రెండూ॥ ౧౫

తా. శిష్యా! నిద్రకు జాగ్రత ఎట్టిదో తెలియదు, జాగ్రతకు సుషుప్తి లేక నిద్ర ఎట్టిదో తెలియదుగాని, ఈరెండింటిని జాగ్రతయనె మెలకువ ఎరుంగును. అటువలే యీ వృత్తబట్టబయలు తననుతాను ఎరుంగదు, ఎరుక ఎట్టిదో ఎరుంగదు। గాని ఎరుక యీ వృత్తబట్టబయలు ఎట్టిదో ఎరుంగును, తననుతాను ఎరుంగును, శ్రీ నిజగురుస్వామికరుణచే ఎరుక పరిపూర్ణముల రెండింటిని తెలసి లేని ఎరుక లేకుండావుంటె అంతే చాలును। అటుపైని నేనని నీవని వేర్వేరుగా విభజించి పలుకుటకు పలుకు లేకుండా పోవునని భావము। 15

90. కం. సంకల్పము లేనిదె ని-సంకల్పములోనదోచు - చను దోచుచనున్ - సంకల్పము తప్పున ని - సంకల్పము నెరిగినేని-చను తాలేనముచూ॥ నిసంకల్ప-మును నిల్చేదనుచూ। సంకల్పించుటకింక - సంకల్పమేది ని స్సంకల్పమందిట్లు - సంకల్ప మెరిగితే - చనుతాలే ననుచూ॥ నిస్సంకల్ప-మును నిల్చెదనుచూ॥ ౧౬

తా. శిష్యా! ఎరుకకులేక మనస్సుకు సంకల్పములేకుండా నిస్సంకల్పముగానుండు సమయంబున, యేమేమియో సంకల్పములు (వూహలు) తోచిపోవును. మరల తోచుచు పోవుచుండును, సంక

ల్పము (లేకయిచ్చ) తప్పని నిస్సంకల్పముకు తోచిన తానుకూడా లేకుండా పోవును. సంకల్ప వికల్పములుకాని నిస్సంకల్పమే నిల్చును, సంకల్పించుటకు వేరే యింకొక సంకల్పములేదు, నిస్సంకల్పమునకిట్లు తెలిసిన తానును లేకపోవును. కాబట్టి సంకల్పములు రెండునూ దోష స్వరూపములని తెలిసి వాటిని విడుమని భావము। 16

100. కం. ఎరుక తనకు దా విడిపో - దెరుకను విండిపించ లేరు ఎవ్వరు ధాత్రిన్ - గురుడొకడు దప్ప గురునకు - పరిచర్య యొనర్చి బోధ-పద్ధాతి వినినన్॥ తిరిగిరాని - పద్ధతి గనినన్॥ పరిపూర్ణ మెరుక యే - ర్పరుచ నెరుకలేక - హరిని స్వప్నముగన్న - కరిమ్రిగ్గినట్లొ యీ పద్ధతి వినినన్॥ తిరిగిరాని-పద్ధతి గనినన్॥ ౧౭

తా. శిష్యా ! ఎరుక యెంతటి వారికైనను తనకుతాను విడచి పోదు, ఈ ప్రపంచమునందు అచల గురుస్వాములు తప్ప మరి ఎవ్వరును యీ మాయమగు యెరుకను విడిపించలేరు. శ్రీ నిజగురు ప్రభువుల యందు భయభక్తి విశ్వాసములు గలిగి శుశ్రూషలు ఎల్లవేళల జేయుచు, మరణ జననములు లేకుండుటకై అచల పరిపూర్ణ బోధను ఆ బోధయొక్క మర్మములను ధర్మములను జక్కగావిని ఆచరణ యందుంచి పరిపూర్ణమును దర్శించిన ఎరుక లేకపోవుట ఎట్లనగా సింహమును కలలో గనుగొన్న ఏనుగు యేలాగు చనిపోవునో అటువలెనే పరిపూర్ణమును గనిన ఎరుక హరించిపోవునని భావము॥ 17

101. కం. అపరోక్ష మౌనె మనుజుల - కుపరోక్షంబైన బయలు - గురుకృపలేకన్ - అపరోక్షమౌను మనుజుల - కుపరోక్షంబైన బయలు - గురుకృపాగలుగా॥ కీలిదేలేని - ఎరుకాతా తొలుగా॥ విపరీతమౌ బుద్ధి - విడచీ నీ విప్పుడు - ఉపచారములుజేయు చుండుము గురునీకి - గురుకృపగలుగా॥ కీలిదెలేని - ఎరుకాతా తొలుగా॥ ౧౮

తా. శిష్యా! శ్రీ అచల గురుస్వాముల కరుణ గలుగక యీ మనుష్యులకు రూపనామ క్రియారహితమై కనబడరానటువంటి ఈ వృత్త బట్టబయలు ఏలాగు కనబడును. శ్రీ సద్గురు స్వాముల కరుణ గలిగిన యడల కనబడరాని అచల పరిపూర్ణము కనుపించును, గురు కరుణ గలుగుటె ఎరుక పోవుటకు కారణము. నీవు గురునియందు విపరీత బుద్ధిని విడచి అనగా దురహంకార, కపట, కల్మష, అభిమానము లుంచుకొనక శ్రీ గురుస్వామికి పరిచర్యలు ఎల్లప్పుడు ఆయన కృప గలుగునటుల జేయుచుండుటె రహస్యము ఈలాగు చేయుచుండిన లేని ఎరుక లేకుండా పోవునని భావము॥ 18

102. కం. నే నెవ్వడ నను జీవుడు - నేనే నేనను శివుడు ఈ- రెండనకన్ - తానుండు నచలమి వీటిని-నేనెరిగరిగినను పైది - నేనెట్లననీ॥ నేనకున్న-తానెట్లననీ॥ నేనన్నదాంట్లోదె - నీ నా ప్రసంగాము- తానన్నదాంట్లోనె - తలపోయవలె నిట్లు - నే నెట్లన నీ॥ నేననుకున్న - తానెట్లననీ॥ ౧౯

తా. శిష్యా! ఇరువది నాల్గు యింద్రియాది సమూహముతో కూడిన మేనుయే తానని పలికెడి జీవుడును మేను తానుకానని సోహంభావముతో దివారాత్రులయందు దిరుగుచునేనని పలికెడి శివుడును ఈ విధముగానున్న ఈ రెంటిని అంటకనేనని పలుకు లేక యున్న ఈ వృత్త బట్టబయలును నేననునది తెలిసి, తెలిసినదిపోయిన వెనుక నేనని పలుకుటకు ఏదియులేదు ఈవృత్త బట్టబయలుకు నేనని పలుకు లేదు తానున్నాననికూడా తనకు తెలియదు, నేను అనే ఎరుకే నీవు నేను అని మాట్లాడుటగాని ఈ బట్టబయలుగాదు. ఈ బయలులోనే మనయిద్దరము మాట్లాడుచుంటిమని భావము॥ 19

శుద్ధనిర్గుణతత్వకందార్థఉదరువులు - భావార్థములు

103. కం. తొ్ర్రలు తొమ్మిదిగలమే - న్మ్రరికి యొకరెంటి లోన - మ్ర్రలు నాల్గున్ - డె్రది తెల్లది నల్లది - క్ర్రిది దాన గ్రమందు - గలదొక్కతూటూ। అది ఎరుకానె-పులుగుండె చోటూ॥ కుర్రాగురుబోధానె - గొడ్డాలిచేబూని - మ్రిపుగులరెంట్ని - మల చికొట్టరపోనీ - కలదొక్కతూటూ ॥ అదియెరుకానె - పులుగుండె చోటూ॥ ౨౦

తా. శిష్యా ! మర్రిచెట్టువంటి ఈ దేహమునకు తొమ్మిది రంధ్రములుగలవు। వాటిలోరెండు రంధ్రములయందు అనగా నేత్రములయందు ఎర్రది తెల్లది నల్లది కర్రిది యను నాలుగు అండములనే శాఖలున్నవి, అందు మధ్య నివ్వరి ధాన్యపుముల్లువంటి చిద్బిందువులో నేననబడు ఎరుక అనగా పులుగు లేక హంస సంచరించుచుండును అదియె ఎరుకయొక్క స్వస్థానము, పరిపూర్ణబోధయనే గొడ్డలి బూని (అవలంభించి) మేనుయనెడి దేహమును నేను యనెడి దేహియును బాగుగా విచారించి లేనివియని యీ రెండింటిని ఖండించి అచలపరిపూర్ణమును పొందుముయని భావము । ౨౦

104. కం. తనువుతో వొచ్చిన ఎరుకే - తనువును తను వనుచు - తనను తాననియెరుగున్ - తనువును బాసినమీదట - తన నా దేహమును రెంట్ని - తానెరుగదెపుడూ॥ అదిగనుక తా-లేనే లేనెపుడూ॥ అనుమానరహిత మిం - దచలాయున్నదికంటె - తనమాట తలపోయు - తనకెసిగ్గయి తనను - తానెరుగదపుడూ ॥ అది గనుక తా - లేనే లేదెపుడూ॥ ౨౧

తా. శిష్యా ! ఈ మేనుతో వచ్చిన నేననే ఎరుకే ఈ మేనుకు నేను విలక్షణుడనని భావించుచుండును, ఈ మేనును నేను విడచిన తర్వాత తనకు తన దేహమును ఈ రెంటిని తాను తెలుసుకొనలేదు.

అందువల్ల తాను లేనేలేదని చెప్పవలసి వచ్చెను. నీవు యే సంశయము లేకుండా నిత్యమై యున్నటువంటి ఈ వృత్త బట్టబయులు నెరింగిన ఎరుక తన నిజమును తాను విచారించుకొనిన తాను లేనిదాననని తనకె సిగ్గయి నేనని చెప్పుటకు నోరాడకపోవునని భావము. 21

105. కం. ఉప్పెనచే జెడుతరువు వా - కప్పుడు విత్తనము పుచ్చు - నా రెంటికి ఈ తిప్పలు దప్పవు ధరయే - తిప్పలు తానెరుగుదిట్లు - తెలుసుగదోయీ॥ తను వెరుకా బయు-లులనట్లెరుగోయీ॥ గొప్పైన గురుబోధ - చొప్పున నెరిగి-ఈ తిప్పాలు గలవాట్ని - తప్పాదీశితెచాలు - తెలుసుగదోయీ॥ తను వెరుకాబయులులనట్లెరుగోయీ॥ ౨౨

తా. శిష్యా! ఘాలీవానకు చెట్లు పడిపోవును. మరియొక సమయమున విత్తనముకూడా పుచ్చి నశించును. యీలాగు నాశనముగగ్గెడి చెట్టు విత్తనముల రెంటియొక్క తిప్పలను యీ భూమికి తెలియదు. యీలాగుననే ఈ దేహి దేహములని తెలిసికొనుము అనగా ఈ దేహి దేహములను చెట్టు విత్తనములకు పోల్చి నశించునవి యని భావించి, భూమిని బట్టబయులునకు పోల్చి నశించకుండా యుండునని తలంచుము. గొప్పదియగు యీ పరిపూర్ణబోధ నెరింగి ఈ దేహి దేహభ్రాంతిని విడుమని భావము॥ 23

ఇతి॥ శ్రీ మద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణ
మూర్తి విరచిత తాత్పర్య భావార్థ యెరుక
మోక్షన్నామ షష్టమోధ్యాయః



— • ౭ మతాల లక్షణం • ౨౯ • ౭౫ —

106. కం. మతముల వారలు తమస - మ్మతమైె నటువంటి శాస్త్ర మర్యాదలచే - మితమేరుపరచుకొని బహు - గతులను కల హింతురట్టి - గతినీకేమికీ॥ చెపలత జెంద - స్థితినీకేమిటికీ॥ ప్రతి లేని యీ బట్ట - బయలుండజూచి సం - తతము లే నెరుక లే - దని నమ్మి మికవారి - గతినీ కేమిటికీ॥ చపలతజెంద-స్థితి నీకేమిటికీ॥ ౧

తా. శిష్యా। శైవ శాక్తేయ గణాపత్య వైష్ణవ బౌద్ధకుటీచక క్రైస్తు మహమ్మదీయ జైను పారసీక మొదలుగాగల అనేక మతస్థులు అనేకములైన మతములుగలవారు, తమతమ, మతమునకు సమ్మతమైన ఆయా శాస్త్రలు రీతిగా ఆచారనిష్టలను మర్యాదలను, మితి మేరలు నియమములు ఏర్పరచుకొని, ఒకరితోనొకరు మామత మేగొప్పదని మా దేవుడే గొప్పవాడని వారలయొక్క మహిమలను వర్ణించుకొనుచు కల హించుచుందురు. వారలవలె నీకు అహంకారముతో నుండునట్టి స్థితి ఎందులకు నీమనస్సు చెలనము పొందనీయకుము, యిట్టిదని చెప్పుటకు అలవిగానిదియు దానితో సమానమగునది రెండవది లేనిదియు యగు యీ వుత్త బట్టబయలును పొడజూచి యేకాలములయందును లేనటు వంటి ఎరుక లేదని వుత్తబట్టబయలు సర్వకాలములయందు వున్నదని నమ్ముము, పై మతముల వారలవలె అహంకారముగల్గి వాదోపవాద ములు జేయకుమని భావము।

107. కం. ద్వైతా ద్వైత విశిష్టులు - సైతురు విని సైసరెపు - సైసక పిదపన్ - సైతురు క్రమమున వేరన - నాతతమతి జీవశివుల - నవి వినబోకూ॥ నేబోధించి - నది విడబోకూ॥ పూత మౌ బయలూను - పొడజూచిగురునిచే - ద్వైతా ద్వైత విశిష్టా - ద్వై తాములను మాను - మవి వినబోకూ॥ నే బోధించి - నది విడబోకూ॥ ౨

తా. శిష్యా ! ద్వైతమతస్థులు ప్రపంచము పరమాత్మయు అగు రెండును శాశ్వత మనియు । దేవుడు యెంతవరకుండునో అంతవరకు ప్రపంచముండుననియు ప్రపంచముశాశ్వతమైనదనియు జీవులకు నాశనము లేదనియు, మరి యేమేమియో చెప్పుదురు, అద్వైతులు ప్రపంచము దేహము అశాశ్వతమనియు దేహి యగు ఆత్మ శాశ్వితమనియు శివ జీవైక్యమే మోక్షమనియు, జ్ఞానయోగములగు యోగాభ్యాసములు లక్ష్యాదిముద్రలుచే పరమాత్మయగు దేవునిజూచి వానియందుయైక్య ముకావచ్చునని అందుకు తగిన సాధనము లెన్నియో చెప్పుదురు, విశిష్టాద్వైతులు పరమాత్మయందు యీ మనుష్యులు అణుస్వరూపు లనియు ఆయన బ్రహ్మాండ రూపుడనియు, భక్తిచేతనే ఆయనలో యైక్యము కావచ్చుననియు, భక్తియోగముచే (నవవిధభక్తిమార్గము లచే) మోక్షము పొందవచ్చుననియు, కర్మజ్ఞానయోగా లక్ష్యాదుల వల్ల పరమాత్మలో యైక్యము కాదనియు చెప్పుదురు. యివి అన్నియు యెరుకలోనివేకాని యెరుకను విడచినవికావు. వీరలు యెరుకయే దేవు డని నమ్మినవారనని యెరుంగుము, యీలాగున ప్రపంచ మాత్మలు శివజీవులు వేరువేరని తలంచి కర్మజ్ఞాన, భక్తియోగములచే బోధించు వారల బోధలను వినకుము, నేబోధించెడి యీ అచల పరిపూర్ణబోధను ఎప్పుడు విడువకుము, రాకపోకలులేక సర్వకాల సర్వదేశ్యముల నిండి నిబిడీకృతమైన బట్టబయలును సద్గురుమూర్తి కృపచే కనుగొని ఆ కనుగొనినయెరుకనువిడువుము, యీయెరుకయగు ద్వైతాద్వైతవిశిష్టా ద్వైత మతములవారల బోధలను విని భ్రాంతిపొందకుమని భావము॥ 2

108. కం. కొందరు దశ విధనాదము - లందున నభపంచ కంబు-నందున చక్రాలందున లక్ష్యధ్యానం - బందున హంసందు బుద్ధి - నాటింతురోయీ ॥ యోగములందు - నటియింతురోయీ ॥

అంది సిద్ధులచేత - నానందింతురు కొంద - రందారి మనుసీ - బోధం దె నీవుండూము - నాటింతురోయీ॥ యోగములందు - నటియింతు రోయీ॥

తా. శిష్యా॥ జనులు కొందరు గజ్జ, మువ్వలు, ఘంటా, శంఖా వీణ, వేణు, తాళ, భేరి, జలధి, మేఘ, నాదంబులనియెడు దశవిధ నాదంబులయందును, మరికొందరుజ్ఞానముమనస్సు, బుద్ధిచిత్తముఅహం కారములగు ఆకాశ పంచకముయందును, ఆధార స్వాధిష్టమణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయములను షడ్చక్రములయందును, భ్రూమధ్యము నాశికము తాలుమూలము, కంఠము, వక్షము, నాభి బ్రహ్మరంధ్ర ముల యందు లక్ష్యధ్యాన్నముల నుంతురు. యింకను కొందరు హంస యందు బుద్ధిని నిలుపుదురు. మరికొందరు అష్టాంగ యోగములనియెడి యమ, నియమ। మానసప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన్నధారణ సమాదులయందు సంచరింతురు, వాటివాటికి తగిన సిద్ధులచేత ఆనం దము పొందుచుందురు. యివి అన్నియు యెరుకలోనివే గావున అట్టి వారలచేతలను చూచి భ్రమను జెందక ఈ అచల పరిపూర్ణబోధ యందే నీవు వర్తించు చుండుమని భావము॥ 3

109. కం. కొందరు ముద్రలుగనవలె - నందురు మరికొంద రధిక - మందురు ద్రష్టన్ - కొందరుభజనేలెన్నని - యందురు యివి యన్ని యెరుకే - నని తెలుసుకొనుమీ॥ నీ కివియాల పనిలేదు వినుమీ॥ ముందూగ పరిపూర్ణ - మున్నాదిగని గుర్తు - నెందుండ కుండదా - న్నెగరాగొట్టితె జాలు - నని తెలుసుకొనుమీ॥ నీ కివి యాల - పనిలేదు వినుమీ॥ ౪

తా. శిష్యా! కొందరు మనుజులుఖేచరీ భూచరిషణ్ముఖిశాంభవి మధ్యమ వైఖరిలను ముద్రలు చూడవలెనందురు. మరికొందరు జాలం

ధర, మూలబంధ, వొడ్యాణబంధములచే జూడవలయునందురు, మరిన్ని కొందరు దృష్టియనెడి గుర్తును చూచుట మంచిదందురు, యింకనూ కొందరు తాళములతో గాని చిరతలతో గాని చేతులతో గాని వాయించుచు పాటలు పాడుట మంచిదని యందురు. యివి అన్నియు యెరుకే యని తెలియుము. నీకు వీటిచేత యేమియు ప్రయోజనము లేదని గ్రహించి ముందుగా పరిపూర్ణమును గుర్తెరిగి గుర్తెరిగిన యెరుకను యెంతమాత్రము వుండనివ్వక విడచి పెట్టితే యింతె చాలునుయని భావము॥ 4

110. కం. దేవుణ్ని నిన్ను యెరుగవు - నీవిప్పటి కెట్టివారో-నే దెల్పెద నీ - కేపెర్రిబోధ లెందుకు - కావున దేవుణ్ని యిదిగో-కనుగొనవోయీ॥ నామరూప - కర్మాలేవోయీ॥ నీవా దేవునిలోన - నినులెస్సా వెతకి న - న్నావాలిముచ్చాట - నడుగోయి తెల్పెద - కనుగొనవోయీ॥ ౧

తా. శిష్యా! దేవుడు ఎట్టివాడో నీకు తెలియదు. కొయ్యతామ్రశిలాలోహప్రతిమలే దేవుడు అనుకున్నావు. రాతినే దేవుడు అనుకున్నావు. చెట్టే దేవుడు అనుకున్నావు, పుట్టయే దేవుడు అనుకున్నావు, జ్యోతియే దేవుడు అనుకున్నావు. నీవు ఏలాటివాడవో అనగా నీవు ఈశ్వరుడవో జీవుడవో దేవుడవో నీసంగతి నీకు తెలియదు. గావున నీవు ఏలాటివాడవో నీ నిజము నేను చెప్పెదను వినుము. నీకు పైని చెప్పిన పిచ్చిబోధలు వినుట యెందులకు. దేవుని యిదిగో చూడుమని కనుసొంజ్ఞచే బట్టబయలును సూచించి యీ దేవునికి నామము రూపము ప్రవర్తన యున్నదేమో చెప్పుము లేదుగదా, అయితే యీ దేవుని లోపల నీవు వుంటివోలేదో బాగుగావిచారించి అటుపైని నీవడుగ వలసిన మాటలు నన్ను అడుగుము బదులు చెప్పెదను, అనగా శిష్యుడు

బట్టబయలును గనుగొని తాను మొదలే లేనని తెలిసి తర్వాత అడుగుటకు తానసె గుఱైరుగు యెరుక లేక పలుకకుండెనని భావము॥ ౬

111. కం. మానవుడు చేయబూనిన - దానినిలోతెరిగి చేయ - దగునని మదిలో - నేనెరిగి నీకుజెప్పితి - పూనుము రుచిబుట్టదేని - పోనీ నీమనసూ॥ రుచిబుట్టితే - పూనునీమనసూ। నేనేమియనబోతె- నీకేమి దోచునో - లేనినిష్ఠూరము - లేకుండుటేలెస్స - పోనీ నీమనసూ॥ రుచిబుట్టితే - పూను నీ మనసూ॥ 6

తా. శిష్యా ! మనుష్యుడు యేపనిని చేయదలంచినను ఆకార్యమును దూరదృష్టితో కష్టసుఖములను, లాభనష్టములను చక్కగా విచారించి చేయవలయును. అట్టి లాభనష్టములను నేను యీబోధలో బాగుగా విచారించియే నీకు నేను చెప్పబూనితిని. నీవున్నూ పరులు చెప్పేడి బోధలకు నే బోధించిన పరిపూర్ణబోధకు గల తారతమ్యములను విచారించి, ఈ పరిపూర్ణబోధయందు నీకు అపేక్షలేనియెడల విడచిపెట్టుము. యీబోధయందు నీకు అపేక్ష జనించినయెడల నీ మనస్సుకు నచ్చినయెడల దీనిని అవలంభించుము. నేను ముందు బోధించబొయ్యేడి అచల పరిపూర్ణబోధాంశములు నీమనస్సుకు యేలాగు తోచునో, లేనటువంటి నిష్ఠూరము నీకును నాకును లేకుండుటే మంచిది గాబట్టి నీవు చక్కగా మనస్సులో సందేహ విపరీతభావములు పొందకుండా యీ పరిపూర్ణబోధ వినుటకు పూనుకొనుమని భావము॥ 6

112. కం. పంచాదశాక్షరముల ప్ర - పంచము తా నుద్భవించె - ప్రణవాక్షరమం - దంచు శృతులెన్నె దాన్నెరు కం చని నీవెరిగి యెరుగు - మచలాముదీనన్॥ నిల్పకు మెరుక - నచలాము లోనన్॥ చంచాలమతి చాత - చతురాక్ష రెక్కవం - చెంచేద

వెందుకు - యిదినమ్మ కెరుగూమి-యచలాముదీనన్॥ నిల్పకుమెరుక-నచలాములోనన్॥ ౭

తా. శిష్యా ! ఏబది యక్షరములతో జగత్తుపుట్టెనని యీ యాభై అక్షరములు ఓంకారముయందు పుట్టెనని శృతులు చెప్పుచున్నవి. అకారాది క్షకారాంతము యీ యాభై అక్షరములు యీ శరీరమున షడ్చక్రములయందుండెడివి. ప్రణవమను అక్షరము నేనని పలుకుచున్న ఆత్మగాను, ఓంకారమువలన పుట్టిన యాభై అక్షరములుతో కూడిన ప్రపంచమనెడి స్థూలశరీరము లేక క్షరము, మేనుయైనది యని ఈ రెండింటిని యెరుకగానెరిగి ఆ యెరిగిన యెరుకచేత ఈబట్టబయలును యెరిగి, ఈ యెరిగిన యెరుకను వుండనివ్వక తీసివేయుము. చలనముగలిగిన మనస్సుతో "హంసస్సోహం" యనెడి చతురాక్షరీ యే మహామంత్రమని తలంచుకుము అది యెరుకేయని భ్రమనువీడి, ఈవృత్త బట్టబయలును నమ్ముము దీనికి మించినది యేదియు లేదనిభావము॥

ఇంకొకవిధ మెట్లంటే - పదునైదు అక్షరములతో ప్రపంచము పుట్టెనని ఈ పంచదశ అక్షరములు ఓంకారముయందు పుట్టెనని శృతులు చెప్పుచున్నవి. అవియెట్లంటే ఓంకారముయందు అకారఉకార మకార మాతృకా త్రయములు పుట్టెను. అకారముయందు పంబ్రహ్మబీజములు యైదునూ, ఉకారముయందు పంచశక్తిబీజములు యైదున్నూ, మకారముయందు పంచభూతబీజములు అయిదున్నూ కలసి పదునైదుబీజము లాయెను. వానియొక్క సూక్ష్మాంశమువల్ల అక్షరము లేక నేనును, పంచభూత స్థూలాంశములవల్ల క్షరము లేక మేనును ఆయెను. యిట్లు దేహిదేహములగు యెరుక ప్రపంచమాయెను. ఈ ప్రపంచమును యెరిగిన యెరుకచేతనే అచలపరిపూర్ణమగు ఈవృత్త బట్టబయలునెరిగి, బట్టబయలు నెరిగిన యెరుకను బట్టబయలులోలేకుండా

చేయుము. చలించెడి మనస్సు గలవాడవై "నారాయణ" యనెడి చతురాక్షరీమంత్రము గొప్పదని తలంచుకుము. అది యెరుకయేగాని అచల పరిపూర్ణమగు ద్వాదశాక్షరీకంటె గొప్పదికాదు. నీమనస్సున సందేహములు విడచి ఈ అచలపరిపూర్ణబోధను నమ్ముము. దీనికిమించినది యేదియును లేదని భావము॥ 7

113. కం. యెరుజడ మజడ మీజగ - మరయగ పరిపూర్ణమేమి - యనరానిదియా - యెరుక జగము లస్థిరములు-పరిపూర్ణము శాశ్వితపుది - పాటించి కనరా॥ కావారెండి - పాటివి వినరా॥ గురుముఖమున వీట్ని - నరుడు గుర్తెరుగునో - తిరిగి పుట్టడువాడీ-ధరపై మునుపటివలె - పాటించి కనరా॥ కావారెండీ - పాటివి వినరా॥

తా. శిష్యా ! ఎరుక కదిలికలేనిదిగాను కదిలిక కలిగినదిగాను ప్రపంచముగాను యైయున్నది. అచలపరిపూర్ణమగు బట్ట బయులు యిట్టిది అట్టిది యనరాకయున్నది. ఎరుక ప్రపంచములు రెండును అశాశ్వితమైనవి. పరిపూర్ణమగు బట్టబయలు శాశ్వితమై సర్వకాలములయందు సర్వదేశ్యములయందు నిండి రాకపోకలు లేక యున్నది. శ్రీసద్గురు స్వాములవారి ముఖంబున యేమనుష్యుడు అచల పరిపూర్ణముయొక్క యదార్థమును, ఎరుక ప్రపంచములలేమిని చక్కగా విచారించి దృఢ చిత్తుడై యుండునో అతడు పూర్వమువలె భూమియందు పుట్టనేరడని భావము॥

114. కం. కొందరు భూతములై దిటి - యందున చిత్తంబునుంతు - రధికములనుచున్ - కొందరు యేమియులేదని యం - దురు గుర్తెరుగు మిన్ని - యపశబ్దములెరా॥ యివి నిలువాని - వని తెలియు

వలెరా॥ యందారెన్నన్నానీ - కెందూకు బయలూను - ముందూగ గని - గుర్తునెందుండ నివకవ్వి - యపశబ్ధములెరా ॥ యివి నిలువాని - వని తెలియవలెరా॥

తా. శిష్యా ! కొందరు జనులు పంచ మహాభూతములే గొప్ప వని వాటికి మించినవి లేవని వాటికి నాశనము లేదని తలంచుచుందురు. మరికొందరు యీ ప్రపంచ సృష్టికి పంచభూతములయొక్క కూడికచే జరుగుచున్నదనియు ప్రాణావసానమున పంచభూతములు దేనియందది లయమగుచున్నదనియు, శేషించునది యేదియు లేదనియు, మరల జన్మము లేదనియు, సూన్యముగా తలంచి నాస్తికులై సూన్యవాదము చేయుదురు. వీరలు భ్రాంతితోనే పోవుచున్నారుగాన వీరలకు జన్మము తప్పదు. యిటువంటి వారలమాటలు అబద్ధములుగా తెలియుము. ఇట్టి వారల బోధలు ఈ నిజబోధవద్ద నిలుచునవికావు. అట్టి అబద్ధపుమాటలు విని నీవు భ్రమనుపొందక, ఈవుత్తబట్టబయలును ముందుగా గుర్తించి ఆగుర్తించెడి యెరుకను నిలుపకుము. యిదియే నీవు సద్గురు పాదముపట్టినందుకు నీకు పుట్టినందుకు సార్ధకమని భావము. 9

115. కం. కొందరు కర్మమునే బా-గందురు మరికొంద రెక్కు వందురు తనువున్ - కొందరు ప్రాణము లధికము - లందురు నీకిట్టి వట్టి - యాశా లేమిటికీ॥ వారితోపొందు-జేశేవేమిటికీ॥ యెందారి మాటాల - నెన్నీన ఈబోధ-కిందవేకాని పై - కెక్కేవి గావిట్టి - యాశాలేమిటికీ॥ వారితోపొందు - జే శేవేమిటికీ॥ ౧౦

తా. శిష్యా ! జనులు కొందరు తీర్థయాత్ర స్నానసంధ్యా వందన దాన ధర్మ యజ్ఞయాగాది క్రతువులనే కర్మలను, షట్కర్మ లును చేయుటే జన్మకు సార్ధకమని చెప్పుదురు. కొందరుశరీరము కాయ

సిద్ధిని చేసుకొనుటె ఎక్కువని చెప్పుదురు. కొందరు పంచప్రాణములే గొప్పవిగాన ప్రాణాయామము చేయుట ముఖ్యమని చెప్పుదురు. నీకు యిటువంటి అబద్ధపుమాటలయందు ఆశ యెందులకు అట్టి వారలతో స్నేహము చేయుటే జన్మముకు హేతువు యెందరి బోధలను విచారించి చూచినను, యీఅచల పరిపూర్ణబోధకు క్రింది బోధలేకాని దీని కంటె యెక్కువైన బోధలుకావు. అందువలన యీ పరిపూర్ణబోధను యెన్నటికి విడువకుమని భావము॥ 10

116. కం. తను వెరుకలు రెండొక్కటి - యని యనరాదనుచు కొంద - రందురు భువిలో - తను వెరుకలలో నొక్కటి - గన రాకుం టేను రెండు - గనరావోయన్నా ॥ రెండొక్కటే - వినరామా యన్నా ॥ అనుమాన మికయాల - అందారి మాటాలు - వినబోకనే బోధించినరీతి నెప్పుడు - గనరావోయన్నా॥ రెండొక్కటె - వినరామా యన్నా ॥ ౧౧

తా. శిష్యా ! ఈ ప్రపంచమున కొందరు శరీరమువేరు, ఆత్మ వేరనియు, యీ రెండును వొక్కటిగా చెప్పరాదనియు శరీరము విడచి ఆత్మ యెచ్చటికో పోవుచున్నదనియు, మరల యింకొక శరీరములో ప్రవేశించుచున్నదనియు వాదింపుచుందురు. అది సరియైన మాటకాదు ఏమనగా యీ శరీరముయందు ఆత్మయు ఆత్మయందు శరీరము వుండును. దానిని విడచి యిది దీనిని విడచి అది వుండదు. స్థూలము పోయిన సూక్ష్మముకూడా దానితోనే పోవును. యీ రెండూ వొక్కటేయని తెలియుము. నేను చెప్పెడి మాటలయందు అను మానము విడచి, అందరి మాటలు జెవిబెట్టక నే బోధించెడి అచల పరిపూర్ణ పద్ధతిగా నమ్ముమని భావము॥ 11

117. కం. కన్నుల ప్రక్కల ప్రేళ్ళిడి - తిన్నగ - భ్రూమధ్య

మందు - దృష్టినిలిపియుం దున్నదివెన్నెలలో బయు - లన్నాకను మందు నెరుకే - అది నిలువదోయీ॥ తనువులో బొయ్యె - దని దెలియుమోయీ॥ యన్ని తనువులు వచ్చి యరగీన రుణకాక - వున్నాబయలిది జూచి - వుళ్ళక్కెరుకనుమాను - మరినిలువదోయీ॥ తనువుతోబొయ్యె - దని తెలియుమోయీ॥ ౧౨

తా. శిష్యా! కొందరు కన్నుల ప్రక్కలయందు వ్రేళ్ళుంచి నొక్కి భ్రూమధ్యమున దృష్టినిలిపి యందు కనిపించెడి పౌర్ణమినాటి వెన్నెలవంటిలో బయలును జూడుమని అదియే అచల బ్రహ్మమని పరి పూర్ణమని చెప్పుదురు. అదియే యెరుక అదియే మహాకారణ శరీరము అది స్థూల శరీరము దాల్చుచు విడచుచు మరణ జననములు పొందు చుండును. ఈ యెరుక యెన్ని తనువులు యెత్తినను తనువులు పోయి నను అచల పరిపూర్ణమగు బట్టబయలు మాత్రము పై యెరుకవలె రాకపోకలు లేక చలించక యున్నది. అట్టి బట్టబయలును వుండగా గుర్తించి గుర్తించిన యెరుకను లేనిదని నిరసన జేసియుంటే అంతే చాలునని భావము॥ 12

118. కం. జనులాత్మాను భవంబై - నను ముక్త్యనిపల్కిరిట్లు నమ్మకు మెరుకే - కనరాదెచ్చట గురుకృప - ననుభవ మెవ్వరికైన ఆ మాట నిజమో॥ అనుభవముళ్ళ క్కిమాట నిజమో॥ వినజెప్పు మీ రెండు - వివరించి పై మాట - వినినే ముందరిబోధ - వినిపింతు వేవేగ - ఆ మాట నిజమో॥ అనుభవముళ్ళ - క్కిమాట నిజమో ౧౩

తా. శిష్యా! మనుజులు కొందరు ఆత్మసాక్షాత్కారమే మోక్ష మని చెప్పిరి. అట్టిమాటలు నమ్మవలదు యేమనగా ఆత్మానుభవము కలలో అనుభవము వంటిది. అది యెరుక భ్రమగల్గిన వారికె నిజము

అచల గురుమూర్తి కరుణ గల్గినట్టయిన ఆత్మయగు ఈ యెరుక ఎచ్చటను కానబడక మటుమాయగా పోవును. అప్పుడు ఆత్మలేనేలేదు. శరీరము దానితోనే పోయెను. అందుకై అనుభవముళ్ళక్కని అంటిని. నేను జెప్పినమాట నిజమో పై జనులు చెప్పినమాట నిజమో ఈ రెంటిని బాగుగా విచారించి సందేహింపక నీవు చెప్పుము. నీవు చెప్పెడిమాటను విని నేను ముందు చెప్పబొయ్యెడి అచల పరిపూర్ణ బోధను చెప్పెదను అని భావము॥ 13

119. కం. తనను తాగనిన మోక్షం - బని పల్కిరిగాని జనులు - అది నమ్మకుమీ - తనను - తాబట్టబయుటను - గన బోయితె తనకుదానె - కానరాదోయీ॥ విశ్వము తనకు - కానరా దోయీ॥ తననుంచైనదిగనుక - తాను విశ్వము రెండు - గనుపించు టుళ్ళక్కి - గావున తనకుదా - కానరాదోయీ। విశ్వము తనకు - కానరాదోయీ। ౧౪

తా. శిష్యా। జనులు తానైన ఆత్మనుచూచినయెడల లేక జ్యోతిదర్శనము చేసినయెడల మోక్షమనిపలికిరి, లేనిదియు మాయయు యగు తననుతాను జూచిన మోక్షమెట్లాగు కలుగును, ఈలాంటి మాటలు నమ్మవద్దు, ఏమంటివా అచల పరిపూర్ణమగు బట్టబయలును గుర్తించబోయిన యెరుకయగు ఈ యాత్మ తానెందును నిలువకుండా మటుమాయగాపోవును, ఈప్రపంచము తనకు కానరాదు. ఎందు కనగా తనవల్ల పుట్టిన ప్రపంచముగనుక తానున్నూ ప్రపంచమును రెండును గనిపించుట యుళ్ళక్కియని భావము। 14

120. కం. మాయగదా లేనీయహం - బాయగదాతన్నుదానే - యచలము యేర్పా - టాయగదా మాయనలేందాయగదా మాయ చిత్ర - మాయగదోయీ॥ సంశయమంత - పోయగదోయీ। మాయా

సమూలము - మాయ చూస్తుండగ - మాయమైపోయును - మాయకె యిది చిత్ర - మాయగదోయీ ॥ సంశయమంత - పాయగదోయీ॥ ౧౫

తా. శిష్యా! నేను నేననెడి అహంకారము తనకు తానె వచ్చుచు పోవుచుండును అట్లు వచ్చుచుపోవునది మాయయేగదా! రాక పోకలు లేని అచల పరిపూర్ణ మగు బట్టబయులునందు మూలము లేనటువంటి యీ అహంకారము తనచేత కల్పింపబడెడి ప్రపంచ చిత్రములు తనకే మాయగా కనిపించుచున్నవిగదా, యీ అ హ ం కా ర మనెడి యెరుక మూలములేని దయ్యును ఎంత చిత్ర విచిత్రములను చేయుచు పొందు చున్నదో తెలిసితివా, నీ సంశయములు విడచెనా లేదా, మాయయొక్క మూలము (పుట్టుక) సంకల్పము మాయ చూస్తుండగనే యీ మాయ మటు మాయగా మాయమైపోవును, మా య యొ క్క చిత్రమే యీ ప్రపంచమంత యని భావము. 15

121. కం. లేని యహమున్న బయలును - లేని ప్రపంచమును తనను - లెస్సగ తనలో - రాను విమర్శించిన యా - లేనివి లేకుండు నవల - లేదు యే మాటా ॥ యిట్లనసైన - లేదు యే మాటా ॥ లేని యహమీబైట - లేనే లేదిది జూచి - లేనిది కలదాని - లేని మాటా డేవు - లేదు యేమాటా ॥ యిట్లనసైన - లేదు యేమాటా ॥ ౧౬

తా. శిష్యా! లేనటువంటి అహంకారము లేక యెరుకయును, లేనటువంటి ప్రపంచమును, తన్నును, శాశ్వతముగా యున్నటు వంటి యీ వుత్తబట్టబయలును, బాగుగా తన మదిలో విచారించిన తానైన లేనటువంటి అహంకారము ప్రపంచము యీ రెండును లేకుండా పోవును. అటుపైని మాట్లాడుటకు మాటయేలేదు, శాశ్వత ముగ స్థిరమైయున్న బట్టబయలగు అచల పరిపూర్ణము వున్నదని తెలిసి,

లేనివి యగు అహంకార ప్రపంచములు వున్నవని అబద్ధము లాడకు మని భావము। 16

122. కం. పరిపూర్ణ మెరుక లెట్టివో - గురు ముఖ మున రెంటిన్ని లెస్స - గురుతెరిగెరుకన్ - సరిపుచ్చుకున్న మృష యని - పరి సుద్ధపు బోధ యిాది - పాటించి కనరా॥ శివరామూల - పద్ధాతి యిదెరా॥ నరులు కొందరు బల్కి - రెరుకానుమ్రింగి యిా - పరిపూర్ణ మయ్యె మం - చెరు గాక చెడుటాకై - పాటించి కనరా॥ శివ రామూల - పద్ధాతి యిదెరా॥

తా. శిష్యా! అచల పరి పూర్ణమగు బట్టబ యలును, లేనటు వంటి యెరుకను, నిజగురు కటాక్షముచేత బాగుగా సంశయము లేకుండా సూక్ష్మజ్ఞప్తిచేత గ్రహించి, ఎరుక యే కాలమందు లేదనీ మునుపటి మాయ భ్రాంతిని విడిచి, సర్వకాలములయందు అచల పరిపూర్ణము శాశ్వతమైయున్నదని మనస్సులోదృఢపర్చుకొన్నయెడల అదియే పరి శుద్ధమైనబోధ యని లక్షణమని తె లు సు కొ ను ము, శ్రీశివ రామదీక్షిత సద్గురు ప్రభువుల బోధాపద్ధతి యిది యని తెలియుము, జనులు కొందరు యెరుకను సమూలముగా నాశనముచేసిన బట్టబయలు అయ్యెదమని చెడుటకై చెప్పుదురు, యేమనగా యెరుకకు మూలమేలేదు అట్టిదానిని నాశనము చేయుద మనుట అసంభవము, యిది అపభ్రమయే అట్టి మాటలు నమ్మకు, కాలా కాలములయందున్న అచల పరిపూర్ణ మగు బట్టబయలను వుండజూసి, లేని యెరుక యే కాలములయందు లేనిదని దృఢముగావుంటే అంతేచాలునని భావము. 17

123. కం. బిందువు తనువున బుట్టును - బిందువు తను వింద్రియ ముల - బృందంబసువుల్ - అందముగ గలుగునివి దే - నందున బుట్టి నవో తెలియు - నజునికి తరమా ॥ మూలములేని - వని తెలుసుకో సుము ॥ అందుకే బయలున్న - దరసి మూలములేని - బిందాది

కంబూః - పేరు దల్పకు తెలియ - నజునికి తరము ॥ మూలములేని -
వని తెలుసు కొనుము॥ ౧౮

తా. శిష్యా ! ఈ శరీరము వలన శుక్లమనెడి బిందువు పుట్టు చున్నది. అట్టి బిందువువలన శరీరమును, యింద్రియములును, ప్రాణ ములును అన్నియు-పుట్టినవి-శరీరమునకు బిందువు మూలము బిందువుకు శరీరము మూలము. యీ విధముగా పుట్టుటగాక వేరే విధముగా పుట్టు చున్నారని చెప్పుటకు బ్రహ్మదేవునికైనను అలవికాదు. య్యీ రెంటికి మూలము వేరే యెంకొంటి యున్నదని యనకుము. అందుకై నీవు అచల పరిపూర్ణ మగు బట్టబయలును యెరిగి మూలము లేనటువంటి బిందువును శరీరేంద్రియము లనెడి వాట్ల పేర్లను నిజమని భ్రమజెంద వలదు. బిందువనెడి ఆత్మను శరీరేంద్రియము లనెడి అనాత్మయును లేని వని దృఢముగా యుండుమని భావము. 18

124. కం. జనులనిరి దేవుడెవరికి - కనరాదని- నామరూప -
కర్మ జననముల్ - గన నతనికి లేవనియా - జనవాక్యము బయలు
కెపుడు - సహజమౌ వినరా ॥ అనుమానాము - చాలించికనరా ॥ కని
నామరూపాది, కమ లున్న యెరుకను - వినబోక కనబోక - విడచి
పెట్టర పోనీ - సహజమౌ వినరా ॥ అనుమానాము-చాలించి కనరా॥ ౧౯

తా. శిష్యా ! దేవుడు యెవ్వరికి కనబడడని యిట్టివాడని వర్ణించుటకు అలవికాదని ఆయనకు నామముగాని రూపముగాని కర్మముగాని జనన మరణములుగాని లేవని జనులు సహజముగా దేవుని యెరుంగకయే పలుకుచుందురు. అట్టి దేవుడే యీ అచల పరిపూర్ణమగు వుత్తబట్టబయలని నీకు సూచించితిని - అనుమానము లేక చూడుము అట్లు యీ వుత్తబట్టబయలును చూచి, నామము రూపము కర్మము జనన మరణములు గల్గిన యీ ఎరుక ప్రపంచములు నిజమని తలంచక యిది వుంటుందని భ్రమను జెందక వానివంకనైనా చూడక యెరుక యొక్క సర్వభ్రాంతిని విడచి యుండుమని భావము. 19

125. కం. అంతట గలదీ యెరుకని - యంతో వాదింపుచుందు - రెరుగని వారల్ - అంతట నింతట గనుపడు - నంతటిదేకాని యెరుక - అంతటగలదా ॥ అది నిజమైతే - యగుపడవలదా ॥ అంతాట గలదొక్క - అచలమే కానెరుక - నంతాట గలదాని - యనరాదు వినరాదు - అంతటగలదా ॥ అదినిజమైతే - యగుపడ వలదా । ౨౦

తా. శిష్యా ! ఎరుకయొక్క నిజమెరుంగని జనులు కొందరు యీ యెరుక అంతటను గలదని యెన్నోవిధములుగా వాదింపుచుందురు, యీ యెరుక అప్పటప్పట కనుపించుచు మరల కనుపించక మటు మాయగా పోవుచుగాని, అంతటను నిండి నిబిడీకృతమై శాశ్వతమై పుట్టుగిట్టులు లేనిదై యుండునదికాదు. బట్టబయలగు అచల పరిపూర్ణము అంతటను నిండి నిబిడీకృతమై చావుపుట్టుకలు లేనిదై శాశ్వతమై సర్వదేశ్య సర్వకాల సర్వవస్తువులయందు చెలించక యున్నది - యీ యెరుక అంతటా లేనిదై రాకపోకలు తరుగు విరుగులు చలనము గల్గినదై లేనిదైనది గావున యిట్టి దానిని వున్నదని యనరాదు. అట్టి అబద్ధపు మాటలు వినరావని భావము. 20

126. కం. బయలాకసమని కొందరు - భయపెట్టెద రందు వలన - భయపడకుసుమీ - బయలందు శబ్దమున్నను - బయలాకస మనుచు నమ్మబడని - నీచాటాశబ్దములేదీ - భ్రమయందుచాతా ॥ బయు లాకాశముగాదు - పరిపూర్ణమని నమ్మి - నయముగా యెరుకాను - నమ్మాక విడచిపో - బడని నీచాటా ॥ శబ్దములేదీ - భ్రమయందు చాతా ॥ ౨౧

తా. శిష్యా ! ఈ ఆకాశమే బట్టబయలని కొందరు మాయా వాదకులు శిష్యులకు బోధించుచుందురు. అట్టి మాయకుల మాటలు విని నీవు భయపడకుము. (ఆకాశస్యగుణోశ్శబ్దః నిశ్శబ్దో బ్రహ్మవుచ్యతే అని శృతి వున్నది) అందు వలన యీ బట్టబయలగు అచల పరిపూర్ణ

బ్రహ్మమునందు శబ్దమనెడి గుణముండినయెడల ఆకాశమని చెప్ప వచ్చును. శబ్ద గుణము యీ బట్టబయులుకు ఏమీలేదు. గాన యీ బట్ట బయలు ఎల్లప్పుడు రాకపోకలు లేక ఏ గుణములు లేక యున్నదని నమ్మి యీ యరుక యనే ఆకాశతత్వము ఏ కాలముయందు లేదని శబ్దగుణ కము గల్గినదని విడచిపెట్టిన చాలునని భావము ॥ 21

127. కం. కల మేల్కొ లెరుక బయలుల - కిల సామ్యము జేసి చూడు - మీ భ్రమ తొలుగున్ - ఫలమేమి పెక్కు చదువుల - వల నను జప యాగయోగ - వ్రతముల వలనన్ ॥ శమదమ మఖ - శత మూలవలనన్ ॥ తల క్రిందుగా బడ్డ - తనువునేగానన్న - కలమేల్కగని తా - నెక్కడ నిల్వనట్లై నె - వ్రతముల వలనన్ ॥ శమదమ మఖ - శతముల వలనన్ ॥ ౨౨

తా. శిష్యా ! యెరుకను కలకును, అచల పరిపూర్ణము మెలకువ కును పోల్చి చక్కగా విమర్శించిచూచిన, నీకు అందుగల నిజానిజం బులు తెలిసి భ్రమలన్నియు తొలగిపోవును. అనేక గ్రంథములు చదువుట చేత చిత్తవిభ్రమమే కాని యేమియు ఫలము లేదు. అదియునుగాక అనేకములైన మంత్రజపములు చేయుట, యోగాభ్యాసములు చేయుట యాగయజ్ఞాది క్రతువులు చేయుట, చాంద్రాయణాది వ్రతములు చేయుట, శమాదిషట్క సంపత్తిచేయుట, నూరు అశ్వమేధయాగములు చేయుట, తలక్రిందుగావుంచి తపస్సుచేయుట, తనువు నేనుకాను, ఆత్మయే నేనని తలపోయుట యివి అన్నియు యేమియు ప్రయోజన ములుకావు. అవి అన్నియు కలలోపనులేకాని కలను విడచి మెలకువలో పనులుకావు. మెలుకువలో యీ పనులు యేమియులేవు చేయుటకు వలనుపడదు, కలగని మేలు కొనిన కలలోదోచిన వ్యవహారికము అంతయు ఏమీలేనటుల, యీ అచల పరిపూర్ణమగు బట్టబయలును తెలసిన యెరుక యేమియు లేనిదై నిలువకుండా పోవునని భావము. 22

శుద్ధనిర్గుణతత్వకందార్థఉదరువులు - భావార్థములు

122. కం. నీకలలో నిను నన్నును - లోకుల లోకములజూచి - లోపలిభ్రమచే - నాకరుణ బడసి మేలుక - చేకొనికల కల్లజేసి - చేరె దవెటకో । సర్వము నీతో - చేరీని యుటకో ॥ ప్రాకటముగ బట్ట బయు లెరుక రీరీతి - నీకు దెలిసినమీద నిలువాక వే వే గ - చే రె ద వెటకో ॥ సర్వము నీతో - చేరీని యుటకో ॥ ౨౩

తా. శిష్యా ! నీకలలోవల నిన్నును నన్నును లోకులను లోకములను జూచి నీ మనస్సులో నిజమని భ్రమసి కలకాయుచున్నావు. అట్టి సమయమున నా కరుణామృతమనే గురుసూచనను పొంది, నీవు మెలకువ గల్గి యాకలను కల్లగాజేసి యెచటకో చేరెదవు అనగా బట్టబయలులో నుందువు. నీవనెడి యెరుకతోడనే సర్వమును యెచ్చటకో పోయెను గదా, అటువలె యీ బట్ట బయులు మెలకువగాను ప్రపంచ మనెడి యెరుక కలగాను పోల్చుకొని తెలుసుకొనిన మీదట దెలిసిన నీవనె యెరుకతో సర్వమును నిలుపకుండా యెచ్చటకో చేరును యని భావము.

129. కం. హరికర నఖముఖ విదళిత - కరిమస్తక గళితమైన - ఘనమౌక్తికముల్ - దొరికిన నెరుకలు గురిజలె - ధరియింతురు రెంటి విలువ - తమ రెరుగకనెకా ॥ అట్లనె బోధ - క్రమ మెరుగకనెకా ॥ పరి పూర్ణబోధాను - యెరిగింపుచుండిన - యెరుకాకె కొందారు - మరిగేది మర్మాము - తమరెరుగాకనెకా ॥ అట్లనెబోధ - క్రమమెరుగకనెకా ॥ ౨౪

తా. శిష్యా ! సింహము పంజాగోళ్ళ చేతను దంతముల చేతను జంపబడిన యేనుగు కుంభస్తలములోని విలువైె గొప్పవగు మంచి ముత్యములు మహారణ్యముల యందుండెడి కోయు, కొండ, గదబ, మొద లగు వారలకు ఆ మంచిముత్యములు దొరికిన యెడల గురిగింజల పేరుల వలె వాటిని ధరింతురు, యెందువలననగా గురిగింజల పేరు యొక్క విలువ యెంతయో యీ మంచి ముత్యముల విలువయెంతయో గ్రహించ లేక సమముగా పోల్చుకుందురు, అటువలెనే కొందరు వివేక సూన్యులు

అచల పరిపూర్ణబోధ పొందియు అబోధయొక్క అధికృతను గ్రహించ లేక యెరుకయొక్క మార్గముల యందు మరిగి విడువలేక పరిపూర్ణమగు బట్ట బయలును నమ్మి అనుసరించలేక చెడిపోవుదురని భావము. 24

130. కం॥ తనువో బహిరింద్రియములో - మనసో ప్రాణములో విషయ - మమతో నేనం - చని నీవని యన నిదియని - యనుమా నించెదవదేల - అది ద్రోవగాదూ ॥ నీవెన్నాడు - ఇది వినలేదూ ॥ వినుమీ పరిపూర్ణము - గనిలేనియామీది - తనువాదికమును లేం - దని గురునిచే దెలియు - మది ద్రోవగాదూ ॥ నీవెన్నాడు - యిది వినలేదూ ॥ —అ౩

తా. శిష్యా ! అచల పరిపూర్ణ మనగా యీ స్థూలశరీరమా, శ్రోత్రత్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణములను జ్ఞానేంద్రియములా, మనస్సా, పంచప్రాణములా, శబ్దస్పర్శ రూప రస గంధములును అరిష డ్వర్గములను విషయములా, అంతయు నాదనుకొనే ప్రేమయా, నేనను చున్నదా, నీవనుచున్నదా, పలుకకూడనిదా, యిందేదియో సంశ యములేకుండా జెప్పుము, నేను చెప్పబోవునది నీవనుకొనే దానిలో యేదియును కాదు. నీవు ఈ అచల పరిపూర్ణ బోధను యెప్పుడు విన లేదు - నేను బోధించునది అశ్రద్ధలేక చక్కగా వినుము. నిజగురు కటాక్షము పొంది అచల పరిపూర్ణమును దర్శించి, అటుపై యింద్రియ సమూహంబనె తనువును, నేననబడు యెరుక లేక ఆత్మయు లేనిదని గురుకటాక్షముచే పరిపూర్ణ బోధనొంది దృఢమైయుండుట సరియైన పద్ధతియని భావము. 25

131. కం. నినునను ప్రపంచమును, జగ మని యెరిగే యెరుక చాత నచల - మును గనుంగొని - నినునను జగమును జగ-మని యెరిగే యెరుక మాను - మమలవివేకా ॥ చాలునీ వీ క్రమమెరిగి నాన్నా ॥

నిను నన్ను పై రెండింటిని విశ్వమునక బయు - లనకుండె గున్నాదం -
చనగుర్తు లేకుండు-మమలా పివేకా ॥ చాలునీ వీ క్రమ-మెరిగినావ్వా॥ ౨౬

తా. మూడు మలముల విడచిన శిష్యుడా ! నిన్నును, నన్నును ప్రపంచమును నిజమని యెరింగెడి ఎరుక చేత అచల పరిపూర్ణమగు ఈ వుత్త బట్టబలునుజూచి, నిన్నును నన్నును ప్రపంచమును నిజమని ఎరిగే ఎరుకను తక్షణము విడువుము. అణవమల, మాయామల, కార్మికమలములను విడచి సూక్ష్మజ్ఞ గలిగిన బుద్ధిమంతుడా నీవీ పద్ధతిగా తెలుసుకొంటేచాలును. నీవని నేనని ప్రపంచమని ఈ అచల పరిపూర్ణమగు బట్టబయలు యేమీ యనకుండా యుండెను. అటువలె నేను నీవనెడి గుర్తు అనే ఎరుక లేకుండా వుంటే చాలునని భావము. 26

132. కం. పొద్దున నిద్దుర మేల్కని - వద్దికి యేతెంచి గురుని-వక్త్రజనితమౌ - శుద్ధులు మ్రొక్కివినుము యే - ప్రొద్దిది ఒహుముద్దుసుమ్మీ ॥ పుట్టినందులకూ ॥ గురుచరణాము - పట్టినందులకూ॥ నిద్రామౌ శక్తిచే - నీవిట్లు జేసితే, దిద్దితీరిచి బోధ - తెరవూజూపును నీవు - పుట్టినందులకు ॥ గురుచరణాము పట్టినందులకూ ॥ ౨౭

తా. శిష్యా ! తెల్లవారిన వెంటనే నిద్రనుండి లేచి నిత్యకర్మములు దీర్చుకొని శ్రీ సద్గురు స్వాములవారి యొద్దకుంబోయి ద్వాదశ సాష్టాంగ నమస్కారంబులనుజేసి, యా మహాత్ముని వాక్కున వచ్చెడి అమృత వాక్యంబులనియెడి శుద్ధులను, నత్యంతాసక్తితో భయభక్తి విశ్వాసములుగల్గి మ్రొక్కుచు వినుము, ప్రతిరోజూ యీవిధముగా నీవు చేయుటచే మనుష్యుడవై నీవు పుట్టినందులకు గురుచరణములు పట్టినందులకు యిదియే సార్థకమైనపని, యీలాగు నిత్యము చేయుచుంటివేని సద్గురుమూర్తికి నీయందు కరుణగల్గి అచల పరిపూర్ణ బోధను దిద్దిదీర్చినటుల చక్కగా బోధచేయును, అందువలన త్రికరణ శుద్ధిగలిగిన భక్తుడవై జనన మరణములు లేకుండా ప్రకృతియనే ఎరుక నంటకుండా జన్మసాఫల్య మగుదువని భావము. 27

133. కం. గురుడు పరిపూర్ణము జూ - పెరుకను తేండనుచు దెల్పి - యిక దల్పకుమం - చెరిగించక నిడిపోవునె - యెరుక నరుల్ సాధనములు - యెన్ని జేసినను॥ లక్ష్యము ముద్ర - లెన్ని జూచిననూ॥ హరహరి బ్రహ్మ - మరాసుర ముఖులైన - ధరణి సురాద్యష్ట - దశ జాత్యుద్భవులాను - యెన్ని జేసిననూ॥ లక్ష్యము ముద్ర - లెన్ని జూచిననూ॥ ౨౮

తా. శిష్యా! శ్రీమదచల గురుమూర్తి అచల పరిపూర్ణమిది యని యీ వృత్తబట్టబయలును సూచించి, యీ గుర్తెరిగెడి యెరుక యేమియు లేనిదని తీర్మానించి యే తేనటువంటి యెరుకను మరలతలంచ వలదని గురుడు బోధించకుండిన, యీ యెరుక యెంతటి వారికైననూ విడిచిపోనేరదు. ఈ రహస్యము నెరుంగక నరులు కొందరు ఎరుక పోవుటకై లక్ష్యములను ముద్రలను యోగములను యెన్నియో జేయుచు చూచుచుందురు. ఈశ్వర విష్ణు బ్రహ్మలను త్రిమూర్తులను ఇంద్రా యక్ష కిన్నర గరుడ గంధర్వ కింపురుష పన్నగ రాక్షసులను సేవించినను, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర చండాలాదిగల పదునెనుమిది కులములలో పుట్టిన వారికైనను, గురుడు యెరుకను విడిపించకుండిన యడల వారలకు ఆ యెరుక విడువ నేరదని భావము॥ 28

134. కం. బల ధన విద్యా ధైర్యం - బులు చక్కదనంబు సత్వ - బుద్యాద్యుతులన్ - కలలో యివి లేని మను - ష్యుల జగ మును తనను తాను - జూచి మానవుడూ॥ మేల్కనెనేని - చూడాలే డొకడూ॥ కలమేల్క లెరుక బయ - లుల కట్ల జతగూర్చి - కల ఎరు కలను - దేశికులచె వీడితె జూలు - చూచి మానవుడూ॥ మేల్కనెనేని చూడా లేడొకడూ॥ ౨౯

తా. శిష్యా! శరీరముయొక్క బలము ధనము విద్యయును ధైర్యము చక్కదనము లేక అందము సత్వగుణమును శాంతమును

బుద్ధియును ప్రపంచముతో యీ మొదలైనవి సర్వమున్నూ కలలో వంటివి కలలో మనుష్యులను భార్యయును బిడ్డలును యేనుగులునుగుర్రములును రాజ్యమును సంపదయును శిరియును దాసదాసీజనంబులును ప్రపంచమును తననుజూచి కలలో నిజమని భ్రమసి మెలకువరాగా యివి అన్నియు యేమీ లేకుండా ఎచ్చటకు పోయెను వొక్కటియైనను అపురుషుడు జూడనేరడు, ఈలాగుననే అకలకు యీ ప్రపంచము ఎరుకను జతగాపోల్చి, మెలకువకు యీ బట్టబయలు జతగాపోల్చి, అట్టి అచల పరిపూర్ణమును సద్గురు స్వామికరుణచే దర్శించి కలవంటి ఎరుకను దేశిక స్వాములవారి వలన విడచిపోతేచాలును, ఏ పురుషుండైనను కలనుండి మేల్కనిన వెనుక కలయందు గనుపించినవాటిని మరల చూడనేరడు అట్లు గురుమేల్క నీకు అబ్బినయడల యీ ప్రపంచము కలవలె కాన్పించనేరదని భావము॥ 29

ఇతి॥ శ్రీ మద్భావగత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణ
మూర్తి విరచితె తాత్పర్య భావార్దె సకల మతలక్షణ
న్నామ సప్తమోద్యాయః

---

*** అ ప రి పూ ర్ణ బో ధ • ౨౬ • 26 ***

135. కం. ఈ వుత్తబట్టబయలును - నీ విప్పుడు వుండజూచి - నిజముగ యెరుకన్ - నీవని నేనని జగమని - భావింపును పిదప దీన్ని భాయు మనిశమున్ ॥ నిజముగ దీన్ని - భాయ కనిశమున్ ॥ శ్రీ వనితేశ్వరాజీవ - సంభవ భవ - దేవేంద్రాదుల నింక - సేవించుతలపేల - భాయూమనిశమున్ ॥ నిజముగ దీన్ని - భాయ కనిశమున్ ॥ ౧

తా. శిష్యా! ఈ వుత్తబట్టబయలైన అచల పరిపూర్ణమును యదార్థముగా నీవు జూచితివిగదా, అచూచిన ఎరుకయే నీ వనియు

నేననియు ప్రపంచమనియు విచారించి విచారించిన ఎరుకను సమూల ముగా విడిచిపెట్టుము. లక్ష్మి సరస్వతి పార్వతి మొదలగు శక్తులను ఈశ్వర జీవఖర్మములను దేవేంద్రాది దేవతలను కోర్కెల కొరకై ఆశించి సేవించకుము, ఎల్లప్పుడు ఈ వుత్తబట్టబయలగు పరిపూర్ణమును మరువక అన్ని వేళల ఆ ధ్యానలోవుండి, ఎరుకను యేసమయమందైన గుర్తు రానీయక విడచి యుండుమని భావము. 1

136. కం. లేదనకు మున్నదదుగో - నే దెలసితి ననకుదీన్ని -నీవె రిగేవా - కాదది నీచే దెలియను - యేదిర తన్మాత్రసమితి - యీ బట్టబైటా ॥ దీనికిసాటి - దేది ఎచ్చోటా ॥ వాదేల లే నెరుకతో - దీన్ని గనిపెట్టి - పోదొట్టు మెరుక నిం - కేది బట్టదు చాలు - ఈ బట్ట బైటా॥ దీనికి సాటి దేది ఏచ్చోటా॥ ౨

తా. శిష్యా ! కేసలాత్మయగు ఈ వుత్తబట్టబయలును లేద నకుము వున్నదదిగో చూడుము. నేను తెలిసితినని చూచితినని చెప్ప కుము, నీవు చూచుటకు తెలుసుటకు అది సాధ్యముకాదు ఏమనగా దానియందు శబ్దస్పర్శ రూపరసగంధ తన్మాత్రలులేవు యిట్టిదని నిర్దే సించుటకు వచించుచుటకు అలవికానిది "యతోవాచా నివర్తంతె అప్రా వ్య మనసాసహ" అని వున్నది. అయ్యది మితిమేరలు లేక అంతటను దట్టమై సూదిమొన మోపసందులేక ఎల్లకాలములయందు నిండియు న్నదే యీ వుత్తబట్టబయలు దీనికి సాటియైనది యింకొకటీలేదు, ఎరుక కలిగి వాదములు చేయక అచల పరిపూర్ణ బ్రహ్మమును సందర్శించిన యీ యెరుక పోతుందని వొట్టుబెట్టి చెప్పుచున్నాను. గాన ఎరుకను యెందును నిల్వనివ్వక పారదోలుము, నిన్ను ఎరుక సంబంధమగు భ్రాంతాది సంకల్పములు వృత్తులు పొందనేరవని భావము॥ 2

137. కం. కనవచ్చి యిట్టిదట్టిది - యని యనరాకుండు బయలు - నదె కనుగొనుమీ ॥ కనరాకపోతె శూన్యం - బను మిట్టిది

యట్టి దనుచు - పలుక వచ్చిననూ॥ యెరుక దాంట్లో - పలికి జొచ్చి
ననూ॥ వినుమా బయలునూ - నీవేమనినా నొప్పెదగ - నొప్పును
నీమాటను నే - జెప్పినరీతి గనవస్తే - పలుకవచ్చిననూ॥ యెరుక
దాంట్లో - పలికి జొచ్చిననూ॥ 3

తా. శిష్యా ! ఈ కండ్లకు యీ వుత్తబట్టబయలు కనబడక జ్ఞాతయైన యీ గుర్తెరిగే శరీరముకు కనబడుతూ శాశ్వితమైయున్నటు వంటి యీ వుత్తబట్టబయలును, యిట్టిది అట్టిదియని చెప్పుటకు ఎవ్వరికి అలవికాని దానిని గనుగొనుము॥ నీవు అట్టి అచల పరిపూర్ణమగు బట్ట బయలును గుర్తించలేకుండిన శూన్యమని చెప్పుము. ఏమనగా అయ్యది ఎరుపు తెలుపు నలుపు నీలము జ్యోతి చైతన్యము పొట్టి పొడవు లావు సన్నము స్థూలము దీర్ఘము వర్ణము రూపము చీకటి వెలుగు గుణము ఆకారములు లేనిది. యిట్టిదనిగాని అట్టిదనిగాని పోల్చుటకు అలవికానిది, అదిసూన్య మెన్నటికికాదు. దానిలో వున్నా ననుకొనె యీయెరుకయే శూన్యము. యీ యెరుక ఆ బట్టబయలును చూడవలయునని ప్రయ త్నించి తానే శూన్యమైపోవును. బట్టబయలు పోవునది వచ్చునదికాదు దానిని శూన్యమని నీవు చెప్పినను నేను వొప్పుకొనను నా అజ్ఞ ప్రకా రము వున్నటువంటి బట్టబయలును దర్శించి లేనటువంటిదిన్ని శూన్య మైనదియైన ఎరుక భ్రాంతిని విడచి పరిపూర్ణమును విడువకుమని భావము. 3

138. కం. కనవొచ్చు బయలు లేదని - యనవచ్చునె చీ -
యనరాదు యెరుక కెన్నడు - కనుకనె యీ బయలు యెల్ల -
కాలముంచుందీ॥ దీనందెరుకే - కాలముకాలాముల్లేంది॥ వినుమీలేనెరు
కాను - వివరించ శూన్యమౌ - అనుమానమే మెరుక - గను విశ్వ
మట్టిదే - కాలముంచుందీ॥ దీనందెరుకే - కాలములెందీ॥ 4

తా. శిష్యా ! ఈ వుత్తబట్టబయలగు కేవలాత్మను ప్రత్యక్షముగా చూడవచ్చును, త్రికాలములయందు సర్వదేశ్యములయందు సర్వవస్తువులయందు కనిపించే ఈ అచల పరిపూర్ణమగు బట్టబయలు లేదని యెట్లు చెప్పవచ్చును. గుణరూప వర్ణ భేదంబులు అద్దానికి కలవని ఏలాగు చెప్పవచ్చును. ఛీఛీ యెరుక యేకాలముయందును వున్నదని చెప్పకూడదు. వర్ణ గుణ రూపనామ భేదంబులు గల్గినది యెరుక గావున యే కాలముయందు లేదని దృఢముగా చెప్పవచ్చును. ఈ అచల పరిపూర్ణ మగు బట్టబయలు ఎల్ల కాలములయందు ఏకరీతిగా వున్నదని సిద్ధాంతము ఈ బట్టబయలుయందు ఎరుక యే కాలముయందు లేదనే సిద్ధాంతము ఏమనగా మూలము లేనటువంటిది యెరుక గావున దీనిని ఆ మూలాంతము విచారించి చూచిన శూన్యమగును. ఈ ప్రపంచము ఈ ఎరుకవల్ల కలిగినదౌటచే ఈ ప్రపంచముకూడా శూన్యమే అవును. ప్రపంచము పుట్టినను పెరిగినను నశించినను ఈ వుత్తబట్టబయలు దీని వలె పుట్టుచావులు గలిగినది కాదని భావము॥ 4

139. కం. పరిపూర్ణమనిన ఎట్టిదో - ఎరిగెదనని ఎరుకబైట - కేగిన ఎరుకే - ఎరుకకు శూన్యంబయ్యెను - ఎరుకను జన్మించినట్టి - ఈ విశ్వమంతా ॥ ఎరుకవలెనే - ఏమీ లేదంతా ॥ ఎరుక వుండగానే ఎరుక విశ్వములు లే - వెరుకాకే యిదిజూడ - ఎంతోవింతైతోచె - ఈ విశ్వమంతా ॥ ఎరుకవలెనే - యేమి లేదంతా ॥ ౫

తా. శిష్యా ! ఈ వుత్తబట్టబయలగు కేవలాత్మ ఎట్టిదో జూడ వలయునని ఎరుక తలంచి ఆ పరిపూర్ణమును జూచి అందు తాను నిలువలేక ఎరుకే లేకపోయెను. ఎరుకవలన పుట్టిన ఈ ప్రపంచమంతయు ఆ ఎరుకతోడనే శూన్యమాయెను. ఎరుక లేనిదగుటచే దానితో వచ్చినది దానితోడనే పోవును. ఈ ఎరుక తన్నును ప్రపంచమును ఎంత నిజమోయని విచారించి చూచుకొని తన ముచ్చట తనకే వింతగా

తోచి లేనిదాననని తానే పోవును. ఎరుక పోయిన యడల సర్వము దానితోడనే యేమియు లేకుండా పోవునని భావము॥ 5

140. కం. గురుమూర్తి జూపకున్నను - పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షమగున్ - గురుమూర్తి జూపెనేనియు - పరిపూర్ణము తనకు లెస్స - ప్రత్యక్షమౌరా॥ చూస్తునె ఎరుక - పారిపోవునురా॥ ఎరుకా పోయిన వెనుక - ఎవరా ప్రత్యక్షాన్ని - ఎరిగిట్టి దట్టిదం - చెరిగే వారటుమిద - ప్రత్యక్షమౌరా॥ చూస్తునె ఎరుక - పారి పోవునురా॥ ౬

తా. శిష్యా! అచల పరిపూర్ణ బ్రహ్మమగు ఈ వృత్త బట్ట బయలు తాను ఎంత ప్రజ్ఞావంతుడైనను సద్గురుమూర్తి కరుణగల్గి జూపకున్న తనకు ఎన్నడూ కాన్పించదు. అచల గురుమూర్తి కరుణగల్గి జూపినయడల ఆ క్షణమే కరతలామలకమువలె బట్టబయలు లెస్సగా కాన్పించును. అలాగు చూచినటువంటి ఎరుక ఆ క్షణమే పారిపోవును అచల పరిపూర్ణ బ్రహ్మమును జూచిన ఎరుక పోయిన తరువాత ఆ పరిపూర్ణము వున్నదని గాని లేదనిగాని శంకావాదములు చేయుటకు అటుపై ఎవ్వరును లేరు అనగా గుర్తించిన తానేలేడు గావున పలుకుటకు యింకొకరు లేరని భావము. 6

141. కం. పరమపదమనిన బయలన - గురు గుహ్య మనంత మనిన - గోప్యంబనినన్ - పరిపూర్ణ మచల మనినను - తిరమనగా బట్టబయలు - తెలియుమాయప్పా॥ యీా తెలిసిన - తెలివిమానప్పా॥ ఎరుకా నెరుగనిదన్న - నెరుకా మీరినదన్నా - ఎరుకా మరుపులు లేని - పరవస్తువన బయలే - తెలియుమాయప్పా॥ ఈ తెలిసిన - తెలివిమానప్పా॥ ౭

తా. శిష్యా! పరమపదమనినను బట్టబయలుయనినను గురుగుహ్యమని (రహస్య) మనినను అనంతమనినను గురుగోప్యమనినను పరిపూర్ణ

నను అచలమనినను స్థిరమనినను బట్టబయలు యనినను ఈపేర్లన్నియు ఈ వృత్తబట్టబయలుకే యని తెలియుము. యిట్లు తెలిసిన తెలివియనే గురుతును విడువుము. ఎరుక యొక్క పుట్టుగిట్టుటలు కలిమిలేములు మొదలగు ద్వంద్వములు తెలియని బట్టబయలనిన ఈ గుర్తెరిగెడి ఎరుకకు అతీతమైయున్న బయలనినను ఎరుక మరపులులేని పరవస్తువనినను ఈ వృత్తబట్టబయలేయని తెలియుము. ఈ బట్టబయలను తెలిసిన గుర్తుయగు ఎరుకను విడువుమని భావము॥ 7

142 కం. బట్టబయలనుచు దీనికి - మొట్టమొదల్ పేరు లేదు ముదమున ఎరుకే పుట్టి పేర్పెట్టి దానిని - పట్టుకల వ్వాడలేక - పారిపోవునురా ॥ కనరాదిందు - దూరానేరదురా ॥ పుట్టిచచ్చుచు మళ్ళీ - బుట్టిగిట్టుచుబుట్టు - నిట్టి తిప్పలునొందు - ఎరుకే బయలును జూస్తే - పారిపోవునురా ॥ తనరాదిందు - దూరానేరదురా ॥ ౮

తా. శిష్యా! ఈ అచల పరిపూర్ణమునకు బట్టబయలని మొట్ట మొదట పేరు ఏమీలేదు - ఎరుక తనకు తానే పుట్టి ఈ అచల పరిపూర్ణమునకు ఈ వృత్తబట్టబయలని తానే పేరుబెట్టి పరిపూర్ణమును పట్టుకొని దానియందుండవలెనని తలంచి తాను కనబడకుండా పోవుచున్నది. ఈ ఎరుక అచల పరిపూర్ణముయందు చొరబడలేక పుట్టుచు చచ్చుచు। మరల పుట్టుచు గిట్టుచుయుండును॥ యిట్టి బాధలను పొందుచున్నటువంటి ఎరుక అచల పరిపూర్ణ మగు బట్టబయలును దర్శించిన యడల మరల పుట్టనే పుట్టదని భావము ॥ 8

143. కం. వినుము నేననుచు ఎరిగే - తనువందునలేక బయలు - తానిండినదౌ - కనుగొనుమది కనుగొని ఈ - తనువును విడనాడుమింతే - తడువేలనోయీ॥ యీ పనికింక - గడువేలనోయీ॥ అనుమానముంటే నీ - వరయూము - శివరాము - లను శిక్షితులు జేసే -

నచలా గ్రంథము నంత - తడువేలనోయీ॥ ఈ పనికింక - గడువేల నోయీ॥ ౯

తా. శిష్యా ! పరాకు లేక చక్కగావినుము. నేను నేనని పలుకుచు సర్వమును గుర్తెరుగుచున్న నాల్గవదేహమగు మహాకారణ శరీరమను ఎరుకయందు యీ పుత్తబట్టబయలులేదు. యీ పుత్తబట్టబయలు తాను సర్వదేశముల యందు సర్వవస్తుల యందు అంతటను పరిపూర్ణముగా నిండియున్నది కనుగొనుము॥ సర్వమును గుర్తించెడి గురుతుచేతనే ఈ పుత్తబట్టబయలును కనుగొని ఈ గుర్తించెడి తెలివి యనే నాల్గవశరీరమగు యెరుకను విడువుము॥ అట్లు విడుచుటకు ఆలస్యమెందులకు గడువు ఎందులకు॥ నేను చెప్పిన ఈ బోధయందు నీకు అనుమానమగు సందేహమున్న యడల మాకు పెద్దలైన అచలగురు సార్వభౌములగు శ్రీ శివరామ దీక్షితులవారు రచించిన బృహద్వాశిష్టమను అచల గ్రంథమును చూచిన యెడల నీకుగల సందేహములు నివర్తియగునని భావము॥ 9

144. కం. దేహాకారముగానిది - యహంభావంబు లేని - దఖిల జనులుదా - సోహంసోహంబనినను - మోహము జెందనిదిబైలు - మొదలెరుగవలెరా॥ యెరిగిన ఎరుక-తుదకెరుగవలెరా। కోహంకత్వంబాని - కూతాలూగాసేటి - దేహిదేహములాను - తెలియాను యీ బైలు - మొద లెరుగవలెరా॥ ఎరిగిన ఎరుక - తుదకరుగవలెరా ॥ ౧౦

తా. శిష్యా ! ఈ పుత్తబట్టబయలు స్థూలసూక్ష్మకారణ మహాకారణ శరీరము లనెడి జీవతనువులుగాని విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృత మూల ప్రకృతులనెడి ఈశ్వరతను చతుష్టయములలోగాని యేదియు కాలేదు. వెనుక అయివుండలేదు. యిప్పుడుకాలేదు. ముందుకాబోదు నేననె అహంకారముగానిది పల్కులేనిది, సర్వజనులు సోహంసోహం బని పలుకుచుండినను దానియందు పరిపూర్ణము కలిసి యుండలేదు. అట్టి కలియక సంతోషములు లేని బట్టబయలు ఎట్టిదో దానివునికి తెలియు

వలెను. శాశ్వతమైయున్న బట్టబయలును తెలిసి తెలిసిన ఎరుకలేకుండా పోవలెను, దేహమువేరు దేహివేరు నీవువేరు నేనువేరు అని పలుకుచున్నటువంటి నేను మేనులు ఎట్టివో ఎరుగనటువంటి ఈవృత్తబట్టబయలును దర్శించిన ఎరుక వెంటనే విడిచిపోవలయుననని భావము. 10

145. కం. ఏ వస్తువచాతను దా - నా విర్భవమొందు దేహమనుతరువరయన్ - ఆ వస్తువె దానికివి - త్తై వెలయును దాన్నె సాక్షి - ద్రష్టానికనుమీ ॥ ఎరుకయిదె - స్పష్టానువినుమీ ॥ భావించిచూడుమీ బట్టబయలను భూమి - యావిత్తుచెట్టున్న - దరయాదవిత్తూనే - ద్రష్టానికనుమీ॥ ఎరుకయిదె - స్పష్టామువినుమీ॥ ౧౧

తా. శిష్యా ! ఏ ఎరుక చేతను ఈ దేహమనెడి చెట్టుపుట్టుచున్నదో ఆ ఎరుకే ఈ చెట్టునకు వి త్తనమైయున్నది. ఈ వి త్తనమును సర్వసాక్షియునియు ద్రష్ట అనగా సర్వమును చూచుచు గుర్తించుచున్నదనియు, ఎరుక అని యదార్ధము వినుము. ఈ వృత్తబట్టబయలును భూమిగా పోల్చి, దీనియందు ఈ చెట్టును వి త్తనమును ఈ భూమి ఎటులనెరుంగదో అటుల ఈ దేహిదేహములగు నేను మేనులనెడి శరీరాత్మలను ఈ వృత్తబట్టబయలగు అచల పరిపూర్ణము ఎన్నడూ ఎరుంగదని భావము. 11

146. కం. ఏ పరిపూర్ణము మేనికి - లోపల వెలినిండి యుండు - లోపములేకన్ - ఆ పరిపూర్ణమే జగతికి - లోపల వెలినుండు దాని - లోనెవున్నవిరా ॥ పై రెండెవ్వి - లేనివెన్నకురా॥ ఈ పూర్ణబోధచే - పై ప్రపంచశరీర - రూపము లెడబాపు - యీా పట్లనే దాని - లోనెవున్నవిరా ॥ పై రెండెవ్వి - లేని వెన్నకురా ॥ ౧౨

తా. శిష్యా ! ఏ అచల పరిపూర్ణమగు బట్టబయలు ఈ స్థూల శరీరమునకు లోపల వెలుపల సందులేక నిండియున్నదో, ఆ లాగునే ఈ వృత్తబట్టబయలు ఈ ప్రపంచమునకు లోపల వెలుపల విండియున్నది. అనగా ఈ వృత్తబట్టబయలులోనె స్థావరజంగమ క్రిమికీటక పశుపక్షి నర

మృగదేవ తిర్యగ్ సంఘాతమగు సర్వమున్నూ లేనివే యున్నటుల కనిపించుచున్నవి. ఃయీ శరీర ప్రపంచములు రెండును యీ బట్టబయలు యందు లేనివే యున్నటుల కనిపించుచున్నవి. యీశరీరప్రపంచములు రెండును యీ బట్టబయలు యందు లేనివే వాటిని వున్నవని భ్రమ జెందకుము. యీ అచల పరిపూర్ణ బోధచే పై ప్రపంచ శరీరములనెడి రెండు రూపములను విడిచిపెట్టుము, బట్టబయలు ఎప్పుడు విడువబోకు మని భావము. 12

147. కం. ఎరుకనగా యెరుగేటిది - మరుపనగా యెరుక తనను మరచుట మీ రెం - ట్నెరుగనిదె బయలివి నీ - వెరిగెరుకను మరుపునివ్వి - డెరుకాచేవిడరా॥ వీడితె పై మా - టెరిగేదెవ్వడురా ॥ యెరుకే పరిపూర్ణ మం - చెదిరించి వదరేవు - పరిపూర్ణమైతె చూవర - బయలందున దాన్ని - యెరుకాచే విడరా ॥ వీడితె పై మా టెరిగే దెవ్వడురా ॥ ౧౩

తా. శిష్యా ! ఎరుకనగా సర్వప్రపంచమునను తనను యిట్టి దట్టిదని గుర్తించి యెరుంగునది మరుపగా తనను ప్రపంచములోగల వస్తు జాలంబులను మరచునది యెరుక మరపులు రెండును లేనిదే యీ వుత్త బట్టబయలుయైన అచల పరిపూర్ణము యీ యెరుక మరలపును యెరుక చేతనే విడచిపెట్టుము. అలాగు విడచిన యెడల అచల పరిపూర్ణమును ఎరుగుటకు ఎవ్వరునులేరు. ఎరుకే పరిపూర్ణ మగునని నా మాటను తిరస్కరించి మాట్లాడకుము. అచల పరిపూర్ణము ముందెన్నడు యెరుకై వుండలేదు. గావున ఎరుక పరిపూర్ణము ఎన్నటికిని కా నేలదు. ఎరుకే పరిపూర్ణమైన యెడల ఈ వుత్త బట్ట బయలులో ఆ ఎరుకను జూపింమమని భావము. 13

148. కం. లేదన్నను కనుపడుగద - నే దెలసితినని బైట - నే నిల్వదుగదా - నే దీని వెనుక గద నా - కేదో మూలంబు యిదిగా - దిక లేదెచ్చోటా ॥ కనుకనెవుళ్ళ - క్కి నేనన్నాటా ॥ యేదిలేదిది దప్ప

నే దెలియనిది యని - తా దెలుసుకొని ఎరుకే - తనను వీడితె జాలు యిక లేదెచ్చోటా ॥ కనుకనే వుళ్ళక్కి నే నన్మాటా ॥ ౧౪

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయలగు అచల పరిపూర్ణము ఎట్టిదో తెలియని వారలు లేదన్నను లేకపోదుగదా తెలిసినవారలకు ప్రత్యక్షముగా కనిపించుచున్నదిగదా నేనను ఎరుక అచల పరిపూర్ణ మును తెలుసు కొందునని ఆ అచల పరిపూర్ణమును గుర్తించి దాని యందు నిలువలేక పోవుచున్నది. నేనను ఎరుక యీ బట్టబయలునకు వెనుక తనకు తానే వచ్చినది. నేనను యీ ఎరుక యీ బట్టబయలు తనకు మూలము గాదని తాను స్వయంభుఃవని (అనగా తనకు తానే వుట్టుట) విచారించికొని ఎచ్చటను నిలువలేక పారిపోయెను. అందు చేత ఈ ఎరుకను వుళ్ళక్కని అనగా లేనిదని చెప్పవలసివచ్చెను, ఈ వృత్త బట్టబయలు తప్ప మరి యేమియు లేదని నేను దానియందు వుండు టకు వీలు లేదని ఎరుక విచారించుకొని యీ ఆలోచన చేసిన ఎరుకే విడిచిపోతే జాలును మరి యేమియు నుండదని భావము. 14

149. కం. సత్యమగు బట్టబయలు న - సత్యంబగు ఎరుక నెరిగి - సద్గురు కృపచే - సత్యముగాదని ఎరుకను - సత్యముగా నమ్మి యుంటే - చాలుచాలన్నా ॥ వానితోటి - సాటెవ్వరన్నా ॥ నిత్యానిత్య ములనే - నిర్ణయమెరుగాక - నిత్యుడై యుండేటి-నిజబోధ గలిగితే - చాలుచాలన్నా ॥ వానితోటి సాటెవ్వరన్నా ॥ ౧౫

తా. శిష్యా ! సత్యమైనటువంటి యీ వృత్తబట్టబయలును, అసత్య మైనటువంటి ఎరుకను యీ రెండింటియొక్క విచారణలను సద్గురు కటాక్షంబున తెలుసుకొని. ఎరుక సత్యముగాదని అనగా లేనిదని త్రికరణశుద్ధిగా లేక సత్యముగా ఎరుకను నమ్మక యుంటె అంతే చాలును, అట్టి గురుపుత్రుని తోటి సమముగా పోల్చుటకు మరి యెవ్వరును వుండరు. యీ వృత్తబట్టబయలు నిత్యమై సత్యమై శాశ్విత

మైయున్నదని నమ్మి, అనిత్యమై అసత్యమై అశాశ్వితమై ప్రపంచ దేహి దేహములుగా కన్పించుయెరుక యని రెండింటి నిర్ణయములను తెలుసు కొని, యిది నిత్యమని యిది అసత్యమని యెరుగని స్థితిగలిగి నిత్యుండై యుండెడివానికి సాటి మరియెవ్వరును లేరు. అచల పరిపూర్ణ బోధ యొక్క ధర్మమర్మములు సద్గురుస్వామిచే నెరింగి నడచుకొనువానితో సమాను లెవ్వరును నుండరని భావము. 15

150. కం. పరిపూర్ణములో దోచిన - యెరుకే కలలేని యెరుక - నెరిగి మృషని యీ - మరుగెరుక కెరుక దెల్పిన - యెరుగుటమే మేల్క సుమ్మి - యిది యామారకుమీ ॥ సద్గురువాజ్ఞ - కెదిరి మీరకుమీ ॥ యెరుక యీ రీతిగ - యెగిరిపోయిన వెనుక పరిపూర్ణ మొకటుండు పలుకరా దెట్లందు - నిది యామారకుమీ ॥ సద్గురువాజ్ఞ - కెదిరి మీ రకుమీ ॥ ౧౬

తా. శిష్యా ! ఈ వృత్తబట్టబయలులో లేకనే వున్నటుల కనిపిం చెడి యెరుక కలలో కన్పించిన యెరుకవంటిదేకాని నిజముకాదు. కలలో కన్పించిన శరీరాలకు యెంతమూలమో యీ శరీరాలకు అంతే మూలము, అచల పరిపూర్ణమును యెరుగబోయిన యెరుకే తాను యెచ్చటను కనుపించక మటుమాయుగా పోవుచున్నది. యీలాగు యెరుకయొక్క మర్మమును తెలుసుకొన్న యడల అదియె ఎరుకకు మెలకువ ఈమాట యెప్పుడును మరచి యుండకుము. సద్గురు ప్రభువుల అజ్ఞను ఎదిరించి నడవకుము. ఎరుక యీ తీరుగ తెలుసుకొని దేహభ్రాంతి, ప్రపంచ భ్రాంతి పోయిన తర్వాత యిట్టి ట్టిదని నిర్దేశించుటకు వీలులేక అవాఙ్మా నస గోచరమైన అచల పరిపూర్ణము యున్నదని చెప్పుటకు ఎరుకకు పలుకులేదు అనగా మాటాడలేదని ఎరుక ఏమీ లేదని భావము. 16

15. కం. తిప్పలగు రాకపోకలు - నెప్పుడు తానెరుగు నట్టి యీ బయలందున్ - తప్పక తనకై తానె - తప్పగ గనవచ్చి ఎరుక

శరీరమును నిజమని భ్రమించుచున్నావు యిది నిజము ఎన్నటికి కానే రదు. సర్వకాల సర్వావస్థలయందు శాశ్వితమైయున్న యీ బట్టబయలును తెలుసుకొని నమ్మి, సర్వకాల సర్వావస్థలయందు లేనటువంటి నేను మేనులనే ఈ శరీరమను ఎరుకను లేదని భ్రాంతి విడచియుంటే చాలునని భావము. 18

153. కం. కనకమన భూషణంబులు - యినుమన శస్త్రాదికంబు - లిత్తడియనినన్ - గనుగొన పాత్రలు గనుబడు - తనువన నవయవములన్ని - తగదొంతియనినా ॥ కుండలుభూత - తతిజగత్తనినా ॥ వినుమట్ల ఎరుకన్న - వివరించ తత్వాలు - మనసందు గట్టిగ-మరువాకు మీమాట - తనదొంతియనినా ॥ కుండలుభూత - తతిజగత్తనినా ॥ ౧౯

తా. శిష్యా ! ఒక్క బంగారమే అనేక పేరులు స్వరూపములు గల అలంకారములైన నగలుగా నున్నది. ఒక్క యినుము ఆయుధములు కత్తులు, గొడ్డలి, పార, గునపము, సూది మొదలగు అనేక స్వరూపములు పేరులతో వాడబడుచున్నది. ఒక్క యిత్తడియే బిందె, చెంబు, గాబు, గుండిగ మొదలైన పాత్రలుగ నామములతో వాడబడుచున్నది. యీలాగునే యెరుక ఒక్కటియే తొమ్మిది అవయములుగాను, షట్చక్రములుగాను, యిరువదియైదు తత్వములుగాను, శరీరముగాను నేను మేనులుగా కనబడుచున్నది. కొన్ని కుండలు చేరుటచే దొంతియనిపేరు గలగినది. పంచభూతముల కూడికచే ఎనుబది నాలుగు లక్షల జీవరాసులు స్తావరజంగమాదులు వృక్షములు లతలు, కొండలు. నదులు కలసినదే ప్రపంచముగా చెప్పబడుచున్నది యని ఒక్క ఎరుకయే నేను మేనులుగా యైనదిగాన నీ మనస్సులో యీవిచారణ మరువక యుండుమని భావము. 19

154. కం. పార లరటిదుంప యనినను - తరువులు వనమనిన - రవలు ధారుణి యనినన్ - గిరియనిన రాళ్ళుగుట్టలు - ధరముళ్ళయనిన

తత్వ - తతియెరుకం చనినా ॥ లేనిదేయెరుక - స్థితి లెస్సా కనినా॥ ఎరుకా జేసిన విశ్వ - మెరుకావంటిదే, బయలు - నెరుకాగు ర్తెరిగి తా - నేగితె నరితత్వ-తతి యెరుకం చనినా॥ లేనిది ఎరుక - స్థితిలెస్సాకనినా॥ ౨౦

తా. శిష్యా ! అనేక పొరపొరలు గల్గియు ఒక్క అరటిదుంప (లేక చెట్టు) యైనటుల, అనేక వృక్షములు కలసి ఒక తోటయనినటుల, అనేక రేణువులుకలసి ఒక భూమి అయినటుల, అనేక గ్రామములు పట్టణములుకలసి ప్రపంచమైనటుల, అనేక రాళ్ళుకలసి ఒక పర్వతమైనటుల, తొంబదియారు తత్వములతోకలసి నొక్క ఎరుకే అయినది. యీ ఎరుక యొక్క స్థితిని బాగుగా విచారించిన లేనిదని తెలియబడుచున్నది. యీ లేనటువంటి యెరుక చేత పుట్టిన ప్రపంచము లేనిదే యని నిశ్చయము. శాశ్వతమై పుట్టు గిట్టులులేని బట్టబయలును యీ ఎరుక గుర్తెరిగి తాను లేనని తెలిసి తాను పోతే చాలునని భావము. ౭౦

155. కం. పెనుమాయను జూడుమిదె - జనకుని జఠరంబువలన- జననీగర్భం - బున జొచ్చి మూరురూపున - జనియించును నవయువములు - జనితామై భువినీ ! విను కను తిను - మూర్ఖాను వచ్చును చనీ ॥ । దినదినమభివృద్ధ్యై - దీవిచే బయలును - గనియా మాయల మల్లీ - కథమాయించుము పోనీ - జనితామైభువినీ ! విను కను తిను - మూర్ఖాని వచ్చును చనీ । ॥ ౨౧

తా. శిష్యా ! మహామాయ యనగా ఎట్టిదో దెల్పెదవినుము, తండ్రియొక్క జఠరాగ్ని లేక హృదయమునుంచి అయిన అన్నమయమగు శుక్లంబు. తల్లియొక్క గర్భమందుండెడి శోణితముతో కలసి పిండరూపమై శిశువై నవయువములుగా యేర్పడి మూరు రూపుతో జన్మించి శరీరము గుణములు క్రమక్రమముగా అభివృదె వినుచు-చూచుచు - నవ్వుచు - ఏడ్చుచు - తినుచు - ముద్దుచూపుచు - మాటలాడుచు

పాడుచు సంచరించు చుండును. ఇట్టి శరీరము (మహాకారణ శరీరము) చేతనే యీ వృత్త బట్టబయలును సద్గురు కటాక్షముచే గనిపెట్టి శరీరాదులనెడి మాయను తిరస్కరించి అనగా మరల శరీరములు పుట్టకుండా స్త్రీ సంపర్కము లేక స్త్రీ భ్రాంతిని విడిచిపెట్టుము యింతకన్నా మాయ ఎచ్చటను లేదని భావము. 21

156. కం పెట్టియలోపలి గారడి - చెట్టుపయిన్ గానవచ్చి - చెట్టున జూడన్ - గట్టువయి దోచునది కను - కట్టుసుమీ దీనివలెనె- గనిపించునెరుకా ॥ అంతలో ఎచట - గనుపించ దెరుకా ॥ దిట్టామహా బోధాచే - వట్టి ఎరుకను తిరిగి - పుట్టకుండగ దాని - పుట్టి ముంచుము లేందె - గనుపించు నెరుకా ॥ అంతలో ఎచట - గనుపించ దెరుకా॥ ౨౨

తా. శిష్యా ! గారడీ విద్యలుచేయు గారడివాడు పెట్టెలో ఒక పిల్లవాని అందరూ చూచుచుండగా వుంచి కప్పునుమూసి పెట్టెలో ఆ పిల్లవానిని గనుపడనీయక, చెట్టుమీద ఆ పిల్లవానిని జూపించును. మరల ఆ చెట్టుమీదను కనుపించనీయక ఎత్తైయిన గట్టుమీద కనుపింప జేయును. పిమ్మట ఆ గట్టుమీద కనుపించనీయక పెట్టెలోనే కనుపింప జేయును. యిది అంతయు కనికట్టు విద్యయొక్క ప్రభావమే కాని వాస్తవము కానేరదు అనగా నిజము కానేరదు. కనికట్టు విద్యవలె ఈ ఎరుక వొక క్షణములో కనిపించి మరుక్షణములో నెచ్చటను కనుపించక మటు మాయగా పోవును. నిజగురు స్వాములవద్ద అచల పరిపూర్ణ బోధ పొంది ఈ ఎరుక చేతనే శాశ్వితమైన బట్టబయలు దర్శించి ఈ గుర్తెరిగిన ఎరుక మరల పుట్టకుండా నాశనము జేయుము అనగా ఎరుకను సంకల్పమనే పేరుతోకూడా తీసివేయుమని భావము. 22

157. కం. నేననని బ్రహ్మలోపల - లేనిదె సంభవము నొంది - లీల తనకు దా - మేను జగములై వెలసెను - నేనది మృగజలమురీతి -

నిజము గాదనుచూ ॥ లోకు లనేటి గజిబిజి వినుచూ ॥ మానాసమున వారి - మాట కామోదించి - దానికి బోధాకు - తగునంచు విన జేస్తి నిజముగా దనుచూ ॥ లోకులన్నటి - గజిబిజి వినుచూ ॥ ౨౩

తా. శిష్యా ! నేనని పలుకు లేని అనగా శబ్దరహితమగు కేవలాద్మయైన అచల పరిపూర్ణ బ్రహ్మమునందు, మూలము లేని యీ ఎరుక తనకు తాపుట్టి శరీర ప్రపంచములుగా పరిణమించెను. నేననేటి యీ ఎరుక ఎండమావులయందుండెడి జలమువలె నిజముకాదు. త్రివిధమతములవారలు చెప్పెడి మాటలకు నమాధానంబు చెప్పవచ్చునని మనస్సునతలంచి. యీ పూర్ణబోధయే అందుకు తగినదని వినజేసితి, జనులు వలికెటి కల్లబొల్లి వాక్యంబులను నమ్మక ఎరుకయొక్కయు, అచల పరిపూర్ణముయొక్కయు నిజస్థితిని తెలియదగిన అచల గురుస్వాములచే యీ పరిపూర్టబోధను సదా వినుచుండుమని భావము. 23

158. కం. కలనెడబాసిన మనుజులు - కలలోపలి పనులుచేయ- కలవారన నా - కలవారుగారు వారల - వలె ఎరుకను గురునిచేత - వదలెరుకలోనా ॥ గలపనిజేయు వల దెరుకలోనా ॥ కలవారంచని నోట పలుకూట మరయాక - బలికీనవారికి - తొలగాదు పాపాము - వదలెరుకలోనా ॥ గల పనిజేయు - వలదెరుకలోనా ॥ ౨౪

తా. శిష్యా! కలనుగాచి - జాగ్రత నొందిన మనుష్యులు కలయందలి పనులు మరల చేయనేరరు అనిన - అచల పరిపూర్ణ బోదనొందిన సద్గురు పుత్రులగు వీరలు కలలోనివారుకారు. కలనువిడచి జాగ్రత నొందిన మనుష్యుల పోలికగానే, ఎరుక యనెడి కలను సద్గురు కటాక్షము చేత అహంకారమను ఎరుకవదలి అచల పరిపూర్ట స్థితియనే గురు మేల్కొవనొందిన పుణ్యపురుషులు, అట్టివారలనుగాంచి వారి మర్మములు ధర్మములు లోకులు తెలియనేరక, వారిని గలలోవారని పోల్చుకొని చెప్పెడి వాక్యముల వలన వారలకు పాపములు విడువ నేరవని భావము. 24

159. కం. గుడమె మధురము మధురమె - గుడమా గుడమధురము గాన - కొనితొలుతన్ - బొడమినదేదన సరిగా - బొడమిందొక జీగరెండు - పోయినట్టెకదరా॥ తను వెరుకాలి - ట్లైనట్టె కదరా॥ పొడజూచి బయలు - నిప్పుడె మేనెరుకలజోలి విడరా లేనివెరెండు పెడచౌబెట్టకవిను - పోయినట్టెకదరా। తనువెరుకాలి-ట్లైనట్టె కదరా॥ ౨౫

తా. శిష్యా! బెల్లమనగా తియ్యన అ తీపియే బెల్లము, బెల్లము తీపులనెడి రెండుమాటలు ఒకదానిని విడచి ఒకటివుండక వొక్కటిగానే యుండును. ఆలాగు నేను మేనులు రెండును ఒకదానినివిడచి వొకటి వుండనేరదు. గాన రెండూ వొక్కటేయని తెలియుము. సద్గురు కటాక్షముచే ఎల్లకాలముల వున్నటువంటి యీ వృత్తబట్టబయలు కనిపెట్టి, లేనటువంటి నేను వేరు మేనువేరనే భ్రాంతిని విడచి రెండూ ఒక్కటే యని దృఢచిత్తముతో యుండుము, యీ పరిపూర్ణ బోధ వినుట యందు అశ్రద్ధగా యుండక జాగ్రతగావిని వినిన బోధాలక్షణమును మనన జేయుమని భావము. 25

160. కం. ఇది వున్నది యిదివున్నది - యిదివున్నది యనుచు బయలు - నెరిగి ఎరుకచే - యిదిలేనిది యిదిలేనిది - యిదిలేనిది యనుచు నెరుక - నెరిగితె సరిరా॥ ఆపైనుండే - దెట్లందు వినరా॥ వుదయాస్తమానము - లుడుగాక యిదనీ నెమ్మదిలోన నమ్ము - నా మాట నిశ్చయమిట్లు - యెరిగితేసరిరా॥ ఆపైనుండే - దెట్లందువినరా॥

తా. శిష్యా॥ ఈ వృత్తబట్టబయలు యిదివున్నది, యిదివున్నది, యిదివున్నదని ముమ్మాటికి త్రికరణశుద్ధిగా నమ్ముము, మూలము లేనటువంటి గుర్తెరిగే శరీరము యిదిలేనిది, యిదిలేనిది, యిదిలేనిది యని ముమ్మాటికి దృఢముగా ఎరుకను నమ్మకయుంటే చాలును, ఆ పైని పరిపూర్ణ బోధను నేనునీకు యేమని చెప్పుదును, యీ విధముగా

పొద్దుట సాయంకాలముల విడచి పెట్టక నీ మనస్సులో దృఢముగా నా మాటను నమ్మి మంత్రములు సిద్ధియగువరకు స్మరించుచుండుము. యిది యే సిద్ధాంతము ఈలాగు వుంటేచాలును. అపైని బోధించుటకు యేమియు లేదని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమతత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచితే తాత్పర్య భావార్థే పరిపూర్ణ బోధో నామా
ష్టమో ధ్యాయః

—౧ ... ౬ - గురుమంత్ర ప్రతాపం - ౨౭ ... 27—

161. కం. యెరుగన నేటిది యెరుకే యెరుగుదునని తనను పరుల - నెరిగే దెరుగే - యెరుగ నెరుంగదు నను దా - న్నెరుగుచు నుండేటి దెరుకే - నిరుపామబుద్ధీ॥ నీ వెరుగిది-నిగమ ప్రసిద్ధీ॥ గురుమంత్ర మనియేటి - గృద్ధాలితోటి యీ - యెరుకా కూకుడువేరు - నెరిగి త్రొవ్వితేచాలు - నిరుపామబుద్ధీ॥ నీవెరుగిది - నిగమప్రసిద్ధీ॥ ౧

తా. సుబుద్ధియైన శిష్యరత్నమా! తనను పరులను ఎరుగనని చెప్పునది ఎరుకే, తనను పరులను ఎరుగుదునని చెప్పునది ఎరుకే, ఎరుక అన్నిటిని ఎరుగుదుననియు, సర్వము ఎరుగననియు తనను తా నెరుంగుచుండును. యీ ఎరుకే వేదములచేత ప్రశస్తముగా చెప్పబడిన సచ్చిదానంద బ్రహ్మమని నీవెరుగుము. అచల గురుమూర్తిచే చెప్పబడిన షోడశీమంత్రమనే గొడ్డలి బూని యీ ఎరుక యొక్క కూకటవేరును అనగా ఎరుకకు గుర్తెరుగుట యనే సంకల్పము పుట్ట కుండా త్రవ్వి లేక విచారించి తీసివేసితే అంతేచాలును. అలాగు విచా

రించుటకు నీవు మహా బుద్ధివంతుడుగా యుండవలెనని యీలాగు తెలి యనగునని శృతి స్మృతులు ప్రసిద్ధిగా పలుకుచున్నవని భావము. 1

162. కం. యెరుకే చదువుల జేసును-యెరుకేవిను చదువుసెరుక-నెరుకే తిరమం - చెరిగించును శంకించును - యెరుకే కొనకేమి లేక - యేగునోయన్నా॥ బయలే చదువు-యెరుగాదోయన్నా॥ యెరుకేయెన్నటి కైన - పరిపూర్ణమున్నాదం - చెరిగి తాలేనాని - యెరిగితె నిలువాక - యేగునోయన్నా ॥ బయలే చదువు - యెరుగాదో యన్నా ॥ ౨

తా. శిష్యా ! ఈ యెరుక వేద శాస్త్ర పురాణాదులు సర్వ భాష్యములు శృతి స్మృతి యితి హాసాది భాషలనన్నింటిని పుట్టించెను. సర్వభాషలు యీ యెరుకే వినును చదువును। యీ యెరుకే నేను స్థిరమని తలంచుచుండును. యీ యెరుకే అనేక సంశయములు నొందును. యీ యెరుకే కొనకు యేమీ లేకుండా మటు మాయగా పోవును. యీ వృత్త బట్టబయలు ఏ చదువులు ఏ గ్రంథములు పుట్టించలేదు. చదువదు వినదు, యీ యెరుక ఏ ప్రాయములోనైనా అచల పరిపూర్ణమున్నదని సద్గురు మూర్తిచే గుర్తెరింగి తన లేమిని తానెరింగి తుదకు యీ యెరుక యేమియు లేకుండా పోవును.

163. కం. చూపులలోగల వస్తువు - చూపులు గనువస్తువులను - చూపులు గూడన్ - తేపకు యెరుగని తెలియుము - చూపులు లేనట్టి బయలు - చూచేదింకేమీ ॥ యెరుకేలేదు - తోచేదింకేమీ ॥ దీపాముపలెకను - పాపాలోగల వస్తువే - పరమాత్మని చూపితే - యెరుకాయు చూచేదింకేమీ ॥ యెరుకేలేదు - తోచేదింకేమీ ॥ 3

తా. శిష్యా ! చూపులోనుండి చూచే దృష్టియు చూపులకు గనపడు దర్శనయు చూపులోపలనుండి విమర్శించు దృశ్యమును యీ

మూడును ఒక్క యెరుకేయని తెలియుము. చూపులు లేనట్టి అచల పరిపూర్ణము దేనిని చూడనేరదు. యీ వృత్త బట్టబయలు నందు యెరుక లేదుగాన దానికి లోచేది యేమియులేదు. కంటి పాపలలో నుండి చూచుచు అపోజ్యోతియై తనకు తాను ప్రకాశించుచుండెడి వస్తువే పరమాత్మయని చూపించితే అది యెరుకయని యెరుంగుము. అచల పరిపూర్ణమును చూచుటకు దోచుటకు ఎరుక యేమియు లేదని భావము. ३

164. కం. శతపత్రాప్తుని పొడగని - యతిరయమున తిమిర మణగి - యగుపడదెట్లు - తులిత గురుకృప గలిగిన - మంతిమంతుల జూచి ఎరుక - మరి నిల్వబోదూ॥ సంశయమునీ - మదినిల్వరాదూ॥ శృతులందు - స్మృతులందు యితిహాసములయందు సతతము శ్రమపడి వెతకిన ఈ ఎరుక - మరి నిల్వబోదూ॥ సంశయమునీ - మది నిల్వరాదూ॥ ४

తా. శిష్యా! చీకటి సూర్యుని రాకడను చూడబోయి సూర్యుని దగ్గర తాను నిలువలేక ఎట్లు మటుమాయగా పోవుచున్నదో అటువలెనే శ్రీ సద్గురు స్వాములవారి కరుణాకటాక్షము పొంది మంత్రమూల, మంత్రార్థ, మంత్రసార, మంత్రరహస్యముల నెరిగిన బుద్ధిమంతులగు శిష్యులకు నేననెడి ఎరుక లేక అహంకారము ఎందును నిలువక పారి పోవును. ఈ వాక్యమునకు నీ మనస్సులో సంశయము ఎంతమాత్రము వుంచకుము. శృతురందు స్మృతులందు ఉపనిషత్తులయందు యితి హాసములయందు చదివి కష్టించి చూచిన లేక విచారణ చేసినచో ఈ ఎరుక నిల్వనేరదని భావము. 4

165. కం. ఎరుకే కోశములై దెరు - గెరుగే భూతముల నెరుగు- నెరుగును సర్వం - బెరుకే ఎరుక నెరుంగును-ఎరుకను గుర్తెరుగ వేరే-

ఎరుకా వున్నాదా ॥ వున్నదంటే - నరకామేకాదా ॥ నిరతాము గురు సేవ - పర తంత్రులగుచు - తత్కరుణాకు పాత్రులై - ఎరుకమాలి నవారి - కెరుకావున్నాదా ॥ వున్నదంటే - నరకామెకాదా ॥ ౫

తా. శిష్యా ! ఈ ఎరుకే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లనెడి పంచకోశములు ఎరుగును. యీ ఎరుకే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధివి యనెడు పంచ మహాభూతంబుల నెరుంగును. సర్వ చరాచర జగత్తంతయు ఎరుకే. యీ సర్వంబునకు తాను విలక్షణమై (సర్వసాక్షియై) చూచుచు సర్వము నెరుగుచు సర్వము తానెయై యున్నది. అట్టి ఎరుకను గుర్తించుటకు యింకొక ఎరుక వేరేలేదు. యీ సర్వసాక్షియైన ఎరుకను చూచుటకు యింకొక ఎరుక వున్నదని చెప్పినవారికి గర్భనరకము తప్పదు. ఎల్లప్పుడు నిజగురునకు చతుర్విద శిశ్రూషలు చేయుచు ఆయనకరుణకు పాత్రులై అచల పరిపూర్ణమందు నిమగ్నులై ఎరుకను విడచిన పుణ్యాత్ములగు శిష్యులకు ఎరుక లేనేలేదు. వారలకు ఎరుక వున్నదని చెప్పెడు వారలకు నరకము విడువదని భావము. 5

166. కం. గురుమంత్రముచే నిలువని - ఎరుకను పరిపూర్ణ మనుచు-నెరిగి నిరతమున్ - ఎరుకై యుండినవారల - తెరువిక నీ కేల వట్టి - దీజోలిమానూ ॥ ఎరుకలేని - యాజొలిబూనూ ॥ గురునిచే పరిపూర్ణ - మరసి యీ తెలిసివ - ఎరుకనెన్నటికిని - వెరుగాకు మిది వట్టి - దీజోలిమానూ ॥ ఎరుకలేని - యాజోలిబూనూ ॥ ౬

తా. శిష్యా ! ఎల్లకాలములయందు లేనటువంటిదై నిజగురు మంత్రముచే నిలువని ఎరుకను, త్రికాలములయందుండెడి అచల పరిపూర్ణ మును సద్గురుమూర్తిచే నెరింగి, ఎరుక యనెడి అహంకార మమకార ములతో ఎల్లప్పుడు సంచరించెడి పాపాత్ములయొక్క స్నేహము చేయ

కుము. అహంకార మమకారములు విడచిన పుణ్యాత్ములగు ఎరుకలేని వారితో స్నేహము మానకుము. శ్రీ సద్గురు స్వామిచే యీ వృత్త బట్ట బయలును దెలుసుకొని ఈ తెలిసిన ఎరుకను యెన్నటికిని వున్నటుల గుర్తెరుగక తీసివేయుము. అలాగు యెరుకను తీసివేసినవాడవై యెరుక గల్గినవారితో స్నేహము మానుకొనుట శ్రేయోదాయకమని భావము. 6

167. కం. లేనికలదోచినప్పుడు - లేనివిచిత్రంబులన్ని - లేకనె దోచున్ - లేనికల మేలుకొన్నను - లేనివిచిత్రములు తాను - లేక పోవుగదా ॥ అనుమానాము - లేదిందువినరా ॥ లేనెరుక ఈరీతి - గానే బయలునుజూస్తే - తాను తనచిత్రములు - పూనెందునిలచుండ - లేక పోవుగదా ॥ అనుమానాము - లేదిందువినరా ॥ 2

తా. శిష్యా ! నిజముకానటువంటి కల కలిగినప్పుడు, కలలో నిజముగా చిత్రవిచిత్రము లెన్నియో లేకనే గనిపించును. ఆ నిజము కానటువంటి కలనుండి మెలకువరాగా ఆకలలో కనబడిన చిత్రవిచిత్ర ములలో కొంచమైననులేక లేశమాత్రంబైనను కనబడక సర్వమును లేకపోవును. ఈ మాటయందు సంశయము యెంతమాత్రము లేదని తెలుసుకొనుము. లేనటువంటి కలవంటి ఈ ఎరుక మెలకువవంటి అచల పరిపూర్ణమును జూచి తాను తన కార్యములగు చిత్రవిచిత్రములును సర్వము క్షణకాలమైనను నిలుచుటకు వలనుపడక పారిపోవును. ఈ మాటకు సందియము ఎంతమాత్రము లేదని భావము. 7

168. కం. మరణ సుషుప్తుల జెందిన - పురుషుడు మేల్కనిన వాడు - భువి తదితరుడో - పురుషుడు కలగనువాడని - ఎరిగుండుము మొదటి యత - డెరుగాడీ రెంటిన్॥ రెండో పురుష - డెరుగూనీ రెంటిన్॥ యిరువు రొక్కటె సుమ్మీ ॥ తిరిగి పుడుదురు వీరె - గురునిచే

మేల్కొంటె తిరిగి పుట్టనెవ్వట్ట - డెరుగాడీ రెంటిన్ని ॥ రెండో పురుష- డెరుగూనీ రెంటిన్ని ॥ ౮

తా. శిష్యా ! మరణమును నిద్రయును పొందిన పురుషుల శరువురను ప్రపంచములో జాగ్రతలోవున్న పురుషుడు వేరుగా యుండును. నిద్రపొందిన పురుషుడే కలగనువాడు యని తెలియుము. మరణించిన పురుషుడగు మొదటివాడు జాగ్రతలో నున్న పురుషుని నిద్రలోనున్న పురుషుని వీరలిద్దరిని నెరుంగడు. రెండవ పురుషుడైన నిద్రించువాడు నిద్రనుండి లేచిన తర్వాత ఈతడు మరణము పొందెనని ఈతడు జాగ్రతలో మన్నవాడని వీరలిద్దరు ఎరుంగును, గావున మరణ సుషుప్తులు పొందెటి పురుషు లిద్దరును వొక్కటియే స్థితిగాన వీరలిద్దరకు పుట్టుగిట్టుటలు గల్గుచుండును. శ్రీ సద్గురు కరుణా కటాక్షముచేత గురుమేల్కలోనుండు శిష్యాగ్రగణ్యుడు మరణ సుషుప్తుల రెంటిని నెరుగడుగాన పుట్టనే పుట్టడని భావము. 8

169. కం. ఎరుకే ఎరుకకు కొడుకులు - ఎరుకే తలితండ్రి ఎరుక - కెరుకే యితరుల్ - ఎరుకే ఎరుకకు మూలము - ఎరుకకు మూలంబు బయులం - చెట్లందునోయీ ॥ ఎరుకే ఎరుక - కేమి లేదోయీ ॥ ఎరుకలేని వృత్త - పరిపూర్ణమును జూచి - ఎరుకే తా లేనాని - ఎగిరిపోయితె పై - మాటెట్లందునోయీ ॥ ఎరుకే ఎరుక కేమి లేదోయీ ॥ ౯

తా. శిష్యా ॥ ఎరుకకు ఎరుకే కొమాళ్లుగాను, కుమార్తెలుగాను తల్లిదండ్రులుగాను అయినది ఎరుక కెరుకే నేనని నీవని యెష్టిభావముతో తనకు యితరులుగా భావించుకొనుచున్నది. ఎరుకె ఎరుకకు మూలమై యున్నది. ఎరుకకు మూలము ఈ వృత్త బట్టబయులని ఏలాగు చెప్పగలను. అనగా ఎరుకకు మూలము బట్టబయులు కాదని తలంచుము. ఎరుక గుర్తించే ఎరుక బట్టబయులులో ఏమీలేదు. ఎరుక లేకపోతే

ఈ ప్రపంచము శరీరములు ఏమియులేవు. ఎరుకలేని పుట్టబయు లును ఎరుక పొడచూచి తాను లేనని ఎరిగి లేకపోయిన తర్వాత నీవు నేను మాట్లాడుటకు మాటలులేక శబ్దరహితమైయున్న అచల పరి పూర్ణమే స్వతఃసిద్ధమై యుండునని భావము. 9

170. కం. గురుతను కలలోనారీ - నరులూరికెవచ్చి పొంది - నయముగ సుతులన్ - వరకన్నియలను గాంచియు గురువరుచే మేలు కొంటె - గురుతుండదన్నా ॥ ఆపై మాట - నెరిగేలేదన్నా ॥ యెరు కొక్కటుంటేనే - యేర్పాటులుండును - యెరుకొక్కటేగితె - యోర్పాటు జేస్టి - గురుతుండదన్నా ॥ । ఆపై మాట - నెరిగేదేదన్నా ॥ ౧౦

తా. శిష్యా ! మూలములేని గురుతనెకలలో స్త్రీలు పురుషులు మూలము లేకనేవచ్చి కామోద్రేకముచే భోగించి కొమాళ్ళను కొమా ర్తెలను గని వారలతో సుఖదుఃఖములచే మెలంగి, శ్రీ అచల గురు మూర్తిని దర్శించి ఆయన కరుణచే మేల్కొనినవారలకు యీ కలయనే గురుతుండదు. ఆలాగు గురుతనేకల పోయినతర్వాత యెరుగుటకు యేమియును లేదు, గురుతనె యెరుక వొక్కటి యున్నటులైన ప్రపంచ సంబంధమగు ఘననీచములు, కులమతభేదములు, స్త్రీ పురుషాది విచ క్షణలు - నీవు నేననే యెట్టిభావములు, యీర్షాఅసూయలు, సుఖదుఃఖ ములు, జననమరణములు, పుణ్యపాపములు, అహంకార మమకార ములు మొదలగు ద్వయదోషమైన అనేక యేర్పాటులు చేయుచుండును. అట్టి గురుతనే యెరుక గురునిచే పోయినట్టయిన ప్రపంచములో యేర్పా టులు చేసేటందుకు మరి యింకొక ఎరుక యేమియు లేదని భావము. 10

171. కం. నిను నను నివు కలగాంతువు - నిను నను కలలోన గాంతు - నే నొకవేళ్ళన్ - నినుననునివు నే ననునిను - గనుగొనగా గలమె మేలు - కనినమీదటనూ ॥ గురుబోదట్ల - వీనినా మీదటనూ ॥

మునుపుగలిగిన ఎరుక మొదటికే నిలువాదు-నినునన్ను నేనను-నిను నీవె రుగుటయెట్లు-కనినామీదటనూ॥ గురుబోధట్ల-వినినామీదటనూ ॥ ౧౧

తా. శిష్యా ! నిన్నును నన్నును నీవు కలలో ఒకసారి చూచెదవు. నేనొకవేళ నిన్నును నన్నును కలలోపల చూచెదను. నేను మేలుకొనిన పిమ్మట నిన్ను నేను చూడజాలను. నీవు కలగని మేలుకొన్న తర్వాత నన్నును నీవు చూడజాలవు. ఇది నిజమేకదా? అదే ప్రకారము అచలగురు మూర్తిచే పరిపూర్ణ బోధవిని పరిపూర్ణము సూచనమైన తర్వాత ఎరుక యనెడి - యీకల మొదటికే నిలువదు. అట్టి గురుమేల్క యనెడి స్థితిలో నిన్ను నేనును నన్ను నీవును జూచుటలేదు. నేను బోధించుటయు నీవు వినుటయు యేమియునుండదు. నామరూపముగల సర్వము కలయనియు యీ వృత్తబట్టబయలును దర్శించుటే మెలకువయని భావము. 11

172 కం. నిను నీవు నన్ను నేనును-నను నీవు నేనిన్ను యెరిగి-నదె కల యిది తా - తన నెరుగనిదానిని గని - తన కలిమి మృషనుచు దెలిసి - తానేగెనేని ॥ అది మేల్కవలి - దాన్నెవ్వాడెరిగినీ ॥ నను నీవు నే నిన్ను పోధవినుపించు వినుమాని - యనుటాకిద్దరి కిపుడు - మును పున్న ఎరుకేది - తానేగెనేనీ ॥ అది మేల్కవలి - దాన్నెవ్వాడెరిగినీ ॥

తా. శిష్యా ! నిను నీవు ఎరుంగుట కలయే, నన్ను నేను ఎరుంగుటయుకలయేయగును, నన్ను నీవునేనునిన్ను ఎరుంగుచుండుటకలయగును యీవుధముగా యెరుగని అనగా తనకుతాను యెరుగదు. తనలో యెరుక వున్నదో లేదో యెరుగదు. అట్టి అచల పరిపూర్ణమగు బట్టబయలును యెరుక దర్శించి తానుండుటయు తన బ్రతుకు భాగ్యములు వ్యర్థములని తానెరిగి యెరుక పోయిన పిమ్మట అనగా మేల్కవగల్గిన తర్వాత పరిపూర్ణము వున్నదనిగాని, యెరుకైన ప్రపంచము లేదనిగాని యెరుగుటకు ఎవ్వరును లేరు. నన్ను నీవు పరిపూర్ణబోధ వినుపించు మనుటకు

తా. శిష్యా ! మరుపును, నిద్రయును, మూర్ఛయును, చావును సమాదియును అగు యీ అయిదు అవస్తలు పొందెడి మనుష్యులు యితర జనుల శరీరముల నెరుంగరు, తమతమ శరీరములు తామెరుంగరు. తమ్ము తామైనను యెరుంగరు. అట్లు యెరుగక ఆయాయవస్తలు పొందెడి వారలకు యేమి లాభము గలుగును. వారలే మరల జన్మమునకు వచ్చుచుందురు. ఏమనగా మొదట నలుగురకు అజ్ఞానావస్థయందు యెరుక మ్రగ్గియున్నది. అయిదవ వానికి జ్ఞానమందు యెరుక మ్రగ్గియున్నది. గాని వీరలకు యెరుక నాశనము కాలేదు గావున వీరలు పుట్టుచుందురని చెప్పబడెను. అచల గురుమూర్తిచే పరిపూర్ణ బోధ పొంది గురు మేల్కలోనుండి యెరుక లేక యున్నవారలకు మరల పుట్టుక లేదని భావము. 16

177. కం. పరిపూర్ణ మెరుక లివియని - యెరుగని బయులందు లేని - యెరుక తనకు దా - నరుదెంచిట గురు శిష్యుల - తెరగున మాట్లాడి రెంట్ని - దెలసీతా జనునూ ॥ ఆ పై మాట - వలికేదేది కనూ ॥ అరమార లేకనే - నెగిరించినట్టి యీ - గురుబోధ పాత్రులు నెడుగాక తెలిపేవు - తెలసీతా జనునూ ॥ ఆ పై మాట - వలికేదేది కనూ ॥ ౧౭

తా. శిష్యా ! ఇది పరిపూర్ణ మనియు యిది యెరుక యనియు యెరుంగని యీ వృత్త బట్టబయలునందు లేనటువంటి ఎరుక తనకు తానె వచ్చి గురుశిష్యుల పోలికగా కనబడి పరిపూర్ణమును ఎరుకను యీరెంటినీ బాగుగా విచారించి తదుపరి వారల ఎరుక ఏ పరిపూర్ణమందు కలిగినదో ఆ అచల పరిపూర్ణ మందే లేకుండా పోయెను. ఎరుక పోయిన తర్వాత మాట్లాడు కొనుటకు గురుశిష్యులు యిద్దరూ లేరు. నీ యందు ఏ సందియము లేకుండా నీకు నేను బోధించిన యీ అచల పరిపూర్ణ

యిన్ని - నిబిడామై యుండూ ॥ బయలును గనతా - నిలువాలేకుండూ నేను మేనీరెండు - నేనే లేకుంటె - మేనూలేదిది - లేకనే నిల్చె దెట్లిన్ని - నిబిడామై యుండూ ॥ బయలును గనతా - నిలువా లేకుండూ ॥ ౨౧

తా. శిష్యా ! అనేక విధములగు అవయవములు అనేక విధము లగు పేరులు అనేకములైన రూపములు అనేక విధములగు ప్రవర్తనలు అనేక విధమాయలు, అనేకమైన సంకల్పాదులు నేనని పలుకుచున్న ఎరుక యందు యివి అన్నియు యిమిడియున్నవి. యిన్నిటితోనున్న ఎరుక యీావుత్తబట్టబయలును తెలసినయడల తానుఅన్నిటితో నిలువకుండా పోవును. నేననెడి ఎరుక పోయిన వెనుక మేను లేనేలేదు. అట్టి నేను మేనులు పోయిన తర్వాత అవయవములు పేరులు, రూపములు వర్తనలు మాయలు సంకల్పాదులు వ్యవహారములు అంతయు లేనివే యగుచున్న వని భావము. 21

182 కం. జగమువలన సంకల్పము - జగమూ సంకల్పమునను- జనియించును వే - రగుపడదు జన్మమందిర - మగుపడ దెడబాసి నిల్వ - వారెండెన్నటికీ ॥ బయలును గనినీ-వీరెంట్నెన్నటికీ ॥ యిక దల్చబోకూ ము - యివి బుట్టుటుళ్ళక్కి - మృగజల మగుపడ్డ - మిద్యం చెరిగిన మాడ్కి - యా రెండెన్నటికీ॥ బయలుగనినీ - వీరెంట్నెన్నటికీ॥ ౨౨

తా. శిష్యా! ప్రపంచము వలన మనస్సులేక సంకల్పముపుట్టును. అట్టి సంకల్పమువలన ప్రపంచము పుట్టుచుండును. యీా రెండును పుట్టు టకు వేరొకటి వున్నటుల కనుపించదు. ప్రపంచము సంకల్పము యీా రెండును నొకదాని నొకటి ఎడబాసి యుండనేరవు. ఇవి రెండును బట్ట బయలును దర్శించిన ఎన్నటికి మరల పుట్టనేరవు. యివి లేనివి అని తెలి యుము. ఎండమావులయందు జలము కనిపించుట మాయ యని తెలిసిన

రీతిగా యివి రెండును మాయా స్వరూపములని భ్రాంతిని విడచితె లేని వగును. యిట్లుతెలిసి మరలవున్నవని భ్రాంతి పొందవలదని భావము.౨౨

183 కం. పరిపూర్ణ మనెటి పల్కె - ఎరుకను బల్పాక్షరముల - కెచ్చటగనినన్ - తిరమైయున్నది కనుగొని - ఎరుకను బల్పాక్షరముల- నికగట్టిపెట్టూ ॥ ఎవరికి దెలియు - దిదెమూలగుట్టూ ॥ గురుమూర్తి కరుణాచే - ఎగిరి తెల్పితినేనీ - పరిపూర్ణ బోధాను :- పరుల దెల్పినబోధ - నికగట్టిబెట్టూ ॥ ఎవరికి దెలియు - దిదిమూలగుటూ ॥ ౨౩

తా. శిష్యా! పరిపూర్ణము! అనిన మాటయుందే సత్యము, ఘనము, సర్వమాటలకు అతీతముయై యున్నది. ఎరుకయను కొద్ది అక్షరముల మాట నీచమై అసత్యమై కొద్దియైయున్నది. యితర మతస్థుల కెవ్వరికి యీ మూలగుట్టైన రహస్యము తెలియుబడదు. యీ పరిపూర్ణముయొక్క గుట్టు లోకులగు శాస్త్రవాదులకు అంతకు మునుపే తెలియదు. శ్రీ మద్గురుస్వాములవారి కరుణాకటాక్షముచేత అచల పరిపూర్ణ బోధయొక్క రహస్యము నేను తెలుసుకొని నీకు చెప్పితిని. ఇతర మత వాదులైన పరులు చెప్పుచుండెడి నానా విధములగు బోధలను విని భ్రాంతిపొందక విడిచిపెట్టుము. యీ అచల పరిపూర్ణ బోధను ఎన్నడు విడువకుమని భావము. 23

184. కం. చూపించి చూపరానిది - చూపించితి దాన్ని వుండ- జూచినవుగదా - చూపించ జూచెనిది దీ - న్నే పొద్దిక దల్చబోకు - మిదె గురుబోధా ॥ నిన్నంటాదు - నితరామేబాధా ॥ నా పాప నా కూన - నా చిన్ని నా యన్న - నా పెన్నిధానమ - నా రత్నముల కొండ - యిదె గురుబోధా ॥ నిన్నంటాదు నితరామేబాధా ॥

తా. శిష్యా! ఇట్టి దట్టిదని నిర్దేశింప రానిదైన అచల పరిపూర్ణ మును జూపించితిని అది వుండగా నీవు చూచితివి గదా నేను

చూపించిన సమయములో నీవు యే గుర్తు చేత యీ వృత్త బట్టబయలును వుండజూచితివో ఆ గుర్తును ఏ రోజునైనను ఏ క్షణములోనైనను మరల రానివ్వకుము! దాని పోకటల యందైనను పోకుము. యిదియె పరిపూర్ణ బోధయొక్క రహస్యము. యీలాగు పరిపూర్ణ స్థితిలో నీవు వుండుటచే శరీర ప్రాపంచక విషయములయొక్క సుఖ దుఃఖములు అహంకార మమకారములు యితర మత ప్రబోధకుల యొక్క బోధలు యేవియు నిన్ను బాధింపనేరవు. నా ముద్దుబిడ్డా, నా పసివాడా, నా చిన్నివాడా, నా తోడా, నా నిక్షేపముగు ధనమా నా సుగుణములనే రత్నముల కొండయని ప్రేమాస్పదములతో గురుడు గారాబముగా పలికెనని భావము. 24

185. కం. నామము రూపము నటన స్తోమము బయలందు లేదు - చూడుము నివా - నామము రూపము నటన - స్తోమము యెరుకందు గలదు - చూడుమి నిజమూ ॥ బయలెరుకాల చూచి చూడకుమూ ॥ వేమారు నేనెంత-విన జెప్పినాగాని - ఈమార్గమేతప్పు- యిక లేదు రెండోది - చూడూమి నిజమూ ॥ బయలెరుకాల - చూచి చూడకుమూ ॥ -అ౨

తా. శిష్యా ! పేరును ఆకారమును ప్రవర్తనయు కార్యములు మొదలగు వృత్తులు అచల పరిపూర్ణముయందు లేవు. నీవు నిజము గ్రహించి చూడుము, ఈ నామములున్నూ రూపములున్నూ, ప్రవర్తనలున్నూ, కార్యములున్నూ మొదలగు సర్వవృత్తులు యెరుకయందు గలవు. వీట్లను విమర్శించి చూచి నిజము యెద్దియో గ్రహించుము. బట్ట బయలును ఎరుకను చక్కగా విమర్శించి, బట్టబయలునుజూచి ఎరుకను జూడకుము. అనేక పర్యాయములు అనేక వుపమాన వుపమేయములతో నీకు ఈ అచల పరిపూర్ణ బోధను నేనెంతయో బోధ జేసితిని -

జనన మరణ ప్రవాహమునుండి తప్పించుటకు ఈ పరిపూర్ణ బోధయే తప్ప యింతకు ఎక్కువైన బోధయు యింకొక మార్గము యేదియు లేదని భావము। 25

186. కం. గురుడు గురుబోధ శిష్యుని - కెరిగించెటివేళ్ళ శిష్యు డెరిగెటి వేళ్ళన్ - యిరువురు వైశ్వానర శ - ద్భురములవలె వెలిగి యవల - పొడజూపరోయీ ॥ అట్లనే నీ - విక్కడ దెలియుమోయీ ॥ పరిపూర్ణ మెరుకాల - నెరిగి యా మీదట - ఎరుకాను విడచూచి గురుబోధం చెరుగూము - పొడజూపరోయీ ॥ అట్లనే నీ విక్కడ - దెలియుమోయీ ॥ ౨౬

తా. శిష్యా ! శ్రీ అచల గురుస్వామి తన గురుడు తనకు బోధించిన పరిపూర్ణ బోధను తన శిష్యునకు బోధించెటి సమయము నందు, ఈ పరిపూర్ణ బోధను వినుటకు అధికారియగు సచ్ఛిష్యుడు తాను పరిపూర్ణమును తెలుసుకొనే సమయమునందు, ఆ గురుశిష్యుల యొక్క మనుస్సులు కర్పూరము అగ్ని కలసి వెలిగినటుల అంతఃకరణలు ఏకమై బోధానంతరము ఎరుకలేని వారగుదురు. అటువలెనే నీవు అచల పరిపూర్ణము యొక్క వునికిని ఎరుకయొక్క లేమిని పరిశోధించి ఆ ఎరిగిన ఎరుకను వీడుటే అచల గురుబోధయొక్క స్థితియని భావము. 26

187. కం. సతి కౌగిట తత్పతి త - త్పతి కౌగిట సతియుజేరి - పర వశించికలన్ - మృతిజెంది మేలుకని సు - స్థితులై యొకరొకరి కట్టి - చేష్టా దెల్పదురా ॥ సిగ్గెడలి యా - చేష్టా నిల్పుదురా ॥ ప్రతిలేని గురు బోధా - స్థితి జెంద్యట్లనె - సంతతి తిరిగి లేనెరుక - గతియిట్టిదని దాని- చేష్టా దెల్పదురా ॥ సిగ్గెడలి యా - చేష్టానిల్పుదురా ॥ ౨౭

తా. శిష్యా ! ఈ ప్రపంచకమనె కలలో కేళికా మందిరము యందు భార్యా కౌగిట భర్తయును. భర్త కౌగిట భార్యయును గాఢా

లింగనచే రతి యుపరతులచేత అలసి గాఢముగా నిద్రించి మెలకువ వచ్చిన తర్వాత స్తాయిగా కూర్చొని ఆ యిరువురు తామొకరితో వొకరు కిృతము చేసిన చేష్టలను సిగ్గువిడచి చెప్పుకుందురా చెప్పరు. రాత్రి కేళికా మందిరము యందు పొందిన చేష్టలయందే అప్పుడుకూడా యుందురా వుండరు. అటువలెనే యీ పరిపూర్ణ బోధయొక్క ధర్మములు మర్మములు యితర జనంబులతో జెప్పరు. అచల పరిపూర్ణబోధ స్థితిని జెందిన శిష్యులు ఆ పరిపూర్ణము యందే నిమగ్నులై యుందురు. పూర్వము తాము ఆచరించిన ఎరుకయొక్క చేష్టలును ఆయా భ్రాంతులను మరల పొందక తలంపుయైనను చేయరని భావము. 27

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచితే తాత్పర్య భావార్ధే గురుమంత్ర ప్రతాపం
నామ నవమోధ్యాయః

— ••• 10 * ౧౦ బోధ దృఢీకరణం ౫ * 5 ••• —

188 కం. రానిది పోనిది బయలని-లేనిది యీ యెరుక యనుచు - లెస్సగ ధృఢమౌ - దామక నీవీ మంత్రము - మానక జపియించుచుండు - మా నీతిశాలీ ॥ లేనిదెలేదు - మరువాకిజోలీ ॥ లేనిది లేదాని - పూనినిశ్చయమైతె - తా నొక్కటుండును - గాని యట్లన విను - మా నీతిశాలీ ॥ లేనిదెలేదు - మరువాకిజోలీ ॥ ౧

తా. ఓ నీతివంతమైన శిష్యుడా! వచ్చుట పోవుటలనే చావు పుట్టుకలు లేనిది యీవుత్త బట్టబయలనియు, యెరుక ఏ కాలముయందు యెప్పుడు లేనేలేదని నీకు సందేహము లేకుండా ధృఢము అయ్యేవరకు నీవీ షోడశాక్షరీ మంత్రమును విడువకుండా అన్ని వేళలయందు జపించు

చుండుము. ఈ పద్ధతి ఎప్పుడు మరువకుము, మూలము లేని ఎరుక లేనే లేదని గట్టిగా నీకు నిశ్చయమైతే లేని ఎరుక లేకుండాపోతే, అచల పరిపూర్ణ మగు బట్టబయలు మాత్రము నిండియుండును. అట్టి ఈ వృత్తి బట్టబయలును యిట్టిదని నిర్దేశించుటకు అట్టిదని చెప్పుటకు నీకు సాధ్యము కాదని భావము.

189. కం. ఉన్నది పరిపూర్ణము లేం - దెన్నటికీ ఎరుక యనుచు-
నిది దృఢమే దా - కెన్నమునే బోధించిన - తిన్నని ఈ బోధ
శిష్య - తిలకా మరువకుమీ ॥ సుజనుల ముందల - పలుకా వెరువకుమీ॥
నిన్ను కుమతులు వచ్చి - నీ లోతడిగితె వారి - కెన్ని విధముల నీ -
పరిగింప కిది శిష్య - తిలకా మరువకుమీ ॥ సుజనుల మోల -
పలుకా వెరువకుమీ ॥ ౨

తా. శిష్యాగ్రణి! సర్వకాల సర్వ దేశ్యంబుల సర్వ పదార్థముల నిండి నిబిడీకృతమై యున్నదే ఈ అచల పరిపూర్ణము భూతకాల భవిష్యత్కాల వర్తమాన కాలములయందు లేనిది ఈ యెరుక యని నీకు బాగుగా దృఢమగు వరకు నేను నీకు బోధించిన ఈ పరిపూర్ణ బోధను మరువక ఎల్లప్పుడు విచారించు చుండుము. అలాగు యీ బోధను ఎల్లప్పుడు విచారణ చేయుచుంటివేని ముఖమునకు తిలకము ఎంత శృంగారమో అలాగు శిష్యమండలి కంతటకు బోధలో అధికమై ప్రకాశించెదవు. పెద్దల ఎదుట మాట్లాడుటకు వెనుక దీయకుము. నీ వద్దకు కుత్సిత స్వభావముగల పురుషులు వచ్చి నీ గురు బోధ యొక్క రహస్యమును అడిగితే వారల మనస్సు ఎట్టిదో తెలియక యే విధముగానైనను యీ అచల గురుబోధను వారలకు యెరిగింపకుమని భావము.

190. కం. పరిపూర్ణము నెరుకను నే - నెరిగించితి నీవు రెంటి
నెరిగితివిగదా - యెరుకను గురు దక్షిణగా - మరివేగిర మివ్వ పట్టి-
మాట లేమిటికీ ॥ యెరుకతో యింక - కూట మేమిటికీ ॥ పరులు నేనని

యేటి - భావ మభావమై - నిరతాము ఒకరీని - నిలచుండు మిక వట్టి మాట లేమిటికి ॥ యెరునతో యింక - కూట మేమిటికీ ॥ ౩

తా. శిష్యా ! అచల పరిపూర్ణముయొక్క రహస్యమును యెరుక యొక్క లేమిని నీకు యెరిగించితిని. యీ రెంటినీ నీవు నెరికగితివికదా యీ వృత్త బట్టబయులగు అచల పరిపూర్ణమును యే యెరుకచేత నీవు యెరిగితివో ఆ యెరుకను చేననెడి అహంకారమును గురుదక్షణగా నాకు ధారబోయుము. అలాగు గురుదక్షణ యివ్వక వట్టిమాటలచేత యేమియు ప్రయోజనము లేదు. నేనని పలికెడి యెరుకను యిప్పుడు నాకు గురుదక్షణగా ధారబోసితివిగదా యిక మీద ఆ ధారబోసిన యెరుకను గ్రహించకుము అనగా యెరుకతో సహవాసము చేయుకుము. నేననెడి అహంకారము కలిగియుండకుము. యితరులని నేనని యెష్టి భావముతో తలంచి యెంచెడి భావము గలిగియుండకుము. ఎల్లప్పుడు యెరుక లేకుండా అచల పరిపూర్ణము యందే నిలచి యుండుమవి భావము. ౨

191. కం. పరిపూర్ణ మెరుక లివియని - గురువరు డెరిగించి యెరుక - కూటమి మాన్పన్ ॥ గురువుకు గురు వెసరనుడకు - మరి శిష్యునికింక నోట-మాట వృళ్ళినా ॥ పోయిన యెరుక - మళ్ళీమళ్ళీనా ॥ గురుశిష్యులని యేటి - గురుతెన్న డెరుగాక - నిరతాము యొకరీతి - నిలచున్న బయలందు - మాట వెళ్ళినా ॥ పోయిన యెరుక - మళ్ళీ మళ్ళీనా ॥ ४

తా. శిష్యా ! శ్రీ సద్గురుమూర్తి ఇది అచల పరిపూర్ణము యిది మూలములేని గుర్తెరిగే యెరుకయని నెరిగించి యెరుక యొక్క స్నేహమును విడిపించుటకు అచల గురువునకు సాటి యితర గురువులు యెవ్వరును కారు ఆయనకు ఆయనేసాటి మరి ఎవ్వరివల్లను కానేరదు. యీయన అచల గురుస్వాములనుటకు, యీయన అచల గురు

స్వాములు కారనుటకు నేననే ఎరుకయొక్క స్నేహము మానిన శిష్యునకు నోట మాటరాదు. విడిచిపోయిన ఎరుక మరల వచ్చునా రానేరదు. గురువు శిష్యుడు యని (ఈశ్వరుడు జీవుడని) భేదము గల్గి తలంచెడి గురుతు శిష్యునకు లేక దివా రాత్రులయందు నొక్కరీతిగా వున్నటు వంటి శబ్ద (మాట) రహితమైనటు వంటిన్ని యీ వృత్త బట్టబయలు నందు నిలచెడి స్థితి గల్గిన శిష్యునకు పోయిన ఎరుక మరల రానేరదని భావము. 4

192. కం. స్థిరమగు పరిపూర్ణము న - స్థిరమగు యీ ఎరుక నెరుక - దెలియు జగములన్ - ఎరిగిన దెరుకేకద స-ద్గురు కృపచే ఎరుకబోతె - గురుశిష్య లేరీ ॥ నోరెత్తాక - మరివినరోరీ ॥ గురుని పాదములాన - గురుతు లేనటువంటీ - పరిపూర్ణ మొకటుండు - పలుక రాదట్లుండె - గురుశిష్య లేరీ ॥ నోరెత్తాక - మరి వినరోరీ ॥ ౧౫

తా. శిష్యా ! అచల పరిపూర్ణము శాశ్వతమై స్థిరమై యున్నది. మూలములేని యీ గుర్తెరిగెటి ఎరుక అస్థిరమై అశాశ్వతమైనది. ఈ ప్రపంచమునకు యీ ఎరుక సర్వసాక్షిగాయుండి సర్వమును గుర్తెరుగు చున్నది. యీలాగు సర్వమును గుర్తించెడి ఎరుక అచల గురు కటాక్షముచే విడిచిపోతే గురుశిష్యులనే భేదము లేనేలేదు. గురునితో ఎదిరించి మాట్లాడక చక్కగా పరిపూర్ణ బోధను వినుము. శ్రీ మదచల గురుమూర్తి పాదముల సాక్షిగా, యే గురుతులకు అందనటువంటి యీ వృత్త బట్టబయలు మాత్రము యుండి యేమాట యేసంకల్పము లేనిదై శబ్దరహితమై శాశ్వతమై గురుశిష్య రహితమై యిట్టి దట్టిదని చెప్పుటకు అలవికానిదై సర్వకాల సర్వదేశ్య సర్వవస్తువుల యందు నిండి నిబిడీకృతమై చలించకయున్నది. నీవు సంకల్పమనే పలుకు లేనివాడవై ఈ అచల బోధను చక్కగా గ్రహించుమని భావము. 5

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్థే బోధ దృఢీకరణ
నామ దశమోధ్యాయః

— •,• 11 * ౧౧ *-బోధస్థితి పురుషలక్షణం-*౬ * 6 •,• —

193. కం. గురుడచల చలనములను తన-కెగిరించిన శిష్యుడెరిగి-యెరుకై యుండన్ - యెరుకను నిల్పకు మనినను-యెరుకను విడనాడి శిష్య - డెట్లుండునంటె ॥ అట్లనె నిం - కెట్లుండునంటె॥ పురుషుడు లేనట్టి - పొలతి సౌందర్యాము - మరి మరి కలిగుండి - మరి లేనట్లనియుంటి - యెట్లుండునంటే ॥ అట్లనె నిం - కెట్లుండునంటే ॥ ౧

తా. శిష్యా ! శ్రీ సద్గురుస్వామి రాకపోకలు లేక చలనరహితమై కదలిక లేనటువంటి ఈ వృత్త బట్టబయలును, చలనమై కదలిక గల్గిరాకపోకలుగల్గి లేనటువంటి ఎరుకను నెరిగించిన, ఆ శిష్యుడు పరిపూర్ణమెరుకల రెండింటిని గురుప్రభువుచే నెరింగి ఎరుకై యుండుటను గురుమూర్తి జూచి ఎరుకను తీసివేయుమని శిష్యునికాజ్ఞాపించిన, గురు అజ్ఞానుసారము ఎరుకను విడచిన శిష్యుడు ఎట్లాయుండు ననగా భర్త చనిపోయిన యువతి సర్వాలంకృతయై సౌందర్యముకు మిన్నయై లలాటమునందు తిలకము లేక మెడలో మాంగల్యము లేక ముత్తైదువులతో పేరంటమునకు పనికిరాక, యింటగల సర్వపనులు చేయుచు తనభర్త చనిపోయిన వాడు మరల రాడని దృఢభావముగల్గి నెట్లుండునో, అటులనే ఎరుక లేనేలేదని తవయందుండెంది నేననే అహమును లేక ఎరుకను విడచిన వాడైన మహాత్ముడు, ఎరుకగల్గిన ప్రజలతో సమముగా కనబడుచు వారలవలె తానును ప్రపంచ సంబంధమగు కార్యముల నన్నిటిని చేయుచు భ్రాంతి విడచినవాడై నిరహంకారుడై చరించుచుండునని భావము. 1

శుద్ధనిర్గుణతత్వకందార్థఉదరువులు - భావార్థములు

194. కం. యెరుకను విడనాడిన యా-పురుషునిస్థితి యెట్టిదనిన-పొందుగ వినుమీ - సరిపడు సరిపడదనకను - సరిగా వర్తింపుచుండు - సమరాసబుద్ధిన్ ॥ కార్యములయందు-సహజప్రవృద్ధిన్ ॥ పరిపరివిధముల పరువులు బెట్టాడు - మరి వైరాగ్యముచేత - మానుకొనుండాడు - సమరస బుద్ధిన్ ॥ కార్యములందు - సహజప్రవృద్ధిన్ ॥ ౧

తా. శిష్యా ! ఎరుక విడచిన పురుషుని వునికి యెట్లుండునంటే వినుము. యిది సరిపడును యిది సరిపడదు, యిది యౌను యిది కాదు అని చెప్పక బేధముచేయక సర్వపనులను సమముగా చూచుచు చేయుచుండును, సర్వకార్యముల యందును సమరసభావముతో సుఖదుఃఖములు విడచి ప్రవర్తించును. అధికాశగల్గి విశేష తాపత్రయముతో కార్యములయందు ప్రవర్తించడు. యేమియు లేదని వైరాగ్యముగలిగి కార్యములు చేయుట మానడు. యేలాగు జరిగేపనులు ఆలాగు జరుగునని తలంచి పోయినదానికై విచారించక రానిదానికై కోరక వున్నదానికై సంతోషించక యిది కావలయుననిగాని, యిది అక్కరలేదని కానియనక సంసారమునందు అంటివున్నటుల పరులదృష్టితో కనపడుచు తన దృష్టిలో అంటియుండక అహంకార మమకారములు విడచి ప్రవర్తించునని భావము. 2

195. కం. అనహంకారు డనిమిషుడు - గనుకనె విశ్వంబ నేటి - కలగానడహం - బనువాడు పనిమిషుడుగా - వున విశ్వంబనేటి స్వ - ప్నోద్యోగముబూని ॥ చేయుచు యా - వుద్యోగాము మానీ 1 యను నీ స్వప్నోద్యోగ - మునకు నేకారణ - మని తాననిమిష - డెన్నడను కోడిమాట ను - ద్యోగాము బూనీ ॥ చేయుచు యా వు - ద్యోగాము మానీ ॥ 3

తా. శిష్యా ! ఈ ఎరుకయనే అహంకారము లేనివాడే అనిమిషుడు, గనుక ప్రపంచమనెటి కలను పొందడు. ఎరుకయనే అహంకారముతో నున్నవాడు సనిమిషుడు, గనుక ప్రపంచమనియెడి కలను పొందుచు సుఖదుఃఖములు పొందుచు కార్యములు చేయుచుండును. సనిమిషుడు యే కారణముచేత యీ కార్యము ఈలాగు జరిగినదని ప్రపంచమనే కల వుద్యోగముగాని చింతించుచుండును. ఈకల యనెడి కార్యము యే కారణముచేత ఈలాగు జరుగుచున్నదని ఎరుకయనే అహంకారము లేని అనిమిషుడు ఎన్నడు ప్రపంచమనే కల వుద్యోగమును తలంచడు. ఎందువల్లననగా అచల పరిపూర్ణమగు బట్టబయలునందు ఎరుకలేక అనిమిషత్వము పొంది కదిలిక లేనివాడై యుండుటచేతను, అనిమిషత్వమనగా అహంకారము లేకుండుట దేవత్వము రెప్పవాల్పకుండుటయని అర్థము. అట్టి అనిమిషునకు అజ్ఞానమగు నిద్రలేనివాడై గురు మేల్కలో నుండి అశ్రద్ధ అనే బద్ధకము లేనివాడై యెల్లప్పుడు పరిపూర్ణ స్థితియందే యున్నవాడుగాన ప్రపంచమనే కల లేనివాడు కార్యకారణములను తలంపులేని వాడని భావము ॥ సనిమిషత్వ మనగా అహంకారము కలిగియుండుట నరత్వము రెప్పవాలుట అజ్ఞానమగు నిద్రా బద్ధకముయని భావము.

196. కం. కల మేలుకొన్న పురుషుడు - కలలోపలి బాము లెరుక - గలిగుండగనే - తిలకింపలేవు గురుకృప - తెలిపొందిన వాని కింక - తిప్పాలున్నావే ॥ తెల్వర కొద్ది - గొప్పాలున్నావే ॥ తలిదండ్రి దొరదాత - కులదైవ మాప్తులు - కలబాంధవులు - దేశికులని నమ్మితె యింక - తిప్పాలున్నావే ॥ తెల్వరకొద్ది - గొప్పాలున్నావే ॥ ౪

తా. శిష్యా ! కలలో అనేక సుఖదుఃఖములు పొంది మేల్కొన్న పురుషుడు కలలోపలి కష్టసుఖములు మేల్కలో నెరుగజాలడు. కలలో వాటిని తలంచుకొన్నను మరల కనబడవని వాటివలన ఫలితము లేదని

తెలియును అటువలెనే శ్రీ సద్గురుమూర్తి కృపయనెడి కరుణచేత ప్రపంచమనెడి కలనుండి మేల్కొవను పొందినవారికి ప్రపంచ సంబంధమగు కష్టసుఖములు లేవు. కొద్ది గొప్పలు ఘనము నీచములు లేవు. తల్లియు తండ్రియు ప్రభువు దాతయు కులదైవము ఆపదలో ఆదరించిన మిత్రులును బంధువర్గమును సర్వమును శ్రీ సద్గురు స్వాములేయని త్రికరణ శుద్ధిగా నమ్మి సేవించినవారికి యెట్టి కష్టములు హెచ్చు తగ్గులు లేక యుందురని భావము. 4

197. కం. ఈ రీతి స్థితి గలిగిన - నేరుపు శాలితర జనుల - నిందాస్తుతులన్ - తారేగి చేయుడెన్నడు - వారలు మరిచేసిరేని - వలదాని యనడూ ॥ చెవియొగ్గి - కావలెనాని వినడూ ॥ వారుమీవారు మా వారు వీరనుకొంచు - సారెకు వీధిలో - పోరాడే వారిని - వల దాని యనడూ ॥ చెవియొగ్గి - కావలెనాని వినడూ ॥ ౫

తా. శిష్యా ! ఈ అచల పరిపూర్ణ స్థితిని పొంది బుద్ధివంతుడై వితరణశాలైన శిష్యుడు యితరులు చెడ్డవారిని నిందింపడు యితరులను మీరు గొప్పవారని స్తుతింపడు పొగడుకొనడు తాను యే క్షణము నందైనను అహంకార మనెడి కోపము గలిగియుండడు. యితరులు తనను నిందించినను తిట్టినను అహంకారముగల్గి మీరు తిట్టవలదని యనడు. వారలు స్తుతించి గొప్పవాడని పొగడిన సంతోషించి ఆనందించడు. తాను యిూలాంటి మాటలను చెవియొగ్గియైనను వినడు. యితరులు వారు మీవారు వీరు మావారని యనుచు నిందాస్తుతులను జేసుకొనుచు వీధులయందు పోట్లాడేవారిని వాదోపవాదములు జేయువారిని వలదని యనడు అట్టి మాటలు చెవులతోనైనా వినడని భావము. 5

198. కం. ధ్వని మొదలగు తన్మాత్రలు - గనుగొనగా లేశమైన - గాన్పించని చో - టును బట్టబయలుగా గని - ధ్వని ముఖ

తన్మాత్రలున్న - దాన్నె యెరుగకనూ ॥ గని యీ రెంట్లో - దేన్ని యెరుగకనూ ॥ పునికి గల్గినయట్టి - ఘనుని సన్నుతి జేయ - జనులాకు శక్యమం చనరాదు వినరాదు - దాన్నె యెరుగకనూ ॥ గని యీ రెంట్లో - దేన్ని యెరుగకనూ ॥ ౬

తా. శిష్యా ! పంచభూత విషయములగు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము లనియెడి పంచ తన్మాత్రలు యే బట్ట బయలునందు లేనివో అదియే అచలమని పరిపూర్ణమని తెలియుము. శబ్దము, స్పర్శము రూపము రసము గ్రంధము లనెడి తన్మాత్రలు యీ తన్మాత్రలయొక్క అంశములగు శ్రోత్ర త్వక్కు చక్షు జింహ్వ ఘ్రాణ ములు దేనియందున్నవో దానిని ఎరుకయని తెలిసి విడువుము. ఇది అచల పరిపూర్ణము యిది ఎరుకయని (యిది వున్నది యివి లేనిది యని) యీ రెంటిని నెరుగని స్థితిని పొందిన మహాత్ముని కీర్తించుటకు యీ జనులకు శక్యము కాదని భావము. 6

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచితే తాత్పర్య భావార్థే గురుమంత్ర ప్రతాపం
నామ ఏకాదశోధ్యాయః

—••• 12 * ౧౨ బోధ పఠన లక్షణం ౧౪ * 14 •••—

199. కం. నామాట లెస్స వినుమా - సామాన్యం బనుచుజూడ - జనదిబోధన్ - ప్రేమాతిశయమునం గని - వేమారిది గురుని నోట వినవలెసుమ్మీ ॥ నిత్యము జదువు - కొనవాలేనమ్మీ ॥ నామ రూప క్రియ - నటనలు గలిగిన - దేమివస్తువో - దాన్ని యెటునిల్వ నివ్వాదు - వినవలెసుమ్మీ ॥ నిత్యము జదువు - కొనవాలెనమ్మా ॥ ౧

తా. శిష్యా ! నేను యిప్పుడు చెప్పుచున్న యీ పరిపూర్ణబోధను వినుటకు అశ్రద్ధవిడచి శ్రద్ధతో యితర చింతలు విడచి బాగుగావినుము. యీ పరిపూర్ణబోధ యితరులు అందరూ బోధించెడి బోధవంటిదని, సామాన్యమని తలంచకుము. యీ బోధయందు అత్యంత ప్రేమగలిగి అనేక పర్యాయములు శ్రీ సద్గురు స్వాములవారి నోట యీ పరిపూర్ణ బోధ వినిన నీకు శ్రేయోదాయకము. ప్రతిదినము యీ పరిపూర్ణ బోధను తెలిపెడి గ్రంధములు జదువుచు వాటినే వచింపుచు (జెప్పుకొనుచు) ఆ వాక్యములే వినుచు యున్నయెడల పేరు రూపము, ప్రవర్తన, కర్మము లనెడి వృత్తులు గల్గిన ఎరుకను ఎందును నిలువనీయక పోగొట్టునని భావము. 1

200. కం. నే మొదట నిన్నుగనుగొని-యేముక్కలు నీదుచెవులో-యిమిడిస్తినో - నీ - వా ముక్కలు మూడింటిని - యే మాత్రము మరువకుండ - యీ బోధనిస్తి ॥ అంతకెయింత-గా బోధజేస్తి ॥ ప్రేమతో జదువు మి - దే మారకెప్పుడు - కామితార్థమునిచ్చు - వో మీ యింటికి దేవించీ బోధనిస్తి - అంతెకె యింత - గా బోధజేస్తి ॥ ౨

తా. శిష్యా ! నేను నిన్ను జూచినతోడనే ఏ పలుకులు నీ దక్షిణ చెవిలో నిమిడించినాటించితినో అద్వాదశీ, షోడశీ, పంచదశీయను మంత్రములు మూటిని మరచిపోకుండా నీమనస్సుకు దృఢపడుటకై యింతవిశేషముగా యీ పరిపూర్ణబోధను నీకు బోధజేసితిని. ఈ మంత్రత్రయముల యొక్క ధర్మములు మర్మములు సూక్ష్మముగా నీవు గ్రహించుటకై యింత విరివిగా వుపమాన వుపమేయములతో బోధించితిని. ఎక్కువైన అభిలాష గలవాడవై ఈ గ్రంధమును నిత్యము జదువుచుండుము. ఈ మాట యెప్పుడు మరచిపోకుము. నీవు కోరికొనిన జననమరణ రహితమగు కామ్యము శులభముగా యిచ్చును. యిక మీ యింటికి నీవు

వెళ్ళుము, జన్మరాహిత్య మగునటుల దీవించి ఈ అచల పరిపూర్ణబోధ నీకు బోధించితినని భావము. 2

201. కం. అన్నము దిన్నను ఆకలి - తిన్నగ నీరంబుద్రావ - తృష్ణయు రోగం - బెన్నగ నౌషధ సేవను - జన్నక్రియన్-యెరుకనిల్వ-జాలదోయన్నా ॥ ఈ బోధ నీ - చౌలతోవిన్నా ॥ కన్నులతో జూచి - కడముట్ట జదివిన - నిన్నెన్నటికి యెదుట - నిలచుండి కనుగొన-జాలదోయన్నా ॥ ఈ బోధ నీ చౌలతో విన్నా ॥ 3

తా. శిష్యా ! అన్నము భుజించుటచే ఆకలి తీరినట్లును నీళ్ళు త్రాగుటచే దాహము తీరినట్లును ఔషధము సేవించుటచే రోగము పోయినట్లును శ్రీ సద్గురు స్వాములవారిచే యీ పరిపూర్ణ బోధ నీ చెవులతో వినిన యడల యెరుక యెచ్చట నిలుచుటకు తావులేక పారిపోవును. నీ కన్నులతో యీ గ్రంథమును ఆది మొదలు అంత్యము వరకు జూచి ఈ కందార్ద కందపద్యములు భావార్థములతో జదువుట వలన లేక వినుట వలన నేను అనే అహంకారము అను యెరుక నిన్ను అంటివుండక నీ ఎదుట యే క్షణములోనైననూ నిలుచుండక నీవు కనుగొనుటకు కానరాక మటుమాయగా పోవును. శ్రోత్రములు నేత్రములు వినుట జదువుట చూచుటయైన ఎరుక రహితమగునని భావము. 3

202. కం. జనన మరణ ప్రవాహము - నణచును యీ బోధ పట్టుడని - సాధువు లిచ్చిన - నొల్లకుండి వారలు - జనినపుడా బోధమీద - జనియించి ప్రేమా ॥ వెదకెదరట్టి - జనచేష్టలేమా ॥ యని తోచి నీకు నేవిన - జెప్పవలసె నీవును - ఈ బోధను వల్లననకు - దొరుకదు మళ్ళీ - జనియించి ప్రేమా ॥ వెదకెదరట్టి - జనచేష్టమా॥ ४

తా. శిష్యా ! పుట్టుట చచ్చుటయనే రాకపోకలుగల ప్రవా

హముసుండి దరిజేర్చునట్టి పరిపూర్ణ బోధను బోధించెద వినుడని అచల గురుస్వామి తమ వద్దకు వచ్చి బోధించుటకు యత్నించిన యెడల పరమ మూర్ఖులగు జనులు యీ పరిపూర్ణ బోధ మాకు కూడదందురు. ఆ అచల గురుస్వాములు అచ్చటనుండి వెళ్ళిన కొన్నాళ్ళకు యీ మూర్ఖజనులు పూర్ణబోధను పొందవలయునని యితర మైనవి యెన్ని తెలిసినను యీ నరజన్మకు సార్ధకము లేదని ఆశగలవారలై ప్రేమతో అట్టి అచల గురు స్వాములగు మహాత్ములేక సాధువులు ఎచ్చట లభ్యమగుదురా యని వెతుకులాడుదురు. జనులయొక్క బుద్ధులు యీలాగు యుండునని నేను తెలిసి నీకు వినజేసితిని, గావున నీవు యీ సమయములో యీ పరిపూర్ణ బోధను పొందుటకు వద్దనకుము. యిట్టి పరిపూర్ణబోధ సక్రమముగా భోధించ గల్గిన సద్గురుమూర్తి మరల నీకు దొరకుట ప్రయాస లేక దుర్లభమని భావము. 4

203. కం. మరుపుకు తన్మాత్రలుగల - వెరుకకు తన్మాత్రలున్న - నీ రెండొకటే - పరిపూర్ణమునకు లేవని - పరిపూర్ణము యెరుక గాదు - మరుపూగాదోయీ ॥ వెతకిన దీని-సరిది లేదోయీ ॥ పరిపూర్ణ మెరుకాల - శోధించి గ్రంథము - రచించి నీకిస్తి - మరువక చదు వెరుక - మరుపూగాదోయీ ॥ వెతకిన దీని - సరిది లేదోయీ ॥ ౫

తా. శిష్యా ! మరపుయనే మరచుటయందు తన్మాత్రలనెడి శబ్ద స్పర్శ రూప రస గంధములతో కూడిన శ్రోత్రత్వక్కు చక్షు జింహ్వ ఘ్రాణము లున్నవి. యెరుక లేక గుర్తుయందు ఈ తన్మాత్రలతో కూడిన శ్రోత్రత్వక్కు చక్షు జింహ్వ ఘ్రాణములగు జ్ఞానేంద్రియములు వున్నవి ఈ రెండు వొక్క యెరుకేయని తెలియుము. ఈ వృత్తి బట్టబయలుకు పంచ తన్మాత్రలు గాని తన్మాత్రల అంశములగు శ్రోత్రత్వక్కు చక్షు

జింహ్వ ఘ్రాణములు గాని యేమియు లేవు. ఈ బట్టబయలు యెరుక యెన్నడూకాదు. నీవు బాగుగా విచారించుము. ఈ పరిపూర్ణ మగు బట్టబయలుకు సమానమైనది యింకొకటి లేదు. ఈ వుత్త బట్టబయలును ఈ లేని యెరుకను ఈ రెండింటిని అనేక విధములగా చక్కగా విచారించి శోధించి ఈ పరిపూర్ణ బోధకు ఈ గ్రింధము సిద్ధాంతమని వ్రాసి నీవు చదువుమని దీనిని నీకిస్తినిగాన యెల్లప్పుడు ఈ గ్రంధము చదువుచుండుమని భావము. 5

204. కం. అందముగా సద్గ్రింధము - చందము వినిపింతుదాన్ని-చదివిన వినినన్ - ముందుగ బయలెరుకై యే - సందున లేనెరుక లేక-జనవలె సుమ్మీ ॥ నదె యిదివిని - చదువుమీ నమ్మీ ॥ యెందూకు నీకింక - యితర శాస్త్రములజో లందు - గుర్తుండీ పోదది - గాన ఈ యెరుక - జనవలెసుమ్మీ ॥ అదె యిది విని - చదువుమీనమ్మీ ॥ ౬

తా. శిష్యా ! ఈ అచల గ్రంధము యందుండెడి అంశములను చక్కగా వినిపింతును వినుడు, లేక మీరలు యెల్లప్పుడు చదువుచుండుడు. ఈ గ్రంధము అలాగు చదివిన యడల ముందుగా పరిపూర్ణమును దృఢముగా తెలియపరచును. ఆ తర్వాత ఎచ్చటను లేనటువంటి ఎరుకను లేకుండా జేయును. నీ మనస్సులో ఈ గ్రంధమును నమ్మి యిందుండెడి అంశములను వినుచు చదువుచు సూక్ష్మజ్ఞప్తిచేత గ్రిహించుచుండుము. నీవు యితర వేదాంత శాస్త్రములను నమ్మి జదివినయెడల ఎరుక బలముగా వుంటుందిగాని ఎరుక భ్రాంతి పోనేరదు. అందుకై అచల పరిపూర్ణమును స్థిరపరచి లేని యెరుక లేకుండా జేయునది ఈ గ్రంధమేగాని యింకొకటి లేదని భావము. 6

205. కం. చెక్కెర మెక్కక లోకులు - చక్కర మాధుర్య మెరుగ - జాలరటువలెన్ - మక్కువతో విని జదువక - చక్కగ గ్రింధా

ర్ధ మెరుగ - జాలేర జనులూ ॥ కావున నీవు - చాలించి పనులూ॥ చొక్కా
మీ గ్రంథాము - చూడుమీ కొనవెళ్ళ - యిక్కాడితో జన్మ -
మె త్తావుసరి - తెలియు_జాలేర జనులూ ॥ కావున నీవు-చాలించీపనులూ॥

తా. శిష్యా ! శ్లేష్మజాతి రోగము గల్గిన వారలు పంచదారను తినజాలరు ఏమన తియ్యని చక్కెర వారి జింహ్వాకు హితవుగా వుండదు. అందుకై వారు దాని మాధుర్యము యెరుంగజాలరు. అటువలె యీ జనులు ప్రేమతో యీ అచల గ్రంథము వినక జదువక యీ గ్రంథము నందుండెడి భావార్ధములతో కూడిన సారాంశమును యెరుంగ జాలరు. ఆ పామర జనులవలె యీ గ్రంథము చదువుటలో అశ్రద్ధ శాయక నీకుగల పనులు తగ్గించుకొని నీ యదార్ధమును తెలియపర్చెడి యీ గ్రంధము ఆఖరువరకు చూడుము. ఆలాగు పదే పదే చదివితివేని యింతటితో నీ జన్మము పరిపోవును మరల జన్మమెత్తవు. పామర జనులు వారికిగలిగెడి పనులు విడువజాలక యీ గ్రంథము ఆ సాంతముజూడక సారాంశము తెలియ నేరక చచ్చుచు పుట్టుచు నుందురని భావము. 7

206. కం. గూడార్ధ మెరిగి సతతా - రూఢుండై నతడు గ్రంథ రుచి గొనడు భువిన్ - గాఢతర జ్ఞానంబున-మూఢుండై యున్నవాడు - మొదటికే వినడూ ॥ సుజనులపాడ - ముదమొప్పాగనడూ ॥ వాడు వీ డనరాని వాడే గ్రంధము వినే - వాడు నిశ్చయమిట్టి - వార్త లెరుగని వాడు - మొదటికే వినడూ ॥ సుజనులపాడ ముదమొప్పగనడూ ॥ ౹ా

తా. శిష్యా ! ఈ ప్రపంచములో మంత్ర లయ హట యోగము లచే సాంఖ్య తారక అమనస్క భావంబుల వర్తించుచు గూడార్ధపరుడై యోగాదులచే అమనస్క సమాధిని పొందిన జ్ఞానియైన ఆరూఢుడు, యీ గ్రంధముయొక్క సారాంశము నెరుంగజాలడు. అజ్ఞానమగు ఽటికి

చీకటిలో తారాడుచు దేహమే శాశ్వితమనుకొని అరిషడ్వర్గములతో మెలంగెడి మూఢుడు యీ గ్రంథము యెట్టిదో మొదటి కైనను వినడు చూడడు - పెద్దలగు గురువులనుజూచి యోర్వజాలడు, సజ్జనులనుచూచి అసూయపడును. నేను నీవు అనే భేదములేక సమరసజ్ఞానము గలిగిన వాడే యీ గ్రంథమును వినుచు చదువును. యిది యదార్థమగు మాట యని జెప్పితిని. ఈగ్రంథముయొక్క బోధాలక్షణము యెరుగని మూర్ఖులు సద్గురువులగు పెద్దలను ఈ శేవించక బోధను నిందించుచుందురని బావము.

207. కం. తాబేటి తలపుచేతను - తాబేల్పిల్లల షుదార్తి - తలగుట దెలియన్ - తాబేటి గర్భమందున - తాబేలై పుట్టకున్న - తరమా యితరులకూ ॥ సద్గురుబోధ - ట్లరయ నితరులకూ ॥ యే బాధలెరుగాని - ఈబోధ గలవారి - చేబోధ బడయాక - చేకొనదలచీ తె - తరమా యితరులకూ ॥ సద్గురుబోధ - ట్లరయ నితరులకూ ॥ 8

తా. శిష్యా ! తాబేలుయొక్క తలంపు చేతను ఆ తాబేలు పిల్లల యొక్క ఆకలిబాధ పోవుట తెలియవలెనని - తాబేలు గర్భ మందున తాబేలుగా పుట్టిన పిల్లలకే తెలియునుగాని - యితర గర్భ జనిత మైన వాటికి తెలియనేరదు. అలాగు ఈ అచల గురుబోధ తెలియవలె ననిన ఆ అచలగురు సాంప్రదాయక శిష్యులకేగాని యితర గురుసాంప్ర దాయకులకు తెలియునేరదు. జననమరణ సుఖదుఃఖాది ద్వంద్వసంబంధ మగు యే బాధలులేని ఈ పరిపూర్ణ బోధగల సద్గురువులచే బోధను పొంద నేరక కర్మ భక్తి యోగ జ్ఞానులగు గురువులచే ఈ పరిపూర్ణబోధ పొందవలయుననిన ఈ బోధయొక్క మర్మములు ధర్మములు వారలకు తెలియ నేరవని భావము. 9

208. కం. ఈ తాపేక్షను మనుజులు - సూతిదరిం జేరినిల్చి - నోట గొలిగినన్ - ఈ తేలవచ్చు వారికి - చేతులతో నీక్షళమీద - చేరి

ఈదకనూ ॥ మునునేర్చిన - వారీదించకనూ॥ ఈతీరుగనే దేశి-కేంద్రుడు దెల్పాక - చాతుర్యమున బోధ సాధించనయ్యాన - చేరి ఈదకనూ ॥ మునునేర్చిన - వారీదించకనూ ॥ ౧౦

తా. శిష్యా ! ఈత నేర్చుకొనవలయునని కోరికతో నుండిన మనుష్యుడు నదియొడ్డునగాని చెరువుయొడ్డున నిలచి, ఈతరావలయునని ఎంత సేపు నోటిలో అనుకొనుచుండినను వానికి ఈతరానేరదు. అతడు నీళ్ళ మీద పరుండి చేతులతో ఈదవలయును. అట్లు ఈదుటకు యిదివరకు ఈతనేర్చుకొని ఈదుచున్నవారు తనను నీళ్ళమీదవుంచి మొలత్రాటిని పట్టి నీళ్ళలో మునుగకుండా పట్టుకొని చేతులతో ఈదమని వారును ఈదుచు తనకు ఈత నేర్పవలయును. ఈ విధముగా అచల గురువులవల్ల పరిపూర్ణ బోధ తెలియక తన వూహాపోహ లనెడి చతురతచే పరిపూర్ణ బోధ తెలియవలెననిన సాధ్యముకాదు. ఎట్లనిన ఈ పరిపూర్ణ బోధ యందుండెడి మర్మములు తెలియనేరవని భావము.

209. కం. ప్రవిమలచిత్తుడు శిష్యుడు - సవినయమున దేశికునకు - శరణాగతుడై - త్రివిద ప్రసాదములుగొని - భవనాశస్థితులు లేని - పద్ధతి వినినన్ ॥ తిరిగిరాని - పద్ధతి గనినన్ ॥ భువిలో వాని సాటి - బోల్పనెవ్వరులేరు - అవిరాళ భక్తినీ - వారీతి నుండేవీ - పద్ధతి వినినన్ ॥ తిరిగిరాని పద్ధతి గనినన్ ॥ ౧౧

తా. శిష్యా ! నిర్మలమగు అంతఃకరణతో నుండెడి శిష్యుడు భయభక్తులతో అచల గురుస్వాములకు శరణు జొచ్చినవాడై యామహాత్ములవలన ద్వాదశీ. షోడశీ, పంచదశీ యనే త్రివిధ ప్రసాదములు పుచ్చుకొని, పుట్టుట, చచ్చుటలులేని అచల పరిపూర్ణ బోధను ఆసాంతగా విని మరల జన్మముకు రానటువంటి వాడైన మనుజుడే మహాపుణ్యాత్ముడు, ఈ లోకములో ఆ పుణ్యాత్మునకు సాటియైనవారిని పోల్చుటకు మరియెవ్వ

రూపుండరు. అట్టివాడు అచల పరిపూర్ణ స్థితిని పొందినవాడై సద్గురువులయందు యెడతెగని భక్తి గలిగి యుండుమని భావము. 11

210. కం. ఉపనయనముగానిదె తా - నుపనయనముమీది చదువు - నూహను గొనినన్ - విపరీతమగును దానను - చపలుడు బ్రాహ్మణుడుగాడు - చర్చించిచూడా ॥ శూద్రుడువాన్ని - యర్చించ రేడా ॥ వుపమాచేబోదట్ల - ఊహించి నిక్కోటి - కపటాచిత్తుడు సాధు - గణముతో సమమౌనె - చర్చించిచూడా ॥ శూద్రుదు వాన్ని యర్చించరేడా ॥ ౧౨

తా. శిష్యా ! వడుగు జేసుకొని గాయత్రీ మంత్రోపదేశము పొందకయే గాయత్రీ మంత్రమునకు అధిష్టానమైన వేదములు వూహవల్ల చదువుట అలవాటు జేసికొనిన ఆ గాయత్రీ అధిష్టాతయగు బ్రహ్మము తెలియుటను అట్టి వేదములు స్వరయుక్తముగా చదువుట విమర్శ జెప్పుటయును విపరీతమగునేగాని విచారించగా వేదములు తెలిసిన బ్రాహ్మణునిచేత చెప్పించుకొనిన బ్రాహ్మణుడు కానేరడు. విచారించగా శూద్రుడే యగుచున్నాడు అట్లా ఈ పరిపూర్ణ బోధ తన వూహ చేత తెలుసుకొంటినని గర్వించి మాట్లాడువాడు పూర్ణబోధకుడు కాడు కపట మనస్సు గలవాడు అట్టివాడు అచల గురునకు శుశ్రూషలు జేసి, పరిపూర్ణ బోధ దెలసిన సాధు జనముతో సమానము యెన్నడూ కానేరడని భావము. 12

211. కం. మంత్రముచే సం తెట్లగు - తంత్రము లేకున్నకాదు తంత్రము చేతన్-మంత్రములేకను వడుగిల-మంత్రము తంత్రంబురెండు॥ మరిగూడకోని ॥ కార్యములన్ని-జరిగించుపూనీ ॥ మంత్రతంత్రమూలాలో మర్మాము గురుడెరుగ - మంత్రతంత్రములాలో - మరుగెరుగు గురు నిచే - మరిచూడుకోనీ ॥ కార్యములన్ని - జరిగించుపూనీ ॥ ౧౩

తా. శిష్యా ! స్త్రీలు తమ భర్త యొక్క సంపర్క మనెడి తంత్రము లేక ప్రత్యేకముగా మంత్రముచేత సంతానము బడయలేరు. అటు వలె యీ పరిపూర్ణ బోధ స్థితికై మంత్రతంత్రములనెడి రెండింటి చేతను సర్వకార్యములు చేయుము॥ మంత్రమనెడి మర్మమును తంత్రమనెడి దష్టాంతదృష్టాంతములను ఈ రెండిటియొక్క రహస్యములు శ్రీ సద్గురుమూర్తి కరుణచేత తెలియును మంత్రతంత్రములను గురుముఖముగా విచారించి తెలుసుకొని సర్వకార్యములు చేయుచుండుమని భావము. 13

212. కం. సంకల్పాదిక గుణముల - సంకులమీ యెరుక యందు-సమకూడుండున్ - సంకల్పాదిక గుణముల - సంకుల మచలమున జూడ-జాడాలేదన్నా ॥ ఈ రెంటికీ - ఈడు గాదన్నా ॥ కొంకక ఈ రెంటిన్ని గూర్చి గ్రంధము జేస్తి - సంకోచింపక జదువు - శంకబుట్టదు శంక జాడలేదన్నా ॥ ఈ రెంటికీ - ఈడు గాదన్నా ॥ ౧౪

తా. శిష్యా ! అనేక సంకల్పాదులతో గూడిన భ్రాంతులు గుణములు సంశయములు ఈ యెరుకయనే మనస్సునందు నిండియుండి పుట్టుచుండును. అలాగు సంకల్పాదులు గుణములు సంశయములు భ్రాంతులు ఈ అచల పరిపూర్ణము యందు యెచ్చటను లేనేలేవు. ఈ వృత్తి బట్టబయలకును యెరుకకును సంపర్కము ఎన్నడూ లేదు. అనగా యెరుక అచల పరిపూర్ణము కాదు అచల పరిపూర్ణము యే క్షణములో నైనా యెరుక కాలేదు. ఈ పరిపూర్ణమును యెరుకను నేను నిజము యెంతయో బాగుగా విచారించి చూచి ఈ గ్రంధమును వ్రాసితిని. నీవును సందేహించక యెల్లప్పుడు ఈ గ్రంధమును జదివితివేని నీకుగల సందేహములు భ్రాంతులు గుణములు యుండవని భావము. 14

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య బావార్థే బోధపఠన లక్షణం
నామ ద్వాదశోధ్యాయః

••• 13 * ౧౩ * భద్రాద్యంకితం * ౮ * 8 •••

213. కం. అల భద్రాచల మనిన - బయలుగా గుర్తెరుగ వలయు - యెరుకను విష్ణ్వం - దులదోచి గురుని కృపచే - నిలువక విష్ణ్వగిరిపోతే - నిశ్చయ మదిరా ॥ కృష్ణాదాసు - నిశ్చయమిదిరా ॥ యిలమీద యెవరైనా - ఈ కందార్థముల - లోపలి గూడార్థము దెలియు - భ్రమను జెందరువారు - నిశ్చయ మదిరా ॥ కృష్ణాదాసు - నిశ్చాయమదిరా ॥ ౧

తా. శిష్యా ! అల భద్రాచల మనగా శాశ్వతమై చలనములేని దైన ఈ పుత్త బట్టబయలని గుర్తెరుగుము ఆ భద్రాచలము యందు కనిపించెడి విష్ణువే ఈ బట్టబయలునందు కనుపించెడి యెరుకయని తెలియుము శ్రీ సద్గురుమూర్తి కరుణచేత ఈ బట్టబయలు శాశ్వతమై యుండుటయు అందు విష్ణువు యనె యెరుక అశాశ్వతమై లేకపోవుటయు నిశ్చయము, యిదే శ్రీ భాగవతుల కృష్ణదేశకులవారి బోధోద్దేశ్యము ఈ ప్రపంచములో నెవ్వరైనను ఈ కందార్థములలో నుండెడి రహస్యాతి రహస్యమగు పరమ రహస్యమును సద్గురుమూర్తి కరుణ చేత తెలిసినేని యే భ్రమలు జెందరు యెదె సిద్ధాంత వాక్యమని భావము. 1

214. కం. భాగవతుల నారాయణ - యోగికి జానకి యనేటి - యువిదామణికిన్ - బాగుగపుత్రుడనై భూ - భాగమునన్ కృష్ణననుచు

ప్రభవించినానూ ॥ అనంతికి - ప్రభువైనానూ ॥ నా గురువు కృపచేత - నయమైన యీ బోధ - నేగంటి కన్నంత - నీకు దెల్పుట కిట్లు - ప్రభవించినానూ ॥ అనంతికి - ప్రభువైనానూ ॥ ౨

తా. శిష్యా ! శ్రీ భాగవతుల నారాయణ యోగికిని అతని యువతీమణి ఐన జానకమ్మయనెడి దంపతులకు కుమారుడనై జన్మించి యీ ప్రపంచములో కృష్ణుడనే పేరుకలిగి, అనంతమ్మయనెడి సాధ్విలలామకు భర్తనైతిని. నా యొక్క అచల గురుని కరుణవలన యీ పరిపూర్ణ బోధను సాంతముగా నెరింగి నేను మద్గురు ప్రభువులచే తెలిసికొనినంతయు నీకు కొరత లేకుండా బోధించుటకై యీ భూమిమీద నీ కొరకై అవతరించితినని భావము. ౨

215. కం దేశాటనంబు జేసితి - వ్రాసితి గ్రంధములు కొన్ని - పరగురుశిష్యుల్ - జేసెటి చర్చలు వింటిని, రోసితి మోక్షాద్యపేక్ష - రూఢీగ వినుమీ ॥ నీవిట్టియా - రూఢాతగనుమీ ॥ దేశికుదయ బుట్ట జేసి శుశ్రూషోప - దేశాముగొని యుప - దేశామిచ్చితి మెచ్చి - రూఢీగ వినుమీ ॥ నీవిట్టియా - రూఢాతగనుమీ ॥ ౩

తా. శిష్యా ! నేను అనేక దేశములు తిరిగితిని. కొన్ని గ్రంధములు కూడా వ్రాసితిని ॥ అనేకమంది గురువుల శిష్యులు సంభాషించెడి సంభాషణలను వింటిని. వారివారి చర్చలు వాదనలు వింటిని. ఆరూఢజ్ఞానమే మోక్షమని అట్టి మోక్షమనే ఆశకూడ ప్రకృతిస్థాయి దోషములతో కూడినదని అనగా బంధమోక్షములు రెండు ప్రకృతి ద్వయములని అదికూడా విడచితిని, నీవుకూడా నావలెనే బంధమోక్ష రహితమగు ఆరూఢాతీతమును కలిగియుండుము. నాకు నీవు చతుర్విధ శుశ్రూషలు జేసి నాకు దయ బుట్టునటుల భక్తి సలిపితివి గాన నీ భక్తికి మెచ్చి నీయందు కరుణ గలిగి యుపదేశ మొసంగితిని. నీవును నావలె

యీ బోధయందు దిట్టరివగుము. ఆరూఢాతీతమగు పరిపూర్ణము పొందుమని భావము. 3

216. కం. హటమున కుటిలాత్మని జం :- పుటకై భటకోటి కాజ్ఞ భూపతి యిడినన్ - భటులటువలె జేసెటి లో - పటికుటిలుడు బడినపాట్లు పాటించికనునా ॥ అట్ల నెగురుని - నోటతావినినా ॥ యిటువంటి బోధాను- యెటువంటిపరుడైన - అటువెనుక తనచేష్ట - లెటువంటినో వాట్ని- పాటించికనునా ॥ అట్లనె గురుని - నోటతా వినినా ॥ ౪

తా. శిష్యా ! దుర్మార్గుడగు మనుష్యుని మహారాజు జూచి కోపముతో యీతడు దుష్ప్రవర్తకుడు యీ నేరస్థుని జంపుడని మరణదండన విధించి తన భటులకు ఆజ్ఞాపించగా ఆ భటులు రాజాజ్ఞ ప్రకారము వానిని జంపెడి సమయములో కుటిలాత్ముడు తాను ముందు జేసిన దుష్కార్యములగు నేరములు మనస్సులోనైనా తలంపుజేయుడు. ఆలాగుననే అచల గురుస్వాములవలన పరిపూర్ణబోధ వినిన వెనుక యెటువంటి దుష్టుడగు జనుడైనను తనయొక్క వెనుకటి దుష్ప్రవర్తనలను మరల చేయుటగాని వాటని తలంచుకొనుటగాని చేయుడని భావము. 4

217. కం. సకల జనుల సమ్మతిగా - నొకరైనను నడువలేరు - మర్త్యస్థలిపై మకరాంతక జనని జనకా - ద్యతళంకులలోను నీ - వన నేమి గణనా ॥ బోదందితర - జను లేమి గణనా ॥ వికలమానసుడావై - వెతలొందబోకునీ - వకుటిల భక్తుడ - వని దెల్పి తీబోధ - నవనేమిగణనా బోదందితర - జనులేగణనా ॥ ౫

తా. శిష్యా ! ఈప్రపంచమునందుగల జనులందరకు యిష్టముగా వొక్క మనుష్యుడైనను ప్రవర్తించనేరదు, తన ప్రవర్తన కొందరకు యిష్టముగాను కొందరకు అయిష్టముగాను వుండును. అది యెట్లనగా మన్మధుని తల్లియగు లక్ష్మీదేవి జనులందరకు మంచిది యగునా, కానేరదు

మన్మధుని తండ్రి యగు నారాయణుడు ప్రజలందరకు మంచివా డగునా కానేరడు. కొందరు వీరలను స్తుతిచేయుదురు. మరికొందరు నిందింతురు. అట్టి వారలనే ప్రజలు నిందా స్తుతులు చేయుచుండగా నేను నీవు అనగా లోకులకు వొక లెఖ్ఖయగునా. కాదు లోకులు నిందించుచున్నారని చంచల మనస్సు గలవాడవై దుఃఖములను పొందబోకుము. నీవు కుటిలములేని గురుభక్తుడవని యీ పరిపూర్ణ బోధ తెల్పితిని. లక్ష్మీ నారాయణులగు దేవతలే జనులందరకు సమ్మతిగా తిరుగ నేరరు గాన నీవు ప్రజలకు యిష్టముగా తిరుగలేదని నిందించుచున్నారని దుఃఖించకుము యితర జనులయొక్క బోధలు యీ బోధతో సమానము కావని భావము. 5

218. కం. బలధనవిద్యలు దుష్టుల - కిలగల్గిన నొరులనొంతు - రీర్ష్యమునన్ - బనధనవిద్యలు శిష్యులు - కిలగల్గిన నొరుల బ్రోతు- రెంతో మోదమునా ॥ నీవీ రెంటి - నెరిగీ మోదమునా ॥ కలలోనైన దుష్టుల చెంత జేరాకు - మెలమి శిష్టులచెంత, కలనైనా వదలాకు - యెంతో మోదమునా ॥ నీవీరెంటి - నెరిగి మోదమునా ॥ ౬

తా. శిష్యా ! దుర్జనులకు బలమును ధనమును విద్యయును గల్గి యుండిన ఇతరులజూచి వోర్వజాలక అసూయభావము గలవారలై పరాభవముచేసి హాని కావించుచుందురు. సజ్జనులకు బలమును ధనమును విద్యయును గల్గినయడల ప్రజలయందు ప్రేమగలవారై వారలకు సహాయులై తగినమేలు చేయుదురు. యీ రెండువిధంబులు నీవు తెలుసుకొని అట్టివారల మనస్సులను గ్రహించి కలలోనైనను దుష్టుల చెంత చేరకుము, అటులవలె కలలోనైనను శిష్టులగు సజ్జనుల స్నేహము విడువవలదని భావము. 6

219. కం. అండమగు స్వాతివర్షపు - బిందువు లెందెందు బడునో - వృదివిని త - ద్భందువులు పాధివశమున - జెందును తగు నామరూప - చేష్టాదికమునూ ॥ అట్లనే నీవు - జెందే విన్నియునూ ॥ మందితో జతగూడి - మాట్లాడి నంతలో - అందుకే సహవాస - మరయూము తగుదాన్ని - చేష్టాదికమునూ ॥ అట్లనె నీవు - జెందె విన్నియునూ ॥ 8

తా. శిష్యా ! స్వాతి కార్తెయందు కురిసిన వర్ష బిందువులు ఆయూవుపాధి భేదంబులచే ఆయా నామ రూపములు పొందుచున్నవి. యెట్లనగా దున్ని యుంచిన దుక్కులయందు ఆ వర్ష బిందువులు పడిన పైరు వంటలుగను, ముత్యపు చిప్పలలో ఆ వర్ష బిందువులు పడిన మంచి ముత్యములుగను, యేడాకుల అరటిచెట్టు మొవ్వలో ఆ వర్ష బిందువులు పడిన పచ్చకర్పూరముగను, చవిటి నేలలయందు ఆ వర్ష బిందువులు పడిన వుప్పనీరుగను, చెరువులయందు నూతులయందు ఆ వర్ష బిందువులు పడిన మంచినీరుగను, ఆయూ స్థల భేదంబులచే ఆయా నామ రూప భేదంబుల పొందుచున్నవి. అట్లనె నీవు యెవరి సహవాసము జేసిన వారివలె యుగుదువు. లోకులగు జారచోరాది దుష్టజనుల సాంగత్వము జేసిన అట్లనె దుష్టుడ వగుదువు గాన అట్టివారల సహవాసము విడచి సజ్జన సహవాసము జేసిన సజ్జనుడవగుదువు కలలోనైనను సజ్జన సహవాసము విడువ కూడదని భావము ॥ 7

220. కం. జారులకు లోకులందరు - జారులవలె తోచపడుట - సహజ గుణంబౌ - చోరులకు సకల జనములు - చోరకులని మదికి దోచు - చునికి సహజమురా ॥ అట్లనె దుష్టాత్మునికి సహజమురా ॥ సారాములేని సం - సారాబ్ధి దాటించు - వారినీ తమవంటి - వారిగా గను టట్టి - వునికి సహజమురా ॥ అట్లనె దుష్టాత్మునికి - సహజ మురా ॥ ౘ

తా. శిష్యా ! జారుల దృష్టిలో లోకులందరూ జారులవలె కనబడుదురు. దొంగలు తమ దృష్టికి కనబడిన వారందరూ దొంగలుగా మనస్సులో భావించుకొనుట సహజము. అట్లె దుర్మార్గులకు లోకులందరూ దుర్మార్గులుగా కనబడుట సహజము. సారములేని సంసారము నీదుచు దరిగానగ తపించెడి లోకులు నిస్సారమగు సంసారము దాటించెడి సద్గురు స్వాముల తమవంటి వారిగా బోల్చుకొని సంభాషించుట యీ లోకులకు సహజ గుణము, జనన మరణ సంసార సాగరమును దాటించు సద్గురుమూర్తియే పరమాత్మ యని గ్రహించి భావించుట యుక్తమని భావము. 8

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ - విరచిత ద్వైతాద్వైత రహిత పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి విరచిత తాత్పర్య భావార్థే భద్రాద్యంకిత న్నామ త్రయోదశోధ్యాయః

---

—•‚• ౧౪ * 14 * గు రు ని ల క్ష ణ ం * 11 * ౧౧ •‚•—

221. కం. బయలెరుకలు శిష్యునకున్ - నయతో గురు డెరుక జేసి - తరువాతను సం - దియ మేమి లేక యెరుకన్ సమయమున విడిపించు గురుడు - నయశాలిగాదా ॥ నీ మదికిది - నాటెనలేదా ॥ భయభక్తి గురుసార్వ - భౌముని సేవ నిశ్చయమూగ జేసితే - జయమందెదొ గురుడు - నయశాలి గాదా ॥ నీ మదికిది - నాటెన లేదా ॥ ౧

తా. శిష్యా ; శ్రీ సద్గురుస్వామి శిష్యునియందు కరుణ కల్గిన వారై యిది అచల పరిపూర్ణ మనియు యిది లేని యెరుక యనియు

విమర్శించి యే సంశయములు లేకుండా బోధించి అచల పరిపూర్ణమును సూచించి లేనటువంటి యెరుకను సందేహము లేకుండా దృష్టద్రాష్టాంతములచే విడిపింపజేసిన సద్గురు స్వాములు మంచివారు కారా యీ విధముగా శిష్యుని తరింపజేసిన గురుమూర్తి మంచివారని నీ మనస్సుకు తోచెనా లేదా అట్టి గురుమూర్తి యందు నిశ్చలమైన భక్తియు భయమును విశ్వాసమును గలిగి యెల్లప్పుడు సేవచేయు చుంటివేని అన్ని విధముల జయము గలిగి జనన మరణములు పోవుటకు సందేహము లేదని భావము. 1

౭౭౭. కం. పది రెండక్షరముగల - పదమల మంత్రార్థ మెరిగి - సద్గురు కృపచే - పదియారక్షరములుగల - యది యెట్టిదో తెలిసె నేని - యతడే సద్గురుడూ॥ యివి రెండెరుగ - నతడేడీ గురుడూ॥ మొదటిది పరిపూర్ణ - మును దెల్పు నెరుకౌను - తదనంతరపు దీబో - ధను జేయునవి దెలిసి - నతడె సద్గురుడూ॥ యివి రెండెరుగ - నతడేడీ గురుడూ॥ ౨

భా. శిష్యా! శ్రీ సద్గురు స్వామి శిష్యునియందు కరుణచేత పది రెండక్షరములు గల్గిన ద్వాదశాక్షరీ మహామంత్రమును వునికిని తెలిపి తరువాత పదియారక్షరములుగల షోడశాక్షరీ మహామంత్రి మెట్టిదో దాని లేమిని తెలిపినవాడే నిజగురుమూర్తి యీ రెండు మంత్రములు యెరుగ నటువంటివాడు అచల గురుడు కానేరడు. మొదటిదియైన ద్వాదశాక్షరీ మహామంత్రము అచల పరిపూర్ణమును దెల్పును. రెండవదియైన షోడశాక్షరీ మహామంత్రములేని యెరుకను లేకుండా చేయును. యీ రెంటిని యెరిగించి వీటియొక్క కలిమి లేములను శిష్యునకు దృఢముగా బోధించగల మహాత్ముడే నిజగురుస్వామి యని భావము. 2

౨౨౩. కం. ఆ మంత్ర యుగము దెల్పెద - నేమముతో దలపు ముత్తదీ బట్టబయల్ - యేమీ లేదని బల్కిన - యీ మంత్రమె ద్వాదసాక్ష - రింకొటి వినుమీ ॥ యెప్పుడు నోట - యివి మరువకనుమీ ॥ యీ మూలం లేని గుర్తెరిగే శరీరాము - యేమీ లేదని యంటె యిది షోడశాక్షరి - యింకోటి వినుమీ ॥ యెప్పుడు నోట - యివి మరువకనుమీ ॥ ౩

తా. శిష్యా ! ఆ మంత్రములు రెండును యెట్టివో వినిపించెదను వినుము. తనయందు యేమియు లేనటువంటిదైన ఈ వుత్తబట్టబయలు యేమీ లేదని నియమముతో దలంచుచుండుము యిదియే ద్వాదశాక్షరీ, సర్వమునకు తాను మూలమై తనకు మూలము యేమియు లేక సర్వము వున్నటుల భ్రమింపజేయుచున్నదే యీ మూలంలేని గుర్తెరిగే శరీరము, యేమియు లేదని తలంచుటే రెండవ మంత్రమైన షోడశాక్షరీ. యీ వుత్త బట్టబయలు అన్ని కాలములయందు వున్నదని, యీ మూలంలేని గుర్తెరిగే శరీరము ఏ కాలముయందు లేదని భావించుచు యీ రెండు మంత్రములు నీవు యెల్లప్పుడు మరువక నోట జపించుచుండుమని భావము. ౩

౨౨౪. కం. తొలిమంత్ర పథన్ మెక్కడ - గలదోయని వెతుక నేల - కలదంతట యీ - వలి మంత్ర పథన్ మెక్కడ - గలదోయని చూడనేల - కాదా చూచేది ॥ వినేది యనేది తినేది ॥ అల తొల్త దాన్ని నీ - వవలోకనము జేసి - కలకాల మెరుకాల - గల దాన్ని విడు మెరుక - గాదా చూచేదీ ॥ వినేది యనేది తినేది ॥ ४

తా. శిష్యా ! మొదటి మంత్రమైన ద్వాదశాక్షరీ యైన బట్ట బయలు యెచ్చట యున్నదోయని వెదుకవలదు. అయ్యది బశదిశల యందునిండి నూదిమొన యుంచుటకు సందు లేనిదై దట్టమై శాశ్వతమై

యున్నది, రెండవమంత్రమైన యెరుకయెచ్చట యున్నదోయని వెదుక పనిలేదు యేమనగా అదియే చూచునది వినునది తినునది రుచించు నది యీ స్థూల శరీర మందుండెడి గుర్తులేక తెలివి యనునదే సర్వ మును గుర్తించుచున్నది అదియే యెరుక. మొదట మంత్రార్ధమైన బట్టబయలును యీ గుర్తుచేత గుర్తించి ఎల్లకాలములయందు లేనటు వంటిదై అనేక సంకల్పములు పొందుచున్న యీ గుర్తెరిగే శరీరమను యెరుకను విడువుమని భావము. 4

225. కం. ఇది తప్ప యేమి లేదని - మొదటిది మొరబెట్టు చుండు - మదమున వినుమీ - యిది యేమి లేదు పొమ్మని - వదలక రెండవది లెస్స - వదరుచుండునురా ॥ బయలెరుకాల - యిది నిశ్చ యమురా ॥ అదిగాన నీ రెంటి - నరసి నీ విప్పుడు - విదితాముగా రెంటిన్ని - విడరా మంత్రములిట్లు - వదరూచుండునురా ॥ బయలెరు కాల - నిది నిశ్చయమురా ॥ ౫

తా. శిష్యా ! ఈ వుత్త బట్టబయలు తప్ప మరి యేమియు లేదని మొదటిదియైన ద్వాదశాక్షరీ మంత్రముయొక్క అర్థమైయున్నది. ఈ గుర్తెరిగే శరీరమైన యెరుకకు మూలము యేమియు లేదని అనగా యెరుక మొదలే లేదని రెండవదియైన షోడశాక్షరీ మంత్రముయొక్క అర్థమై యున్నది. ఈ వుత్త బట్టబయలగు అచల పూర్ణమును యెరుక యగు యీ మూలం లేని గుర్తెరిగే శరీరమును యిట్లు నిశ్చయముగా చూచి, లేని యెరుకను యెచ్చటను నిలుపక వున్నదనే భ్రమనుపొందక ఖండితముగా ఆ భ్రాంతిని విడచినయడల రెండు మంత్రములు పలుకు సూన్యమై లేకుండా పోవునని భావము. 5

226. కం. పరిపూర్ణ మిదిగొ యిదిగొ - ఎరుకను చూపించి లేని - యెరుకను లేదం - చెరిగించిన గురుడే సరి - ఎరుకను నిల్పేటిగురుడు-

యెందుకోయన్నా ॥ తదోర్భధ-నీ కెందుకోయన్నా ॥ శరణన్నవారి మ-స్తకమందు చెయిబెట్టి - తిర మూగ యెరుకాను - తీసి వెయ్యనివాడు యెందుకోయన్నా ॥ తదోర్భధ నీ - కెందుకోయన్నా ॥

తా. శిష్యా ! ఈ వృత్త బట్టబయలైన అచల పరిపూర్ణమును యిదిగా పరిపూర్ణము యిదిగోయని కనుసౌజ్ఞచే చూపించి - లేని ఎరుకను లేదని యెరిగించి ఎరుకను విడిపించిన సద్గురుమూర్తియే నిజమైన అచల గురుమూర్తి. ఎరుకను నిలుపునట్టి గురుడు నిజగురుడు కానేరడు అతడే బాధ గురువు అనబడును. ఆ లాంటి గురుబోధలు యెందులకైనను వినవలదు. జనన మరణములు పోవుటకై గురుమూర్తికి శరణుజొచ్చి సాష్టాంగపడి నమస్కరించిన శిష్యునియందు గురుస్వామి దయగలవారై అతని శరీరమునందు తనహస్తమునుంచి నాచేయి నీ సిరస్సుయందుంచగా ఏ గుర్తు చేత వుండగా గుర్తించితివో ఆ గుర్తును మరల ప్రపంచ దేహముల గుర్తించ వలదని తీసివేసినవాడే నిజగురుడు యని తెలసి అట్లు తీసివేయనివాడు కల్ల గురువులని భావము. 6

227. కం. పరిపూర్ణ బోధ నెరిగిన - గురువరుచే బోధగొన్న గొప్ప ఫలంబౌ - పరిపూర్ణ బోధ నెరుగని గురువరుచే బోధగొన్న గొప్ప ఫలమౌనా ॥ అది యెట్లన్న - కూడిరతిలోనా ॥ పురుషునిచే సంతు - పొలతి బడయును బడయు - తరమౌన వారికే - తమవంటి వారిచే - గొప్ప ఫలమౌనా ॥ అది యెట్లన్న - కూడి రతిలోనా ॥ 2

తా. శిష్యా ! పరిపూర్ణ బోధ ఎరిగిన నిజగురుమూర్తి వలన బోధ పొందిన యెడల జనన మరణ రహితమగు గొప్ప ఫలితము నిచ్చునేగాని, యీ పరిపూర్ణ బోధ యెరుగని కల్లగురువులచే బోధ వడసిన జనన మరణ రహితమగు గొప్ప ఫలము గలుగ నేరదు, అది యెట్లనగా స్త్రీలు పురుషులతో రతి సల్పిన సంతానము గలుగునుగాని

స్త్రీలతో స్త్రీలు కలియుటచేత సంతానము బడయనేరదు. ఈ లాగునే యెరుకయగు సచ్చిదానంద మార్గమును లేక శివ జీవైక్యమును బోధించు గురువుల బోధవలన గొప్ప జన్మ వచ్చుటకు కారణమగును గాని జనన మరణ రహితము కానేరదు. జనన మరణములు రహితము జేయుటకు అచల గురుమూర్తి బోధించు పరిపూర్ణ బోధయే గొప్ప ఫలితమైన బోధయని భావము. 7

228. కం. పరిపూర్ణ బోధ నెరుగని - గురుశిష్యులు బోధ కొరకు - కోర పనిబడున్ - గురువర్యు నొకని మరలను - హరువరమున బుట్టినట్టి - యా శిఖండికినీ ॥ భార్యైనట్టి - యబల తండ్రికినీ ॥ వరుల నిద్దరిని దే- వలె నీయల్లుడు నేను - వరియింతుమని చెప్ప - వనిత నంపినయట్లు యా శిఖండికినీ ॥ భార్యైనట్టి - యబల తండ్రికినీ ॥ ౮

తా. శిష్యా ! జనన మరణ రహితమగు అచల పరిపూర్ణ బోధ నెరుగని గురు శిష్యులిద్దరు పరిపూర్ణ బోధకొరకు అచల గురుమూర్తిని వెదకి బోధ పొందవలయును. అది యెట్లనగా ఈశ్వరుని వరముచే బుట్టిన శిఖండియను పేరుగల నపుంసకునకు భార్యయైన రాకుమార్తె తన భర్త నపుంసకుడని తెలుసుకొని తన తండ్రికి యిట్లు జాబువ్రాసి పంపెను. తండ్రీ నీ యల్లునికి ఒకభర్తను నాకొక భర్తను తెచ్చినట్టయిన యిద్దరము మరల వివాహము జేసుకొందుమని జాబువ్రాసి దాసీమనిషి కిచ్చి పంపినవిధంబుగా. యీ పరిపూర్ణ బోధ యెరుగని గురు శిష్యులిద్దరును అచల గురుస్వాములు వారిచే పరిపూర్ణ బోధ పొంది జన్మరహితులు గావలయును. యితర గురువులచే జన్మరహితము యెన్నడూ కా నేరదని భావము. 8

229. కం. దృష్టాంత మెరుక కేదని - యోష్టము గదలించగానె - యెరులుకలనుచున్ - దృష్టాంత మడుగబోదకు-స్పష్టముగా కర్పూరము

దీ - పము జూపవోయీ ॥ యీ యుక్తిలో - పము జేయకోయీ ॥ తుష్టి బొందెదరిట్లు - తోచి చెప్పితివేని - శ్రేష్టామౌయీబోధ - చేకొన్న వారు దీ - పము జూపవోయీ ॥ యీయుక్తి లో - పము జేయకోయీ॥

తా. శిష్యా ! సర్వమును కనిపించు చుండెడి యీ ఎరుక లేదనుటకు దృష్టాంతము యేదని నిన్ను యితరులు అడుగగా, యీకనుపించెడి మనుష్యులు ప్రపంచము అంతయు కలవంటిదని వారికి చెప్పుము. యీ బోధకు, దృష్టాంతము అడుగగా కర్పూరముకు దీపము అంటించి జూపి విమర్శ జెప్పుము. యీ యుక్తిని జూపించుటకు వెనుదీయకుము. యీ విధముగా వారలకు జెప్పి జూపించి వివరముగా జెప్పినట్టయిన వారలు సంతుష్టి పొందెదరు. గొప్పదైన పరిపూర్ణ బోధను పొందెడి శిష్యులకు దృష్టాంత ద్రాష్టాంతములు జూపి పరిపూర్ణ మెరులకలను బోధించి సంతృప్తుల జేయుమని భావము. 9

230. కం. యెరుక భ్రమగల్గు శిష్యుని - పరితాపము మాన్పినట్టి - పండితుడెవడో - గురుడతడె కాని గురువలె - గురువులమని పొట్టకొరకు - గొలిగే వారెల్లా ॥ వారికిబోధ - తెలియుటకల్లా ॥ పరిపూర్ణమును లేని - యెరుక నేర్పడ దెల్పి - యెరుకను విడిపించ-నెరుగాక గురువులై - గొలిగే వారెల్లా ॥ వారికిబోధ-తెలియుటకల్లా ॥ ౧౦

తా. శిష్యా ! దేహ ప్రపంచ భ్రమగల్గి ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆది దైవికములనే తాపత్రయాగ్నులచేత దుఃఖమును పొందిన శిష్యుని హృదయ తాపము చల్లార్చునట్టి పాండిత్య ప్రకర్షణ గల్గిన అచల గురుమూర్తియే కాని, భాధ గురువులై యింటింట యెత్తుకూళ్లు తినుచు జింహ్వాశిశ్న నాపల్యత చేతను తిరుగుచుండెడి పామరగురువులు నిజగురువులు కారు. అట్టివారికి యీ పరిపూర్ణ బోధయు యీ బోధకు గల మర్మ ధర్మములు తెలియనేరవు. పరిపూర్ణములో లేనటువంటి యెరుక యెట్టిదో వివరించి తరువాత ఆ ఎరుకను విడిపించక యున్నవారు

బాధ గురువు లనబడుదురు. వారలే మాయను నమ్మిన వారలు యీ పరిపూర్ణ బోధ వారలు బోధింప నేరరని భావము. 10

231. కం. గురు శిష్రూష నొనర్చుట - మెరిగించెద నెట్లనిన యేర్పడ వినుమా - నరు లిష్ట దైవమునకున్ - పరిచర్య యొనర్చు నట్లు - భక్తితోడుతనూ ॥ గురుమూర్తి - కత్యుక్తి తోడుతనూ॥ నిరతామర లేక - నీవు సల్పితివేని - గురుబోధ మరుగు - సద్గురునిచే దెలిసేవు - భక్తితోడుతనూ ॥ గురుమూర్తి క - త్యుక్తి తోడు తనూ ॥ ౧౧

తా. శిష్యా ! శ్రీ సద్గురు స్వాములకు స్థాన అంగ భావ ఆత్మ శిష్రూషలు చేయుచు, మనుష్యులు తమ తమ యిష్టదైవములకు నిత్యము ఉదయ సాయంకాలముల యందు భక్తి శ్రద్ధలతో చతుర్వింశతి వుపచారములు, షోడశోపచార పూజలు యెటువలె చేయుచుందురో అటువలె నీవు అచల గురుసార్వభౌములకు గావించిన యడల ఆయనకు కరుణగల్గి పరిపూర్ణ బోధయొక్క మర్మములు ధర్మములు తెలుసు కొందువుగాన యెల్లప్పుడు సద్గురు స్వాములవారికి దయగలుగు నటుల శేవించ వలయునని భావము, 11

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ - విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్థే గురుమూర్తి
లక్షన్నామ చతుర్ధశోధ్యాయః

••• 15 * ౧౫ * శిష్యుని లక్షణము * ౧౬ * 16 •••

232. కం. తను మన ధనములు గురునకు - వినయంబున ధార బోసి - వేడ్క గురునిచే - అనువైన బోధబడసిన - ఘనమతిమంతు నకు

సాటి - గ ల దా యీ భు వి నీ ॥ లోకులు మ్రొక్క వలదా చాలవినీ ॥ తన నితరులనె - తాననక యే మాటను - వినక పరిపూర్ణత దనరు వానికి సాటి - గలదా యీ భువినీ ॥ లోకులు మ్రొక్క - వలదా చాలవినీ ॥ ౧

తా. శిష్యా ! మహాకారణ శరీరమనెడి తనువును సర్వ సంకల్ప రూపమగు మనస్సును ప్రాణమనే ధనమును అరమరయుంచక శ్రీసద్గురు స్వాములవారి పాదపద్మములయందు ధారబోసి, అచల గురు ప్రభువుచే శ్రమ లేనటువంటి పరిపూర్ణ బోధను పొంది గొప్పదైన బుద్ధిగల్గి అనగా సూక్ష్మాతి సూక్ష్మముగా విచారించ గలిగిన మేధానిధితో సమానులు యెవ్వరును కారు. ప్రపంచకులగు జనులు అట్టి పుణ్యాత్ముని చూచినను అట్టివాని నామధేయము చాలతో విన్నను నమస్కరింపుదురు. నేనని యనక నీవని యనక తాను యే మాటను అనక వొకరు అనిన మాట వినక పరిపూర్ణమగు స్థితిలో నుండువాని సాటి ఎవ్వరును కారు. అట్టి వారే నిరహంకారులు అశరీరులు లోకులచేత నమస్కరింపదగిన వారని భావము. 1

౭౩౩. కం. జలము నెడబాయనొల్లని - జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు - హృజ్జలజంబను పీఠముపై - నిలిపితరము మాని గురువు - నే కొల్చు సుమ్మీ ॥ తదుక్తాలనే - తల్చునమ్మీ ॥ కలకాల మీరీతి గడపుచునే ప్రొద్దు - తలిదండ్రి దొరదాత - దైవమనుచు గురువు - నే కొల్చుసుమ్మీ ॥ తదుక్తాల - నే తల్చునమ్మీ ॥ ౨

తా. శిష్యా ! నీళ్ళను ఎడబాయక నీళ్ళలోనే యుండెడిచేపలు రీతిగా బుద్ధి వంతుడైన శిష్యుడు తనహృత్ కమలమునే పీఠముగా జేసి, అందు సద్గురుస్వామి యున్నటుల ఎల్ల వేళలయందు భావించుకొని మనస్సున యితర చింతలు అన్నియు విడచి సదా

సేవించుచుండును. తన సద్గురు స్వాములచే బోధింపబడిన యుక్తులనే ధర్మములను మర్మములను తలంచుచుండును. ఎల్లకాలములయందు సద్గురుస్వాములను ఆయన బోధను మరువక తల్లియు తండ్రియు మహారాజు తన ప్రభువు దాత కులదైవము తన సర్వస్వము ఆ గురు ప్రభువేయనీ భావించుచుండునని భావము. 2

234. కం. సతి పొరుగూరికి బోయిన - పతి రాకడ కోరినట్లు భావములోనన్ - మతిమంతుడు సచ్ఛిష్యుడు - సతతము గురురాక గోరు - సత్యము వినరా ॥ వానితోటి - సాటెవ్వరనరా ॥ హితుని రాకడను స్నే - హితుడు గోరిన యట్లు - అతి దరిద్రుడు ద్రవ్య-తతిరా గోరిన యట్లు - సత్యము వినరా ॥ వానితోటి - సాటెవ్వరనరా ॥ 3

తా. శిష్యా ! వుత్తమ స్త్రీ తనయొక్క భర్త యితర గ్రామము వెళ్ళియుండగా భర్త యే వేళప్పుడు వచ్చునాయని ఎదురు చూచుచుండునటులను, బుద్ధివంతుడైన సచ్ఛిష్యుడు ఎల్లప్పుడు తన గురుని రాకకై నిరీక్షించుచుండును. యిది సత్యమైనదని వినుము. అట్టి మంచి శిష్యునితో సమానులు యెవ్వరును కాజాలరు. ఆదియునుగాక తన మంచిని గోరునట్టి స్నేహితుని రాకకు తాను ఎట్లా ఎదురు చూచునో అటువలెను అతి కష్టజీవితమై దరిద్రబాధ పొందువాడు ధనము తనకు ఎప్పుడు వచ్చునా తనకష్టములు ఎప్పుడు తీరునా యని అహర్నిశముల యందు ధనముకై తలంచుచు ఎదురుచూచునటుల, బుద్ధివంతుడైన మంచి శిష్యుడు తన సద్గురుమూర్తి ఎప్పుడు వచ్చునాయని అయన రాకకు ఎదురుచూచు చుండునని భావము. 3

235. కం. అతివెలరతి చతురతలా - యతివలచే వారి తంద్రు-లరయురనుచు త - త్పతులరయు రేరతినట్ల నే - మతిమంతుడు గురుడు

బోధ - మానీనగానీ ॥ తద్బోధతా - మానాడుపూనీ ॥ అతి దరిద్రునిచే - విద్యార్జించి నతగాడు - చతురుడై విత్తా - మార్జన జేయుపంతూలు - మానినగానీ ॥ తద్బోధతా - మానాడుపూనీ ॥ ४

తా. శిష్యా ! స్త్రీలు తమ భర్తతో సంభోగకాలములో చూపిన చాతుర్యము ఆ స్త్రీలచే వారి తంత్రులు యెరుగజాలరు. తమ యొక్క భర్తలు మాత్రము యెరుగుదురు వారు తమ భార్యల చాతుర్యములు మరువరు. అటులనే బుద్ధివంతుడైన శిష్యుడు తన గురుడు పరిపూర్ణ బోధను బోధించి గురుడు ఆ బోధను కొన్నాళ్ళు మానినప్పటికి ఆ బోధయందుండెడి మర్మధర్మములు మరుకుండా యుండును. శిష్యుడు జననమరణములనే దరిద్రబాధపొందలేక, ఐశ్వర్యమనే బ్రహ్మవిద్యద్బోధ నిజగురుస్వామునిచే పొంది అయన బోధచేయుట ఏకారణముచేతనైనా మాని నప్పటికి తన తెలివితేటలనే చాతుర్యముచేత తన నిజగురుస్వాములు యిచ్చిన (లేక బోధించిన) విద్యాధనమును విచారణచే పెంచుకొనుచు జనన మరణములనే దరిద్రబాధను పొందడని భావము. 4

౭౬౫. కం. పరిపూర్ణ బోధ దెల్పె - పరియంతము సేవ చేసి - బహు నమ్మికగా - గురుమూర్తికి తరువాతను - మరి కన్నులగనని వాని - మార్గాము ఛీఛీ ॥ తలచరాదా - మాట ఛీఛీఛీ ॥ గురువాజ్ఞయి వనిదే - గురువై శిష్యుని గూర్చి - గురుబోధ దెల్పెటి - గురువంచకుని యొక్క - మార్గాము ఛీఛీ ॥ తలచరాదా - మాట ఛీఛీఛీ ॥ ౫

తా. శిష్యా ! కపటాత్ముడగు శిష్యుడు శ్రీ సద్గురుస్వాములు తనకు అచల పరిపూర్ణ బోధ తెలిపే వరకు పరిచర్యలు చేయుట భయ భక్తి విశ్వాసములు గలవానివలె నటించుచు, ఆ పరిపూర్ణ బోధ తెలుసు కొనిన తర్వాత గురుని యింటికి తానుపోక గురునకు కనుపించక గురుడు కనుపించిన నమస్కరించక గురుని ముఖమువంకైనను జూడక యుండెడి

దుర్మార్గునియొక్క నడత ఛీఛీ యనవచ్చును, వాని మాట వినరాదు తలంచరాదు ముమ్మాటికి ఛీఛీఛీ యనవలెను. శ్రీ సద్గురుస్వాములవారు తనను గురువు గమ్మని దీక్షానామమిచ్చి గురువుగా పూజచేయించనిదే తాను కొందరు శిష్యులను గూర్చుకొని గురుబోధను బోధించుచుండును. అట్టి గురుద్రోహి యగు గురువంచకునియొక్క పద్ధతి ఛీఛీ యని విడువవలెను. అట్టివాని బోధలు వినరాదు కనరాదు వాడు గురుద్రోహి గావున అట్టివాని ముఖమైనను చూడకూడదని నీచుడని ముమ్మాటికి ఛీఛీఛీ యని విడువ వలెనని భావము. 5

237. కం. తన శిష్యులు విని తననతి - వినయంబున గొల్చు-కొరకు - వినుతి యొనర్చు - తన గురువును గురుడింటికి_జనుదెంచిన జూచి శుశ్రూష - నొనర్చకుండా ॥ లేమిని దెల్పి - జనుమనుచుండా ॥ వినుముకుచ్ఛిత శిష్యా - గ్రణివీడు వీడెట్లు - ఘనబోధో క్తస్థితి గనునో గురునకు - శుశ్రూష నొనర్చకుండా ॥ లేమిని దెల్పి - చనుమను చుండా ॥ ౬

తా. శిష్యా ! గురువులు కొందరు తమ శిష్యుల యెదుట తాము తమ గురువును అనేకవిధములుగా సేవించినామని డంభములు చెప్పుదురు తమ శిష్యులు తమ్ము సేవించుటకొరకు యీ విధముగా వినిపింతురే కాని వారు పలికినట్లు చేసినవారుకారు. అది యెట్లనగా తన గురుని యింటికి తామెళ్ళి సేవచేయడు. తన గురుడు తన యింటికి వచ్చిన ఆమహాత్ము నకు శుశ్రూషలు చేయడు ఆ గురుమూర్తితో తన కుటుంబకష్టములను దరిద్రబాధలను శరీరబాధలను జెప్పి వెంటనే సాగనంపును. యిటువంటి వాడే కుచ్ఛిత శిష్యులలో అగ్రగణ్యుడని చెప్పవచ్చును. యిట్టి కుచ్ఛిత స్వభావముగల శిష్యుడు బ్రహ్మవిద్యయు జన్మరహితము చేయగలిగిన అచల పరిపూర్ణ బోధయొక్క స్థితిని పొందనేరడు, ఇట్టి వారలు జనన

మరణ ప్రవాహము నందుండు వారేగాని జన్మరహితులు కానేరని భావము. 6

238. కం. కుటిలాత్ముడైన శిష్యుడు - యిటువలె తాబలుకుచుండు - యింటికివస్తే - యెటుబోవుచుండ వస్తిరో - యిటకిక దర్శనము మళ్ళీ - యెప్పుడయ్యేనో ॥ యెవరికి దెలుసు - యెప్పుడేమౌనో ॥ యెటు దోచదేమైన - యిత్తా మంచనుకుంటి - తుటకూనవకరాగి - దుడ్డయిన లేదిప్పు - డెప్పుడయ్యేనో ॥ యెవరికి దెలుసు-యెప్పుడేమౌనో ॥ 2

తా, శిష్యా ! దుష్టుండై కుటిల మనస్సుగల్గిన శిష్యుడు తన సద్గురుస్వామి తన యింటికివచ్చినం జూచి - స్వామీ తాము యెక్కడికి వెళ్ళుచు దారి మార్గమని యిక్కడకు వచ్చినారో మరల తమ దర్శన భాగ్యము లభించుట యెప్పుడగునో - యెప్పుడు ఏమి జరుగనున్నదో యెవరికి తెలియును. యిప్పుడు తమకు సమర్పించుకుందామంటే వకరాగి దబ్బైనను యీ సమయమునలేదు చాలా చిక్కులు పడుతూ కుటుంబ సంరక్షణ చేసుకొనుచున్నాను. మీ గురించి నాకు యేమియు తోచుటలేదని మనస్సులో కపటముంచుకొని పలుకులో యింకొక విధముగా మాట్లాడుచు గురుమూర్తిని సాగనంపునని భావము. 2

239. కం. జపములు తపములు సలుపుచు - విపరీత స్మరణజేయు - వేదాంతార్థం - బపరిమితంబుగ జెప్పును - కపటాత్ముడు శిష్యకోటి - గని మెచ్చుకొరకూ ॥ మెచ్చి ద్రవ్య - ముసు యిచ్చుకొరకూ ॥ అపకీర్తిచేతాల - కదరినట్లగుపడి - ఉపమాచే బ్రతుకూచు - నుండులోకులు తనను - గనిమెచ్చుకొరకూ ॥ మెచ్చి ద్రవ్యమును యిచ్చుకొరకూ ॥ ర

తా. శిష్యా ! అనేక మంత్రజపములు అనేక యోగాభ్యాసములు ఎల్లప్పుడు జేయుచు, మహాభక్తునివలె ప్రజలందరికి కన్పించవలెనని ఎల్లప్పుడు ఏదో వొక నామమును స్మరణజేయుచు, వేదాంతము యొక్క అర్థమును విచ్చలవిడిగా అన్ని కాలములయందు అన్ని చోట్లను ప్రాపంచకులగు జనులవద్ద విరివిగా జెప్పుచు, తమ శిష్యులు తననుగొప్ప బోధకులని మెచ్చుకొని ద్రవ్యములు యిచ్చుటకుగాను యిల్లు వాచాడంబరములతో కపటాత్ముడై నుడువుచుండును. మరియు అపకీర్తి పనులకు భయపడి నటుల కనబడుచు కుటస్వభావము గలవాడై మాయోపాయములచేత ధనమార్జించి తను పోషణ చేసుకొనుచు బ్రతుకుచుండును యిట్టివారే కపట గురువులని భావము. 8

240. కం. గురుమూర్తి కెదురహంకృతి - దొరకొన్నను దొంగతోవ - ద్రొక్కిన చెవులన్ - గురువింద వినినజేవిన-నరునకు పరిపూర్ణ బోధ - నలవియె తెలియా ॥ కూడదువాన్ని - తెలియాక కలియా ॥ గురుడు దెల్పని పుస్త - క రీతిచే పూర్ణ - మరసితినని యెంతో - మురసిన యీ బోధ - నలవియె తెలియా ॥ కూడదువాన్ని - తెలియాక కలియా ॥ ౯

తా. శిష్యా ! శ్రీ గురుప్రభువు యెదుట అహంకారము జూపినను లేక అహంకారముతో మాట్లాడినను, తన గురుడు జెప్పిన మార్గమును విడచి ఇతర మార్గములయందు ప్రవర్తించినను, గురునింద చెవులతో వినినను లేక తాను జేసినను, యట్టి దుష్టాత్మునకు యీ పరిపూర్ణ బోధయొక్క స్థితిని తెలియుటకు అలవికాదు. అట్టివాని మనస్సును తెలియకుండా వానితో స్నేహము చేయకూడదు. సద్గురుమూర్తి తెలుపని గ్రంధములు చదువుటవల్ల నేను అచల పరిపూర్ణము దెలిసితినని వాడెంతగా మురసినను యీ పరిపూర్ణ బోధ వానికి పట్టనేరదని భావము. 9

241. కం. నాలుగు శిశ్రూషణమును - లోలత గావించు కొనుచు - లోకాతీతం - బాలోకించీ గురునిచే - యీ లోకముజోలి విడువు - మింతే చాలన్నా ॥ నీతోగూడా - యిది మరువకన్నా ॥ కీలుదెలియని చదువు, చాలా చదివెందుకు - చాలించి నీవిట్టి - కీలుదెలిసితివేని - యింతే చాలన్నా ॥ నీతోగూడా - యిది మరువకన్నా ॥ ౧౦

తా. శిష్యా ! నాలుగు శిశ్రూషములు అనగా - స్థాన - అంగ - భావ - ఆత్మలు-అవి యెట్లనిన (1) స్థాన శిశ్రూష యనగా శ్రీ సద్గురు స్వాములు యుండెడి మఠ ఆశ్రమము లేక మందిరము శుభ్రపరచుట మొదలగు కార్యములు చేయుట- (2) అంగ శిశ్రూష యనగా సద్గురు స్వామికి స్నానాది కృత్యములు చేయించుట- (3) భావ శిశ్రూష యనగా అయన యే యే పదార్థములు భుజించునో ఆయన కోరకయే ఆయన భావమును గ్రహించి ఆ యా పదార్థములు సమర్పించుట - (4) ఆత్మ శిశ్రూష యనగా గురునియొక్క ఆత్మ ఏ విధముగా వర్తించునో తన ఆత్మను ఆ విధముగా వుంచి వినుట గ్రహించుట ఆ యాత్మతో తన యాత్మ కలసియుండుట. యిట్లు యెల్లప్పుడు సేవించుచు, అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళ, భూలోక, భువర్లోక సువర్లోక, మహర్లోక, జనర్లోక, తపోలోక సత్యలోకములను పదునాలుగు లోకములకు అతీతమైన అచల పరిపూర్ణమును సద్గురుమూర్తి కరుణ గలిగి కనుసౌజ్ఞచే దర్శించి యీ ప్రపంచభ్రాంతులను విడువుము. ఇంతే చాలును. నీవు యిది యెప్పుడు మరువకుము. ఇట్టి గురు రహస్యమనే కీలు తెలియక అనేక గ్రంథములు చదివినను, అనేక పాటలు పాడినను, అనేక విచారణ చెప్పగలిగినను గురుసేవ జేయకుండిన యేమియు ప్రయోజనములేదు యని భావము. 10

242. కం. దేశికుని చరణ తీర్థము - కాశీగంగ యని గురుని గను గొన్నను వి - శ్వేశ్వరుడని యతడు తనకుప - దేశం బొనరించినట్టి

దే - తారకమనీ ॥ మనసందు తా - నీతీరుగనీ ॥ యే సీమయందున్న-
కాశీ ప్రయాగ - రామేశుని పురమై - ప్రకాశించునా సీమ - దే తారక
మనీ ॥ మనసందు తా - నీతీరుగనీ ॥ ౧౧

తా. శిష్యా ! తన సద్గురు ప్రభువులవారి పాద తీర్థమే కాశీయం
దుండెడి గంగా జలమనియు, శ్రీ సద్గురుమూర్తియే కాశీలోవుండే విశ్వే
శ్వరుండనియు, తనకు ఉపదేశము జేసిన మంత్రమే తన నిజరూపమైన
తారకమంత్ర మనియు, యీ విధముగా తన మనస్సులో తలంచుచుండ
వలెను. తన గురుస్వాములుండెడి గ్రామమే కాశీనగరము, ప్రయాగ
నగరము రామేశ్వరముగా ప్రకాశించుచుండును. గావున సద్గురుమూర్తి
యందును ఆయన వుండే గ్రామముయందు పాదతీర్థ ప్రసాదముల
యందు సదా ప్రేమగలిగి యుండవలెనని భావము. 11

243. కం. గురు చరణ జలము గోదా - వరి యని గురుమూర్తి-
రామభద్రుండని త - త్పురమును భద్రాచలమని - గురుమంత్రమె
తారకమని - గురి గలిగినట్టి ॥ తిరిగిరాని - మరుగెరిగినట్టి ॥ గురుదున్న
చోటె - సుందర శేషగిరి భద్ర - గిరి రంగనాయక - పురమాన
దగియుండు - గురిగల్గినట్టి ॥ తిరిగిరాని - మరుగెరిగినట్టి ॥ ౧౨

తా. శిష్యా ! శ్రీ అచల గురు సార్వభౌములవారి పాదజలమే
గోధావరీ జలమనియు - ఆ సద్గురు ప్రభువే శ్రీరామచంద్రుండనియు,
ఆ సద్గురుస్వామి నివసించేడి పురమే భద్రాచల మనియు, ఆ గురుమం
త్రమే తన నిజస్వరూపమైన తారకమంత్ర మనియు, మరల జన్మముకు
రానటువంటి అచల పరిపూర్ణ బోధయొక్క మరుగు తెలుసుకొని,
శ్రీ సద్గురుమూర్తి నివసించిన గ్రామమే శేషపాన్పుపై పరుండెడి
శ్రీ రంగనాయకుల పురమగు రామేశ్వరమై ప్రకాశించునని గురిగల్గి
యుండవలెనని భావము. 12

244. కం. గురుడు నరుతనుచు దలచిన-గురుమంత్రము మంచి యున్న - గురుపుత్రుల నా - దరణ మొనర్పక యుండిన - గురువును విడనాడి రెండో - గురుని జేరిననూ ॥ సద్గురుబోధ - నెరిగి దూరిననూ ॥ యెరుక మహత్యాము - నెరిగి యెటువంటి - నరునాకు తప్పాదు - నర కాము నిజమింకో - గురుని జేరిననూ ॥ సద్గురుబోధ - నెరిగి దూరిననూ ॥

తా. శిష్యా ! శ్రీ అచల గురుస్వాములను ప్రపంచము నందుండెడి మనుష్యులవంటి మనుష్యుడేయని భావించినను, గురుమంత్రము మరచి యుండినను, గురుపుత్రులకు అన్న పానీయములిచ్చి ఆదరించక పోయినను, అచల పరిపూర్ణ బోధ తెలిసిన సద్గురుమూర్తిని విడచి యెరుక మహాత్యము జూపెడి రెండవ గురుని జేరినను, యీ పరిపూర్ణ బోధ నెరింగి యీ బోధయందు విశేషములగు మహత్యములు లేవని నిందించినను, యెరుక యొక్క మహత్తుల నెరింగి వాటిని ఆచరించు నరునకును, యిట్టివారలకు జననమనే నరకము ప్రాప్తించును గాని అందువలన జన్మరహితము కానేరదని భావము. 13

245. కం. జ్ఞాన వైరాగ్య భక్త్య - సమాన నదీ స్నానదేవ - మంత్రపఠన - తద్ధ్యాన మఖ తంత్రములు పర - మాని నిరతిగోరు నట్టి - మనుజా సంఘముకూ ॥ బోధను దెల్పు - మనిన వారలకూ ॥ తాను బోధించూట - తగదు బోధించితె - తాను నేనను భ్రాంతి తలగేదేలా గట్టి - మనుజా సంఘముకూ ॥ బోధను దెల్పు - మనిన వారలకూ ॥ ౧౪

తా. శిష్యా ! జ్ఞానము గొప్పదను వారలకు, వైరాగ్యమే దొడ్డదను వారలకు దేవతాభక్తి గలవారలకు తీర్థ యాత్రలనెడి నదుల యందు స్నానములు జేయుచు తిరిగెటి వారలకు, దేవతామంత్రములు జపించుచు తద్ధ్యానము నందుండు వారలకు, యజ్ఞయాగాది క్రతువులే

వరమని నమ్మిన పామర జనులకు యీ పరిపూర్ణమును దెల్పుమని వేడినను వారలకు యీ బోధ బోధింప గూడదు ఒకవేళ బోధించినట్లయిన నేను నీవు అనెడి అహముతో కూడిన భ్రాంతి వారికి విడువదు. అట్టి వారలకు యీ పరిపూర్ణ బోధ బోధించినను జన్మ సార్థకము కలుగదని భావము. 14

246. కం. ఇంగితము నెరిగి సద్గురు - పుంగవుచే నరుడు భుక్తి ముక్తి క్రియలన్ - సంగా సంగము వెడలిన - శృంగారమె వాని చేష్ట చూచేవారలకూ ॥ వాడున్నట్లు - తోచే వారలకూ ॥ మంగాళసూత్రమే - భంగిశృంగారమె - శృంగారవతికి యీ - శృంగారవతి కట్లు చూచేవారలకూ ॥ వాడున్నట్లు - తోచె వారలకూ ॥ ౧౫

తా. శిష్యా ! అచల గురుస్వాములచే జన్మకు సార్థకమగు ముందు రాబొయ్యేడి యదార్థ విషయమును తెలుసుకొని అవాఙ్మానస గోచరమైన అచల పరిపూర్ణమును నరుడు గురునిచే గ్రహించి ప్రపంచ వ్యవహారికములలో భుక్తి ముక్తుల యొక్క నడవడికలయందు ప్రపంచకులతో పాటు అహంకారము గలిగి యున్నటుల అన్ని కార్యములు చేయుట కాన్పించును. కాని ప్రపంచకులతో సంపర్కము కలిగియు కలగనివాడై సంసార తాపత్రయముకు అంటి అంటనివాడై నేననే అహంకారము విడిచియుండును. యీ మహాత్ముని ప్రవర్తన చూచే వారలకు మిగుల శృంగారమై వింతగా కాన్పించుచుండును. అది యెట్లా యంటే పుణ్యస్త్రీకి వుండవలసిన వస్తువులు ఏమియు లేకపోయినను మంగళ సూత్ర మేలాగున సౌందర్యము నొసంగునో, ఆలాగుననే గురుపుత్రుడై అచల పరిపూర్ణ బోధపొంది వరమును తా నవలంభించి ప్రపంచములో నడచెడి గురుపుత్రుని యొక్క చేష్టలు వింతగా ఆనందముగా సంతోషము గొలుపుచు విలసిల్లునని భావము. 15

247. కం. జనులందరు గురుబోధను - గనిరా జనులందు నేను-గలియక యున్నన్ - నను మన్నింతురే వాతని - మనసున దలపోస్తే బోధ - మర్మామబ్బీనా ॥ అబ్బినవారి - ధర్మామబ్బీనా ॥ జననమరణము లేని - ఘనమైన త్రోవనే - గనసైతి నని బోధ - గనకున్న యీా బోధ - మర్మామబ్బీనా ॥ అబ్బినవారి - ధర్మామబ్బీనా ॥ ౧౬

తా. శిష్యా ॥ ఈ లోకములో తనయొక్క స్నేహితులు, బంధువులు సన్నిధులు గురుబోధ పొందినారు. ఆ జనులవలె తానును గురుబోధను పొందక పోయినవారలు తన్ను గౌరవించరని మనస్సున తలపోసి, గురుబోధ (గురూపదేశము) పొందిన యెడల యీా పూర్ణబోధ యొక్క మర్మములు (రహస్యములు) అబ్బనేరవు. ఒకవేళ మర్మములనెడి మంత్రామూల మంత్రార్ధ మంత్రసార మంత్ర రహస్యములు అబ్బినా వారి ధర్మములు అబ్బనేరవు. ఏమనగా జననమరణ రహితమగు బ్రహ్మ విద్యయొక్క బోధ పొందవలయునని తన మదిలో తాను విచారించి, ఆతృత గలవాడై జన్మసార్ధకము జేసుకొనవలయునని తలంచి గురుబోధ పొందవలయునేగాని ఒకరితో సాపత్యమునకు బోధ పొందిన జన్మకు సార్ధకము గలుగదని భావము. 16

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ - విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్ధే శిష్య లక్షణం నామ
పంచదశో ధ్యాయః

• 16 • ౧౬ • గురు శిష్యోభయ లక్షణం • ౧౨ • 12 •

248. కం. హృదయగ్రంధి విడుటకై - సదయత యీా బోధదెల్ప-జనదా గురుడై - వదలక చిత్తములో గురు-పతయుగళము దలుపవలదె

భక్తుడైనపుడూ ॥ భ్రాంతిరహితా - సక్తుడైనపుడూ ॥ కుదురాదు యివిరెండు - గురు శిష్యులకు లేక - కదిలికలేనట్టి - ఘనబోధోక్త స్థితి- భక్తుడైనపుడూ ॥ భ్రాంతిరహితా - సక్తుడైనపుడూ ॥ ౧

తా. శిష్యా! నేత్రమధ్యమున వాయు తత్వమనబడు చిద్బిందువే హృదయగ్రంధి, అందు ఆకాశతత్వమనబడు కళ లేక తెలివి (యెరుక) చేత నిద్ర సంగమభయు, లజ్జ శోక మోహ సంశయాదులు పుట్టు చున్నవి. యివియే సప్తావరణములు. యీ సప్తావరణములు విడచుటకై సద్గురు ప్రభువు యీ పరిపూర్ణ బోధను బోధించవలెను. అట్టి సప్తావరణ ములగు హృదయ గ్రంధి విడచుటకై శిష్యుడు శ్రీ సద్గురు పాదపద్మ ములు తన చిత్తములో వదలక తలంచుచుండవలెను. తనకు భ్రాంతి రహితము కావలయునని ఆశక్తితోనున్న శిష్యుడును, శిష్యునకు హృదయగ్రంధి విడిపించవలెనని తలంపుతో గురుడును యీలాగు యిద్ద రకు ఆప్యాయము కలిగియుండవలెను. అట్లు వొకరికి వుండి వొకరికి లేక పోయిన యెడల జననమరణ రహితమై గొప్పదై చలన రహితమైన యీ అచల పరిపూర్ణ బోధయొక్క స్థితి (వునికి) కుదురనేరదని భావము. 1

249. కం. గురుడాస వదలకుండిన - మరి శిష్యుడు ద్రవ్యలోభ మగ్నుండైనన్ - మరియాద దక్క దిరవుర - కెరిగుండుము వీరలతి - హీనులోయన్నా ॥ గట్టిగ దురభిమానులోయన్నా ॥ గురుడు శిష్యుని కన్న - కొడుకూగ గనకున్న - గురునిపై శిష్యుడా - గురునిల్పకుండిన హీనులోయన్నా ॥ గట్టిగ దురభి మానులోయన్నా ॥ ౨

తా. శిష్యా! గురుడు ఆశను విడచిపెట్టక శిష్యుడు యిచ్చిన ధనముతో తృప్తిపొందక యింకా కావలయునని కోరుచుండినను, శిష్యుడు ధనము గురుని కిచ్చుటలో లోభియై దాచుకొని గురుని సం తోష పరుచక యుండినను, అట్టి గురు శిష్యులిద్దరు సమరసము నెరింగిన

మర్యాదవంతులు కారు. వీరలిద్దరు నీచులు దురభిప్రాయము గలవారని తెలసికొనుము. సద్గురుడు శిష్యుని తన కన్నకొడుకు వలె ప్రేమ గలవాడై జూడవలెను. శిష్యుడు తనను గనిన తండ్రివలె ప్రేమయుంచక పోయిన యడల వీరలిద్దరు దురహంకారముగల నీచులని భావము. 2

250. కం. గురు గురుబోధలచేతను - పరిపూర్ణము నెరిగి యెరుక బాసిన యతనిన్ - గురుతెరుగ నొరుల శక్యమె - యెరిగిన నరులిట్టి బోధ - నెరిగేరోయన్నా ॥ వారెరుగాని - మరుగుండదన్నా ॥ చిరుతపాప నిరీతి - మరి పై శాచము భాతి - తిరుగూచూనుండు - వెక్కురుమాడ్కి గురుడెట్లు - యెరిగెరోయన్నా ॥ వారెరుగాని మరుగుంతదన్నా ॥ 3

తా. శిష్యా ; శ్రీ సద్గురుస్వామి తన గురు సార్వభౌములచే అచల పరిపూర్ణ బోధస్థితి లక్షణములు నెరింగి యెరింగిన యెరుకను విడచిన పుణ్యాత్ముని యీ ప్రపంచకులగు నరులు యిట్టివాడని ఆయనను గ్రహించుటకు శక్యముకాదు. అట్టి వానియొక్క గుట్టు నెరిగిన నరులకే యిట్టి పరిపూర్ణబోధ యొక్క గుట్టు దెలియును. వారికి దెలియని రహస్యము లేమియు నుండవు. అట్టి పరిపూర్ణులగు దేశిక స్వాములు బాలునివలెను, పిశాచము వలెను (దయ్యము) పిచ్చివాని వలెను దిరుగుచుండును. అట్టి వానికి అహంకార మమకారములు జిహ్వోపస్థాది చాపల్యములు నుండవు. అట్టి గురుమూర్తి యొక్క రహస్యమును ఆయనను యీ లోకులు యెరుంగజాలరు. అట్టివాని నెఱింగిన వారలు ధన్యులగుదురని భావము. 3

251 కం. మలయాద్రి - చెంత చెంచుల - కిలచందన భార హములె - యిందన మట మిక్కిలి గలుగబట్టి యట్లనె - చుల కన సుమి యింట గలుగు - సూరి భూషణుడూ ॥ బహుమాన్యుడు దూరస్తుడెపుడూ ॥ తెలియానివారికి - తెలిసేది కఠినాము - తెలివిచే

తెలిసీతే - తెలియాజేసును బోధ - స్ఫూరి భూషణుడూ ॥ బహు
సూన్యుడూ ॥ దూరస్తు డెపుడూ ॥ ౪

తా. శిష్యా ! హిమాలయ పర్వత ప్రాంతముల యందుండెడి గ్రామములలోనుండు కోయవాళ్లు కొండవాళ్లు గదబవాళ్లు చెంచువాళ్లు మొదలగు కొండజాతులవాళ్ళు అయా ప్రాంతములలో నుండెడి అరణ్యముల యందు మంచిగంధపు చెట్లు విశేషముగా నుండుటచే వాటిని తరుచుగా వంట కట్టెలకు వాటి విలువ తెలియక వాడుచుందురు. ఆలాగునే తనయింటి యందున్న లేక తన గ్రామమందున్న సద్గురుస్వామియగు మహాత్ముని అతని బోధను చులకనగా యీ ప్రజలు చూతురు. దూరముగా యుండు సద్గురు స్వామియైతె వాటిని విశేష పూజనీయునిగా మహా బోధకునిగా స్తుతింతురు. గురుమూర్తి యొక్క నిజమును గ్రహించ లేని వారికి వారిబోధ యెట్టిదియో తెలియుట కష్టము. తాను తెలివిగలిగి అట్టివారిని తెలుసుకొని సేవ జేసి అచల పరిపూర్ణ విచారణ అడిగి వారియొక్క కరుణకు పాత్రుడై బోధను వినవలయునని భావము. 4

౭౫౬. కం. దూరమునమండి విన్నను - చేరును సజ్జనుడు గురుని
చెంతకు బోధన్ - గోరి దుర్జనుడు గోరడు - దూరస్థుడుగాక గురుని
తో గూడియుండీ ॥ యెట్లనియన్న - దూరాననుండీ ॥ కోరి తుమ్మెద
తమ్మీ - జేరి తెనియగ్రోలు - నారీతి నెరుగావు - చేరి కప్పలుతమ్మి
తో గూడియుండి ॥ యెట్లనియన్న - దూరాననుండీ ॥ ౫

తా. శిష్యా ! మంచి బుద్ధివంతుడై సజ్జనుండగు శిష్యుండు సద్గురుమూర్తి దూరముగా యుండినను గురుబోధ యందపేక్ష గలవాడై వారి దగ్గరకుబోయి గురునిచే ఎప్పుడును పరిపూర్ణ బోధను పొందుచుండును. దుష్టాత్ముడై కుటిలుడైన శిష్యుడు సద్గురుస్వామి దగ్గరగా

యుండినను ఆయనను సేవించక ఆ గురుబోధను పొందక యుండును. అది యెట్లాఅంటె తుమ్మెద తేని గ్రోలవలయునని అపేక్షగలదై తనకు దూరముగా నుండెడి సరస్సులకు (కొలనులకు) బోయి అందుండెడి తామర, కలువ మొదలగు పుష్పములయొక్క మధువును (తేనిని) తృప్తిగా గ్రోలి తన తావుకు చేరును, కప్పలు ఆ తామర కలువ కమలములయొక్క మొదటనే యుండియు ఆ తామర పువ్వులలోని తేనిని త్రాగుట నెరుంగనేరవు. యీ పరిపూర్ణ బోధయందు సజ్జన దుర్జనులకు ఆప్యాయము యింట్లుండునని భావము. 5

౨౯. కం. చూచి మది దెలసి శిష్యుడు - యాశయమును తగిన బోధ - నతనికి దెలియున్ - జేసి ముదమంద జేసెటి - దేశికుడే ముఖ్యుడనుచు - తెలుసుకోవోయీ ॥ కనియు తగాణ్ని - కలుసుకోవోయీ ॥ చేసిని దయతో - నీ యాశ సంపూర్తిట్లు - వ్రాసైతే వేసుకో - చూచేవు తార్ఖాణం - తెలుసుకోవోయీ ॥ కనియు తగాణ్ని కలుసుకోవోయీ ॥ ౬

తా. శిష్యా ! శిష్యుని కాబోయ్యేవాని యొక్క రాకను గురుడు చూచి వాని మనస్సునందుండెడి కోరికను గ్రహించి వాని యభిలాషకు తగినది యే బోధయో అద్దానిని వానికి సంతోషము గలుగునటుల బోధింపగలిగిన సద్గురుడే ముఖ్యమైన వాడని యదార్థమైన వాడని తెలుసుకొనుము అట్టి గురుప్రభువును చూచి యతనితో కలుసుకొని యాతని కరుణ గలుగునటుల సేవించి దయను పొందిన యడల నీ యాశయములు అన్నియు పూర్తిగా నెరవేరును. నీ మనస్సునందుండెడి సందేహము లన్నియు తీర్పగలిగిన సద్గురుస్వామిని తార్కాణము చూచుకొని యతనితో కలసి నీకు సంశయములను అడిగి తెలుసుకొనుమని భావము. 6

యుండినను ఆయనను సేవించక అ గురుబోధను పొందక యుండును. అది యెట్లాఅంటె తుమ్మెద తేని గ్రోలవలయునని అపేక్షగలదై తనకు దూరముగా నుండెడి సరస్సులకు (కొలనులకు) బోయి అందుండెడి తామర, కలువ మొదలగు పుష్పములయొక్క మధువును (తేనిని) తృప్తిగా గ్రోలి తన తావుకు చేరును, కప్పలు ఆ తామర కలువ కమలములయొక్క మొదటనే యుండియు ఆ తామర పువ్వులలోని తేనిని త్రాగుట నెరుంగనేరవు. యీ పరిపూర్ణ బోధయందు సజ్జన దుర్జనులకు ఆప్యాయనము యింట్లుండునని భావము. 5

౭౬౬. కం. చూచి మది దెలసి శిష్యుడు - యాశయమును తగిన బోధ - నతనికి దెలియన్ - జేసి ముదమంద జేసెటి - దేశికుడే ముఖ్యుడనుచు - తెలుసుకోవోయీ ॥ కనియు తగాణ్ని - కలుసుకోవోయీ ॥ చేసిని దయతో - నీ యాశ సంపూర్తిట్లు - వ్రాసైతే వేసుకో - చూచేవు తార్ఘాణం - తెలుసుకోవోయీ ॥ కనియు తగాణ్ని కలుసుకోవోయీ ॥ ౬

తా. శిష్యా ! శిష్యుని కాబొయ్యేవాని యొక్క రాకను గురుడు చూచి వాని మనస్సు నందుండెడి కోరికను గ్రహించి వాని యభిలాషకు తగినది యే బోధయో అద్దానిని వానికి సంతోషము గలుగునటుల బోధింపగలిగిన సద్గురుడే ముఖ్యమైన వాడని యదార్థమైన వాడని తెలుసుకొనుము అట్టి గురుప్రభువును చూచి యతనితో కలుసుకొని యాతని కరుణ గలుగునటుల సేవించి దయను పొందిన యెడల నీ యాశయములు అన్నియు పూర్తిగా నెరవేరును. నీ మనస్సు నందుండెడి సందేహము లన్నియు తీర్చగలిగిన సద్గురుస్వామిని తార్కాణము చూచుకొని యతనితో కలసి నీకు సంశయములను అడిగి తెలుసు కొనుమని భావము. 6

నేర్చుకొనక పోయిన యెడల మన జన్మములు వ్యర్థములని భావించు కొని వారలు అచల గురుమూర్తి వద్దకు జని శరణు శరణని జనన మరణములు బాపవలయునని వేడుకొనుచు గురుని దరిజేరేటట్టుల గొప్పదైన యుక్తిని జేసి గురునివద్దకు జనుల కొందరిని రప్పించేటట్లు బోధించేవాడే సచ్ఛిష్యుడు యీ మాటకు సందేహము యేమియులేదు సందేహము వున్నదని అనరాదు వినరాదు యిట్లు చేయుట యుత్తమ శిష్యునియొక్క కర్తవ్యము లక్షణమని భావము. 8

258 కం. తన భార్య రూపురేఖలు - తన పుత్రుల సద్గుణ ములు - తన సంపదయున్ - తన పెరటిముందు చెట్లు - తన గ్రామపు సాధు జనులు - తనకు మెప్పౌనా ॥ యీ యిలలో - యెంతటి వానికైనా ॥ వినలేదె నీ వాహల్యను - జూచి మోహించె - ఘన వాహనుండు - చక్కని భార్య గలిగుండి - తనకూ మెప్పౌనా ॥ యీ యిలలో యెం - తటి వానికైనా ॥ ౯

తా. శిష్యా ! ఈ ప్రపంచములో యెంతటి వారలకైనను తన భార్యయొక్క సౌందర్యము గొప్పదిగా యుండదు. వేరొకనిభార్య సౌందర్యవతిగా కాన్పించును. అట్లాగునే తనకుమాళ్ళ సద్గుణముల కంటె యితరులయొక్క కుమాళ్ళ సద్గుణవంతులని భావింతురు. మరిన్ని తన సిరిసంపదల కంటె యితరుల సిరిసంపదలు యెక్కువని తలంతురు. తన పెరటిలోయుండెడి చెట్టుయొక్క మందు మంచిదికాదని అటువంటి చెట్టె అరణ్యముల యందుండిన అది గొప్పదని భావింతురు. అటువలెనే తమ గ్రామముయందుండెడి సాధువులగు సద్గురువులు తమకు గొప్పవా రుగా కాన్పించక ఇతరగ్రామముయందుండెడి గురువులు గొప్పవారని తలంతురు. అది యెట్లాయుంటే తెల్లటేనుగ నెక్కిన దేవేంద్రుడు తనకు మిక్కిలి సౌందర్యవతియైన ఇంద్రాణి భార్యయై యుండగా, అరణ్యము నందున్న జడధారియగు గౌతమ మహర్షికి భార్యయై అక్షమాలా

కాషాయాంబరధారిగాయున్న అహల్యనుజూచి చక్కనిదని మోహించి కష్టముల పాలయ్యేను. యీ జనులయొక్క చేష్టలు యీలాగుయుండు నని భావము. 9

257. కం. జతనముగ దాచి చదువుము - రత్నములహార మిదియు రసికులగళమూ - యతనము దీనికి నేబహూ - యతనముగావించి తెచ్చి యిస్తీరా నేడూ ॥ బోధకు బందో - బస్తౌర చూడు ॥ రతనావెట్లౌరాళ్లు రతనాలంచని యంటే - రతనాలీ పద్యాలే - రసికులెరిగెదరివి నీ - కిస్తీర నేడూ ॥ బోధకు బందో - బస్తౌరచూడూ ॥ ౧౦

తా. శిష్యా ! ఈ పద్యములు వరుసగా జదువుము. పరిపూర్ణబోధ నొందిన బుద్ధివంతులకు యోగ్యులకు యీ పద్యములు రత్నములతో కూర్చిన హారము కంఠమున ధరించిన యెట్లు శృంగారమగు అంశముగా యుండునో అట్లు భావించి నీవు కంటగతముగా యీ పద్యములను వర్ణించి చదివిన వినువారలకు ఆనందము గొలుపుచుండునని వ్రాసి యిచ్చితిని. అదియునుగాక అనేక గ్రంధములు పరిశోధించి యియ్యది బహు ప్రయత్నముతో వ్రాసితిని. యీ పద్యములు పరిపూర్ణ బోధ చేయుటకు అన్ని విధములలోనూ చాలా కట్టుదిట్టముగా యుండును. యితర గురువులు బోధచేయు పద్యాలు తద్విషయములు గువ్వరాళ్ళ వంటివి. గాని నవరత్నములుగావు. అచల పరిపూర్ణబోధ పండితులే యీ పద్యములు రత్నములుగా భావింతురు యని భావము. 10

258. కం. విననేర్చి చెప్పనేర్చిన - మనుజులకే దీనిలోని - మర్మము దెలుసున్ - వినజెప్ప నేరకుండిన - మనుజులు యీబోధలోని- మర్మా మెరిగేరా ॥ దీనందుండే - ధర్మా మెరిగేరా ॥ జనులే గొబ్బరి కాయు - తిననేర్పు గలవారు - తిననేర్చునా కోతి - తనకా కాయుబ్బిన - మర్మా మెరిగేరా ॥ దీనందుండే - ధర్మా మెరిగేరా ॥ ౧౧

తా. శిష్యా ! ఈ పరిపూర్ణ బోధ వినవలెనని కుతూహలము గలవారికి బోధ చెప్పుటయందు నేర్పరితనము గలవారికి దీనియందుండే మర్మములు తెలియవచ్చునేగాని, యీ పద్యములు వినుటయు, అర్థము చెప్పుటయు నెరుంగని మనుష్యులకు ఈ గ్రంథముయందుండే మర్మములు తెలియనేరవు. ఒకవేళ మర్మములు అబ్బినను యిందుగల ధర్మము లేమియో తెలియనేరవు. గొబ్బరికాయ తినుటకు మనుష్యులకే సాధ్యమగునుగాని కోతికి ఆ కొబ్బరికాయ దొరికినను దానిని తినుటకు సాధ్యముగాదని యెల్లరకు దెలియును. అటువలె శ్రీ శివరామ దీక్షిత అచల గురు సాంప్రదాయక అచల గురువులకు వారి శిష్యులకే యీ గ్రంథమున గల మర్మములు, ధర్మములు తెలియును. యితరులకు యీ గ్రంథము దొరికినను యిందుగల మర్మధర్మములు తెలియ నేరవని భావము. 11

259. కం. నే నెంత లెస్సజదివిన - దీనిని దెలియంగ గలరె - దేశికవర్యున్ - పూని సేవించకుండిన - మానవులది యెట్లటన్న - మరి వినవోయీ ॥ నామాటందు - మనసుంచవోయీ ॥ వానా కాలములోని - వర్షాము వొకబిందు - నైన మిట్టనునిల్వ - దది నిశ్చయమె కద - మరి వినవోయీ ॥ నామాటందు - మనసుంచవోయీ ॥ ౧౨

తా. శిష్యా ! ఈ గ్రంథము యందుండెడి పద్యములను నేను యెంత విమర్శగా జదివినను జెప్పినను శ్రీ అచల గురుస్వాములకు శిష్యులుగాక శుశ్రూషలు చేయక పోయినయెడల ఈ గ్రంథముయందు గల మర్మములు, ధర్మములు పరిపూర్ణ స్థితి ఈ జనులకు తెలియనేరదు. యెట్లా తెలియలేరో తార్కాణము చెప్పెద. నా మాటయందు మనస్సు చక్కగా వుంచి వినుము. వర్షాకాలములో వర్షించు వర్షబిందువులు వొక్క బిందువైనను ఆకాశమందుండక భూమియందు పడుట యెట్లు

వాస్తవమో అటువలె అచల గురుపుత్రులుగాని వారల మనస్సులో ఈ పరిపూర్ణబోధ యెంతమాత్రము అంటియుండ నేరదని భావము. 12

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ - విరచిత ద్వైతాద్వైత రహిత
పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్థే గురుశిష్యో భయులక్షణం
నామ షోడశాధ్యాయః

---

•• 17 * ౧౭ * గురుదత్తాభయదానం * ౧౧ * 11 ••

260. కం. నన్నాశ్రయించినావని - యున్నా ఈ బోధ నీకు-
అతుకుటకొరకై - యెన్నో యుక్తులు జెప్పితి - విన్నావా దీన్ని నీవు-
విడువకెప్పటికీ॥ నాయాజ్ఞాను-గడువా కెప్పటికీ॥ నన్ను నీవు నిన్ను నే-
గన్నా వేళ్లెట్టిదో - నన్ను నీవు విడలేవు - నిన్ను - నే విడలేను-విడువ
కెప్పటికీ ॥ నా యాజ్ఞాను - గడువ కెప్పటికీ ॥ ౧

తా. శిష్యా ! నీవు జననమరణ ప్రవాహము నుండి దరిజేరుటకై నన్ను ఆశ్రయించి శేవించినావని నీ శేవకు మెచ్చి అందుకు తగినది ఈ పరిపూర్ణ బోధయని యియ్యది నీకు దృఢపడుటకొరకై, అనేకములైన వుపమాన వుపమేయములగు యుక్తి ప్రయుక్తులను అందుకు కూర్చి చెప్పితిని. నీవు చక్కగా విన్నావు గదా! ఈ పరిపూర్ణ భోధ నీవు యెప్పటికి విడిచి పెట్టకుము. నాయాజ్ఞను మీరి యెన్నటికి నడువబోకుము. నీవునన్నును, నేను నిన్నును జూచిన వేళ యెట్టిదోగాని నన్ను నీవు విడువజాలవు, నేను నిన్ను విడువజాలను. నాయజ్ఞను నీవు యెన్నటికి మీరకుండున యెడల యెరుక బాధించ నేరదని భావము॥ 1

261. కం. పతియైనను సతియైనను - నతి సాహస పరులుగాక యాంతర్యమునన్ - రతివేళ్ళ లజ్జపడ సం - తతి గలుగదు చూడు మట్లు - తగదు లజ్జించా ॥ గురు శిష్యులు - తగులజ్జ నొంచా ॥ మతిని నీవిట్లు స - మ్మతి జేసియే యె - సంగతి నన్నడుగుము - బోధస్థితి నీకు దృఢ పరతు - తగదు లజ్జించా ॥ గురు శిష్యులు - తగులజ్జ నొంచా ॥ ౨

తా. శిష్యా ! పురుషుడైనను స్త్రీయైనను సంభోగ కాలమునందు యెక్కువ ప్రేమ గలవారలు గాక మనస్సులోని సిగ్గు గలవారలై సందేహముతో చరించిన యెడల ఆనందము సంతానము కలుగ నేరదు. అటువలెనే గురు శిష్యులకు బోధా సమయమునందు లజ్జ పొందిన యెడల యీ బోధాస్థితమగు పరిపూర్ణ స్థితిని పొందనేరదు. నీ మనస్సులో సిగ్గు లేకుండా జేసి సంతోషముతో యెట్టి సంగతియైనను నన్నడుగుము. అందుకు తగిన బోధ జేయుచు యదార్థమును నీవు చక్కగా దృఢపరతును. సందేహించక లజ్జను విడచి నీకు గలిగెడి సందేహము లేమియో నన్నడిగి తెలుసుకొనుమని భావము. ౭

262. కం. రతికొరకు గాదె సతి పతి - కతి హితమతి సేవజేయు నటువలె బోధ - స్థితి నీకు కుదురుటకు స - మ్మతితో గురు సేవ జేయుమా - నీతివంతా ॥ అభిమానము - పోనీ నీదంతా ॥ అతనికి దయువస్తె - అరనిముషమున బోధ-స్థితి నీకు కుదిరించు - సిగ్గువిడచి కొల్వుమా - నీతివంతా ॥ అభిమానము - పోనీ నీదంతా ॥ ౩

తా. శిష్యా ! నీతివంతుడా సంతానముయందు కోర్కెతో సంభోగము నందపేక్ష గలదై భార్యా తన భర్తకు యిష్టమగు నటుల మంచి మనస్సుతో పరిచర్యలు చేయుచుండును అటువలె యీ పరిపూర్ణ బోధయొక్క స్థితి లేక వునికి నీకు కుదురుటకై సద్గురువుల సేవ

నమ్రతతో జేయుచుండుము. నేను నీవు అనెడి అభిమానము పూర్తిగా విడచి గురుస్వాముల సేవ జేయవలెను. శ్రీ సద్గురు స్వాములకు నీ యందు కరుణ గలిగిన యడల వొక్క అరనిమిషములోనె అచల పరిపూర్ణబోధ యొక్క స్థితిని నీకు కుదురునటుల జేయును అందుకై సిగ్గు విడచి సద్గురు స్వాముల సేవ జేయుమని భావము. 3

263. కం. నీ మానసమున సంశయ - మే మాత్రము నిల్వబోకు మిక నాతోడె - నామాట నిశ్చయమునే - నే మాత్రము దాచలేదు నీతోడు సుమ్మీ ॥ యింతకు మిక్కిలిక లేదులెమ్మీ ॥ నా మీద తల పుంచు - నను మరువకిక నేను - నీమీద దయపుంతు - నిఃమిందు కిడెవొట్టు - నీ తోడుసుమ్మీ ॥ యింతకు మిక్కిలిక లేదులెమ్మీ ॥ ४

తా. శిష్యా ! నీ మనస్సున సంశయము లేశ మాత్రంబైనను పుంచవలదు. నీకు సంశయము లేదని నాతోడుగ వొట్టుబెట్టి చెప్పుము. అటువలె నేనును నీ తోడుగా వొట్టుబెట్టి నే నేమాత్రము యీ పరిపూర్ణ బోధయందు దాచలేదని ప్రమాణికముగా చెప్పుచున్నాను. సత్యముగా ఈ పరిపూర్ణమునకంటె యెక్కువ యేమియును లేదు. నా మీద నీవు ఎల్లప్పుడు తలపుంచి ఏ క్షణమునందైనను మరచిపోకుండా యుండుము. నీయందు యెల్లప్పుడు కరుణగలిగి యుందునని నీతోడని వొట్టుబెట్టి నిశ్చయముగా చెప్పుచున్నాను. ఈ పరిపూర్ణ విచారణలో యింతకు అధికమైన విచారణ యెద్దియు లేదని భావము ॥ 4

264. కం. నీ గురుబోధను. నీచే - బాగుగ విని నిందసేయు - భ్రష్టులమాటల్ - లో గొని విడచేవిది నీ - కే గురుడీలాటి బోధ - నెరిగించడోయీ ॥ యెరుకలో దె - యెరిగించునోయీ ॥ ఆ గురుబోధల నన్నీ నే దెలనుండి - నా గురుబోధనే - శయముగ నీకిస్తి - యెరిగించ జ్ఞియీ ॥ యెరుకలోదె - యెరిగించునోయీ ॥ ౫

తా. శిష్యా ! నేను నీకు బోధించిన ఈ పరిపూర్ణ బోధను నీవలన యితరులు విని యీ బోధ మంచిదికాదని నిందించునట్టి పతనమునకు భ్రష్టులగు దుష్టజనుల మాటలువిని వారల బోధయందు భ్రమగొని ఈ బోధను విడచిపెట్టకుము యే గురుడైనను నీ కిటువంటి యదార్ధమైన బోధను బోధించడు. యెరుకను నిలబెట్టెడి బోధలను బోధించును. యెరుకగలిగిన మార్గములయందు ప్రవర్తించెడి గురువుల యొక్క బోధలన్నియు జనన మరణముల నిచ్చునని ఆ బోధలన్నియు యదార్ధములుగావని నేనెరిగుండి జనన మరణములు రహితమగుటకు సద్గురుమూర్తిచే నేను యెరింగిన నిజమైన ఈ అచల పరిపూర్ణబోధ నీకు యిచ్చితిని దీనికి మించిన బోధ యేదియునుగాదు. అందువలన ఈ బోధ యెప్పుడును విడువకుము. యితరుల బోధలకు ఆశించవలదని యెరుకలోనిదె చెప్పుదురని భావము. 5

265. కం. నిక్కముగ బీరపీచుల - చిక్కనుమీ విచ్చరాదు ఛీ ఈ యెరుకన్ - మక్కువనే బోధించిన - చక్కని బోధాగ్నిచేత సాధించుపోరా ॥ విచ్చేచింత - చాలించుకోరా ॥ చొక్కమౌ ఈ బోధకెక్కడ ఈడౌను - తక్కిన బోధాల - దిక్కుచూడక దీన - సాధించుపోరా ॥ విచ్చేచింత - చాలించుకోరా ॥ ౬

తా. శిష్యా ! నిజముగా ఈ యెరుకయొక్క మార్గము అనగా సచ్చిదానంద బ్రహ్మము యొక్క మార్గము బీరకాయలోని పీచువలె విచ్చుటకు సాధ్యముగాక యెక్కువైన చిక్కులు కలిగి జననమరణములు పొందుచుండును. అట్టి నీచమైన యెరుకయొక్క చిక్కులు విడదీయుటకు ప్రయత్నించరాదు అందువలన సార్ధకము కూడాలేదు ఛీయని విడువవలెను. ప్రేమతో నీకు నేను బోధించిన ఈ పరిపూర్ణ బోధదృఢముచేత సమూలముగా యెరుకను దహింపజేయును. నీ చింతలన్నియు

యింతటితో విడచిపోవును ఈ బోధయే జనన మరణములు విడిపించునది ఈ పరిపూర్ణ బోధతో ఏ గురువుల బోధలైనను సమానముగావు. అట్టి ఎరుకగల బోధలను వినుటయైనను అట్టి గ్రంథములు జూచుటయైనను జేయుకుము. ఈ బోధను యెప్పుడు విడచి పెట్టకుమని భావము. 6

266. కం. అడవి వుశిరకేయు జలనిధి - బొడమిన లవణంబటంచు - బొగడిని రీతిన్ - పుతమిని ఈ స్తలమందున - కడువేడుక నీవు వేను - గలసూట వినరా ॥ నీ నా ప్రేమ - గలసె కన్గొనరా ॥ విడలేవు నీవు నన్ను - విడలేను నేనిన్ను - పొడజూచి నీవు - నేనెక్కడ బోక నిలచిట్లు - గలసూట వినరా ॥ నీ నా ప్రేమ - గలసె కన్గొనరా ॥ 2

తా. శిష్యా ; అడవియందు పండిన వుసిరికాయులకును, సముద్రమునందు పుట్టిన వుప్పుకును, సంబధము యేలాగు కలసి రుచి పుట్టినదో. అటుల మన యిరువురము ఈ స్థలమున యిచ్చోటకూడి అచల పరిపూర్ణ బ్రహ్మమును విచారించి, వినుటకు నీవును, బోధించుటకు నేనును ప్రేమగలవారమైతిమి. నీయందు నాకును, నాయందు నీకును, పరిపూర్ణ విచారణయందు యిట్లు ప్రేమగలిగెనని తెలియుము. అట్లు కలిగిన ప్రేమవలన నీవు నన్ను విడువలేవు. నేనును నిన్ను విడువలేను. యిట్లుండుటచేతను యితరమైన యెరుక బోధలకు నీ మనస్సును పోనివ్వకు, యీ పరిపూర్ణ బోధయందే నిలచియుండుమని భావము. 7

267. కం. పెద్దలనింద యొనర్చకు - పెద్దల సేవించుకొరకు - పిరిది వియకుమే - పెద్దలతో వాదించకు - పెద్దలు జెప్పేటి సుద్ది - పెడచెవుల వినకూ ॥ పెద్దలు నడచే - నడతానే మనకూ ॥ పెద్దల కన్నానే - పెద్ద నంచనుకోకు పెద్దల గనుగొన్న - ప్రియముతో

ప్రొక్కుము - పెడచెవుల వినకూ ॥ పెద్దల నడచే - నడతానే మనకూ ॥ ౭

తా. శిష్యా ! పెద్దలగు సద్గురు స్వాముల నెవ్వరినైనను ఎన్నడు నిందా వాక్యములతో దూషించకుము. సద్గురుస్వాములను సేవించుటకై ప్రపంచకులకు భయబడి సేవకు వెనుకదీయకుము. గురు ప్రభువులతో కుశ్నంకలతో వితండవాదము జేయుకుము. అచల గురువులు బోధించెడి పరిపూర్ణ బోధను పెడచౌలతో వినకుము, పెద్దలైన సద్గురువులు నడచెడి నడవడికలను తప్పుడు నడతలని నీ మదిలో భావించి వారికి పేర్లుబెట్టకుము, పెద్దలగు గురువుల కన్నను నీకు విశేషముగా తెలియుననియు, సత్ప్రవర్తకుడననియు, వారలకన్నను గొప్పవాడననియు గర్వించకుము. పరనిందా ఆత్మస్తుతిచేయకుము. పెద్దలగు గురువులనుజూచినతక్షణమే, ప్రేమతో వారలకు సమస్కరించుముయని భావము.

౨౬౮. కం. పెత్తనమున యేనుంగిల - చెత్తను దినవలసె చీమ- చిన్నతనమునే - హత్తుకొని తినును చక్కెర - యిత్తరి యీ రెంట్లో నీకు - యిష్టామేదైతె ॥ చేకొనుమదె - స్పష్టామిదైతో ॥ పెత్తనమున చేటే - పెంపొందుచుండూను - చిత్తాములో దెలియు - చిన్నతనమే మేలు - యిష్టామెదైతె ॥ చేకొనుమదే - స్పష్టామిదైతె ॥ ౬

తా. శిష్యా ! ఈ ప్రపంచములో పెద్దదైన తనువు గలిగిన యేనుగు, ఆకులు, కొమ్మలు, కసవు మొదలగు చెత్తను ఎక్కువగా తినకుండినయడల, దానికి ఆకలిబాధ తీరనేరదు. చిన్నతనువు గలిగిన చీమ, మృదువైనదియు రుచివంతమైనదియునగు, చక్కెరను కొద్దిగా తినినదానికి ఆకలిబాధ తీరును. యీ రెండు పద్ధతులలో నీకు యేది యిష్టమో, మంచిదియని తోచునో, యేది సుఖతరమై యుండునో అద్దానిని అవలంభించుము. పెద్దతనమైన గురుత్వము అవలంభించుడిచేత

అనేక విధములగు విచారణ హృద్గతముచేసి, అడిగినవారలకు ఆయా బోధను, వారిమనస్సులకు ఆనందముగా నుండునటుల సమాధానము జెప్పుచు లోకులనెడి నిందాస్తుతులకు కష్టములకు వోర్చి యుండవలెను చిన్నతనమైన శిష్యుడై యుండుటచే, గురువాక్యము నమ్మియుండుటే తన కర్తవ్యముగాన, తనస్థితిలో తానుండుటకు మిగుల శ్రేయోదాయకమై, కష్టములు లేక యుండును. పై రెండుపద్ధతులలో యేది నీ మనస్సుకు మంచిదని తోచునో, అద్దాని నవలంభించుమని భావము. 9

269. కం. తనను శరణన్నవారల - మనుసెట్టిదో తరచిచూచి మరి తెల్పదగున్ - విను వారికి దగినట్టిది - యని రిట్లు మహానుభావు- లతి చాతుర్యమునా ॥ విని కని నీమను - సతి చాతుర్యమునా ॥ ఘన మైన ఈ బోధ - కరుణిస్తి దీన్ని - చచ్చినదాక నిదురా - వచ్చిన దాక మరువాకు - మతి చాతుర్యమునా ॥ విని కని నీమను - సతి చాతుర్యమునా ॥ ౧౦

తా. శిష్యా ! నిన్ను జనన మరణ ప్రవాహమునుండి, దరిజేర్చు మని శరణుజొచ్చినవారల మనస్సులను, చక్కగా శోధించి చూచి, వారివారి అభిలాషలకు తగినట్టి బోధను, బోధించి, వారల మనస్సులకు ఆనందపరుపవలయునని, మహాత్ములైన మన పెద్దలగు సద్గురువులు అతి చతురతతో పలికిరి. నేనును నిన్నుకూడా అలాగునేశోధించి, నీమనస్సు కనిపెట్టి అందుకుతగినది అన్ని బోధలకు గొప్పదియునగు యీ పరిపూర్ణ బోధకు తగినవాడవని గ్రహించి, నీయందు కరుణగలిగి యీ బోధ నొసంగితిని. ఈ బోధాస్థితికై నేను అనే అహంకారము చచ్చేవరకు, నిదురయనే మరణము వచ్చేవరకు, ఈ బోధను మరువకయుండుమని భావము.

270. కం. చెప్పదగు గురుడు బోధను - చెప్పినపని జేసెనేని - శిష్యాగ్రణికిన్ - చెపదగదు చెప్పినపని - తప్పన వాదించెనేని - దయ దల్చి బోధా ॥ యిద్దరికుండ - దగునిట్టిమేధా ॥ జెప్పిముందుగ బోధ - చెప్పండి పనులన్న - చెప్పాగూడదూవాన్ని - తిప్పాల బెట్టాక - దయ దల్చి బోధా ॥ యిద్దరికుండా - దగునిట్టిమేధా ॥ ౧౧

తా. శిష్యా ! శ్రీ గురుస్వాముల ఆజ్ఞప్రకారము చెప్పిన పనులను చేయువాడు, వుత్తముడైన సత్శిష్యుడు, అట్టివానికి యీ పరిపూర్ణ బోధను బోధించవచ్చును. గురుప్రభువుల అజ్ఞ ప్రకారము నడువని దుశ్శిష్యునకు, యీ అచల పరిపూర్ణబోధను చెప్పకూడదు. సద్గురుస్వాములు చేయుమనిన పనిని తప్పు పనియని, గురునితో యెదిరించి వాదించెడి దుశ్శిష్యునియందు, దయగలిగి పరిపూర్ణబోధను యెంతమాత్రము బోధించకూడదు. యీ విషయములలో గురుశిష్యు లిద్దరును, అతి జాగరూకులై తెలివిగలిగి యుండవలెను. మీరు చెప్పెడి పనులు తరువాత చేయుదును ముందుగా పరిపూర్ణ బోధను బోధించుడని, పలికెడి శిష్యుని కష్టములు పెట్టకుండా వానియందు దయగలిగి, అచల పరిపూర్ణ బోధను తొలుతనే బోధించగూడదు. యీ పరిపూర్ణ బోధ బోధించెడి సద్గురువునందు, విశ్వాసము భయము భక్తియు, బోధయందు ప్రేమయు శిష్యున కుండవలయునని భావము. 11

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ-విరచిత ద్వైతాద్వైత రహిత
పరమతత్వైన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి -
విరచిత తాత్పర్య భావార్థే గురుదత్తా భయదానం
నామ సప్త పంచదశోధ్యాయః



• 18 • రాగం • సుజన లక్షణం • ౬ • 6 •

271. కం. ఇవివినుమనినను సుజనులు - చెవియొగ్గదరివియు సృష్టు - జేసికృతికి బల్ - చవబుట్టింతురదెట్లన-శివుడుకళానిధినిచక్క జేసెనలేదా ॥ నీమదిశంక - బాసెనలేదా ॥ అవనిలో శ్రీరాము - డవ గుణినాహల్య నెవరేమీయనకుండ - సవరించిసగుణిగ - జేసెనలేదా నీమదిశంక - బాసెనలేదా ॥

తా. శిష్యా ! ఈ కందార్థదరువులను వినుమని మించిబుద్ధిగల వారలకుచెప్పినయడల శ్రవణానందముగా నిర్మలమనస్సుతోవిని యానం దింతురు. అదియునుగాక యీ పద్యములకు రుచిబుట్టునటుల చక్కగా - చదువగలరు అదియెట్లన, అపరమేశ్వరుడు గురుశాపగతుడైన చంద్రుని తని శిరస్సున ధరియించి గురుభార్యను పొందిన దోషముపోగొట్టి పవిత్రు నిగా జేసెను. నీమనస్సులో కలిగిన సందేహము యింతటితో పోయెనా లేదా ! ప్రపంచమునందు దుష్టగుణముగలిగి భర్త శాపగతమై రాయుగా పడియున్న అహల్యను పవిత్రురాలుగా చేయుమని యెవరైనను కోరకయే శ్రీరామచంద్రుడు అ రాతిని నాతిగా జేసెనుగదా అట్లా యీ పద్యములను గుణవంతులు చక్కజేసి మాధుర్యము కలుగునటుల జదివి ఆనందించి యితరులకు ఆనందింప జేయుదురని భావము. 1

272. కం. గురుసూచనైన నరులను - మరిమరి వినుమనుచు జదువుమా-పద్యములన్- గురుసూచన యెరుగనియా - నరులను వినుమనుచు జదువ - సగుణాటౌగదరా ॥ అదియెట్లన్న - యిదిగోనే దెల్పెదరా ॥ పురుషాపంగతిలేని - పొలతికొక్కకశాస్త్ర - మరసి మెచ్చునెదాన్ని - యతిప్రౌఢపతివాలె - నగుణాటౌగదరా ॥ అదియెట్లన్న - యిదిగోనే తెల్పెదరా ॥ ౨

తా. శిష్యా ! శ్రీసద్గురుప్రభువులచే గురుసూచనపొందిన గురు పుత్రులవద్ద యీ కందార్ధదరువులను పదేపదే అనేక పర్యాయములు

జదువుము. వారలు ఆపద్యములను విని ఆనందింతురు. గురుసూచన కాని యితరులయొద్ద జదివి వినుమనిన వారలు పరిహాసము చేయుచు నిందింతురు. అది యెట్లనగా పురుషునియొక్క సంపర్కమేమో యెరుంగని స్త్రీకి కొక్కొకమనబడు కామశాస్త్రము వినిపించిన లేక ఆ స్త్రీ జదివిన ఆ శాస్త్రము తనకు మెప్పురాదు. ఆ కళాశాస్త్రమును పురుషసాంగత్య మెరిగిన స్త్రీకి వినిపించిన ఆనందించును. అట్లాగే గురుసూచనైన గురుపుత్రులె యీ పద్యములు జదివియు వినియు ఆనందింతురని భావము. 2

273. కం. యెవరంటె - యేమి భయముర - సవరింతురు తప్పు లుంటె - సాధులు విన్నన్ - సవరించు నిప్పు మిదివిని - యవనీతులు నిందజేస్తె - అయ్యేదేమోయీ ! అందులో మనది - పొయ్యేదే మోయీ ॥ భవనాశ స్తితే ౨ - పద్ధతి యీ బోధ - చౌరంగ విని పించు - చాటేల మాటేల - అయ్యేదేమోయీ ॥ అందులో మనది - పొయ్యేదేమోయీ ॥ 3

తా. శిష్యా ! నీవు యీ గ్రంధమును జదువు సమయములో అచ్చోట యెందరు సాధువులు యెటువంటి వారలుండివిన్నను యేమియు భయపడకుము. యిందుతప్పులున్న యెడల వారలను సవరించనియ్యుము యీ గ్రంధమును దుర్మార్గులువిని నిందించిన మనకు కలుగునష్టమేమి పరిపూర్ణ బోధలో మనకు వచ్చేనష్టమేమి, చచ్చుట పుట్టుట పెరుగుటలు లేని పద్ధతైన యీ యచల పరిపూర్ణ బోధ బాహాటముగా అందరకు వినిపించుము. చాటుమాటులనె మరుగు యుంచకుము. అలాగు విని పించి నందువలన మనకు అయ్యేది యేమియుతేదు. అందువలన పొయ్యేది అంతకంటె యేమియు లేదని భావము. 3

274. కం. పుట్టింటబిడ్డ బహుగా - దిట్టైయుండినను యెవరు దిట్టరు భువిలో - పుట్టింటివారు కోడలు - దిట్టైనను అత్తవారు - దిట్టరు

సుమ్మీ ॥ చేతులకొద్ది - గొట్టేరు సుమ్మీ ॥ అట్టుంబలెనె బహు ఉట్లై
నశిష్యాని - తిట్టాడు గురుమూర్తి - పట్టివారు జూస్తై - తిట్టేరు
సుమ్మీ ॥ చేతులకొద్ది . గొట్టేరు సుమ్మీ ॥ ४

తా. శిష్యా ! ఈ ప్రపంచములో పుట్టింటియందు ఆడబిడ్డ యెంత గయ్యాళిగా లేక వడితనముగా యుండినను పుట్టింటివారు ఆమెను గారాబముచే తిట్టరు, కొట్టరు, ఆ పుట్టింటివారి కోడలు వడితనముగా యుండినను లేకపోయినను ఆమెను అత్తవారు నోటికి వచ్చినటుల తిట్టుదురు. చేతులకు వచ్చినటుల కొట్టుదురు. అట్లాగే యీ అచల పరిపూర్ణ బోధయందు దృఢమై బహు ఉట్టరియైన సచ్ఛిష్యుని సద్గురుమూర్తి తిట్టడు, కొట్టడు. యితరులగు మతవాదులు లోకులు వానినిజూచిన ఆవాక్యములు వినిన తిట్టగలరు, కొట్టుటకుకూడా రాగలరని భావము. 4

275 కం. అందముగ ఘనులు మెచ్చెద - రెందుకు మెచ్చెదరు దీన్ని - యితర జనంబుల్ - చందురుడు దయింబందిన - సింధువు చెల రేగినట్లు - చెలగూనె చెర్వ్యాల్ ॥ కోనేర్లునూ - తులుబావులేర్లూ ॥ మందయానలపొందు - మగవారె నుతిజేతు - రెందూకు నుతి జేతు రిలషండ పురుషూలు - చెలగూనె చెర్వ్యాల్ ॥ కోనేర్లు నూ - తులు బావులేర్లూ ॥ ౫

తా. శిష్యా ! ఈ అచల పరిపూర్ణ బోధను గొప్పవారలగు పండిత ప్రకర్షణగల్గిన జనంబులు మెచ్చుదురుగాని, లోకానుసారులగు పామరులగు శుద్ధసంసారులు యీ అచల పరిపూర్ణ బోధను యెందుకు మెచ్చుదురు. మెచ్చనేరరు, అది యెట్లాగంటే, చంద్రోదయము కాగానే సముద్రముపొంగునేగాని చెరువులు, కోనేర్లు, నూతులు, ఏర్లు నుపొంగనేరవు. అదియును గాక స్త్రీలతో భోగించిన సుఖానందము పురుషులగు వారలే యెరింగి ఆనందింతురు. ప్రపంచములో నపుంసకులగు షండ పురుషులు స్త్రీలపొందు నెరుంగరు గాన నుతిచేయనేరరు. ఆలాగే యీ

అచల పరిపూర్ణబోధ సారాంశము నెరింగిన పండితులగు బ్రహ్మవిద్యజ్ఞను లకే గొప్పయగును. శుద్ధసంసారులగు పామరజనంబులు అవలంభించెడి అవిద్యగాదని వారలకీ బ్రహ్మవిద్య మెప్పుగాదని భావము. 5

276. కం. కాకంబులు సంపూర్ణ - తటాకస్థ జలంబు లెట్లు త్రాగక తృషచే - గైకొనునో కుంభజల ము - ట్లీకలియుగమందు దుష్టు - లింపు మీరగనూ ॥ నిర్వరుబోధ - కంపూ బారిననూ ॥ మీకు దీనికేలంకె - మాకేల యిట్టిచీకాకు - కొక్కోకమైతే - గైకొందు మందూరు - యింపు మీరగనూ ॥ నిర్వరుబోధ - కంపూబారిననూ ॥

తా. శిష్యా! కాకులు దాహము గలిగినపై సంపూర్ణముగా జలముతో నిండియుండెడి చెరువులలో నీళ్లుత్రాగక కుండలలో నుం డెడి నీళ్లను త్రాగును. అట్లాగే యీ కలయనే ప్రపంచమునందు లేక యీ కలియుగమందు దుష్టబుద్ధి గలిగిన మానవులకు యీ అచల పరి పూర్ణబోధ సహించక, నిందించుచు భ్రాంతి విడలేనివారలై యెరుక మార్గములయందు మెలగుచు మీకు యీ అచల బోధకు సంబంధమే గాని మాకు అయ్యేది అక్కరలేదు, కొక్కోకమనె కళాయిశాస్త్రము అయితే మాకు ఆనందము యిష్టమని కామ్య సంగతులుగల గ్రంథ ములు చూచుచు ఆనందింతురని భావము. 6

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత
పరమతత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్థే సుజనలక్షణ నామ
అష్టాదశోధ్యాయః



... 19 * ౧౯ * కుజన లక్షణం * ౪ * 4 ...

277. కం. కుచ్చిత మతియగు పురుషుని - చెచ్చెర వినుమనుచు జదువ - శిష్యులవలె తా - ముచ్చటపాటుగ వినదివి - కుచ్చుల కుళ్ళాయికుక్క - కూనా కెందుకురా ॥ పిడుదుకు దుగ్ధ - పానా మెందుకురా ॥ హెచ్చైన ముత్యాలు - పచ్చాల పతకాము - గృచ్చి పేరుగ జేసి - తెచ్చివేసితే కోతి - కూనా కెందుకురా ॥ పిడుదుకు దుగ్ధ-పానా మెందుకురా ॥ ౧

రా. శిష్యా ॥ కుట్ర స్వభావముగల మనుష్యునికి యీ అచల పరిపూర్ణబోధ వినుమని వానివద్ద జదివినయడల లోకులవలె తాను ఆనందముగా వినడు. ఏలాగనగా పట్టుకుచ్చులతో కట్టిన చొక్కాయి కుక్కపిల్లకు తొడిగిన అది ఆనందించుట మాని చించివేయును. అది గాక ఆవులయొక్క పొదుగును అంటివుండి రక్తము త్రాగెడి గోమారు నకు ఆ పొదుగులోనుండెడి పాలు త్రాగుట తెలియనేరదు. మరిన్ని ఖరీదు గలిగిన గొప్ప మంచిముత్యముల హారమునకు పచ్చలతో పత కమునుగూర్చి అట్టి హారమును తెచ్చి కోతిపిల్ల మెడయందు వేసిన దాని సౌందర్యము విలువ ఆ కోతిపిల్ల యెరుంగ నేరదు. అటువలె దుర్జనులకు అనగా దుష్టస్వభావము గలవారలకు యీ పరిపూర్ణబోధ వినుటకు అర్హానిని గ్రహించుటకు యిష్టము వుండదని భావము. 1

278. కం. అక్షయబోధ స్థితిగల - లక్షణవేత్తలకు మెప్పులైన కృతులలో - కక్షకు తప్పులుకు మతి పరీక్షింపుచునుండు నెన్నో - రీతూల వినుమీ ॥ తద్భావ మీ - రీతిది కనుమీ ॥ మక్షిక మెప్పుడు - మాని సుగంధాదు - లీక్షించు వ్రణము ప్ర - త్యక్షమెకద ఎన్నో రీతూల వినుమీ ॥ తద్భావ మీ - రీతిది కనుమీ ॥ ౨

తా. శిష్యా! చందోశాస్త్రవ్యాకరణ సులక్షాది గ్రంధముల నెరి గిన పండితవేత్తలకు మెప్పుగల్గినట్టి కందార్థదరువులను కృతులతో

అక్షయమై నశించనటువంటి అచల పరిపూర్ణ బోధను వ్రాసితిని. దుష్ట బుద్ధిగల్గినవాడు యీ పద్యములయందు తప్పులు యెచ్చట దొరకునా యని పగ సాధించవలెనని అనేక రీతులు పరీక్షింపుచుండును. అట్టివాని యొక్క స్వభావము యెట్లాటిదనిన వినుము. ఈగలు సుగంధద్రవ్యము లపై వ్రాలక దుర్గంధముచేనుండెడు పుండ్లు, వ్రణములమీద వ్రాలి ఆ దుర్గంధమును గ్రహించునట్లు కుట్ర స్వభావముగలవాడు తప్పులకై వెదుకుచుండునని భావము. 2

279. కం. రమ్మని పిలువనిదె ప - ద్యములు జదువంగ వచ్చి - యతి నిందించున్ - సమ్మతిగాక కుమతివిని - యిమ్మహి యది యెట్ల టన్న - నిట్లానే వినుమీ ॥ వానిబుద్ధ్య - దట్లానేకనుమీ ॥ బొమ్మ లాటలో దిచ్చు - బొమ్మ తానొకటి ఛీ - పొమ్మనియనినా - హా స్య మొనర్చుదే పోక - నిట్లానే వినుమీ ॥ వానిబుద్ధ్య-దట్లానె కనుమీ॥ 3

తా. శిష్యా ! ఈ కందార్థ దరువులగు పద్యములను సభలో చదువుచుండగా రమ్మని పిలువకనే దుష్టబుద్ధి గలవాడొచ్చి యీ అచల బోధను విని సహించలేక యెక్కువగా నిందించును. యీలోకములో అట్టి దుర్జనులు యెట్లాటివారో వారి బుద్ధి యెట్టిదో తెల్పెదవినుము. బొమ్మలాటలాడు సమయమున ఆ తెరపైకి హాస్యము చేయునట్టి గందోళిగాడను బొమ్మ యొక్కటి వచ్చును. అద్దానిని ఛీఛీ పొమ్మనినను పోక ఛీ యని కొట్టినను పోకుండా అచ్చటనేయుండి హాస్యము చేయు చుండుట యెటులో అటువలె, దుర్జనులను పొమ్మనినను సభనుండి పోకుండా గ్రంథమునందుగల పరిపూర్ణ బోధను నిందించుచుందురని భావము.

280. కం. వటియించిన చన్నులుగల - కుటిలాలికి నిందజేయు - గుప్తపు రవికన్ - యెటువలె తన తప్పెరుగక - నటువలె గ్రంథమును

మెచ్చు - నతిదుర్జనుడూ ॥ లేనిదెతప్పు - వెతుకూచునుండూ ॥ యిటు వంటిబోధ - నే నెరిగెదెట్లనుకోక - కటు వాక్యములుబల్కి - ఘనులు గాసిలజేయు - నతిదుర్జనుండూ ॥ లేనిదె తప్పు - వెతుకూచునుండూ ॥

తా. శిష్యా ! కదులుచున్న స్తనములుగలదై స్త్రీ రవిక తొడుగుకొనిన స్త్రీని జూచి, కదలకయుండు స్తనములుగల స్త్రీ తానును కొద్దిరోజులకు ఆలాగు అగుదునని యోచించక రవిక కొన్నాళ్ళకు తాను తొడుగుకొనవలసి యుంటుందని భావించక ఆమెను పరిహాసము చేయుచుండును. అటువలెనె దుర్జనుడు యీ అచలబోధగల గ్రంథమును మెచ్చడు. దుర్జనుడు తనబోధ గొప్పదని తన విచారణయే చాలా దిట్టమైనదని అనుకొనును. స్తనములు కదులుచున్న స్త్రీవలె రవిక తనకు కూడా ముందు అవసరము వచ్చునని తాను దిట్టమనుకొనినది నిలబడదని, ఈ పరిపూర్ణబోధ పొందక జన్మరహితము కానేరదని తెలియక పరిహాసము జేయును. దుర్జనుడు జన్మరాహిత్య మగు యీ అచల పరిపూర్ణబోధ ఏ విధముగా తెలుసుకొందునని విచారించక, చెవులతో వినరానటు వంటి కఠినవాక్యములు పలుకుచు గొప్పవారగు సద్గురువుల మనస్సు నొప్పి గలుగ జేయునని భావము. 4

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ-విరచిత ద్వైతాద్వైత రహిత
పరమతత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
విరచిత తాత్పర్య భావార్థే కుజన లక్షణం నామైకో
నవింశోధ్యాయః

• 20 • ౨౦ శిష్య విజ్ఞాపన లు • 8 •

281. కం. గురువరమీ నా సందున - ఎరుకను తెరగతిగియుండె యిన్నాళ్లు గొలెన్ - కరుణా రసేక్షణములన్ - తెరదీసితి రెరుకమాట

దీరెనిక్కడికీ ॥ చాలుబోధ - దూరెదెక్కడికీ ॥ పరిపూర్ణమును లేని ఎరుకాను జూపించి - ఎరుకా లేదని యంటివి - ఎరుకే లేదాయాను తీరె నిక్కడికీ ॥ చాలు బోధ - దూరె దెక్కడికీ ॥ ౧

తా. స్వామీ ! సద్గురుప్రభూ యింతవరకు మీకును నాకును మధ్య సందేహములనెడి తెర కలిగి యుండెను. మీ కరుణా కటాక్ష వీక్షణములచేత సంశయమనెడు తెర నేటికి తీసితిరి. ఎరుకమాట నేటికి లేకుండా పోయెను. యీ అచల పరిపూర్ణ బోధ చాలును. యింతకు ఎక్కువగా మీరు చెప్పవలసినది నేను వినవలసినది ఏమియులేదు. పరిపూర్ణమున లేనటువంటి ఎరుకను జూపించి లేని ఎరుకను లేదని మీరు బోధించగా యెరుక (భ్రాంతి) నేటికి లేకుండా పోయెనని భావము. 1

282. కం. దారుణి కొంతజరించి వి - చారించితిగాని యీ - విచారము నే నె - వ్వారలు జెప్పగవినలే - దారయ మీనోట విన్న - నయ్యా గురుమూర్తి॥ నా తరమా నుతి - జెయ్యామీకీర్తి ॥ సారాస నయన - పురారి నీరజబ్బం - దారక ముఖులై నే - రాను మిము దెలియు - నయ్యాగురుమూర్తి ॥ నాతరమానుతి - జెయ్యామీకీర్తి॥ ౨

తా. ప్రభూ! ఈ ప్రపంచము నందు చాలా దేశ్యములు తిరిగితిని. అనేకమంది గురుపుత్రులతోను, గురువులతోను విచారించితిని. యీ అచల పరిపూర్ణబోధవంటి విచారణ యెవ్వరూ బోధించగా నేను వినలేదు. యిప్పుడు మీ నోట జనన మరణ రహిత మగు యీ పరిపూర్ణ బోధ చక్కగా విరివిగా విన్నానయా సద్గురుమూర్తి. యిట్టిబోధకులగు మీ కీర్తిని మిమ్ములను పొగడుటకు నా తరము గాదు. ఏమనగా శ్రీ మహావిష్ణువైనను ఈశ్వరుడైనను చతుర్ముఖ బ్రహ్మయైనను దేవేంద్రాది దేవతలు సహితము మీకీర్తిని నుతించుటకు జాలరనగా మిమ్ముల నుతించుటకు నే నెంతటివాడనని భావము॥ 2

183. కం. ఘటమెదుట బెట్టిచూపిన - యటువలె బయలుండ జూపి - యతి మాయలచే - నటియింపుచున్న యెరుకను - తృటిలో విడిపి స్తిరిపుడు - దీరెమచ్చంకా ॥ యిక బుట్టాదు - యేరీతిశంకా ॥ యెటుదోచ కిలువెళ్ళి - యిటుమిమ్మూజూచి న - ప్పటినుంచి దయ జేసి - ప్పటిదాక బోధి స్తే - తీరె మచ్చంకా ॥ యిక బుట్టాదు - యే రీతిశంకా ॥ ३

తా. అయ్యా ! కుండ యెదుటబెట్టి కుండ యిదుగో చూడుమని తేలికగా చూపించినటుల అచలమగు పరిపూర్ణమును సూచన జేసి, అనేక భ్రాంతులతో సంచరించెడు యెరుకను ఒక క్షణములో విడిపింప జేసితిరి. నా సందేహము నేటికి తీరెను. మరల యే విధమైన సందేహము పుట్టనేరదు. నేను యేమి చేయవలయునో జన్మరాహిత్యము యెవ్వరివలన యగునోయని తోచక యింటివద్దనుండి మీ వద్దకు వచ్చినప్పటినుండి నాయందు దయగలవారలై యింతవరకు యీ అచల పరిపూర్ణ బోధను వుపమాన వుపమేయములతో నా మనస్సుకు అత్తు నటుల బోధించుటచేత నా సందేహములెల్లను తీరిపోయెను. మరల యే సందేహము గలుగ నేరదని భావము. ३

184. కం. ఒరులు నేననక : నిండిన - దెరిగింపుమదేమో బయలు - యే నోరులనుచున్ - యెరుగు నీవెవరు యీ - లేనెరుకను వున్నావు వుంటె - యిది లేనంచనుకో ॥ నేనో నినునీ - మదిని లేననుకో ఎరిగి యీ లేనెరుక - యిట్లా లేకుండితె - పరిపూర్ణమో దాన్న - పగిది గుర్తెరిగేము - యిది లేనంచనుకో ॥ నేనోనినునీ - మదిని లేననుకో ॥ ४

తా. శిష్యా ! ఇతరులని అనగా నీవని నేనని యనకుండా అంతట నిండి నిబిడీకృతమైయున్న యీ అచల పరిపూర్ణమగు బట్టబయలు

యున్నదని చెప్పుము. నేనని యితరులని యెరుగుచున్నటువంటినీవెవరు అనగా లేని యెరుకవు. పున్నావు యిది లేనిదని యెల్లవేళలయందు తలంచుము. నేనును నీవును నీ బుద్దిలో లేనివారమని తలంచుము. యీ లేనటువంటి యెరుకను యే కాలములయందు లేదని యెరింగి యిట్లా లేకుండా దృఢమయితే పరిపూర్ణమనే బట్టబయలును యే విధముగా గుర్తెరుగగలవు. అందువలన అచల పరిపూర్ణము అన్ని కాలములయందు అన్ని దేశ్యములయందు అంతటను యున్నదని, యెరుక యే కాలముల యందు యెచ్చటను లేదని నిశ్చయముగా దృఢభావముతో యుండుమని భావము. 4

285. కం. నా బుద్ధికి సరిపడ్డది - నీ బుద్ధేకాని యన్ని - నేర్పుల గనినన్ - ఛీ బుద్ధులు యీ బుద్ధులు - నా బుద్ధికి మెప్పురావు నా తండ్రి వినరా ॥ శాభాసు ని - న్నే తండ్రిగనెరా ॥ ఈ బుద్ధినికమాన - కే బుద్ధి బూనాకు - యే బుద్ధి బూనీన - నీ బుద్ధి చెడిపోవు - నా తండ్రి వినరా ॥ శాభాసు ని - న్నే తండ్రిగనెరా ॥ ౫

తా. శిష్యా ! నిన్ను అనేక విధములుగా విచారించి చూచినా నాబుద్ధికి సరిపడ్డది నీ బుద్ధియే, ఎట్లంటే తల్లి తండ్రి భార్యా బిడ్డలతో కూడిన సంసారావరణమందు బద్ధులై యుండువారి బుద్ధులు. ఎరుకయగు మంత్రతలయహట యోగలక్ష్యఅణిమాద్యష్టైశ్వర్యములు మొదలగు మార్గములయందు బద్ధమై ప్రవర్తించెడి వారల బుద్ధులు నా బుద్ధికి మెప్పురావు. ఛీయని ఆ బుద్ధులు గలవారల విడువవలెను. నా తండ్రి యిటు వినుము శాభాసు యింత చక్కని బుద్ధిగల నిన్ను యే తండ్రిగనెనురా యిక నీకు ఈ బుద్ధిని ఎప్పుడు మానకుము, యితరుల యొక్క యే బుద్ధిని అవలంభించకుము. ఎవరియొక్క బుద్ధి నీవుబూనినా యిప్పటికి నీకు వున్న బుద్ధి పాడై పోవును. గావున ఓనా తండ్రి చక్కగా నా మాటనువిని ఈ బుద్ధిని ఎప్పుడు విడువకుమని భావము. 5

286. కం. కొట్టితి తిట్టితి శ్రమలన్ - బెట్టితి నీ మనవి చెవునం బెట్టక పెడచౌ - బెట్టితి మొట్టితి వెడలన్ - గొట్టితి నీ మనసు దెలియ కోపాములేకా॥ సరెదెలసే నీ వోపిక పోకా - పట్టు మిచ్చెదయింక - నట్టేమి యని దయ - బుట్టి యిచ్చితిబోధ - గట్టివాడవు రోరి - కోపాము లేకా॥ సరితెలసెనీ - వోపికపోకా॥ ౬

తా. శిష్యా! నిన్ను చేతికొద్ది కొట్టితిని నోటికి వచ్చినటుల తిట్టితిని యింకా అనేక బాధలుకూడా పెట్టితిని నీవు నాతో చెప్పు మాటలు వినిపించుకొనక పెడచెవులంబెట్టి వూరుకొంటిని నీ తల మీద మొట్టితిని. నిన్ను నా దగ్గర వుండ వద్దని పొమ్మని వెడల గొట్టితిని, నీమనస్సు ఎట్టిదో తెలుసుకొనుటకై యిట్లు చేసితిని గాని నీయందు కోపముచేత కాదు. నీ వోర్పును నీ శాంతమును చక్కగా తెలుసు కొంటిని. నీవు ఈ బ్రహ్మవిద్యకు తగినవాడవు బుద్ధివంతుడవని తెలిసి నీయందు దయ గలిగి ఈ అచల పరిపూర్ణబోధ యగు బ్రహ్మ విద్యదోబ్ధ నొసంగి నాడను యిది జాగ్రత్తగా వాడుకొనమని భావము॥ 6

286. కం. నీ వెంత కొట్టి తిట్టిన - నే విడచే వాడగాను - నీ చరణంబుల్ - చావైన పెండ్లియైనను - నే విడువనటంటి పట్టి - నిజ భక్తుడవెరా॥ నే గనుగొంటి - నీ నిష్టనౌరా॥ కావున నీ కిట్టి - ఘన మైన ఈ బోధ వేవేగ దయచేస్తి నీవిది విడునాకు॥ నిజభక్తుడవెరా॥ నేగనుగొంటి - నీ నిష్టనౌరా॥ ౭

తా. శిష్యా! నీభావము యెట్టిదనగా - అయ్యా మీరు యెంత కొట్టినను తిట్టినను నీ పాదములు విడువను ముక్తిరాజ్య పట్టాభిషిక్త మగు శుభమైన పెండ్లియైనను, నేననే అహంకార రహితమగు చావు యైనను మీపాదముల వద్దనే జరుగవలెనుగాని యెంతకైనను మీపాద ములువిడచేవాడనుగానని గట్టిగాపట్టుబట్టిన నిజమైన గురుభక్తుడవునీవే

నీ నిశ్చలమైన గురుదీక్షను నిష్టనుకనుగొంటిని యిప్పుడు యదార్ధమైనటు వంటినీన్ని ద్వైతాద్వైత విశిష్టాద్వైతమగు అన్ని బోధలకు మిన్నయై విద్యావిద్యలకు అతీతమైన శ్రీ బృహద్వాశిష్ట సిద్ధాంత మనబడు బ్రిహ్మ విద్యయైన యీ అచల పరిపూర్ణ బోధను నీయందు దయగల్గి బోధించి తిని దీనిని యెప్పుడు విడువక యుండుమని భావము. 7

288. కం. నా నోటిమాట వెంబడి - తానెప్పుడు సంచరించె - తగనీ చిత్తం బేనడిగని యీ బోధ - నిధానము నీకిస్తి దీన్ని - దాచు కోసుమీ॥ నిత్యము నీవు - చూచుకోనమీ॥ యేనరుడైన నిన్ని - బోధ నడిగితే - వాని మనుసరయాక - వానికి జూపేవు - దాచుకో సుమీ॥ నిత్యము నీవు - చూచుకోనమీ॥ ౮

తా. శిష్యా! నానోట మాట వచ్చిన తోడనే నీ మనస్సు నా మాట వెంబడి తప్పకుండా ప్రవర్తిచుటచేత, నీవు సూక్ష్మాతి సూక్ష్మ మైన దెలివిగలవాడవని తెలుసుకొని యీ అచల పరిపూర్ణ బోధను అవునికిని నీకు జెప్పితిని దీనిని భద్రముగా దాచుకొనుము. నిత్యము యీ గ్రింధమును బట్టబయలును నమ్మి చూచుకొనుచుండుము. యే మనుష్యుడైనను నిన్ను యీ అచల పరిపూర్ణబోధ యివ్వమని అడిగి నట్టయిన వాని మనస్సు యెట్టిదో కనిపెట్టకుండా యీ బోధ వానికి జెప్పవలదు. బట్టబయలును సూచన జేయకుము, నీవు యీ పరిపూర్ణ బోధను బయలును జాగ్రతగా దాచుకొనుమని భావము. 8

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ-విరచిత ద్వైతాద్వైత రహిత
పరమతత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి
తాత్పర్య భావార్దే శిష్య విజ్ఞాపననామ
వింశంతమోద్యాయః

• ౭౧ • ౨౧ గ్రంథపూర్తి ౩. ౩ •

289. కం. కూడి గురు శిష్యులిద్దరు - వేడుకతో బయలువున్న విధ - మెరిగెరుకన్ - వీడిరిది లేనిదని మా - టాడుటకిక యేమీదోచ దదియేమోకానీ ॥ వింటిరె మీ ర లి ది - యిందులోనీ ॥ జాడ మీ కెరుకానీ - వేడీతి వినుమంచు - యీ డీకి సరిముచ్చ - టాడుటకిక దోచ - దదియేమోకానీ ॥ వింటిరె మీరలిది - యిందులోనీ ॥ ౧

తా. ఓ జనులార ! గురు శిష్యులిరువురును కలసి సంతోషముతో అచల పరిపూర్ణ బ్రహ్మమను కేవలాత్మ శాశ్వతముగా యున్నటుల విచారణచే తెలసి, తెలసిన యెరుకను లేనిదని విడచిపెట్టగా అనగా నేననే అహమును వీడగా, వారలకు సర్వమును తోచేటటువంటి గుర్తెరిగే యెరుక లేకపోవుటచేత మాట్లాడుటలు లేకపోయెను, ఓ జనులార, మీరు యీ బోధలో యున్నటువంటి రహస్యాతి రహస్యమైన గుట్టును వింటిరే యీ జాడ మీకు తెలియుటకై యీ గ్రంధమును ఆసాంతముగా వినుమని వేడుకొంటిని. బోధానంతరము గురుశిష్యుల కిద్దరకు మాట్లాడుటకు పలుకుయనెడి యెరుక లేదని అనగా సర్వమును గుర్తించి పలికే యెరుక లేదని భావము. 1

290. కం. శరశాస్త్రస్వర హిమకర (౧౭౬౫) 1765 పరిమితమైనట్టి శాలివాహన శకమం - దరయగ శోభకృ దను వ - త్సర మార్గశిరంబు కృష్ణ-చవితి నాటికినీ॥ పద్యాల్పది దక్కువ మున్నూటికినీ॥ మురయూచు జేస్తి - నెవ్వరు విన్న చదివిన - పరిపూర్ణ మెరుకై లేనెరుక లేకుండూనె- చవితినాటికినీ ॥ పద్యాల్పది తక్కువ - మున్నూటికినీ ॥ ౨

తా. ఓ జనులార ! ఈ గ్రంథము సరియైన శాలివాహన శకమున పదిహేడు వందల అరువదియైదవ సంవత్సర పరిమితికి సరియగు శోభన కృతునామ సంవత్సర మార్గశిర మాసంబున కృష్ణ (బహుళ) పక్షమునందు చవితినాటికి పది పద్యములు తక్కువగా మూడువందల

కందార్ధ దరువులనే పద్యములు రచించితి. వీటిని యే జనులు విన్నను లేక చదివినను అచల పరిపూర్ణ బ్రహ్మము తెలియబడి లేని యెరుక లేకుండా జేయుచు జనన మరణములను తొలగ ద్రోయునని భావము. 2

శాలివాహన శకము ౧౮౭౮ (1878) హూణశకః 1956 సంవత్సరముకు సరియగు దుర్ముఖినామి సంవత్సర శ్రావణ శుద్ధ ౧౫ (15) పౌర్ణమి మంకళవారము నాటికి తాత్పర్య భావార్ధములు శ్రీ దువ్వాడ నారాయణమూర్తి భూమానంద స్వామిచే వ్రాయబడమైనది. 2

291. కం. ఏ పురుషుడు గురువర్యుని - శ్రీపాదము పట్టలేడో సేలుగనాతం - డీ పుస్తకమును జూచిన - యే పట్టున నిలువ కేగు - నిది నిజమయ్యా ॥ నరులార మీ - మది దెలియరయ్యా ॥ యీ పరమ గోప్యము యె - వరెరుగరోయయ్యా - నా పల్కు మదిలోన నాటీన వారికె - యిది నిజమయ్యా ॥ నరులార మీ - మది దెలియరయ్యా ॥ ౩

తా. ఓ జనులార ! ఏ మనుష్యుడు శ్రీ సద్గురుమూర్తి యొక్క పాదము పట్టక అనగా గురునిచే మంత్రోపదేశము పొందక యుండునో, అట్టి మనుష్యుడు యీ అచల గ్రంథమును జూచుటకు జదువగా వినుటకు ఏ ప్రక్కనైనా నిలుచుటకు అంగీకరించక వెళ్ళిపోవును. యిది నిజము జనులార, మీ మనస్సు యెట్టిదో మీరే యోచింపుడు. యీ పరమ రహస్యమైన అచల పరిపూర్ణమును యితరులు యెవ్వరును యెరుంగజాలరు యని భావము. 3

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమ తత్వేన శ్రీ భూమానంద దువ్వాడ నారాయణమూర్తి విరచిత తాత్పర్య భావార్ధే గ్రంధపూర్తి నామ ఏకవింశోధ్యాయః



శ్రీ సీతారామాయనమః

క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత పరమ తత్వ కందముల తాత్పర్యములనే భావార్థములు.

కం. ఈ కలకందములను విను - డో కల నరులార మీకు - నొప్పిదమైనన్ - నేకలగనుక రచించితి - యీ కల మోక్షమును జెంద - నగునివి వినినన్ ॥ ౧

తా. ఓ జనులార ! ఈ ప్రపంచ మనెడి కలలో కందపద్యములను మీరు కలలో వారు గనుక యిష్టమున్న యెడలవినుడు. నేనును కల గనుకనే వీటిని వ్రాసితిని. మీరు యీ గ్రంధమును వినిన యడల నేను అనే కల లేకుండుటకై (నివృత్తి అగుటకై) వ్రాసితినని భావము. 1

కం. మాటలేనట్టి బయలున - మాట గలిగెననుట వినుట - మాయ గదయ్యా - మాట మాయైతె మానెను - మాటను మాట్లాడి మనము - మానుద మవలన్ ౨

తా. ఓ జనులార ! నేననే పలుకు (అనగా శబ్దము) లేనటువంటి దైన యీ వృత్త బట్టబయలగు అచల పరిపూర్ణములో నేననే పలుకు పుట్టినదన చెప్పుట చెప్పినది వినుట మాయగదా (లేనిదేగదా) అట్టి పలుకు మాయ అయినప్పటికి అయ్యేది యెట్టిదో దానిగురించి మాట్లాడుచు (బోధను చెప్పుకునుచు) తరువాత మాటను విడువ వచ్చునని భావము. 2

కం. ఏ కందము కాకందమె - మా కంద ఫలరస రుచిని-మరి పించు రుచిన్ - మీ కందములైనను విను - డీ కందములన్ని సత్క - వీంద్రుల్లారా ॥ 3

తా. సత్కవులారా ! యే కంద పద్యముకు ఆ కంద పద్యమే మాకు ఆనందము, యెట్లనగా ఒక ఫలముయొక్క రుచి యింకొకఫలము యివ్వక యింకొక రుచి యిచ్చునట్లు, క్రితము అనుభవించిన పండ్ల

యొక్క రుచిని యిప్పుడు అనుభవించుచున్న పండ్లరుచి మరపించునట్లు ఒక్కొక్క కందపద్యము ఒక్కొక్క విధమైన ఆనందము గలుగ జేయుటచే యీ కందపద్యము లన్నియు నేను జదివెదను మహాకవులగు మీరలు చక్కగా వినుడని భావము. ౕ

కం. నే ఛందము జదివెరుగను - నా చందంబిదియు గురుని - నమ్మి రచిస్తిన్ - యీ చందపు పద్యములను - చూచందరు నగకదిద్దరు డీసు కవుల్ ॥ ౪

తా. ఓ జనులార ! ఛందోవ్యాకరణ సులక్షణ సారాది శాస్త్రము లేమియు జదువలేదు. నేను యెట్టివాడనో నానిజము లేక స్వస్వరూపము తెలుపుటకై శ్రీ అచల గురుస్వాముల వారిని నమ్మి సేవించి వారి కరుణచేత నా నిజము తెలుసుకొని యీ పద్యములు శ్రీ గురు సార్వభౌముల కృపచేత వ్రాయగలిగితిని. నావలె మీయొక్క నిజము తెలుపునట్టి యీ పద్యములను చదివి హేళనచేయక సుకవులు దిద్దుదురని కుకవులు హేళన జేయుచు దిద్దుట కిష్టపడిరని భావము. 4

కం. కథగాదు జనన మరణ - వ్యధ మానుటకై రచిస్తి - పర కవులార - మది యించి చూచి దిద్దుడీ - పదమే మాత్రంబు దప్పి పొరకయుండన్ ॥ ౫

తా. సుకవులార ! ఇప్పుడు నేను చెప్పబోవు విచారణ చరిత్రాత్మకమువంటి కథగాదు. మరి యెట్లాటిదంటే పుట్టుచావులు కలిగెడి ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములనే దుఃఖము లేకుండా జేయుటకు ఈ గ్రంథమును వ్రాసితిని. దీనిని మీరలు చక్కగా విచారించి ఎతిగణ ప్రాసలతో నుండక ఏ పదచ్ఛేదమైనను తప్పిపోయిన యెడల॥ మీరలు దిద్దవచ్చునని భావము ॥ ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములనగా ॥ యీస్థూల దేహముకు వాతపిత్త శ్లేష్మాదుల వలన కలిగెడి జ్వరాది మూడు వందల ఎనభైయారు వ్యాధులవలన కలిగెడి దుఃఖము ఆధ్యా

త్మికము ॥ సర్ప వృశ్చిక వ్యాఘ్రచోర విష జంతువుల వలన కలిగెడి దుఃఖము: ఆదిభౌతికము ॥ నీటివరద వర్షము పిడుగులు వాయువు అగ్ని వడగళ్ళు చెట్లు గోడలు మీట్లవల్ల కలిగిన దుఃఖము ఆదిదైవికము॥ యని భావము. 5

కం. తక్కువ పాండిత్యముచే - నిక్కౌ పండితులు మెచ్చ - నేరరు వీటిన్ - యెక్కువ పాండిత్యముగల - చక్కని పండితులు మెచ్చి పరెనన్నట్లన్ ॥ ౬

తా. ఓ జనులార ! సులక్షణ తర్క వ్యాకరణ చందోశాస్త్రాదులు వేదాంత పరిశోధన లెరుంగని తక్కువ పాండిత్యముగల పండితులు యీ పద్యములయొక్క నిజము గ్రహించ నేరక ఆనందించలేరు. సులక్షణ సార తర్క వ్యాకరణ మీ మాంస చందోశాస్త్ర వేదాంత పరి శోధనల పూర్ణముగా నెరింగిన మహా పండితోత్తములు యీ పద్య ములు చక్కగా ఆనందించిన మాకు చాలునని భావము. 6

కం. సూరిజనులె యీ గ్రంథపు - సారముగను వారుగాని - సంసార మహా - ఘోరవారాసి జేరిన - వారలు విని దీన్నిజూచి- వచియింపుదురే ॥ ౭

తా. ఒ జనులార ! బుద్ధివంతులు పండితులగు వారలె యీ గ్రంధము:యొక్క సారాంశమైన అచల పరిపూర్ణమును తెలియగలరు. కాని దుష్ట బుద్ధులతోనుండి జనన మరణములతోగూడిన సంసార మనెడి మహా సముద్రమునందు మునిగి కొట్టుకొనుచు దరిగానలేని సుద్ధ సంసారులగు పామర జనులు యీ అచల గ్రంధమును చూచి చదువుటకు గాని చదువుగా వినుటకుగాని యిష్టపడనేరరని భావము. 7

కం. గొప్పప్రతిష్టకు మిక్కలి - తిప్పలబడు నృతతికెపుడు-దీరదు వినని - యొప్పులకుప్పగు బోధను - తప్పక నా మాటనమ్మ -దగు తప్పనకన్ ॥ ౮

తా. ఓ జనులారా ! నేను గొప్పవాడనని ప్రజలు అందరు నన్ను మెచ్చుకొనవలెనని, అహంకారము యెక్కువగాయుండి దుష్ప్రవర్తకుడై చరించుచుండెడి మనుష్యునకు యీ అచల గ్రంధము వినుటకు అవకాశముండదు, అహంభావము లేనివాడై సుగుణసంపత్తులు కల్గిన మనుష్యునకు అచల పరిపూర్ణ బోధగల యీ గ్రంధము తప్పకుండా వినుచు చదువుచు నా బోధను తప్పని తలంచక యీ బోధను నమ్మి యుండునని భావము. 8

కం. మెప్పైన బోధగల మా - యొప్పులు తిప్పుంటెదిద్దు - డదినా కిష్టం-బిప్పగిది కందములనే-జెప్పితి యీ కవితజూచి-శిడిముడిపడకన్॥ ౯

తా. ఓ జనులారా ! ఈ బోదయె యదార్ధమైన బ్రహ్మవిద్యద్భోధ యని పండితులచే కీర్తింపగలిగి గొప్పదైన యీ అచల పరిపూర్ణ బోధ పొందిన మహాత్ములగు గురుశిష్యు లెవ్వరైనను యిందు యేదైనా తప్పులుండిన దిద్దుటకు నాకు సమ్మతమైయున్నది. అదియునుగాక కంద పద్యములతో అచర పరిపూర్ణ విచారణ వ్రాసితినని ఈ కవిత్వము రుచివంతముగా యుండనేరదని అసహ్యము పొందక చదువుడని భావము. 9

కం. ఒకసారియైన వినకన్ - వికవిక నవ్వేటి కుకవివే త్తల్లారా - ప్రకటించక మీ శౌర్యం - బికదాచుటే మీకు మాకు - హితమై యొప్పున్ ॥ ౧౦

తా. ఓ జనులారా ! ఒక్క పరియాయమైనను ఈ పరమతత్వ కంద పద్యములుగల ఈ గ్రంధరాజమును వినకుండా యిందేవిధమైన బోధ గలదో తెలియకుండా, వకవకానవ్వుచుండెడి కుకవులారా ! (వికట కవులారా) మీ అహంకారముతో కూడిన ఈర్షాభావమును వెల్లడించకుండా ఈ సమయమున దాచుకొనుటే మీకు మాకు యిష్టముగా యుండునని భావము. 10

కం. స్వచ్ఛాన్వయ గుచ్ఛములని - పృచ్ఛయొనర్చెదరు కవులు-పృధుయశులారా ॥ యిచ్ఛ జనించిన చదువుడీ - యచ్ఛాపద్యంబులివ్వి-యాసాంతముగాన్ ॥ ౧౧

తా. జనులార ! ఈ భూమియందు శాశ్వతమైన కీర్తిగలిగి ప్రవర్తించెడి బుద్ధివంతులారా, యీ కందపద్యములు నిర్మలమైనటువంటిన్నీ యీ పరిపూర్ణబోధకు బందోబస్తైన పుష్పమాలయని మహాకవులు నుతింతురు. మీరు చదువవలెనని లేక వినవలయునని జననమరణములు పోవుటకై ఆపేక్షగలిగిన యడల నిర్మల బోధగల యీ కందపద్యము లన్నియు మొదటనుండి ఆఖరు వరకు చక్కగా మనసుంచి చదువుడని భావము. 11

కం. తక్కిన బోధలవలె నిది - చిక్కులుగల బోధగాదు - చేపట్ట దగున్ - మక్కువతో మీ మునుపటి - చిక్కుల బోధలను చూర్ణం - జెక్కి ముడమునన్ ॥ ౧౨

తా. ఓ జనులార ! మీరు యిదివరలో వినిన ద్వైతాద్వైత విశిష్టాద్వైత బోధలవలె చిక్కులతోనుండు బోధ యిది కాదు. యీ అచల పరిపూర్ణ బోధను కరతలామలకముగా అతి సూక్ష్మముగా గ్రహింపవచ్చును. మునుపు మీకు ప్రేమగలిగిన సాంఖ్య తారక అమనస్క బోధలు ప్రాణాయామ లక్ష్యముద్రలు ఆసన హఠయోగ సాధన మొదలగు నన్నిటిని రహిత పరచి కేవల భూమానందమను (చలనము లేని ఆనందమును) పొందించునని భావము. 12

కం. సకలకార్య ప్రయత్న జ - నకమగు వస్తువును బట్టి-నలచివైచు దీ - న్నొకసారి వినిన చదివిన - నిక నింతకు యెక్కువైన వే బోధలయా ॥ ౧౩

తా. జనులార ! సర్వకార్యములు యే మనస్సుయొక్క సంకల్పముచేత లేక గుర్తుచేత లేక తెలివిచేత జరుపుచుందుమో అట్టి

యెరుకను, యీ అచల గ్రంధము ఒక్క పరియాయము మీరు జది పిన యడల లేక వినినయడల నేను అనేటి యీ యెరుకను లేకుండా రహితపరచును, యిట్టి అచల పరిపూర్ణ బోధకంటె యెక్కువైనదియే బోధయు కాదని భావము॥ 13

కం. కేరుచు మిము వినుమనినే జ సారెకు మీ చుట్టు దిరిగి - నన్నుతిజేసే - తోరపు బోధకు మూలం - బై రెవ్వరో వార్ని దలచి వరుసనుతింతున్॥ ౧౪

తా. జనులార! నా మనస్సున సంతోష ముప్పొంగగా మీకు యీ గ్రంధము వినిపించెద వినుడని అనేక పర్యాయములు మీ వద్దకు తిరిగి చెప్పుటకు, యీ అచల పరిపూర్ణమును ఆదిని యెవ్వరు జెప్పిరో అట్టి సద్గురు ప్రభువులను వరుసగా పేర్కొని స్తోత్రము చేయుదు నని భావము॥ 14

కం. ఈ క్షితి శివరామాహ్వయ - దీక్షితులకు బోధజేసి - దిద్దిన సామ్యో - దక్షుని శ్రీధరమూర్తిని - నిక్షేపముగా దలంచి - నేవినుతింతున్॥ ౧౫

తా. జనులార! ఈ ప్రపంచమునందు శ్రీ మదచలబోధ ప్రతిష్టాపనాచార్యులును దక్ష ప్రజాపతితో సమానులను శ్రీ శివరామ దీక్షితులకు సద్గురు ప్రభువులును, నగు శ్రీధరస్వాములైన జగద్గురువు లగు మహాత్ములను ప్రేమతో తలంచి నమస్కరించి వేనోళ్ళ స్తోత్రము జేయుదునని భావము॥ 15

కం. దక్షిణామూర్తి యనదగు - నీ క్షితి శివరామనామ - దీక్షితులనుచున్ - వీక్షింతు రార్యులతనిక - పేక్షను దండములు బెట్టి ప్రేమనుతింతున్॥ ౧౬

తా. జనులార! ఈ ప్రపంచములో దక్షిణామూర్తి యనబడు ఈశ్వరుడు యీయనే యనవచ్చుననెడి శ్రీ శివరామ దీక్షితువారే

యని పెద్దలగు సద్గురు సార్వభౌములు వేనోళ్ళ నుతించుచున్నట్టి శ్రీ మద్రామడుగు శివరామ దీక్షిత జగద్గురు ప్రభువులకు నేను ద్వాదశ నమస్కారములు జేయుచు ప్రేమతో స్తోత్రము జేయుదునని భావము॥ 16

కం. అదీక్షితుల కృపకు దా - పొద్దై అప్పయ్యమంత్రి - పరియించెను యీ - మేదిని తద్బోధ నతని - పాదములకు నతులొనర్చి ప్రార్థింతు మదిన్॥ ౧౭

తా. జనులార! ఈధరణీ తలమునందు శ్రీ శివరామ దీక్షితుల వారిని సేవించి, వారి కరుణకు పాత్రుండై అచల పరిపూర్ణ బోధను పొందినటువంటి కంబాలూరి అప్పయ్య మంత్రియను మహాత్ముని అచల పరిపూర్ణబోధకు ఆయన పాదపద్మములకు నమస్కరించి నా మనస్సున నెల్లప్పుడును ప్రార్థన జేతునని భావము॥ 17

కం. నతిజేసెద నప్పయ్యన్ - గతికై కొల్చితడు బోధ - గనెనో నేనా - ప్రతిలేని పరశురామ - క్షితిసురవంశ మణియైన - సీతాపతికిన్॥ ౧౮

తా. జనులార! శ్రీ కంబాలూరి అప్పయ్య సద్గురు సార్వభౌములకు నమస్కరించి, జనన మరణ బాధ నివర్తించుటకై సేవించి ఆయన అనుగ్రహముచే ఈ అచల పరిపూర్ణ బోధ సంపూర్ణముగా నెరింగిన, శ్రీ పరశురామ వంశ సుధీమణీయైన సీతారామ స్వాములవారికి నేను సాష్టాంగ ద్వాదశ నమస్కారములు జేసితినని భావము॥ 18

కం. బుచ్చి వెంకమ్మ తల్లిని - చెచ్చెర పెండ్లాడి కాశి - సేతువుదాకన్ - విచ్చలవిడి యెగజల్లెను - సచ్చరితుల కచలబోధ - సాకల్యముగాన్॥ ౧౯

తా. జనులారా! బుచ్చివెంకమ్మ యనే నామధేయము గల్గిన యువతీరత్నమును శ్రీ పరశురామ సీతాస్వాములవారు వివాహము జేసికొని కాశీపట్టణము లగాయతు రామేశ్వర పర్యంతము మోక్షాపేక్షగల బుద్ధివంతులైన జనుల కందరికి ఈ అచల పరిపూర్ణ బోధను స్వేచ్ఛగా తెలుగుభాషలో తెలుసుకొని జన్మసాఫల్య మగునటుల చాటు మాటు లేం బోధించెనని భావము. 19

కం. ఆ సీతాపతి నతి వి - శ్వాశము నం గొల్చికొంటి - సర్వేశ్వరుడం - చీ సద్బోధను తేటగ - జేసితినివి సకల జనులు-చెవి యొగ్గి వినన్ ॥ ౨౦

తా. జనులార! నేను శ్రీ పరశురామ సీతారామ స్వాముల వారిని పరమేశ్వరుడని నా మనస్సులో భావించుకొని యెక్కువ భక్తి విశ్వాసములతో సేవించుచు, జనన మరణ రహితమగు అచల పరిపూర్ణ బోధను పొంది తేట తెల్లముగ సకల జనులకు శ్రవణానందమును, గురు పుత్రులకు జన్మరాహిత్యము గలుగునటుల కందార్థ కంద పద్యములుగా యీ అచల పరిపూర్ణ బోధను వ్రాసితినని భావము. 20

కం. భాగవత వంశ భవుడను - భాగవతోత్తముల పాద - పద్మంబులకున్ - సాగిలి మ్రొక్కెడువాడను - బాగుగనను జనులు కృష్ణ - భట్లందురిలన్ ॥ ౨౧

తా. జనులార! ఈ లోకములో భాగవత వంశమందు పుట్టిన వాడను, ఉత్తమ గుణములు గలిగిన భాగవతులగు అచల పరిపూర్ణ భగవద్భక్తులైన శ్రీ గురుపాద పద్మములకు సాష్టాంగ నమస్కారములు జేసెడివాడను, నన్ను ఈలోకమునందు జనులందరు కృష్ణభట్లని పిలుచుచుందురని భావము॥ 21

కం. ధారుణ్యత్రిసూయులు - వీరెయని జనులుబొగడె - వెలసినవారల్ - నారాయణ జానకియను వారిరువురు గన్నయట్టి-వాడను సుమీ॥ ౨౨

తా. జనులార ! ఈ ప్రపంచమునందు అత్రిమహాఋషి అనసూయలు వీరేయని జనులచే పొగడబడుచుండెడి, భాగవత నారాయణుడును వారి ధర్మపత్నియగు జానకియను సాధ్వీలలామయైన వారిరువురకు గలిగిన కుమారుండనని భావము॥ ౨౨

కం. అనే నొసర్చినాడను - యీ నిజకందముల గ్రంధ - మెప్పుడు దీనన్ - వీనులవిని కన్నులగని - రేనట్టి జనంబు బల్కు-నేనే ననుచున్॥ ౨౩

తా. జనులార ! నేను వ్రాసిన యీ యదార్థమగు అచల పరిపూర్ణ విచారణ కందార్థముల వరుసతో తేటతెల్లముగా జనులకు తెలిపెటి అచలగ్రంధమై యున్నది. దీనిని చెవులతో త్రికరణశుద్ధిగా విని కన్నులతో కడముట్టజూచిన మనుష్యులు నేనే అనగా, భాగవత కృష్ణభట్లని లేక నేననే యొరుకే యిట్లు వ్రాసెనని పలుకగలరని భావము॥ ౨౩

కం. చిల్లర బోధలనన్నిటి - నొల్లరునిజ బోధదెలసి - యొప్పెటి పెద్దల్ - పొల్లని యందుకే నేనవి - వల్లక యీ బోధయందే - వర్తిస్తి జుమీ॥ ౨౪

తా. జనులార ! ఈ అచల పరిపూర్ణ బోధయగు విచారణ నెరింగి నిజము దెలసిన పెద్దలగు సద్గురుస్వాములు. భక్తి జ్ఞాన వైరాగ్యములును సాంఖ్యతారక అమనస్కములను మంత్రలయ హటయోగాదుల నన్నింటిని చిల్లరబోధలని యవి యంగీకరించకయుందురు. నేనును అవియెల్లను యదార్థమగు బ్రహ్మవిద్యకు బోధలుకావని వాటివి విడచిపెట్టి జనన

మరణములు తొలగించుటకు యీ అచల పరిపూర్ణబోధ ఘనమైనదని దీనియందే యుంటినని భావము॥ 24

కం. గురుశిష్యుల మాటలవలె - పరిపూర్ణబోధ కంద-పద్య పణితిచే - విరచిస్తి వినుడి ముందర - జరిగే ముచ్చట్లు మీకు - సహ్యంబైనన్॥ 25

తా. జనులార! గురుశిష్యులిద్దరు ప్రశ్నోత్తరములచే బ్రహ్మ విద్యను సంభాషించెడి పద్ధతితో యీ అచల పరిపూర్ణబోధ కందార్థ కందపద్యములుగా వ్రాసితిని. ముందు నేను బోధజేయుబోవు అచల పరిపూర్ణబోధ మీకు వినుటకు యిష్టమున్నయెడల వినుడని భావము॥ 25

కం. సకలనిగమాగ మాది - ప్రకర మహానారికేళ - ఫలసార ముదీ - సోక గ్రంధము జేసితి లౌ - కికజనులోకవేళ గొన్న - కీడు దొలంగున్॥ ౨౬

తా. జనులార! ఋగ్వేద యజుర్వేద సామవేద అధర్వణవేద ములతోగూడిన మంత్ర శాస్త్రములను ఆగమములును నిగమము లనెడి ఉపనిషత్తులన్నింటిని బాగుగా తరచి విచారించి వాటివాటి సారాంశమును, గొబ్బరిబెల్లములు మధురపదార్థములు కలిసి తయారు చేసిన యెంతరుచివంతమో అలాగు ఆగమ నిగమముల సారాంశమంత రుచివంతమని యీ కందార్థ కందపద్యములతో నుండెడి గ్రంధముగా వ్రాసితిని. యిట్టి శ్లోకగ్రంధమును ప్రపంచభ్రాంతిలోనుండి జననమరణ ములు పొందెడి మనుష్యులు వినినను లేక చదివినయెడల జనన మరణములనెడి కీడనేదోషము తొలగుననని భావము॥ 26

## ఆగమ విభాగము

కామికము, యోగజము, చింత్యము, కారణము, అజతము, దీప్తము, సూక్ష్మము, జగతి, అంశుమానము, శుప్రభేధ రవము, మకుటము, విమలము, చంద్ర, జ్ఞానము, బింబము, ప్రోద్గీతము, లలి తము, సంతానకము, సార్వోత్తమము, పారమేశ్వరము, కిరణము

కరుణ గలిగి సందేహము లేకుండా నేజెప్పబోవు అచల పరిపూర్ణ బోధము వినుమని యిట్లు చెప్పదొడగెనని భావము॥ 27

కం. పరమ పురుషుడును, లేనిది - యెరుకయుగల దరసి లేని-
యెరుకను విడుమం - చెరించిన శిష్యుడు గురు - వరు నడగెను
మ్రొక్కి రెంటి - వర్తన మవుడున్॥ ౨౮

తా. జనులార! పరమపురుషుడనెడి అచల పరిపూర్ణము కాలా కాలముల యందున్నదని తెలసి-లేనటువంటి యెరుకచే అచల పరిపూర్ణ మును జూచి లేనియెరుకను లేకుండ విడువుమని జెప్పిన సద్గురుమూర్తిని జూచి శిష్యుడు నమస్కరించి ప్రభూ, శాశ్వతమైన అచల పరిపూర్ణ మును లేనటువంటి యెరుకయును యీరెండును యెట్టివియో విరివిగా నా మనస్సుకు అత్తునటుల దెల్పుడని ప్రార్థించెనని భావము॥ 28

కం. పరమపురుషడన నెవ్వడో - యెరుకెట్టిదో తెల్పి యువల-
యెరుకను విడచే - తెరువెట్టిదో యున్నియు నా - కెరిగించు మటంచు
బల్క - నిట్లనెగురుడున్॥ ౨౯

తా. జనులార! క్షరపురుషుండనెడి జీవుండును, అక్షర పురుషుం డనెడి ఆత్మయును లేక ఈశ్వరుండును గాని - పరమపురుషడనెడి అచల పరిపూర్ణము యెట్టిదియో, లేనియెరుక యనగా యెట్టిదియో యీ రెండింటిని తేటతెల్లముగా జెప్పి అటుపై యెరుకను విడచేపద్ధతి యెట్టులో యివి యన్నియు నాకు స్పష్టముగా బోధచేయుడని శిష్యుడు ప్రార్థిం చగా అట్లాగే బోధ జేతునని గురుడు చెప్పదొడగెనని భావము॥ 29

కం. నే పెద్దలచే విన్నది - నీపై దయబుట్టి చెప్పనే బూనితినీ-
కావద్ధతి నంతయు విని - యేపద్ధతి కాశపడకు-మిదివిడువకుమీ॥ ౩౦

తా. శిష్యా! పెద్దలగు సద్గురుస్వాములవారిచే నేవిన్నటువంటి ఈ అచల పరిపూర్ణబోధ నీయుందు కరుణగలిగి బోధింపవలయునని తలంచితిని-అట్టి అచల పరిపూర్ణముయొక్కయు-లేనియెరుక యొక్కయు

పద్ధతులను చక్కగా విని యిందుకు యితరమైనటువంటి యే బోధలకును భ్రాంతిపడక దీనిని యెప్పుడు విడువకుమని భావము ॥ 30

కం. కదలడట పరమపురుషుడు - కదలిక మాయయట ఇట్టి - కదలిక కేదా మొదలన పెద్దలుబల్కి-రి-కదలనిదే కలదు లేదు - కది లిక యనుచున్ ॥ 31

తా. శిష్యా! అచలపరిపూర్ణమనెడి బట్టబయలే పరమపురుషుడు. అతడే కదలిక లేనివాడు అనగా రాకపోకలు లేనివాడు-చైతన్యస్వరూపమై రాకపోకలు గలిగినట్టిదే యెరుకయనెడి మాయ - యిటువంటి రాక పోకలు గలిగి చైతన్యమై సర్వమునకు చైతన్యము గలుగ జేయునది యెరుకయే కాని అచలపరిపూర్ణమగు బట్టబయలు కాదు యని పెద్ద లగు శ్రీగురు ప్రభువులు చెప్పియేయున్నారు. రాకపోకలులేని అచల పరిపూర్ణమే శాశ్వతమైనది, రాకపోకలు గలిగి శుద్ధచైతన్యస్వరూపమై (శుద్ధచైతన్యమీశ్వరః) అని శృతివున్నదిగాన యిది మాయే కాని యియ్యది యేకాలముయందును లేనిదని భావము ॥ 31

కం. పురుగుక్కు స్తంభంబును - కోరికినదన వీతిహోత్రుగూని - ప్రమింగెచదల్ - ధరననినను మాయాపతి - హరినిచీకాకుగయొనర్చె - ననవినదగునే॥ 32

తా. శిష్యా ! ఈప్రపంచములో ఇనపస్థంభమును పురుగు దొల చినదని చెప్పినను, అగ్నిహోత్రమును చెదపురుగులు ప్రమింగివేసెనని చెప్పినను, యేలాగు నమ్మకూడదో ఆలాగు యెరుకయగు మాయ అచల పరిపూర్ణమగు బట్టబయలును ఆధారముగా జేసుకొని సృష్టి చేసెనని చెప్పుటయు అచలపరిపూర్ణమునందు యెరుక ప్రవేశించెనని లేక వున్నదని చెప్పుట నమ్మకూడదని భావము॥ 32

కం. హరియందుదోచు విశ్వము - నరస్వప్నమువంటిదనిరి - నానాజనముల్ - సురస్వప్నము వంటిదియనె - స్థిరమతి శివరామ నామ - దీక్షితులుధరన్ ॥ 33

తా. శిష్యా! బట్టబయలగు కేవలాత్మయందు వున్నటుల తోచుచున్న (గుర్తింపబడుచున్న) ప్రపంచము జనులందరు నిత్యము పొందుతూ వున్నటువంటి కలవంటిదని పెద్దలగు యితర గురువులు కొందరన్నారుగాని, త్రిమూర్త్యాది దేవతలకు (అనిమిషులకు) కల యేలాగున లేదో ఆలాగే బట్టబయలగు అచల పరిపూర్ణమునందు యీ ప్రపంచము యేమియు పుట్టలేదని అనగా లేనేలేదని, కదిలిక లేని మనస్సుగల మన అచలపీఠాధ్యక్షులగు (శ్రీ) శివరామ దీక్షిత అచల గురుస్వాముల వారు అన్నారు అని భావము॥ 33

కం. సురలందు దోచు స్వప్నము - హరియందున దోచు విశ్వ-మ్మాసురలహరిన్ - యెరిగినకల విశ్వము తా - మరుగవె తమ లేమి నెరిగి - యితిబిడియమునన్॥ 34

తా. శిష్యా! అనిమిషులగు త్రిమూర్త్యాది దేవతలకు కలయనునది లేనేలేదు. ఆలాగే బట్టబయలగు అచలపరిపూర్ణమునందు ప్రపంచము పుట్టనేలేదు. అట్టి దేవతలయొక్కయు అచలపరిపూర్ణము యొక్కయు నిజమెరింగిన యీ కల ప్రపంచములు రెండును తాము లేని వారమని తెలిసి సిగ్గుపడి లేకుండా పోవునని భావము॥ 34

కం. కదలనిది కదలదెన్నడు - కదిలికగల దనినదాని - కగు పటము మొదల్ - కదిలిక లేదది గావున-యిది పరమరహస్య మెవ్వ - రెరుగరు దీనన్॥ 35

తా. శిష్యా! కదిలిక లేదనువంటిదనగా రాకపోకలు లేనటువంటి అచలపరిపూర్ణము ఎన్నడూ తానుకాలత్రయమందు పుట్టుచావులు లేక నే

యున్నది - చైతన్యము కలిగి రాకపోకలతో నుండెడి యెరుక యేలాగు పుట్టినదో యెవరివల్ల వచ్చినదో యని విచారించగా యెరుకకు మూలము యెంత వెదకినను సుంతయైనను కనుబడదు. అచలపరిపూర్ణ మగు బట్టబయలు రాకపోకలు లేనిదిగనుక యింకోకదానిని యెట్లా పుట్టించును. యేగుణము లేనిది కేవలాత్మ దానియందు యేది పుట్టుటకు అవకాశము లేదు. యిదియె పరమరహస్యము. దీనిని యెవ్వరూ యెరుగ జాలరని భావము॥ విశేషము-శ్రు నమూలంనాస్థి ప్రజ్ఞానం శరీరం కారణం నచా॥ అనిశ్రుతి॥ యిదియే జ్యోతిర్మయ బింధుస్వరూపమనే మాయావరణ ప్రతిబింబమగు ఈశ్వరుడు యితనికి మూలము లేదు. స్థూలాది మహాకారణ శరీరము లేదు. యిది వచ్చుటకు కారణము యేమియు లేదు. యితనికి మనస్సు వున్నట్టును తన మనోసంకల్పముచే ప్రపంచము సృష్టించినట్టును ఈ శృతి చెప్పుచున్నది. (విశ్వకర్మా మనసా విశ్వంకరోతిదదాతిబ్రాహ్మణః)అని శృతి యున్నది. విశ్వమును సృజించిన విశ్వకర్మయనే ఈశ్వరునకు (బ్రహ్మముకు) మూలము లేదని తనకుతానే (స్వయంప్రభుఃవని) పుట్టెనని తనను పుట్టించినవారు లేరని యీతనివల్లనే ప్రపంచము పుట్టెనని కేవలాత్మయైన బట్టబయలు వలన యీతనుగాని ప్రపంచముగాని పుట్టలేదని యెరుకవల్లనే పుట్టెనని యీ శృతులు చెప్పుచున్నవని భావము॥ 35

కం. కలనిది కదిలెనన్నను - ముదమున వినదగుదు వారి - ముచ్చట నెపుడున్ - కదలిన కదలనిదెట్లగు - నది గావున కదలదనుచు- నమ్మదగుజుమీ॥ 36

తా. శిష్యా! ఏ సంకల్పాదులు (ఏగుణములు) లేనటువంటి రాక పోకలు లేనటువంటి అచలపరిపూర్ణమగు బట్టబయలుకు యెద్దియో సంక ల్పముకలిగి ప్రపంచము పుట్టించెనని లోకులుచెప్పెడి మాటలను ఎప్పుడు

వినవలదు నమ్మవలదు-అనేక సంకల్పాదులు గల్గి రాకపోకలనే చావు పుట్టుకలు కలిగిన యెరుక (మాయ) ఏసంకల్పాదులు లేక రాకపోకలు లేక యుండు అచలపరిపూర్ణమగు బట్టబయలు యెట్లగును కానేరదు, గాన అచలపరిపూర్ణము పుట్టుగిట్టుట లేనిదని యింకొక దానిని పుట్టించ నేరదని నమ్మవచ్చునని భావము॥ 36

కం. నిను మేనును ప్రకృతిద్వయ-మని నిను నీమేనుమృషని - మానిరి నిజో - లిని పెద్దలు నీవెరుగక - నిను నీవొకకొండనంటె- నిజమామాట॥ 37

తా. శిష్యా! నిన్నును నీ మేనులైన యీ రెండును ప్రకృతిద్వయ మగు ఎరుకయే యని నిన్నును నీమేనును లేని వేయనివాటి భ్రాంతిని పెద్దలగు అచలగురువులు విడచిపెట్టిరి. అచలపరిపూర్ణ బోధను నీవు తెలియక మేను లేదనియు నేను వున్నదనియు అంటే ఆమాట లబద్ధములే కాని నిజమైన మాట కాదని భావము॥ 37

కం॥ పేరచలమనుచు బయలని - పేరెప్పుడు లేని మనము - పెట్టుట చేతన్ - పేరాయబయలుకిప్పుడు - పోరా నీవు నేను మృషని - పోతేజాలున్ ॥ 38

తా. శిష్యా! రూపనామ క్రియలు లేని దేవునకు అచలమనియు పరిపూర్ణమనియు బట్టబయలనియు మనము బోధకొరకై పేరు బెట్టుట చేతనే పేరు వచ్చెను. గాని నామరూపక్రియలు దేవునకు యెన్నడూ లేవు, పేరుబెట్టిన నీవున్నూ నేనున్నూ లేనివారమని మాయయని తెలిసితే మన యిద్దరము పోవువారమేగాని, ఆబట్టబయలు పోవునదికాదని భావము॥ 38

కం. పరమపురుషు డీబయలని — గురుడెరిగించినను జూచి గొప్పకురచలై - యెరిగెటినిను నేమృషనని - మెరిగరుగుము నీవె మాయ - వికబుటవిలన్ ॥ 39

తా. శిష్యా! ఈ ప్రకృతి పురుషులనెడి నేను మేనులకు అతీత మైన బట్టబయలే పరమపురుషుడని సద్గురుమూర్తి తెలుపగా, ఆ బట్ట బయలును గుర్తించి, అణువుకంటె అణువై మహత్తుకంటె మహత్తై సర్వమును గుర్తెరుగుచున్నటువంటి నీవును నేనును లేనివారమని తెల సితే నీవు మాయవు గావున మాయయనగా లేనిదేగాన లేకుండాపోవును. అనగా యిక పుట్టనేరవని భావము॥ 39

కం. అయమాత్మ యనిన రీతిగ - నయముగ యీ బట్టబయలు నదుగో యనుటల్ - అయమియమని యనుటుళ్ళక్కి - యయినను నస వలసె నీదు కీడుడుగుటకై॥ ౪౦

తా. శిష్యా! శుద్ధ చైతన్యమగు సచ్చిదానంద బ్రహ్మమే నీవైన ఆత్మ నేనైన ఆత్మయే అయమాత్మ బ్రహ్మమని యితరులు చెప్పిన పద్ధతిగా నేను మేనులు నీవు కాదని నీ నిజస్వరూపము రూపనా క్రియలు లేని యీ వృత్తి బట్టబయలని నీకు చూపించుటయైనది, బట్ట బయలు నీవని చెప్పినమాట అబద్ధము అయినప్పటికి నీకు యిప్పటికి, యున్నటువంటి కీడనే భ్రాంతి వీడుటకై అట్లా అనవలసివచ్చెను. అనగా నేననే మొనక లేకుండాపోతే వున్నది బట్టబయలే గనుక అది పోవుటకై ఇట్లా అనడమైనదని భావము॥ 40

కం. లేనినే నీవు లేని - స్థానంబును కారణంబు - సర్వమున కధి - ష్టానంబుసాక్షి సత్య - జ్ఞానానందంబులనిన - సత్యములగునే॥ ౪౧

తా. శిష్యా! నేను లేనటువంటిన్నీ నీవు లేనటువంటిన్నీ యేః స్థానమగు అచలపరిపూర్ణము యున్నదో, అద్దానిని సర్వమునకు కారణమనియు సర్వసృష్టికి అధిష్టానమనియు సర్వసాక్షియనియు సచ్చి దానంద మనియు సత్యజ్ఞానానందంబనియు చెప్పినయెడల సత్యమైన మాట కాదని అసత్యములని భావము॥ 41

కం. అట్టిది యిట్టిది యనరా - నట్టిది బయలనుచు దెలసి
యీమాదట నీ - వట్టిది యిట్టిది యనరా - నట్టిది బయలనిన దాని
నరయుము మెపుడున్॥ ౪౨

తా. శిష్యా! రూపము నామము క్రియ లేనటువంటిదిన్ని యిటువంటిది యని పోల్చి నిరూపింపరానిదిన్నియైన ఈ వృత్త బట్టబయలును గుర్తించి, అటుపై యిటువంటి గుణములు గల్గినది బట్టబయలు కాదని నీవు యే గుర్తుచేత నిజమైన అచల పరిపూర్ణమును గుర్తించితివో అట్టి గుర్తుయగు మెరుకను యెప్పుడును యున్నదని తలంచుకుమని భావము॥ 42

కం. అదియిది యంచనియనరానిది - బయలని తెలసి నీవు -
యిదియది యనరా - నిది బయలని తెలసిననను - వదిలుండుము లే
నటంచు - వరగుణవంతా॥ ౪౩

తా. సుగుణవంతమైన శిష్యుడా! ఎర్రది తెల్లది నల్లది కర్రిది కళనాదము బిందువు పొట్టి పొడవు లావు సన్నము ఆపోజ్యోతి ప్రత్యగాత్మ నీలతో యద మధ్యస్థము॥ అణోరణీయాం మహితో మహీయాం నీ వారసూ కవర్త్స్వి పీతాభా స్వస్వరూపిణి॥ మొదలైన పేర్లు యున గానిదైన యీ వృత్త బట్టబయలును తెలుసుకొని, నీవైన ఎర్రది తెల్లది నల్లది క్రరిది నాదము బిందువుకళ పొట్టి పొడవు లావు సన్నము అణువు స్థూలములను ఏ గుర్తుచేత అనగా యే తెలివిచేత సర్వమును యెరుగుచున్నావో అట్టి నిన్ను లేవని భావించుమని భావము॥ 43

కం. కలనీకు జగము కంతట - గల బయలుకు కలిగియున్న
ఘనమగు తిప్పల్ - కలయగని మేలుకని యీ - కలవలె మేలుకను
జూచి - కదులు ముళ్ళక్కీ॥ ౪౪

తా. శిష్యా! నీవు కలలో అనేక సుఖ దుఃఖములు మంచి చెడ్డలు మరి యేమేమియో పొంది నిజమని భ్రమించి ఆ కలనుంచి మెల

కువ రాగా ఏలాగున కలలో పొందిన అన్ని తిప్పలు లేనివగుచున్నవో అటువలె ఈ ప్రపంచమనెడి కలలో యీ ప్రపంచము లేనిదని మెలుకువ గలిగి ఆ మెల్కతో బట్టబయలగు అచలపరిపూర్ణమును జూచినయెడల యీ కలలోనివన్నియు నీవును యేమియు లేకుండా పోవునని భావము॥ 44

కం. కలనేన్గ సింహమును క-న్నులగన మృతిజెందినట్లు -
యుళ్ళక్కగు నీ - వల గురు కృపచే బయలున్ - దెలసూరికే యుంటి
వేని - తీరునుమాటా ॥ ४౫

తా. శిష్యా ! ఏనుగ తన కలలో సింహ్వామును కన్నులతో చూచి మరణించినట్లు, సర్వము నీవైన యెరుక ప్రపంచమనెడి కలలో సద్గురుమూర్తి కరుణచేత కేవలాత్మయైన బట్టబయలును గుర్తించి (లేక దర్శించి) న యేమియు లేకుండా పోవును. ఆలాగు తెలిసినతర్వాత నీవు ప్రాపంచక దేహ సంబంధమగు ఏ భ్రాంతులను పొందక అనగా సంకల్పాదులు చేయకుండా పూరికేవుంటె నేను అనే యెరుక లేకుండా పోవునని భావము ॥ 45

కం. ఎప్పటికి యొక్కరీతిగ-తప్పక నిలచున్న దాన్ని - దయతో
గురున్ఁన్-చెప్పినగని యుగణితమగు - తిప్పలుగల నిన్ను నీవు -
దీసి తెసరా॥ ४౬

తా. శిష్యా ! సర్వవస్తు సర్వకాల సర్వదేశ్య సర్వావస్థల యందు కదిలిక లేక ఒకే విధముగా నిలచివున్న బట్టబయలగు అచల పరిపూర్ణమును శ్రీ సద్గురుమూర్తి కరుణగలిగి చూపించినసమయములో శిష్యుడు అది వుండగా గుర్తించిన క్షణముననే అనేకములగు కష్టసుఖ ములు పొందుచుండెడి తానైన యెరుకను విడచి అచలపరిపూర్ణ స్థితిలో యుండుటే సరియైన మార్గమని భావము॥ 46

పరమ తత్వ కందముల తాత్పర్యములనే భావార్థములు

కం. నీవున్న చోటనుండును — నీ వివిధ విచిత్రజగము - నీతో
గూడన్ - నీవు లేనట్టి చోటను-నీ వివిధ విచిత్రజగము - నిలువదు
క్రా॥ ౪౭

తా. శిష్యా! ఓపిల్లవాడా! నేను అనెడి అహంకారము వున్న యెడల నీవనె అహంకారముతో కూడ అనేక చిత్రవిచిత్రముల సంకల్ప భ్రాంతులతో నుండెడి సర్వప్రపంచము నిజమైయుండును. నేను అనెడి అహంభావము లేని అచలపూర్ణమగు బట్టబయలునందు నీవున్నా, నీతో కలసి యుండెడి అనేకమైన సంకల్పభ్రాంతుల ప్రపంచమంతయు లేకుండా పోవునని భావము॥ 47

కం. నానావికారములుగల - నానావిధ నామరూప - నటనలు
గల యీ - నీ నాదశ దిశలును గల-దీనందె లేక మనము - తిరుగుట
మప్పా॥ ౪౮

తా. శిష్యా! అనేక గుణములుగలిగి అనేకవిధములగు పేరులు రూపములు ప్రవర్తనలు (నడతలు) గలిగిన, నీకును నాకును పదిదిశల యందు వీబట్టబయలగు అచలపరిపూర్ణము వున్నదో అద్దానిలోనె అనేకమైన గుణములు ఆకారములు నామములు నడవడికలతో మనము ఏమియు లేనివారమై తిరుగుచుంటిమని భావము॥ 48

కం. అబ్బీ! యీబయలువున్నది - డబ్బునగురు జెరుకజేయు -
దబ్బరవనుచున్ - దెబ్బను మాయముగాకను - కబ్బము జెప్పాటకు
నిల్వ - గలవే నీవున్ ॥ ౪౯

తా. ఓ పిల్లవాడా! ఈ వుత్తబట్టబయలు శాశ్వతమై యున్నదని అద్దానిని చూడుమని శ్రీ అచల గురు ప్రభువులు సూచనచేయగా శిష్యుడు యీ వుత్తబట్టబయలు తప్ప మరేద్దియు లేదని తాను తెలుసుకొని సద్గురువాక్యమనె దెబ్బను నేనని అహంకారముతో పలుకుచుండెడి

నేను అగు అహంకారము పోకుండా నిలచి మాట్లాడ నేరడని భావము॥ 49

కం. మూలము లేకనె వచ్చిన - నీ లీలలు జూచుకొని - నీవె మురుతువీ - బైలున్న దనుచు దోచితె - నీ లేమిని నీ వెరింగి నిలువవుకురా॥ ౫౦

తా. ఓ చిన్నవాడా! నీకు మూలము లేకుండా వుత్త బట్ట బయలులో వచ్చినవాడవై నీవు చేయు పనులు (కర్మలు) చూచుకొని నీవే ఆనందించుచుందువు. యీ వుత్త బట్టబయలగు అచలపరిపూర్ణము శాశ్వతమై యున్నటుల నీవు యెప్పుడు గుర్తించితివో అప్పుడే నేను లేనివాడనని నీకు తోచి లేకుండా పోవుదువని భావము॥ 50

కం. జ్ఞానకర్మ స్వరూపము - గాని బయల్ నదిగో చూచి - కలకాలము యీ-జ్ఞానకర్మ స్వరూపంబా - నిను నీ వెరిగి మృపని-పని వినవోయీ॥ ౫౧

తా. శిష్యా! జ్ఞానము కర్మము (చేయుపనులు) స్వరూపము లనబడు మూడును కానటువంటి యీ వుత్త బట్టబయలు యెల్లకాలముల యందున్నదని చూచి గ్రహించి, యీ జ్ఞానము కర్మము స్వరూపము లనబడు మూడింటితో కూడిన నిన్ను నీవు యెరుకయని తెలుసుకొని ఎల్లకాలములయందు లేనివాడనని నేను మాయేనని తెలియుటే చాలునని భావము॥ 51

కం. ఈ నిర్మలమా బయలున - నా నాగమ నిగమ - కల్ప నాయనటంటే-యే నరులు నమ్మరిందుకు - నా నీ యందున నటంటె నమ్మిన మాడ్కిన్॥ ౫౨

తా. శిష్యా! అచలపరిపూర్ణమగు యీ వుత్త బట్టబయలుచే అనేక మంత్ర శాస్త్రములతో కూడిన చతుర్వేదములు వుపనిషత్తులు

ప్రపంచము మొదలగునవి పుట్టినవి యంటె యెట్టి మూఢాత్ములైన మానవులైనా నమ్మరు. ఎందువల్లనంటె యీ వృత్తి బట్టబయలుకు ఏ గుణము ఏ సంకల్పాదులు లేవు గావున అనేక గుణములతో వుండెడి ప్రపంచమును పుట్టించనేరదని బాగుగా తెలియును, నా చేతను నీచేతను అనే ఎరుకయుందే పై స్వరము పుట్టినదియంటె అందరూ నమ్ముదురని భావము॥ 52

విశేషము॥ (శ్రీ)మన్నారాయణమూర్తి వటపత్రశాయియై జల మద్యంబున తేలుచుండునప్పుడు ఆతనియొక్క (నిశ్వాసభూతా. మే. విష్ణోర్జాతా - వేదాను విస్తరాః) వుశ్వాస నిశ్వాసములందు ఋక్కు యజస్సు సామము అధర్వణములను నాలుగు వేదంబులు గల్పించబడెను. అందు ఋగ్వేదము ౨౧ శాఖలుగాను, యజుర్వేదము ౧౦౯ శాఖలు గాను, సామవేదము ౧౦౦౦ శాఖలుగాను॥ అధర్వణవేదము ౫౦ శాఖ లుగా నుండును. అందు ఒక్కొక్క శాఖయందు ఒక్కొక్క ఉపనిషత్తు గలదు. వానియందు ముఖ్యమైనవి ౧౦౮ ఉపనిషత్తులు అవి యేవి యనగా 1) ఐతరేయ, కౌషీతకి, నాదబిందు, ఆత్మప్రబోధ, నిర్వాణ, ముద్గల, అక్షమాలికా, త్రిపురాసారా, సౌభాగ్య, బహ్వృచలు యివి ఋగ్వేదంబున ౧౦ ఉపనిషత్తులు ముఖ్యంబులు 2) ఈశావాస్య, బృహ దారణ్య, జాబాల, హంస, పరమహంస, సుబాల, మంత్రిక, నిరాలంబ త్రిశిఖిబ్రాహ్మణ, మండలబ్రాహ్మణ, అద్వయతారక, పైంగల, భిక్షుక, తురీయాతీత, ఆధ్యాత్మ, తారాసార, యాజ్ఞవల్క్య, శాట్యాయనీ, ముక్తికోపనిషత్తులు ౧౯న్ని శుక్ల యజుర్వేదంబున ముఖ్యంబులు. (3) కఠవల్లి, తైత్తిరీయ, బ్రహ్మకైవల్య, శ్వేతాశ్వతర, గర్భ, నారా యణ, అమృతబింధు, అమృతనాద, కాలాగ్నిరుద్ర, క్షురికా, సర్వ సార, శుకరహస్య, తేజోబింధు, ధ్యానబింధు, బ్రహ్మవిద్యా, యోగతత్వ

దక్షిణామూర్తి, స్కంధ, శారీరక, యోగశిఖా, ఏకాక్షర, అక్షి, అవధూత, కఠ, రుద్రహృదయ, యోగకుండలిని, పంచబ్రహ్మ, ప్రాణాగ్నిహోత్ర, వరాహ, కలిసంతరణ, సరస్వతీరహస్యము లనియెడు ౩౨ ఉపనిషత్తులు కృష్ణయజుర్వేదంబున ముఖ్యంబులు (4) కేన, చాందోగ్య, ఆరుణి, మైత్రాయణి, మైత్రేయీ, వజ్రసూచి, యోగచూడామణి, వాసుదేవ, మహా, సన్న్యాస, అవ్యక్త, కుండికా, సావిత్రి, రుద్రాక్ష, జాబాల, దర్శన, జాబాలి, ఉపనిషత్తులు ౧౬న్ను సామవేదమునందు ముఖ్యంబులు(5) ప్రశ్న, ముండక, మాండూక్య, అథర్వశిర, అథర్వశిఖా, బృహజ్జాబాల, నృసింహతాపినీ, నారదపరివ్రాజక, సీతా, శరభ, మహానారాయణ, రామరహస్య, రామతాపిని, శాండిల్య, పరమహంస పరివ్రాజక, అన్నపూర్ణ, సూర్య, ఆత్మ పాశుపత, పరబ్రహ్మ, త్రిపురా, తాపన; దేవీ, భావనా, భస్మజాబాల, గణపతి, మహావాక్య, గోపాలతపన, కృష్ణ, హయగ్రీవ, దత్తాత్రేయ, గారుడములని ౩౧ ఉపనిషత్తులు అథర్వణవేదమునందు ముఖ్యములు, యీపరిపూర్ణ విచారణకు సంబంధించినవి ౧౨ ఉపనిషత్తులని ఆర్యోక్తి॥

కం. నే నీవనని మహాత్ముని - కీ నిగమాగమ విచార - మిష్టతి
యానా - నే నీవని యీ పల్కే - నా నీకే యిష్టతౌర - నా
నీయన్నా॥ ౫౩

తా. శిష్యా! నేను నీవుయనెడి అహంకారములేని అనగా ఎరుకలేని మహాత్మునకు (అచలపరిపూర్ణునకు) మంత్రశాస్త్రములు వేదములు ఉపనిషత్తులు ప్రమాణమైన అహంబ్రహ్మ మస్యాది మహావాక్యార్థ విచారణ హితవుగా యుండదు. నేను నీవనెడి అహంకారముతో వాదించుకొను యెరుకగల వారలకే హితవుగా యుండునని భావము॥

కం. కలవేళ్ళను యీ మేల్కను - గల యీ బయలుండజూచి
కల మేల్కలలో - గల లేని నిన్ను నీమే - నుల లేవని నీవు దెలిసి
యుండుము చాలున్॥ ౫౪

తా. శిష్యా! ఈ ప్రపంచమనె కలలో అన్ని సమయముల యందు మేల్కయనబడు ఈడ త్తబట్టబయలును వుండగ జూచి కల మెలకువలో ఏలాగులేదో అలాగు యీ వుత్తబట్టబయలగు అచలపరి పూర్ణమునందు నిన్నును నీ మేనును లేనివని తెలుసుకొని దృఢమై యుండుటె చాలునని భావము॥ 54

కం. మేను జడ మజడమనినను - నేనును మీ రెండుగలసి -
నేననబడు స్వప్నానందమె మదవస్థగు - నేనేనను మృషని తెలియు -
నే మృషనాదున్॥ ౫౫

తా. శిష్యా! మేను అనే యీ స్థూలశరీరము కదలిక లేనటు వంటి కొయ్యవంటి జడపదార్థము, యీ మేనులో నేను అని పలుకు చున్నది. చైతన్యముగల (కదిలికగల) ఆజడపదార్థము యీ రెండును గలసి నేను అని పలుకుచు పొందుచున్నటువంటి సర్వప్రపంచ వ్యాప కము కలలో వ్యాపకముయొక్క ఆనందమువంటిదేగాని అంతకంటె అధికముకాదు. కలయనెడి సమయముతో నేను అని పల్కెడి లేని దని తెలిసి దృఢముగాయుంటే అంతేచాలునని భావము॥ 55

కం. నేనేతానైతె నావలె-యీ నేలేనట్టిబ్రహ్మ-నేననుకున్న-
నేనందు నేను లేనిదే-మేనుజగత్తులయితోంచి-మృషనాకొంచున్॥ ౫౬

తా. శిష్యా! నేనని పలుకుచుండెడి ఈ యెరుక ఈ వుత్తబట్ట బయలయితే నేను అని పలుకవచ్చును. నేను అను పలుకు (శబ్దము) లేనటువంటి (నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే అని శృతి) పలుకులేని అచలపరి పూర్ణబ్రహ్మము నేనని యేలాగుపలుకగలదు, ఈ వుత్తబట్టబయలునందు

పరమ తత్వ కందముల తాత్పర్యములనే భావార్థములు.

నేను అనే యెరుక నేనిదియ్యేను మేనుగాను ప్రపంచముగాను కన బడుచు నిజము విచారించగా నేను మేనులు ప్రపంచము లేనివేయై మటు మాయగా పోవుచున్నవని భావము॥ 56

కం. కానరా వారుమతిములు - నానాగమ నిగమసమితి - నామమురూపం - బేను లేనపుడు నాకై - నేనరుదెంచినను వెంట - నే యువివచ్చున్॥ ౫౭

తా. శిష్యా! ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతములవారలు శైవ శాక్తేయ వైష్ణవ గాణాపత్య బౌద్ధకుటీచక కపాలిక మతస్థులగు వారలను నేను అనే యెరుకయొక్క నిజము యెరుంగరు ఎట్లనగా వేద ములు ఉపనిషత్తులు శాస్త్రములు, పురాణములు, నామములు, రూప ములు నేనుఅను పలుకులేనప్పుడుఎచ్చటయుండెను. నేనుఅను అహంకా రము వచ్చినతోడనే అన్నియువచ్చెను. నేనుఅనేయెరుక పోవునపుడు మరలదానితోడనే అన్నియు సమూలముగా నశించిపోవునని భావము॥ 57

కం. నామీది ప్రేమచేతను - ఈమనుజులు నిలుపదలచి - యెన్నోయుక్తుల్ - తా మొనరించిన నిల్తునె - నేమృష మృషనిల్వ గలదె - నిశ్చయమువలెన్॥ ౫౮

తా. శిష్యా! మాయ ఏమని పల్కుచున్నదో వినుము. ఈ జనులు నాయందు భ్రాంతి విడలేక ప్రేమగలిగి నన్ను శాశ్వితముగా వుంచవలయునని రసకల్పక, గంధకకల్పక, మూలికాకల్పక మొదలగు అనేకములుగా కాయసిద్ధికై కాయకకల్పములును, కుండలీయోగాది సమాది అభ్యాసములును, లంబికాది యోగములును, పరకాయాది ప్రవేశములును, యింకా అనేకయుక్తులచే నన్ను శాశ్వితముగాయుంచు టకై భ్రాంతితో ప్రయత్నించుచుందురు. వారలు యెన్ని చేసినను వారల భ్రాంతియేగాని నేను శాశ్వితముగావుండను. ఏమనగా లేని

మాయను గావున లేనిదానను శాశ్వితముగా ఎట్లువుండును ? ఈమాట సత్యమని తెలియుమని భావము॥ 58

కం. నీతండ్రి తాతలవలెనే - నీ తనయులు నీవుజనుట - నిశ్చయమెకదా - మీతోటిరాదుగద బయ-లీ తెరగెరిగినపుడు శూన్యమేదోకనరా॥ ౫౯

తా. శిష్యా ! నీ తండ్రియును నీతాతయును చనిపోయినవిధముగా - నీవును నీకుమాళ్ళును చనిపోవుట నిజమెకదా - ఈ వుత్తబట్టబయులు మీఅందరితో కలసి రాలేదుగదా - మీరలు చనిపోతే మీతోకూడా యీ వుత్తబట్టబయులు పోవదుగదా - గాన యీ వుత్తబట్టబయులు శూన్యమో మీరలందరు శూన్యమో బాగుగా నిజము విచారించుమని భావము॥ 59

కం. బయలెపుడు పుట్టెగిట్టదు - బయలెప్పుడు ముట్టుకోదు - బ్రహ్మాండంబున్ - బయలెపుడు నన్నెరుంగదు - బయలెప్పుడు జేయబోదు - పనులెవ్వైనన్ ॥ ౬౦

తా. శిష్యా ! ఈ వుత్తబట్టబయులగు అచలపరిపూర్ణము ఎప్పుడూ పుట్టలేదు-గనుక మరొకప్పుడు గిట్టనూ (చావ) బోదు - ఈవుత్తబట్టబయులు బ్రహ్మాండమనెడి పంచభూత పంచశక్తి పంచబ్రహ్మలతో నేననెడి యెరుకను అంటివుండదు- నేనను యెరుక వచ్చినదో హెచ్చినదో చచ్చినదో యీవుత్తబట్టబయలుకు తెలియదు - వుత్తబట్టబయులు ఈనేను మేను ప్రపంచములను పుట్టించుట గిట్టించుట మొదలగు పనులు యేమియు చేయనేరదని భావము॥ 60

కం. బయలనిన నిత్యవస్తువు - బయలన నొకరీతినుండు - బ్రహ్మాండములో - బనులనిన కండ్లబడనిది - బయలన బ్రహ్మాండమవల - బరగెడీదిసుమీ॥ ౬౧

తా. శిష్యా! ఈ బట్టబయలు కాలకాలములయందు కదలక నిలచియున్న శాశ్వితమగు పదార్థము. ఈ వుత్త బట్టబయలు బ్రహ్మాండ మనేడి యెరుకను అంటక లోపల వెలుపల నిండి నిమిడీకృతమైన ఒకే విధముగా యున్నది-మరిన్నీ యీ వుత్తబట్టబయలు యీ కన్నులకు కన బడనిది-యీ వుత్త బట్టబయలు బ్రహ్మాండమనేడి అక్షరపరబ్రహ్మముకు (యెరుకకు) అతీతమైయున్నదని భావము॥ 61

కం. బయలనిన నేను లేనిది - బయలనిన నుపాదిగాన, బడనిది యెపుడున్ - బయలనిన పలుకులేనిది - బయలిట్టిది యనుచు దెలియ - బడదెవ్వరికిన్॥ ౬౨

తా. శిష్యా! ఉత్త బట్టబయలు నేనని పలుకుచున్నటువంటి యెరుక లేనిది. యీ వుత్త బట్టబయలు స్థూలసూక్ష్మ కారణ మహాకారణ విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృతమూల ప్రికృతులనేడి అష్టతనువుల లో ఏవుపాదియుగానిది-యీ వుత్త బట్టబయలుకు ఓం అనిగాని, అహం అనిగాని, నేననిగాని నీవనిగాని పలుకుటకు శబ్దము లేనిది. (యతోవాచోనివర్తంతె అప్రాప్యమనసాసహా॥ అని శృతి) ఈ వుత్త బట్టబయలు శాశ్వితమైనదని యిదియే అచలపరిపూర్ణమని యిదియే నిశ్శబ్దమైన అచలబ్రిహ్మమని ఈ జనులు యెవ్వరికి ఈ రహస్యము తెలియబడదని భావము॥ 62

కం. చెప్పి చూపించరానిది - యప్పాయల్లదిగో చూడు - మని నే నీకున్ - చెప్పి చూపిస్తి మరువకు-యెప్పటికిది నమ్మ్మి లేని - యెరు కనువిడరా! ౬3

తా. శిష్యా! ఇట్టిదని అట్టిదని చెప్పుటకు చూపించుటకు అలవి కానటువంటి రూప నామ క్రియారహితమైన బట్టబయలును అదిగో చూడుమని నీకు కనుసౌంజ్ఞచే చూపించితి అదివుండగా చూచితివి గదా

ఆ బట్టబయలును నిదురవచ్చినవరకు చచ్చినవరకు మరువక శాశ్వత మని నమ్మి అశాశ్వతమై ఎన్నటూ లేనటువంటి నేననెడి యెరుకను నమ్మక విడువుమని భావము॥ 63

కం. ఉన్నదిగద నే జెప్పిన - దగ్నా దాన్నుండజూచి-తలగుము మృషయౌ - నిన్నంటియున్న సంపద - లన్నియుగొని నీవువచ్చినట్లు-మృషగుచున్॥ ౬౪

తా. శిష్యా! నేను నీకు చెప్పి చూపించినటువంటి ఈ వృత్త బట్టబయలగు అచలపరిపూర్ణము శాశ్వతమైయున్నటుల నీవు గ్రహించితివి గదా - గాన ఈ ఉత్త బట్టబయలును ఎప్పుడు ఏ కాలముయందు విడువకుము. నేనని పలుకుచున్నటువంటి ఎరుకయు దానితో కూడిన సర్వసంసారము (బాహ్యాంతర సంసారము) లేనిదని అశాశ్వతమని గ్రహించి మరల భ్రాంతినొందక దృఢముగా నున్నయెడల నీవు నీతో వచ్చిన సర్వసంసారము నిన్ను అంటియున్న వాసనలు నీతోకూడా లేనివై పోవుచున్నవని భావము॥ 64

కం. పంచకోశముల నంచును-మించినదీ యెరుకయనుట- మేలా బయలం - చెంచినదగు నా ముచ్చట - నంచిత సద్భక్తి యుక్త - అమితాసక్తా॥ ౬౫

తా. శిష్యా! అన్నమయ ప్రాణమయ - మనోమయ-విజ్ఞానమయ - ఆనందమయములనెడి పంచకోశములకు విలక్షణముగా ఈ యెరుక యున్నదని చెప్పుట యదార్ధమైన మాటకాదు. ఏమనగా ఈ వృత్త బట్టబయలు నందు ఈ పంచకోశములును పంచకోశములయందుండెడి యెరుకయు నిజము విచారించగా లేనివే యగుచున్నవి. ఈ అచలపరిపూర్ణ విచారణయందు మితములేని ఆశక్తి కలిగినటువంటినీవ్న ఎక్కువగా భక్తిశ్రద్ధలు గలిగినటువంటినీవ్న వాడవని నిన్ను తెలిసి ఈ బోధను నీకు బోధించితినని భావము॥ 65

కం. లేని నేనను శరీరము-లోన బైటగలిగినట్టి - లోక సమితి
కిన్ - లోన బయటగల బయలిది - దీనం దే లేక మనము - తిరుగుట
మనఘా॥ ౬౬

తా. శిష్యా! బుద్ధివంతా! మూలము యేమీ లేనటువంటి దై నేనని పలుకుచున్న యీ మహాకారణ శరీరముకు లోపల బైట దేహ ప్రపంచ భ్రాంతులనే అనేక వ్యూహాలు పుట్టుచున్నవి. వింతలగు పడుచున్నది. యిటువంటి ప్రపంచముకు యీ స్థూల శరీరముకు లోపల వెలుపల ఈవృత్తి బట్టబయలే యున్నది. అట్టి బట్టబయలులో మనము అందరము లేనివారమయ్యును వున్నటుల తిరుగుచుంటిమని భావము॥ 66

కం. ముడిబడి కర్మము జ్ఞానము - విడువక నా రెండు వెలసె విశ్వమననదె - కడు వేడ్క బయలు గనెనా-ఘుడియైనను నిల్వలేక - కల్లైపోవున్ ॥ ౬౭

తా. శిష్యా! కర్మమును విడువక జ్ఞానము, జ్ఞానమును విడువక కర్మము ముడి బడినటుల రెండును కలసియేయున్నవి. యీ జ్ఞానకర్మముల రెండింటిచేతనే ప్రపంచమగుచున్నది. యిట్టి కర్మజ్ఞానము లనగా నేను మేనులు, మేను కర్మము జ్ఞానమే నేను యైనది ఈ వృత్తి బట్టబయలు వున్నటుల గురుమూర్తి చే సూచనైనట్టయిన ఒక్క ఘుడియ సేపైనను నిలువలేక అబద్ధమై రెండును పోవునని భావము॥ 67

కం. సకలంబులేని బయలున - సకలములేని దిటకొచ్చి - చనె నా లేనం-చు కనితా లేచిపోయిన - నిక నిలచే బయలు నెరుగ - నే దుండనురా॥ ౬౮

తా. శిష్యా! ఏమీ లేనటువంటి ఈ వృత్తి బట్టబయలగు అచల పరిపూర్ణ బ్రహ్మమునందు యెరుక మూలము యేమియు లేకుండా తనకు తానువచ్చి అనేక చిత్రవిచిత్రములు కల్పించుకొని ఆనందించి దుఃఖించి

తాను యేమీలేని దానవని తన మూలమును, తాను గుర్తించి తాను లేకుండా పోయిన తర్వాత, శాశ్వితమై యున్నటువంటి ఈ వృత్త బట్ట బయలు వున్నదని గుర్తించుటకు మరి యింకొక యెరుక యేమియు లేదని భావము॥ 68

కం. ఉన్న లేనేమో యనకన్ - వున్నది బయలనుచు యేమో వుంటివి లేనం - చెన్న లేనట్టి నిన్నను - పన్నగగని లేని నీవు-పరు గిడవోయీ॥ 69

తా. శిష్యా ఈ వృత్త బట్టబయలు వున్నదో లేదోయని సంశయించక యెల్లకాలములయందున్నది. ఈ వృత్త బట్టబయలని యెరింగి, ఈ వృత్త బట్టబయలు నెరింగిన యెరుకయగు నీవు యే కాలమునందు లేనని తలంచి, యిట్లు నీ నిజమెరింగిన నీవు నిలచుటకు తావు మెచ్చ టను లేక పరుగెత్తినటుల లేకపోదువని భావము॥ 69

కం. రెండు వస్తువుల నడుమన - ఖండంబిదె కానుపించు - గద దీనిని నీ - వుండి కనుగొని చనందగు - మండిత సత్కీర్తిసాంద్ర - మానవచంద్రా॥ 70

తా. శిష్యా! ఈ ప్రపంచమునందుండెడి మానవులలో చంద్రుని వలె ప్రకాశనే సత్కీర్తిని పొందినవాడా. రెండు వస్తువులమధ్య యేది అఖండంబై గనుపించుచున్నదో అదియే అచలపరిపూర్ణమగు బట్ట బయలు, దానిని నేనని పలుకుచు సర్వమును గుర్తించుచున్న గుర్తుచేత ఈ వృత్త బట్టబయలును గుర్తించి గుర్తించిన యెరుకను లేకుండా తీసి వేయుమని భావము॥ 70

కం. ఉన్నదా నందు నిజముగ - నెన్నడు లేనట్టి మనము - యేమే తెంచిట యీ - తిన్నని ముచ్చటలాడితి-మిన్నిం యికన్ మనము పోతే-యేదిరమాటా॥ 71

తా. శిష్యా ! ఎల్ల కాలముల యందున్నటువంటి ఈ వుత్త బట్టబయలగు అచలపరిపూర్ణ బ్రహ్మమునందు, అన్ని కాలముల యందు యెన్నడు లేనటువంటి మన యిద్దరము యిచ్చట కలుసుకొని ఈ కేవలాత్మమైన బట్టబయలుయొక్క విచారణ యిప్పటివరకు జేసి యుంటిమి, నేను నీవు అనే యెరుక యిద్దరకు పోయిన వెనుక ఈ అచల పరిపూర్ణబోధ బోధించమని జెప్పటకు నీవున్నా, ఈ బోధను బోధించుటకు నేనున్నా యిద్దరకు మాటలు (పలుకులు) శబ్దము ఏమి లేవని భావము॥ 71

కం. ఓ పాపరూప బయ - లే పరమాత్మనుచు నమ్మ - లేనట్టి నినున్ - ఆపోజ్యోతినరుచు దెల - సీపట్లనే లేనటంచు - చేరు ముళ్ళక్కన్॥ ౭౨

తా. శిష్యా ! కన్నులమధ్యను చిద్బిందువులో పాప యే రూపముగా గలవాడా, శాశ్వితమై కాలాకాలములయందు చవించక యున్న ఈ ఉత్త బట్టబయ లే అచలపరిపూర్ణ బ్రహ్మమును పర మాత్మనిగా నమ్మము. మూలములేనట్టి నిన్ను ఆత్మవని ఆపోజ్యోతి స్వరూపుడవని తెలిసి ఈ ఆత్మ అశాశ్వితమని యిది అనాత్మమైన స్థూల శరీరముతో వచ్చి మరల స్థూల శరీరముతో పోవునట్టి మాయ (ఎరుక) యని తెలసి దీనియందు భ్రాంతిని విడచిపెట్టుమని భావము॥ 72

కం. ఇచ్చారాహిత్యంబునె - స్వచ్ఛంబగు బోధయనుచు - సజ్జనులని ఈ - ఇచ్చనె కూడనిదనిరా - స్వచ్ఛందుల మాటలన్ని - సత్యము వినరా॥ 23

తా. శిష్యా! ఏ భ్రాంతిని (ఏ సంకల్పము) లేకుండా చేయగల నిజమైన బోధ యీ అచల పరిపూర్ణబోధయేగాని మరి యితర యే బోధలు పనికిరావని పెద్దలును సజ్జనోత్తములు అగు మన గురు

స్వాములు అనిరి అదిగాక నేననే ఎరుకయు దేహ ప్రపంచ భ్రాంతు (కోరికలు)లు వుంచుకొనుట కూడనిదనిరి. యిట్టి నిర్మలమై యదార్థమైన అచల గురు ప్రభులయొక్క పలుకులు అన్నియు సత్యములుగా తలంచి వినుమని భావము॥ 73

కం. ఏ యాపేక్ష జనించిన - నా యాపేక్షలెల్ల మాయయని తెలియదగున్ - ఆయాస మానుదానను - ఛీ యని యవి విడువ దగును - సేమము కొరకై ॥ ౭౪

తా. శిష్యా! ఏ కోరిక లేక ఏ ఏ సంకల్పములు నీలో పుట్టినను ఆయా కోరికలు (భ్రాంతులు) యెల్లను మాయయని (యెరుకయని) తెలియుము. అకోంకలనే ఆశలచేతను నీకు శ్రమయు కష్టములు కలుగునుగాన ఆయా తలంపులు ఛీయని బ్రహ్మవిద్యకు పనికిరావని మేలుకొరకై అనగా అచల పరిపూర్ణస్థితి కావలసినవాడవు గాన అందులకై ఎట్టి సంకల్పములు చేయరాదని వాటిని విడచిపెట్టవలయునని భావము॥ 74

కం. లేని నీ కలిమి వంధ్యా - సూనునివలె పుష్కర ప్రసూనమువలె స్వ - ప్నానందమువలె గంధ - ర్వానీకస్థానము వలె నని తెలియదగున్॥ ౭౫

తా. శిష్యా! మూలము లేనటువంటి నీవున్నూ నీ సిరిసంపదలెల్లను గొడ్రాలుకు బిడ్డవుండుట యెంత నిజమో అంత నిజము, ఎండ్రకాయ ప్రసవించిన తనసంతతి యెట్లు జూడలేదో అటువలెను, కలలో పొందిన ఆనందము భోగభాగ్యములు యెంత నిజమో అంత నిజము. ఆకాశమున గంధర్వనగరముండుట యెంత నిజమో నీవు నీ కలిమిలేములు అంత నిజములని తెలుసుకొని యీ నేను మేనుల భ్రాంతిని విడువుమని భావము॥ 75

కం. నీ తండ్రి జనిన మీదట - నీ తనయుడు రాకమునువు - నీవున్నప్పుడున్ - యే తత్వమంతటను గల - దా తత్వము నరసి మృషని - తలపుము మిమ్మున్॥ ౭౬

తా. శిష్యా! నీ తండ్రి చనిపోయిన తర్వాత నీ కుమారుడు పుట్టకముందు నీవు వున్నప్పుడు ఈ మూడు కాలములయందు యే అచలపరిపూర్ణమగు బట్టబయలు అంతటను నిండి నిబిడీకృతమై రాక పోకలు లేక చలించక యున్నదో, ఆ బట్టబయలును తెలుసుకొని అదియే శాశ్వతమని అది సూన్యముకాదని, మీ ముగ్గురును అశాశ్వత మని సూన్యమని మాయయని యే కాలముయందు లేనివారమని దృఢ ముగా తెలసి భ్రాంతి విడువమని భావము॥ 76

కం. నీవెసుమీ జీవశివుల్ - నీవె సుమీ మేనుజగము - నీవే సుమీమ్మా - జీవశివైక్యము బయలున - నీవు గలుగలేదు లేదు - నీ మొదలెచటన్॥ ౭౭

తా. శిష్యా! (జీవోహం) నేను జీవుడననుచున్నది నీవె, (శివో హం) నేను శివుడననుచున్నది నీవె ఈ స్థూలశరీరము నీవె, ప్రపంచ మనగా నీవె జీవుడు శివుడు శరీరము ప్రపంచము అన్నియు నీవె, శివుడు వేరే నీవు వేరేవుంటె అయిక్యము చేయవలెనుగాని, రెండు వొక్కటె అయినప్పుడు అయిక్యము అనునది అబద్ధము, అదియునుగాక శివ జీవై క్యము అనునది ఈ వృత్తి బట్టబయలునందు జరుగదు. ఎట్లనగా నీవు వృత్తి బట్టబయలులో పుట్టనే పుట్టలేదు. నీకు మూలమే లేదు. మూలము పుట్టుక లేని నీకు శివజీవైక్యము ఈ వృత్తి బట్టబయలులో గలుగనేరదని భావము॥ 77

కం. కదిలీనా మెదలీనా - కదలని ఈ బయలు నిన్ను - గన లేదుగదా - మొదలెక్కడ గనరాదిక - కదులుము నీకలి ముళ్ళకక్క గాదల్చి సుతా॥ ౭౮

తా. శిష్యా! నా బిడ్డా నీవు కదులుచున్నను మెదలుచున్నను, కదలకుండా యున్నటువంటి యీ వృత్త బట్టబయలు నీవు కదులుచుంటి వనియు లేక మెదలుచుంటివనియు అనుటయు చూచుటయు లేదు. నీవు కదులుటకు మెదులుటకు మొదలు నీకు నీవెగాని నీకు యింకొక మూలము యేమియు లేదు, నీవు యిల్లు వుండుట యెల్లను లేనిదని తెలుసుకొని నీవు లేకుండా పొమ్మని భావము॥ 78

కం. మేనని నను దెలసిన గతి - నేననినది బయలుగాను నీ
వెరుగోయీ - నేననినిది నేననదని - నేనను నేరయ మృషని - నే
మృషనాదున్॥ ౭౯

తా. శిష్యా! ఇది నా శరీరమని యే గుర్తుచేత తెలసి పలుకు చుంటివో ఆ గుర్తుచేత, నేనని పలుకు లేనిదియైన ఈ వృత్త బట్ట బయలు ఉన్నటుల గుర్తించుము. పలుకులేని ఈ వృత్త బట్టబయలు నేనని యెన్నడూ పలుకనేరదని నేనని పలుకుచు సర్వమును గుర్తెరుగు చున్నదానిని (యెరుకను) చక్కగా విచారించగా మాయయే గాన అట్ట గుర్తయనె యెరుక మాయమై పోవునని భావము॥ 79

కం. మేనొక్కటి నేనొక్కట - నే నీ మాటలను విడచి - నిను
నీ తనువున్ - నేనేనని అచలము గని - నేనను నీ వేగవోయి - నే
మృషవనుచున్॥ ౮౦

తా. శిష్యా! మేను వేరుగాను నేను వేరుగాను యున్నదని జెప్ప కుము, నీ శరీరమనగా నీవె నీవనగా నీ శరీరమే రెండూ ఒక్కటేయని తెలియుము. అనగా విత్తుయందే చెట్టున్నది చెట్టుయందే విత్తున్నటుల తెలసి, ఆ తెలసిన యెరుకచేతనే ఈ వృత్త బట్టబయలగు అచలపరి పూర్ణమును జూచి నేను లేనివాడను మాయను అని తలంచి నీవు లేకుం డా పోవుటే మంచిదని భావము॥ 80

కం. దేహమున కొంత నిజమని - మోహంబున నిల్చుకొనుటె
మోసంబు గురు - ద్రోహమగు గాన విడువుము - మోహంబును
మేల్కని కల - మఱిగిన రీతిన్ ॥ ౮౧

తా. శిష్యా! మేను అబద్ధమని నేను నిజమని భ్రమగల్గి అభిమానముతో నిల్చుకొన దలచుటె మోసము ఏమనగా మేను నేనులు రెండున్నూ అబద్ధమైనా కావలయును లేక నిజమైనా కావలయును అందు ఒకటి నిజము ఒకటి అబద్ధము వుండదు. ఎట్లాగంటె బెల్లమును విడచి తీపి, తీపిని విడచి బెల్లము ఎట్లా వుండదో ఆలాగేనని తెలియుము, అందుకే ఆలాగుఅనుట మోసమనవలసి వచ్చెను, ఆలాగు తలంచుట గురుద్రోహముకూడా సంభవించును గాన యీ రెండింటిని అబద్ధమని తెలిసి ఈ భ్రాంతిని విడువుము, కలలో ధారాసుతాది మమకారభ్రాంతి గలిగి మెలకువరాగా కలలో కన్నవాటిలో యేమియు మిగులక అంతా సూన్యమైనటుల నీవు గురుమేల్కలోవుంటే ఈ ప్రపంచ దేహిదేహ భ్రాంతి నిజము కాదని తెలసి విడచి, గురు మేల్కలో యుండునని భావము॥

కం. చలనమన నీవుసుమ్మీ - చలన రహితమనిన బయలు -
చలనమెకల ఈ - చలనము చలన రహితము - గలదనికని తొలగ
మేలు - కగునోయప్పా ॥ ౮౨

తా. శిష్యా! సర్వమును గుర్తించుచు సంకల్పించుచు చలించుచున్న చైతన్య స్వరూపుడవు నీవు అనియు, యే గుర్తు యే సంకల్పములు చేయక చలించక చైతన్యముగాక నిలచియుండునది ఈ వృత్తి బట్టబయలగు అచలపరిపూర్ణమనియు, చలించెడి నీవే కలగనుక నీవనెడి చలించెడి గుర్తుచే చలనము లేని ఈవృత్తిబట్టబయలునుచూచి చలించెడి నీవు చలనములేకుండా పోవుటె గురుమేల్కవయగునని భావము॥ 82

కం. ఈ గుర్తెరిగే మేనును - బాగుగ విడచుండు మిందు - బట్టకు దేనిన్ - ఆగడమహాదానను విని - త్యాగము నీకుంటె మంచి దాగావోరీ ॥ ౮3

తా. శిష్యా! బాహ్యాంతర ప్రపంచమును గుర్తెరుగు చున్నటువంటి మహాకారణ శరీరమనెడి గుర్తును (దేహిని) దేహ ప్రపంచ సంబంధమగు దేనిని భ్రాంతించక విడచిపెట్టుము. యదార్థమగు యీఅచల పరిపూర్ణ బోధను పొంది ఆలాగు విడచిపెట్టుటచే ఏ కర్మలు నిన్ను అంటవు. నేను నేనని పలికెడి దురహంకారమైన గుర్తును విడచెడి త్యాగము నీకున్నటులైన ఈ బోధ విన్నందుకు చాలా మంచిదని భావము॥ 83

కం. చలియించని దాకాశము - చలనంబె వాయువనుచు - చాటింపదగున్ - చలనమె విశ్వము నేనన - చలనమె తను వెరుక లనిన - జగమనిన సుతా ॥ ౮౪

తా. శిష్యా! కుమారా, కదలిక లేనటువంటిదే ఈ వృత్త బట్ట బయలగు కేవల అమల నిర్గుణాతీత నిర్వృతియోగిక అచల పరిపూర్ణమగు పరాకాశము. అట్టి దానియందు కదిలిక కలిగి సోహం సోహం అనెడి వుస్వాస నిస్వాసలైన (స్వరాట్టు) వాయువు అని ఘట్టిగా చెప్పవచ్చును. అట్లు వస్తూపోతూ వున్నటువంటి ప్రణవబ్రహ్మమైనహంసయే సర్వప్రపంచమై యున్నది, ఈ హంసయే నేనని ప్రతిఘటములోనూ పలుకుచున్నది. అట్టి హంసయందు "హం" అనునదె నేను అను యెరుకయైనది, దానియందున్న "స" కారమే స్థూల శరీరముగా యైనది, ఈ రెండును కలసి సర్వప్రపంచముయైనదని భావము॥ 84

కం. వలదెక్కువ ముచ్చట్లిక - చలనము లేనట్టి బయలు - చందముగని ఈ - చలనమగు నీకు నీవె - తలిదండ్రులటంచు దెలసి - తలగుము చాలున్ ॥ ౮౫

తా. శిష్యా! ఇంకా ఎక్కువగా యీ అచల పరిపూర్ణము గురించి మనము మాట్లాడుట అవసరములేదు ఏమనగా కదిలిక లేనటువంటి యీ అచల పరిపూర్ణమగు బట్టబయలుయొక్క రహస్యము చక్కగా దెలసి, యీ కదిలికకలిగిన నీకు నీవే తలిదండ్రులని అనగా నేనే తండ్రి మేనే తల్లి (హం) కారమే తండ్రి (స) కారమే తల్లియని తెలుసుకొని నీవు లేకుండాపోయిన చాలునని భావము॥ 85

కం॥ బ్రహ్మందు లేకకలిగిన - బ్రహ్మను నేననెటిమాయ - ప్రభ లెడగంబై - బ్రహ్మనుగని తానేగుటే - బ్రహ్మననే మాయకు పని బ్రహ్మందుజుమీ॥ ౮౬

తా. శిష్యా! ఈ అచలపరిపూర్ణ బ్రహ్మమునందు మూలము లేక కలిగినటువంటి మాయకు జగద్భ్రాంతిచే కల్పితమై నేనే బ్రహ్మమని (అహంబ్రహ్మస్మి) పలుకుచు యీప్రపంచముగా కనబడుచుండెను. అచలపరిపూర్ణమగు యీ వృత్తబట్టబయలైన శబ్దబ్రహ్మమును, నేనే బ్రహ్మననిపలికె శబ్దబ్రహ్మమగు యెరుకచూచి యీ వృత్తబట్టబయలులో తాను లేకుండాపోవుటే యెరుకనివృత్తిమని భావము॥ 86

కం. నిరుపాధికమగు బయలున - మరిలేక నేకలిగినట్టి - మారుతమునకే - పరియాయనామములగు - కరువనియన యెరుకయనిన - కడుమాయయనన్ ॥ ౮౭

తా. శిష్యా! స్థూల సూక్ష్మకారణ మహాకారణ విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృత మూలప్రకృతుననెడి ఎనిమిది తనువులు కానటువంటి ఈ వృత్త బట్టబయలులో మూలము లేకుండా తనకు తానే ఇచ్చినటువంటి సోహంఅని విశ్వాసనిశ్వాసరూపకములు వాయువులకే బ్రహ్మదేవుడనియు ప్రాణమనియు ఎరుకయనియు గొప్పమాయయనియు పరియాయనామములు గలవని భావము॥ 87

కం. మానసము దేహి జీవుం - డానందము సత్తుచిత్తు - లహము
జగదధి-ష్ఠానంబుసాక్షి సత్య-జ్ఞానము ద్రష్టనిః నీవె-సత్యము సుజ్ఞా॥ ౮౮

తా. సుజ్ఞానియగు శిష్యుడా! మనస్సు దేహి జీవుడు ఆనందము సత్తుచిత్తు అహంకారములగు పేర్లుఅన్నియు ఒక్కయెరుకకే చెప్ప బడును, ఈ ప్రపంచకమునకు లేక శరీరమునకు అధిష్ఠానముశయన్నను సర్వేంద్రియములకు సర్వసాక్షియన్నను, సత్యజ్ఞాన మనంతంబన్నను, ద్రష్టయన్నను(నేత్రమందుండి చూచినది) యీ పేరులుఅన్నియు నేననే యెరుకయేయని యీమాటలు సత్యముగా నమ్ముమని భావము॥ 88

కం. జ్ఞానా జ్ఞానంబులు యీ - జ్ఞానంబువేకాని వేరు - గా
వెన్నటికీ - జ్ఞానా జ్ఞానానికి పని - జ్ఞానాతీతమునుగాంచి - చనుటయె
సుమిత్ర ॥ ౮౯

తా. శిష్యా! శబ్ద గుణకమగు ఆకాశముయొక్క అర్ధాంశము జ్ఞాతలేక జ్ఞానము, మిగిలిన అర్ధాంశము నాలుగు భాగములై వ్యష్టి భూతములతోకూడి మనోబుద్ధి చిత్తహంకారము లాయెను. ఆలాగే మిగిలిన నాలుగుభూతములు పైవలెనె అయి అన్నియుకలసి చతుర్వింశతి తత్వములతోకూడిన దేహమే అజ్ఞానము, పంచవింశతితత్వము దేహిజ్ఞానము, ఈజ్ఞానమే నేనుఅని పలుకుచున్నది. మేనే అజ్ఞానము యీరెండును కలసి వొక్కగు రైరిగే యెరుకయను శరీరమెకాని యీరెండు వేరుయెన్నటికికావు. ఈజ్ఞానాజ్ఞానముత్రేయున్న యెరుకకు అతీతమైయున్న అచలపరిపూర్ణమగు యీ వృత్తి బట్టబయలునుజూచి లేకుండాపోవుటే మంచిపనియని భావము॥ 89

కం. జలమందు మొదలులేకనే - జలచరములు పుట్టిపెరిగి -
సమసినరీతిన్ - అచలపుపూర్ణముంలో నీ - విలసజ్జనసంబుస్థితియు - విల
యములౌరా ॥ ౯౦

తా. శిష్యా! నీటియందు చేపలు యొక్క మొదలు అనగా గ్రుడ్లు గాని, చేపలుగాని ప్రప్రథమమున లేకనే చేపలు వాటికవ్వే బుట్టి వాటి కవియే పెరిగి, వాటంతట అవియే చనిపోయిన రీతిగా, అచలపరిపూర్ణమగు ఈ వుత్త బట్టబయలు నేను అనే యెఱుక తనకు తానే పుట్టి తనకుతానే, పెరిగి తనకుతానె చచ్చుట జరుగుచుండునని భావము॥ 90

కం. అచలమున మొదలు లేకనే - సచరాచర జంతునిచయ-
జననమగు య-ప్పుచయమున లేని జలచర -నిచయము జన్మించినట్లు -
నిశ్చయము సుమీ॥ ౯౧

తా. శిష్యా! అచలపరిపూర్ణ బ్రిహ్మమగు ఈ వుత్త బట్టబయలునందు కదలకున్నవి, కదలుచున్నవియైన యెనుబదినాల్గు లక్షల జంతుజాలములు స్తావరములు, జంగమములు, వుద్భిజములు మొదలగునవి అన్నియు ప్రపంచమున పుట్టుచున్నవి. చేపలకు మొదలు లేకుండా నీటిలో వాటికవియే పుట్టి నశించినట్లు సర్వప్రపంచములోగల స్థావర జంగమాత్మకము లన్నియు, ఈ వుత్త బట్టబయలులో వాటికవియే పుట్టుచున్నవని అనగా ఈ బట్టబయలు పుట్టించుట లేదని దృఢముగా చెప్పవచ్చునని భావము॥ 91

కం. నీరందుచాపలేకనె - నీరు జన్మించిమించి - నీల్గినరీతిన్ -
తోరమగు బట్టబైటను-వారక గుర్తెరుగుమేను వ-చ్చునుపోవున్॥ ౯౨

తా. శిష్యా! నీటియందు చేపలుయొక్క మొదలు యేమీ లేకుండా వుత్తనీటిలో చేపలుపుట్టి, నీటిలోనే పెరిగి, నీటిలోనె చనిపోయినట్లు. దీనితో పోల్చుటకు యింకొకటిలేని ఈ వుత్త బట్టబయలులో సర్వమును గుర్తెరుగుచున్నటువంటి మూలప్రకృతియను యెఱుక లేక అవ్యక్తము తనకుతానే పుట్టి, తనకుతానే పెరిగి, తనకుతానే పోవుచుండును. తనచేతనే సర్వప్రపంచము పుట్టించుట, పెంచుట, నశింపజేయుట యని భావము॥ 92

కం. జలధి జలచరము లోపల - గలదాజలరాసిలోని-జలచరము వలెన్ - జలధినిత్యం బనిత్యము - జలచర మట్లచల చలము - సరణులు గనుమీ॥ ౯౩

తా. శిష్యా! సముద్రము చేపల గర్భములో వున్నదా లేదు. సముద్రములో చేపలు యున్నవి. అదియునుగాక సముద్రము నిత్యమై శాశ్వితమై యున్నది. ఆ సముద్రముయందు పుట్టి పెరిగి నశించుచున్న చేపలు అనిత్యములై అశాశ్వితమై నశించుచున్నవి. అటువలె యెరుక ప్రపంచములను చలనమగు చేపలుగా పోల్చి సముద్రమువంటి ఈ వృత్త బట్టబయలు అచలమును పోల్చిచూచి నిజము విచారించుమని భావము॥ 93

కం. జలరాసికి బుట్టవుగద - జలచరములు వాటికవ్వే - జనియించుగదా - కలకాలమిట్లు బయలెరు - కలు గాంచిన సంశయంబు కడకేగుజుమీ॥ ౯౪

తా. శిష్యా! సముద్రము, చేపలు మొదలగు జలచరములు పుట్టించలేదుగదా, చేపలు మొదలగు జలచరములు వాటికవియే పుట్టుచుండుట నిశ్చయమేకదా, అలాగున అచలపరిపూర్ణమగు యీ వృత్త బట్టబయలును సముద్రముగా పోల్చి, దానియందు పుట్టుచుండెడి యెరుకయగు సర్వప్రపంచము జలచరములుగా పోల్చిచూచిన నీకుగల సంశయములు యింతటితో తీరిపోవునని భావము॥ 94

కం. పుట్టదు గిట్టదు వొకరిని - పుట్టించదు చంపబోదు - భూమ యెరుకదా - పుట్టును గిట్టును వొకరిని - పుట్టించును సమయు జేయు - భూమకితరమై॥ ౯౫

తా. శిష్యా! భూమయను అచలపరిపూర్ణము తాను పుట్టదు చచ్చిపోదు యింకొక దానిని అనగా యెరుకను పుట్టించదు చంపదు

భూమయను యీ వృత్తబట్టబయలుకు వేరైన మెరుక తనకు తాను పుట్టును. తనకుతానే చచ్చును. తనవంటిదైన యింకొకదానిని అనగా ప్రపంచమును పుట్టించును. పెంచును, చంపును. యీవృత్తబట్టబయలునకు మెరుకకు యెవ్విధమైన పోలిక సంబంధములేదు, మెరుక తనకు తానె పుట్టుచు చచ్చుచు అన్నిపనులు చేయుచుండునని భావము॥ 95

కం. కలలోపల యేనుగపై - గలదొర మేల్కనిన - నిల్వగలడా గురుడున్ - తెలిపి బయలు నీవు లేవిక - దలపకుమననీకు నిల్వ - దరమూతలపన్ ॥ ౯౬

తా. శిష్యా! కలలో యేనుగమీద కూర్చుని యున్న మహారాజు ఆ కలనుంచి మేల్కొంచి చూడగా తాను రాజుకాడు యేనుగ మీద తాను కూర్చుండుట లేకపోయెను తానుపొందిన అవస్థ అంతయు కల్ల ఆయెను, అట్లాగే శ్రీ అచల గురుస్వాములు అచల పరిపూర్ణమగు యీవృత్త బట్టబయలును సూచనజేసి ఈవృత్తబట్టబయలులో నీవు లేవని పరిపూర్ణబోధచే దృఢపరచిన తర్వాత మరల యున్నానని తలంపకుము, గురుబోధ విని గురుమేల్కలోనుండిన నీవు ఈవృత్త బట్టబయలులో నిలచిన యడల కలయైన మెరుక నెరుంగుట (తలంచుట) శక్యము గాదని భావము॥ 96

కం. ఎందరు లేదనన్ననుతా - నెందుకు లేకుండు బయలు - నేనీవనకన్ - యెందరుకలదనియన్నన్ - యెందుకుకలిగుండెమెరుక - నేనీవనుచున్ ॥ ౯౭

తా. శిష్యా! నేనని నీవని పలుకనిది చలనము లేనటువంటిదియైన యీ వృత్తబట్టబయలు లేదని అనేకములగు మతవాదులైన జనులు వాదించినను లేకపోదు. నేనని నీవని పలుకుచుండెడి యీ మెరుక శాశ్వతముగా యుండునని యెందరు మతవాదులగుజనులు వాదించినను, నేను

నీవు అను యీ మెయిక అశాశ్వతమే కాని యదార్థముగా యుండనేరదని భావము॥ 97

కం. నీకచ్చిరానియూరున - నీకేగృహ మచ్చినట్లు - నీవా మేనన్ - నీకచ్చిరాదు నీవునిను - చేకొనుటయు మానవయ్య - శ్రీయ స్కా-మా॥ ౯౮

తా. శిష్యా! నీకు యే గ్రామము అర్వాణముగా (అరుబలముగా) యుండదో అనగా నీకు జరుగుబడిలేని పూరున్నా, నీవు ఏ యింటిలో యుండిన క్షేమముగా యుండదని ఆయిల్లు విడచెదవో, అట్లాగు నా మేను యనెడి యీ శరీరము నీకు శ్రేయోదాయకము కాదని తలంచుకొని ఈ మేనుయందు అభిమానమగు అహంభావము విడచిపెట్టుటే నీకు క్షేమమని భావము॥ 98

కం. అష్టాంగ యోగముల నతి - కష్టించు ప్రజలవలెనే - కష్టించక యీ - స్పష్టమగు బోధవిను నీ - కష్టములన్నియును దొలగి - కడకేగు సుమీ॥ ౯౯

తా. శిష్యా! యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులనెడి అష్టాంగ యోగములు జననమరణములు పోవునని చేయుచు కష్టించేజనులవలె నీవు కష్టించవద్దు. యేమంటేవా నిజమైనటువంటిన్నీ, అతి సూక్ష్మమైనటువంటిన్నీ యీ అచలపరిపూర్ణ బోధను శ్రద్ధతో చక్కగా గురునిచే విన్నట్టులయిన నీకు యిదివరలో కలిగినకష్టములన్నియు లేకుండా జేసి జననమరణములు పోగొట్టునని భావము॥ 99

కం. ఇదిగాదుబోధ నే - దెల్పెదరమ్మని నీకు వేరే, పేరిడియువ లన్ - ముదమున నే బ్రహ్మననుచు - వదరుమనినవాడె మాయ - వసుమతిలోనన్ ॥ ౧౦౦

తా. శిష్యా! ఈ అచల పరిపూర్ణ బోధ మంచిదిగాదని దీని యందు మహాత్ములు యేమియు లేవని యింతకంటె ఎక్కువైన బోధ సర్వ మహాత్ములు కలిగినది నే బోధించెదను. నావద్దకు రమ్మని, నీవు సచ్చిదానంద బ్రహ్మమని పేరుబెట్టి, అహంబ్రహ్మాస్మియను అనుభవవాక్యమును ప్రజ్ఞానబ్రహ్మమను సాక్షాత్కారవాక్యమును, తత్వమసియను ఉపదేశ వాక్యమును, అయమాత్మబ్రహ్మమను సమాప్తివాక్యమును, నాలుగు వేదములు నాలుగువాక్యములు చెప్పెనని, వీటిని యెల్లప్పుడు ప్రేమతో జపించుచుండుము, ఆ బ్రహ్మమే నేను నేనే ఆబ్రహ్మమని తలచుచు పలుకుమని బోధించినవాడు యీ ప్రపంచములో మాయాగురువు యని భావము॥ 100

కం. మంత్రయంత్రములు ముద్రలు - తంత్రంబులు నీకుదెల్పి - ధనమడిగెటిరయా - మంత్రజ్ఞులమంత్రములకు - యంత్రములకు తంత్రములకు - నీగకుకూనా॥ ౧౦౧

తా. శిష్యా! సప్తకోటి మహామంత్రములు, చాపరి మంత్రములు, అందుకు తగిన యంత్రములు అనగా చక్రములు, షణ్ముఖి అంతఃఖేచరి, బాహ్యఖేచరి, భూచరి, మధ్యమవైఖరి, రాధా మొదలగు ముద్రలు జాలందరబంధ ఓడ్యాణబంధ మూల బంధములను మరియు వశ్య, కర్షణ, విద్వేషణ, స్తంభన, ఉచ్చాటన, మారణలను షట్ ప్రయోగ తంత్రంబులు నీకు తెలియపరచి ధనములడిగెటి మంత్రవాదులైన మాయకుల యంత్రివాదులగు తంత్రివాదులగు గురువులనుజూచి వారలు బోధించు బోధయే నిజమని భ్రమించవలదని భావము॥ 101

కం. దీపముగతి కన్నులలో - పాపవలెన్ మెలగు నిన్ను - పరమాత్మపవం - చీ ప్రజలు దలతురెరుగక - నీ పాల్గొంగుండి నేను - నిను నమ్మదునే॥ ౧౦౨

తా. శిష్యా! కన్నుల మధ్యమందు చిద్బిందువులో ఆపోజ్యోతి యనెడి యెరుక తనకు తాను ప్రకాశించుచుండును. అద్దానిని కొందరు గురువులు పరమాత్మయని బోధింతురు. అదియె మాయ ఆ ఎరుక చేతనే సర్వప్రపంచము కల్పింపబడినది. అది లేనిదని దాని సంగతి నేను తెలుసు కొని అయ్యది పరమాత్మ కాదని నమ్మకుందును. నీవును ఆ ఎరుకను పరమాత్మగా నమ్మవలదని భావము॥ 102

కం. తర్జనుల వలన జూపును-సర్జున వర్ణగత నీలమని - శిష్యుల కున్ - దార్జన్యగురుకు నీవు వి - సర్జింపు మసత్యమనుచు - సజ్జన తిలకా॥ ౧౦౩

తా. శిష్యా! సజ్జనులలో వన్నె కెక్కినవాడా! తర్జనీ వ్రేళ్ళు రెండింటిని రెండు కనులయందుంచి నొక్కిన చక్రములవలెను, అర్ధ చంద్రాకారమువలెను, మెరుపు తెలుపు నలుపు పసుపు నీలము మొద లగు పంచవర్ణములతో హరివిల్లువలె కన్పించును. అదియే పరమాత్మ యని శిష్యులకు దుర్మార్గుడగు గురుడు చెప్పుచుండును. అట్టిసంగతులు నేను తెలిసికొని అవి సత్యమైనవి కావని విసర్జించి నీకు చెప్పితిని. నీవు వాట్లను నిజమని నమ్మవలదని భావము॥ 103

కం. పురుషోత్తముడని పూజలు - నరులొనరింపుదురు భువిని - నానాచోట్లన్ - ధరమొదలగు భూతములను - చిరుత శిశువులాను కొనుచు - చేష్టలరీతిన్॥ ౧౦౪

తా. శిష్యా! శ్రీ మహావిష్ణువని, నారాయణుండని, కృష్ణుం డని, గోవిందుడని, శిలాదారు లోహకాష్ట ప్రతిమలే దేవుండని చతు ర్వింశోపచారములతో పూజలు చేయుచు సేవించుచుందురు. మరికొం దరు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములే దేవుళ్ళని భావించి

పూజలు చేయుచుందురు. యిట్టివారల భావంబు యెట్టిదనగా చిన్న పిల్లలు ఆడుకొను బొమ్మలాటవంటిదే కాని అంతకంటె అధికముకాదని భావము॥ 104

చతుర్వింశోపచారములనగా: ధ్యానం, ఆవాహనం, సింహాసనం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, పంచామృతస్నానం, శుద్ధోదంస్నానం, వస్త్రయుగ్మం, యజ్ఞసూత్రం, విభూషణం, గంధం, అక్షత, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, పానీయం, ఫలం, తాంబూలం, దక్షిణ హారతి, మంత్రపుష్పం, ప్రదక్షణం, చత్రం, చామరం, తాళవృంతం, దర్పణం, ఆందోళికం, నృత్యం, గీతం యివి ఇరువదినాల్గు ఉపచారములు అని తెలిసేది. 104

కం. రసమనదగనిది వస్తువ - బసవన్న కదెట్టు లెరుక - ప్రభువుకు దెలుసున్ - రసమైతె విసము సగుణము - ససిగాదా ముచ్చటంత - చెవుల వినుటకై॥ ౧౦౫

తా. నవరసములు కానటువంటిన్ని నేననే అభిమానము లేనిది ఈ వృత్తి బట్టబయలు నవరసములుగాని ఈ వృత్తి బట్టబయలు అనే వస్తువసంగతి ద్విపాదజీవులగు యీ మనుష్యులకు ఏలాగు తెలియును. సద్గురు ప్రభువుకే ఈ వృత్తి బట్టబయలు సంగతిన్ని నవరసములతో కలసియుండు నేననే అభిమానసంగతి తెలియును. నవరసభరితమైన నేననే అహంకారము విషము వంటిది అదియె ప్రపంచమై కనబడుచున్నది. నేననే యెరుకయొక్కయు అచలపరిపూర్ణ విచారణయు చాలతో వినుటకు నీకు ప్రేమగా యున్నదా లేదా యని భావము॥ 105

నవరసములనగా: శృంగారరసము - వీరరసము - కరుణారసము దుఃఖరసము - హాస్యరసము - భయరసము - భీభత్సరసము - రౌద్ర రసము - ఆశ్చర్యరసములని తొమ్మిది రసములని గ్రహించేది॥

కం. నీరాంశము సృగ్వోదన - సారము రేతస్సురెంటి - సమ్మి
శ్రంబె - ధారుణి తనువై నిలచును - నారీసరసంగమమున - సయ
గుణరత్నా॥ ౧౦౬

తా. సుగుణమణి యనే రత్నమువంటి శిష్యుడా! జలము యొక్క సారాంశము వలన రక్తమనే శోణితమైనది, రక్తముయొక్క సారాంశమువలన రేతస్సుఅనే శుక్లము అయినది, ఈ రెండింటియొక్క కలియకచే అనగా (స్త్రీ) పురుషులయొక్క సంయోగమువలన ప్రపంచము నందు శిశురూపమై (తనువై) పుట్టుచున్నదియని భావము॥ 106

కం. మనుసన్నపు సూక్ష్మాంశము - విను జలసూక్ష్మాంశము
వలన - వెలసెను ప్రాణం - బును రెండు గలసి పిండం - బన
బ్రహ్మాండం బనంగ - బరగునవత్సా॥ ౧౦౭

తా. శిష్యా! అన్నరసముయొక్క సూక్ష్మాంశమువలన మనస్సు అయినది. జలముయొక్క సూక్ష్మాంశము వలన ప్రాణము కలిగినది. యీ రెండును పిండాండమనియు బ్రహ్మాండమనియు చెప్పబడుచున్నది. యిందు మనస్సే పిండాండము, ప్రాణమను హంసయే (ఉచ్ఛ్వాస నిశ్వాసయే) బ్రహ్మాండమైనదని భావము॥ 107

కం. రెండు రీతుల గనంబడు - చుండే యీ మేనిచేత - చూచి
బయలు ను - ద్దండత వీని నశక్యని-యుండుము దీనందు వాంచ -
నుంచక శిష్యా॥ ౧౦౮

తా. శిష్యా! ఈ పిండ బ్రహ్మాండములే నేను మేనుల రెండుగా యున్నటుల కనబడుచున్న మూలములేని యీ గుర్తెరిగే శరీరముచేత పుత్త బట్టబయలగు అచల పరిపూర్ణమును జూచి ఈ గుర్తెరిగే శరీర మును దృఢముగా లేనిదని తెలిసి ఈ పిండాండమగు మేనుయందు

భ్రాంతి యుంచక యుండుటే ఈ పరిపూర్ణబోధ పొందినందుకు మంచి దగునని భావము॥ 108

కం. ద్వైతాద్వైత విశిష్టా-ద్వైతులమని కీచులాడు - దయ్య్యములవలెన్ - ద్వైతాద్వైత విశిష్టా - ద్వైతులతో కీచులాడ - దగునె నీకన్॥ ౧౦౯

తా. శిష్యా! ద్వైతమతస్థులు, అద్వైతమతస్థులు, విశిష్టాద్వైత మతస్థులు నేననే అహంకారముతో (ఎరుకతో) కూడుకున్నవారై ఎవరికివారే మా మతమే గొప్పదని మా దేవుడే గొప్పవాడని ఒకరితో నొకరు దయ్యములవలె పోట్లాడుచుందురు. అట్టి ద్వైతాద్వైత విశిష్టా ద్వైత మతస్థులవలె నీవుకూడా అహంకారము గల్గినవాడవై ఎవ్వరి తోనూ వాదోపవాదములు చేయకుండా యుండుటే మంచిపని యని భావము॥ 109

కం. అనుభవ వేదాంతులమని - తినరాని పదార్థమెల్ల - తిను దుర్జనులన్ - కనబోకుము తద్బోధను - వినబోకుము యెన్నటికి - వివేక విచారా॥ ౧౧౦

తా. శిష్యా! వివేకము గల్గినవాడా! మా వేదాంతము అనుభవ సంబంధమైనదని కొందరు దుర్మార్గులగువారలు శుక్లము, శోణితము, కండ్లపుసి, చెవిలో గులిమి, ముక్కులో చీముడు, మలము, మూత్రము, అన్నములో కలిపి వారు తిని శిష్యులకు తినిపింతురు. అదియునుగాక వీట్లనన్నింటిని కలిపిన ముద్దను వటుకులుగాజేసి శిష్యులకొక్కరికి పంచి మరల పూజ వచ్చే పర్యంతము ఈ మాత్రిలు మూత్రిజలముతో అరగ తీసుకొని ప్రతిరోజు పుచ్చుకొనవలెనని చెప్పుదురు. ఈ ఎనిమిది అష్ట ప్రకృతులని అష్టప్రకృతులను భక్షించినవారు అష్టప్రకృతులతో మరల పుట్టరని చెప్పుదురు. ఎవరిమూత్రము వారు సూర్యోదయకాలమునందు

పుచ్చుకొనిన త్రిగుణములు రహితముగునని అవియె సమిష్టి భావమని తెలుకరహితాచల మార్గమని అదియే మోక్షమని చెప్పుదురు. గావున అట్టివారల బోధలు వారి స్నేహము యెన్నటికైన వినకు కనబోకుము. దుష్టులగు అట్టివారిని కంటితోనైనను జూడబోకుమని భావము॥ 110

కం. జిహ్వోపస్త విషయము - లెవ్వగలదో వాటి విడువ-లేని గురువులన్ - యెవ్వరుజేరి కొలతురో - యివ్వసుధను వారు జెడుదు - రిదినిజము సుమీ॥ ౧౧౧

తా. శిష్యా! కొందరు గురువులు జిహ్వాచాపల్యముగల్గినవారలై శిష్యుల ఇండ్లవద్ద, తన ఇంటివద్ద అనేక రుచులతో నుండెడి పదార్థములు కోరి చేయించుకొని వారిని పొగడుకొనుచు నోరు ఆర్చుకొనుచు భుజించుచుందురు. ఇదియునుగాక ఉపస్తచాపల్యము వీడలేనివారై, అనేకమైన స్త్రీలతో సంభోగించుచుండెడి గురువులను యే శిష్యులు సేవింపుచుందురో, ఆ శిష్యులుకూడా జిహ్వోపస్తచాపల్యములు విడువలేనివారై యీ బ్రహ్మవిద్యకు పనికిరానివారై గురుశిష్యులెవ్వరైనను ప్రపంచములో చెడిపోవుట నిజమని భావము॥ 111

శ్లో॥ పృధివ్యాంయానిభూతాని జిహ్వోపస్తాది నిమిత్తకం।
జిహ్వోపస్తాదిపరిత్యజ్య। పృధివ్యాంకిం ప్రయోజనం॥ ఇతి.శి.గీ.

విశేషము॥ ఈ ప్రపంచము నందుండెడి యెనుబదినాల్గు లక్షల జీవులును జిహ్వోపస్తచాపల్యములు విడువలేనివై జననమరణములు పొందుచు కేవల బ్రహ్మపదార్థవలోకనము నెరుగజాలకున్నవి. అందు ఈ మనుష్యులగు జీవులు ద్విపాద జంతువులై యున్నవి. యిట్టి జిహ్వోపస్తాది చాపల్యములు విడచిన జీవులు ఈ ప్రపంచమునందుండి నను యేమియు ప్రయోజనములేనివై అనగా ఈ ప్రపంచము అట్టి జీవులకు నిమిత్తములేనిదై కేవల అచల పరిపూర్ణస్థితి కలవియై

యుండును. యిదియునుగాక ఆకలి తీరుటకై ప్రాప్తించిన పదార్థములు భుజించి సంతృప్తి పొందెడివాడు పారమార్థికుడు, రుచులుకోరి చేయించుకొని శరీరముకై భుజించెడివాడు ప్రాపంచకుడు, నవరుచులు విడువక రుచులతో భుజించుచు స్త్రీల సంపర్కముయందు అపేక్షగల్గినవాడు వుదరపోషణకు పనికివచ్చే విద్యలకైనా వృత్తిజ్ఞుడు కాజాలడని పెద్దలు చెప్పుచుండగా, బ్రహ్మవిద్యకు అట్టివాంచలకు నుండెడి గురువులుగాని శిష్యులుగాని పనికిరారని భావము॥ 111

కం. పాషండ మతము వారల - వేషంబులుజూచి శిష్య-వితతి భ్రమించున్ - ఈ షత్తి బోధెరుగక - దూషింతురు విన్నకన్న - దుర్భాషణలన్॥ ౧౧౨

తా. శిష్యా! తీర్థయాత్రలయందుండు రాళ్ళే దేవుండని తలంచెడి పాషండ మతముగల వారలయొక్క కర్మకాండాది నిత్యార్చనలు జూచి కొందరు అచల గురుశిష్యులు అదియె గొప్పదని భ్రమించుచుందురు. ఈ ప్రపంచములో నిజముగు ఈ అచల పరిపూర్ణ బోధయొక్క స్థితి కొంచమైనను నెరుంగక భ్రమించుచుందురు, కొందరు మనుజులు ఈ అచలపరిపూర్ణ బోధను వినినను లేక ఆయా గ్రంధములు చూచినను కఠిన మాటలచే ఈ బోధ గలవారిని ఈ బోధను దూషింపు చుందురని భావము॥ 112

కం. ఎందరు దూషించితే యే - మందరు మనవారె కాని - యన్యులె నీవా - యందరితో వాదించక - నందంబా నిట్టి బోధ - నరయరతండ్రీ॥ ౧౧౩

తా. శిష్యా! యెందరు జనులు నీవు మంచివాదవు కావని నీవు వినిన ఈ అచలపరిపూర్ణ బోధ మంచిదికాదని తిట్టి నిందించినను, వారియందహంకారము గల్గి వారిని యేమియు అనకుము. ఆలాగు ఈ అచల

పరిపూర్ణ బోధను నిన్నును దూషించినవారలు అందరూ మనవారలే యని భావింపుము. ఏమనగా (మమాత్మా సర్వభూతాత్మ) యని శృతి వున్నది. నీవె అన్ని ఘటములలోనుండు యాత్మయని తలంచి వారలతో వాదించక యదార్థమైన ఈ అచలపరిపూర్ణమైన బోధయందే వుండి ఈ బోధను యెల్లప్పుడు విచారించుచుండుమని భావము॥ 113

కం. కోపమె పాపంబనబడు - కోపమె హంకారమనుచు - కొని
యాడబడునె - కోపమె తాపంబనబడు - కోపమె మృత్యువనబడును -
కుటిలవిరహితా॥ ౧౧౪

తా. కుటిల స్వాభావము లేని శిష్యుడా! కోపమే పాపమని చెప్పవచ్చును. అట్టి కోపము అహంకారమని తలంచవలెను. కోపమే హృదయమునందు తాపమై అగ్నివలె యింద్రియములన్నిటిని ప్రజ్వలింపజేయును. ఈ కోపమువలన వొకప్పుడు చావుకూడా కలుగును. యిట్టి కోపము వొక్కటి వుండినయడల అనేక కష్టములు నష్టములు గలుగును. అట్టి కోపమనే అహంకారము విడచినయడల అనేక విధముల సుఖములు కలుగునుయని భావము॥ 114

కం. నిజగురుబోధ నెరుంగక - గుజగుజ శిష్యులకుజెప్పు గురువు
లబోధల్ - భుజగవిషోపమగునుమీ - సుజనౌఘము మెచ్చదట్టి -
సుద్ధిని పట్టీ॥ ౧౧౫

తా. శిష్యా! ఈ యదార్థమగు అచలపరిపూర్ణ బోధ నెరుంగని మాయాగురువులు రహస్యముగా శిష్యులకు యేమేమిరో బోధించుచుందురు. అట్టి రహస్యబోధలు పాము విషముతో సమానములగునని భావించుము. ద్రాష్టదృష్టాంతములతో యదార్థ విహారణజేసి అచలపరిపూర్ణమును సూచించగలిగిన అచలగురువులగు సజ్జనులు అట్టి బోధలను యెన్నడు మెచ్చనేరరని భావము॥ 115

కం. తనువును విడి బ్రహ్మమనె - నను మునుపటి నీ విచార మటు బెట్టిపుడున్ - నిను నీ తనువును వేరని - యనకను పరిపూర్ణ మరసి - చువి విడువదగున్ ॥ ౧౧౬

తా. శిష్యా! ఈ మేను నేనుకానని నేనే బ్రహ్మమని నేననే ఆత్మకు నాశనము లేదని నీవు మునుపు విచారించిన మహావాక్యార్థ విచారణ యిటుపై కట్టిపెట్టి నిన్నును, నీ మేనును వేరనియనక రెండును వొక్కటని తెలసి, అచల పరిపూర్ణ బ్రహ్మమగు ఈ వృత్తి బట్టబయలునుజూచి చక్కగా విచారించి, పై నేను మేనులైన దేహీ దేహములు రెండును లేనివని వాటి భ్రాంతిని విడచిపెట్టుము యని భావము ॥ 116

కం. కొందరు వైరాగ్యంబున - కొందరు తీర్థాటనమున-కొందరు కర్మం - బందున వ్రత జపతపముల మరి - కొందరు నటియింతురిట్టి - కోర్కెలమనుజుల్ ॥ ౧౧౭

తా. శిష్యా! కొందరు వైరాగ్యమే మంచిదని భార్యాబిడ్డలను యిల్లును విడచి అరణ్యములయందు, కొండగృహాలయందు నివాసము చేయుదురు, కొందరు దివ్యక్షేత్రములు తిరిగిచూచుటే మంచిదని తీర్థయాత్రలు చేయుచుందురు కొందరు స్నానసంధ్యావందనాదడనుష్టాన కర్మయోగమే మంచిదందురు. కొందరు చాంద్రాయణాది వ్రతములు చేయుటే మంచిదందురు, కొందరు మంత్రాది జపములయందును, కొందరు అష్టాంగ యోగాభ్యాసాది తపస్సులయందును మంచి కలదందురు. యివి అన్నియు భ్రాంతులతో చేయు పనులేగాని, భ్రాంతిని విడచిన పనులుకావని భావము ॥ 117

కం. కొందరు భక్తిత్రియమున - కొందరు యోగములయందు, కొందరు జ్ఞానం - బందురు మింతురువారల - కందరికీ బోధ యిష్ట - తెనా నాయనా ॥ ౧౧౮

తా. శిష్యా! కొందరు బాహ్యభక్తి, అనన్యభక్తి, యేకాంత భక్తియనే భక్తిత్రయమే మంచిదని చేయుచుందురు. కొందరు యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన్న ధారణ సమాదులనెడి అష్టాంగ యోగములందును, కొందరు ఘటశోధనయనెడి జ్ఞానయోగము యందును భ్రాంతిగలవారలై చేయుచుందురు. అట్టివారల కందరికి ఈ అచల పరిపూర్ణ బోధయందు యిష్టము యుండదని భావము॥ 118

కం. భ్రమ రహిత సహిత జనులకు - సుమనసులను నరుల సమము - జూచిన విశ్వం - బమరి లేకుండ నుండును - క్రమమున కలవంటి దనుచు - కడు నిజముజుమీ॥ ౧౧౯

తా. శిష్యా! ఈ ప్రపంచ మశాశ్వితమని ప్రపంచమునందు భ్రమ (మనస్సు) లేక యుండువారును, ప్రపంచము శాశ్వితమని కష్ట సుఖాది ద్వంద్వములయం దల్లాడుచుండువారును, వీరలిద్దరు ప్రపంచ ములో లోకులకు సమముగా నడచుచున్నట్లు కాన్పించుచుందురు. గాని వారలిద్దరూ చూచెడి ప్రపంచము భ్రమ రహితులకు కలవంటిదై లేకుండా యుండును. భ్రమ సహితులకు మనస్సు కలవారలకు నిజమై యున్నటుల కనపడునని భావము॥ 119

కం. కల తనను లేను కలనని - తలపోసెటి వారిమాట - తమకే నిజమో - కల లేనివారు కల వా - రలు వీరలె నొకరి నొక - రరయ రిరువురున్ ॥ ౧౨౦

తా. శిష్యా! కలయనెడి ప్రపంచములో నేను లేను యిది యం తయు ఏమీ లేని కలయేగాని నిజము కాదని తలంచుచు, భ్రమను జెందక యున్నవారి సంగతి (స్థితి) వారికే, నిజము ఎందువలననగా వారు కలలోవారు గారు. ప్రపంచము శాశ్వితమని భ్రమచే తలంచుచు నేను నిజమని సుఖదుఃఖముల పొర్లాడుచు కలలో కలవరించుచుండువారి సంగతి కల విడచినవారు తెలియలేరు. కల విడచినవారి సంగతి కల గాయుచు భ్రమించువారు యెరుగజాలరని భావము॥ 120

కం. ఎరుగుట జ్ఞానముదానను - జరిగేపని కర్మమనుచు - జను
లెన్నిరి యీ - యెరుకయు కర్మలేనిదే - పరిపూర్ణము వీటి నీవు -
బట్టకుమెపుడున్॥ ౧-౨౧

తా. శిష్యా! ప్రపంచములోసర్వమును గుర్తెరుగుచున్న తెలివి
యగు యెరుకయే జ్ఞానము. యిట్టి జ్ఞానముచేత జరుగుచున్న ప్రపంచ
ములో పనులన్నియు కర్మమని ప్రజలు చెప్పుచుండిరి. యీ యెరుక
యనే జ్ఞానమును యీ కర్మమును లేనిదే ఈ అచల పరిపూర్ణమగు
వుత్తబట్టబయలు, యిట్టి గుర్తెరిగే యెరుకను కర్మమును యీ రెండిం
టిని వున్నవని భ్రమజెందక నీవు యెప్పుడు వాటిని అనుసరించకుమని
భావము॥ 121

కం. కలవారికి మేలుకలో — కలవారికి జాగ్రతందు — కల
హము గలదా - కలహించిరేని వారలు - కలవారలె మేల్కొవారు -
గారెన్నటికిన్ ॥ ౧-౨౨

తా. శిష్యా! నిద్రలో కలయనే స్వప్నము పొందుచున్నవానికి
మేలుకగలిగి జాగ్రతలో నున్నవానికి యిద్దరకు కలహమను పోట్లాట
యుండునా యుండదు, అటువలె గురుమేల్కొను పొందినవానికి గురు
మేల్కొను పొందక ప్రపంచము శాశ్వితమని భ్రాంతితో కలగాయు
చున్నవానికి వీరలిద్దరకు కలహము వుండదు. అట్లు యిద్దరకు కలహము
కల్గిన యడల యిద్దరు కలలోనివారలే కాని మేలుకతో నుండువా
రొక్కరును కారని భావము॥ 122

కం. సురలందు దోచుకలవలె - నరుదెంచును బ్రహ్మయందు -
నఖిలజగంబుల్- యరుదెంచి యజునిగన్గొని - బిరబిరతామేగునిల్వ -
బికీయుంబగుమన్ ॥ ౧-౨౩

తా. శిష్యా! అనిమిషులగుటచే దేవతలకు కల లేనివిధముగా, ఈ వుత్తబట్టబయలగు అచలపరిపూర్ణ బ్రహ్మమందు మూలములేకనే యీ గుర్తెరిగే శరీరమనుయెరుక తనకుతానేపుట్టి, సర్వప్రపంచమును పుట్టించెనని లేనిదే భ్రమకల్గెను. అట్లు తనకుతాను పుట్టినయెరుక యీ అచలపరిపూర్ణబ్రహ్మమగు కేవలాత్మను జూచి తాను నిలచుటకు క్షణకాలమైనను తడవులేక తాను లేనిదానవని సిగ్గుగలిగి తొందరగా లేచిపోవునని భావము॥ 123

కం. మనమీబయలున లేనిదే - మనకుమనమె వచ్చినిల్చి -
మనమేగినయే - మనకమనజోలిగోనకన్ - తనకుతానుండియున్న -
దదుగోకనరా ॥ ౧౨౪

తా. శిష్యా! నీవునేను యితరులగు మనమందరము యీ వుత్త బట్టబయలున మూలములేకుండా మనకుమనము స్వయముగా వచ్చి కొన్నాళ్ళుండి మరల పోయినతర్వాత, ఈ వుత్తబట్టబయలగు అచల పరిపూర్ణము మనము వచ్చినామో, వున్నామో, పోయినామోయని మన సంగతి తాను విచారించక తనకుతానై యున్నానని తలువులేక, తనకు అన్యము యేమియులేనిదై శాశ్వతమై యున్నటువంటి యీవుత్త బట్టబయలు యిదుగో చూడుమని భావము॥ 124

కం. జ్ఞానంబుసత్వగుణమను - దానికిజన్మించెననుచు - దామో
దరుడా - మేనత్తకొడుకుతోననె - జ్ఞానమునకు జన్మమొకటి - గలిగె
గదోయీ॥ ౧౨౫

తా. శిష్యా! జ్ఞానమనెడి యీ గుర్తెరిగే శరీరము, త్రిగుణము లలో సత్వగుణమను దానికిపుట్టెనని శ్రీకృష్ణమూర్తి తనమేనత్తయైన కుంతీదేవి కుమారుడగు అర్జునునితో జెప్పెను. ఈ జ్ఞానమునకు పుట్టుక యనునది వొకటివున్నటుల తెలియుచున్నది. అనగా సత్వగుణమే యీ జ్ఞానము, యీ జ్ఞానమే సత్వగుణముయని భావము॥ 125

కం. పుట్టిందు గిట్టుజ్ఞానము - పుట్టెననుచు కృష్ణమూర్తి - పురుహూతజుడో - నట్టితను ముద్దుమరిదికి - గట్టిగ వినజెప్పెనిందు - కలతేమోయీ ॥ ౧౨౬

తా. శిష్యా! జ్ఞానము పుట్టుచున్నది. అట్టి జ్ఞానము నశించి పోవుటయు కలదని శ్రీకృష్ణమూర్తి దేవేంద్రుని కుమారుడును, తనకు ముద్దుల బావమఱదియునగు అర్జునునకు నొక్కి వక్కాణించినాడు. అట్లు గట్టిగా జెప్పిన మాటయందు అబద్ధము యేమియు లేదని నీవును జ్ఞానము లేనిదని దృఢముగా తెలియుమని భావము ॥ 126

కం. జ్ఞానమగు నీవు జ్ఞేయం బైన బయలుగాంచి జ్ఞానమగు - నినునీవే - లేనంచు దెలియుమని తా - నానరునకు వాసుదేవు - డానతి యిచ్చెన్ ॥ ౧౨౭

తా. శిష్యా! జ్ఞానస్వరూపుడవైననీవు జ్ఞేయమనబడు ఆత్మను అనగా సచ్చిదానంద బయలునుగాంచి జ్ఞానమగు నిన్నునీవు లేవని తెలియుమని శ్రీకృష్ణమూర్తియగు వాసుదేవుడు నరుడగు అర్జునునకు జెప్పెనని భావము॥ 127

విశేషము॥ జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు మూడున్నుత్రిపుటి యనబడును. యీమూడువొక్కటేగాని వేరు కాదు నేను మేనులు వేరుగాయున్నటుల యేలాగు కనబడుచున్నవో, ఆలాగే యివివేరని మాటమాత్రమేగాని వస్తువ (ఎరుక) ఒకటే. శుద్ధమెరుక జ్ఞేయము, మలిన మెరుక జ్ఞాత, మిశ్రిమ మెరుక జ్ఞానముయని భావము॥ 127

కం. మన మచల మనదగదు తగ - దనుటము మన మచలము నకు - తగవేరని రెం - డనిలేవు మనముచలమని - వినుమనముళ్ళక్క తెలియు - విను మనము మనన్ ॥ ౧౨౮

తా. శిష్యా! నేను నీవు అనే మనము అగు యెరుక, అచల మగు వృత్త బట్టబయలు అనరాదు, మనము అనే యెరుక అచల పరిపూర్ణముకాదని అచల పరిపూర్ణములో రెండవదియైన యెరుక వున్నదని అనుట అసంభవము గాన ఈ యెరుకకు ఈ వృత్త బట్టబయలు వున్నదని తెలసి అట్లు తెలసిన యెరుక మనము లేనివారమని మనకు మనము లేకుండా పోవుటే మంచిదని భావము॥ 128

కం. జ్ఞానము నేనన నొక్కటే - జ్ఞానమునే వేరటంచు - గన బోకు సుమీ - జ్ఞానము వచ్చును బోవును - జ్ఞానాతీతమును తాను - గాంచినదాకన్॥ ౧౨౯

తా. శిష్యా! జ్ఞానమన్నను నేను అన్నను యీ రెండును ఒక్కటేగాని వేరుకావు. జ్ఞానమువేరని నేనువేరని వేర్వేరుగా జూడకుము. జ్ఞానమనే నేను పుట్టును, చచ్చును. ఈ జ్ఞానమనే సచ్చిదానంద బ్రహ్మముకు అతీతమైన ఈ వృత్త బట్టబయలగు అచలపరిపూర్ణమును ఎరుక చూచేవరకు పుట్టుచు చచ్చుచునుండి ఆ బట్టబయలును చూచిన తర్వాత తనకు పుట్టుచావులు లేకపోవునని భావము॥ 129

కం. నీ కలను వచ్చిపోయిన - లోకుల లోకముల వలెనె - లోనినను గనుమీ - నీ కలను నీవు మేల్కని - ఈ కల నటువలెనె చూస్తె - యెటు నిల్వవురా॥ ౧౩౦

తా. శిష్యా! నీ స్వప్నములో వచ్చి పోవుచుండెడి లోకులగు జనములను లోకములగు ప్రపంచమును నీవు చూచి నిజమని భ్రమించి నీకు మెలకువ గలిగిన తర్వాత వారలను ఆ ప్రపంచమును కలలో ముచ్చట్లని నిజముకావని తెలసి యేలాగు చూడలేకపోవుచున్నావో అటువలె ఈ ప్రపంచమనెడి కలలో జనములను నిన్నును యివి అన్నియు కలలో ముచ్చట్లుగాని వాస్తవములు గావని తెలసి, ఆ దృఢము

యెల్లకాలములయందు వినువక యుండుటే గురుమేల్కొయగును అప్పుడీ కలయనే భ్రమ యెందును నిలువనేరక పోవునని భావము॥ 130

కం. అందరి కల నీకలెకద- అందరు నీకలను వచ్చి - అగు
పడిపోవన్ - కందువు గద నిన్నట్లనె - మందమతీ కనగదోయి - మరి
లేననుచున్॥ ౧౩౧

తా. శిష్యా! జనులందరు నిత్యముపొందుచున్న స్వప్నము నీవు పొందుచున్న స్వప్నమువంటిదేకద, నీ కలలో అనేకులగు జనులువచ్చి కనిపించి యేమేమియో ప్రపంచ వ్యవహారికములు జేసి నీకు మెలకువ రాగానే వారలను జూడగలుగుదువా, జూడనేరవు. ఓ తెలివితక్కువ వాడా! నీ కలలో కనిపించినవారలు యెవరివలన వచ్చినారు, మరల యెవరివలన పోయినారు, అటువలె యీ ప్రపంచమనె కలలో యీ జనులను వారివర్తనలును నీవును నీప్రవర్తనయును యేకాలమునందు లేనివారనని తలంచుచుండుమని భావము॥ 131

కం. ఆకాశమనిన శూన్యం - బాకాశంబనిన సగుణ - మాకాశ
మనన్ - కాకివలె నల్లరూపుది - ఆకాశముమితములోన - నణగుండు
జుమీ॥ ౧౩౨

తా. శిష్యా! ఆకాశముయనగా ఏమియులేనిది మరిన్ని, యీ ఆకాశము తమోగుణమైయున్నది. ఆకాశమంటె కాకివలె (నీడవంటి) నల్లనిరూపముగలది. ఈ ఆకాశము అణువుకంటె అణువై మహత్తు కంటె మహత్తై, చిన్నజంతువులయందు చిన్నదిగను, పెద్దజంతువుల యందు పెద్దదిగను నేత్రమధ్యమున నివ్వరిధాన్యము ముల్లువంటి చిద్బింధువులో అపోజ్యోతియై అణగియున్నదని భావము॥ 132

కం. ఆకాశమనినకాలం - బాకాశంబన విలంబ - మాకాశ
మనన్-లోకమున చంచలంబగు- నాకాశము శబ్దరూప - మగువిన
వోయీ॥ ౧౩౩

తా. శిష్యా! ఆకాశము భూతకాలము, భవిష్యత్తుకాలము, వర్తమానకాలములను త్రికాలములను నడుపునదిగాన కాలమనవలసి వచ్చెను. ఆకాశము బయలాంశతో నుండుటచే విలంబమై యున్నది. ఈ ఆకాశము పుశ్వాస నిశ్వాసరూపమై వస్తూ పోతూ వున్నందుచే, చెంచలంబన జెల్లును. మరియు ఈ ఆకాశము ప్రతిఘటములోను వుండి నేను నేనని పలుకుచున్నదిగాన (ఆకాశస్య గుణోశబ్దః అని శృతి) శబ్దగుణకమైనదని జెప్పవలసివచ్చెనని భావము ॥ 133

కం. అహమే తనువీ విశ్వం - బహమె జీవేశ్వరులన - నహమె తదైక్యం - బహమె బహముకు మూలం - బహమణగిన నణగునన్ని - యనఘచరిత్రా ॥ ౧౩౪

తా. శిష్యా! నేననే అహంకారమే మేననే ఈ శరీరము - ఈ అహంకారమే ఈ ప్రపంచరూపమును దాల్చినది, ఈ అహంకారమే (జీవోహం) నేను జీవుడను అనుచున్నది. ఈ అహంకారమే (శివోహం) నేను శివుడను అనుచున్నది, ఈ అహంకారమే జీవేశ్వరైక్య సంధానము, నేననే ఈ అహంకారము పుట్టి మేననే ఈ అహంకారమును పుట్టించినది, ఈ అహంకారం తనకు తానే మూలం. ఈ అహంకారముకు మూలం యింకొకటిలేదు, యిట్టి నేననే అహంకారము పోయిన యడల ఈ అహంకారముతో పుట్టిన సమస్తము నశించి పోవునని భావము ॥ 134

కం. భ్రమయనిన పుట్టుకనినను - భ్రమకే నామంబు లిట్టి - భ్రమనే నీవున్ - భ్రమే ఈ మేను జగత్తులు - భ్రమె ఎరుకయు మఱపు రెండు - భ్రమె భ్రమవినరా ॥ ౧౩౫

తా. శిష్యా! జననము యనిన భ్రాంతియే. నీవు యనినను నేను యనినను భ్రాంతియే, ఈ మేనుయనినను భ్రాంతియే, ప్రపంచమనినను

భ్రాంతియే తెలియుటయనే యెరుకయనినను భ్రాంతియే తెలియక పోవుటయనె మరపుయనినను భ్రాంతియే, యీ పేరులు సర్వము భ్రాంతియే గావున యిట్టి భ్రాంతిచే సర్వముయైనదని తెలసి యీ తెలసిన భ్రాంతిని విడచిపెట్టుటే మంచిదని భావము॥ 135

కం. యెరుకసుమీ బ్రహ్మనినను - యెరుకసుమీ మాయయనిన - యెరుకే జీవుం - డెరుక సుమీ ఈశ్వరుడన - యెరుక సుమీ నేను విశ్వ - మిది సత్యమురా॥ ౧౩౬

తా. శిష్యా! నేనుబ్రహ్మమని (అహంబ్రహ్మస్మి) యన్నను యెరుకే, మాయయనినను యెరుకే, నేను జీవుండనినను యెరుకే, నేను ఈశ్వరుడన్నను ఎరుకే, నేను యనినను ప్రపంచమనినను ఎరుకే, గనుక యీ మాటలయందు అబద్దము లేదని సత్యములని భావము॥ 136

కం. మాటసుమీ నేననినను - మాటసుమీ మాయయనిన - మరి జీవశివుల్ - మాటసుమీ బ్రహ్మనినను - మాటసుమీ మేను జగము - మాటేసుమీ॥ ౧౩౭

తా. శిష్యా! నేనని పలుకేగాని వేరే యింకొక వస్తువయేదియు లేదు. మాయయనినను పలుకే జీవుండనినను పలుకే ఈశ్వరుండని యనినను పలుకే నేను బ్రహ్మనినను పలుకే మేనుయనినను పలుకే ప్రపంచమనినను పలుకేగాని యింకొకటి యేదియు లేదని భావము॥ 137

కం. ప్రకటమగు బింబమందున - ముకురము ముకుర ప్రతిబింబ - ములు లేవెపుడున్ - ముకురంబువలన బుట్టును - ముకుర స్తముదానివలన - ముకురముదోచున్॥ ౧౩౮

తా. శిష్యా! ప్రత్యక్షముగా కనబడుచున్న బింబరూపమునందు అద్దము, అందుగల ప్రతిబింబములు రెండును యెప్పుడూ యుండనేరవు. స్వతఃసిద్ధమగు బింబముచూచుటకు అద్దముగాని, ప్రతిబింబముగాని అవసరంలేదు. అద్దమువలన ప్రతిబింబము కనబడును. ప్రతిబింబము వలన అద్దమువున్నటుల కనబడునని భావము॥ 138

విశేషము: ప్రత్యక్షముగా కనబడెడి అచల పరిపూర్ణమనెడి వస్తువయందు నేను మేనులనె అద్దము, అద్దముయందు ప్రతిఫలించిన వస్తువ లేనేలేదు. నేను అనెడి అద్దమువలన మేను పుట్టును, మేను యందు నేను పుట్టును. ఈ రెండును అచల పరిపూర్ణము యందు లేనే లేవు యని భావము॥ 138

కం. లేని నీ రాకడె స్వ - ప్నానందము నీకు గురుడు - పరి
పూర్ణంబున్ - పూని తెలిపి మేల్కొలిపిన - నేననకను నీవుబోవ - నీ
మేల్కొదిరా॥ ౧౩౯

తా. శిష్యా! ఈ వృత్తి బట్టబయలగు అచల పరిపూర్ణములో మూలము లేనటువంటి నీవు రావడం, కలలోని రాకవంటిది. అదిగాక కలలో నీకు ఆనందం ఎవరు రప్పించిరి, దానికదె వచ్చెను. ఈ ప్రపంచ మనెడి కలలో నీకు అచల గురుమూర్తి అచల పరిపూర్ణమును బోధించి సూచించి మెలకువ కలుగజేసిన యెడల నేనని నీవు యనకుండా (అనగా యెరుకరహితమై) పోవుటే నీకు మేల్కొని భావము॥ 139

కం. తనకు దా నోరులు చణకిన - ధ్వని బుట్టినిచోట బ్రహ్మ-
తను దానోరులన్ - చనకిన ధ్వనిగల చోటది - విను మాయయు లేని
మాయ - విడు లేననిసన్॥ ౧౪౦

తా. శిష్యా! నీవు ఇతరజనములను కోపపడెడి సమయములో యే వృత్తి బట్టబయలునందు శబ్దము పుట్టదో అదియె అచలపరిపూర్ణమగు బ్రహ్మము, నీవు ఇతర జనములను తిట్టెడి సమయమందు నీలో శబ్దము లేక మాట యెచ్చుట పుట్టుచున్నదో అదియె మాయ. మాయయనగా లేనిదే గదా! అట్టి మాయయగు అహంకారము లేక నేను అనునది విడువుమని భావము॥ 140

కం. మనసుకు వాక్కుకు దెలియని - ఘనవస్తువు బయలటంచు- గనియా రెంటిన్ - నిను నను విశ్వముగాగని - విను మూలము లేనివి వీటి విడరా శిష్యా ॥ ౧౪౧

తా. శిష్యా ! మనస్సుచే యిట్టిదని సంకల్పించి చెప్పుటకు అలవి కానిదిన్ని, వాక్కుచేత యిట్టిదని వచించుటకు అలవికానిదిన్ని (యుతో వాచో నివర్తంతె అప్రాప్య మనసా సహా) అను శృతిచే చెప్పబడ్డ మహత్తరమై గొప్పదగు వృత్త బట్టబయలై యున్నదో, దానిని అచల గురుమూర్తి కరుణచే చూచి - మనస్సు వాక్కుల రెండింటిని నిన్నును నన్నును ప్రపంచముగా తెలిసి వీటికి మూలము లేదని చలనం లేకుండా దృఢముగా తెలిసి తక్షణమె వీటిని విడచిపెట్టుమని భావము ॥ 141

కం. కలలో వానికి మేలు - గలదని గుర్తెరుగవశమె - కల మేల్కనినన్ - కలవాడు గలడె తెలియును - తలపోయుము నిన్ను నీవు- తగనీరీతిన్ ॥ ౧౪౨

తా. శిష్యా ! స్వప్నము పొందుచున్నవాడు జాగ్రతయెట్టిదో తెలియలేడు. స్వప్నమునుంచి జాగ్రతకు వచ్చిన తర్వాత స్వప్నములో వాడుకాడు. అనగా స్వప్నములో అంశములను మెలకువలో చూడ నేరడు. ఆలాగుననే నీవు కలలోవాడవో మెలకువలోనివాడవో నిన్ను నీవు చక్కగా విచారించుకొనిన నీకే తెలియుగలదని భావము॥ 142

కం. కలవాడు వాని చదువులు - గలవా తామేలుకనిన - గను గొనుమటులన్ - కల నిన్ను నీదు చదువును - ఫలమేమిక చాలు పెక్కు- పలుకులతండ్రీ ॥ ౧౪౩

తా. శిష్యా ! స్వప్నము పొందుచున్నవేళలో అనేక చదువులు చదివియు, ఆ స్వప్నమునుంచి మేలుకొనగా కలలో తాను చదివిన చదువులు యేమియు లేకపోయెను. అట్టి ఈ ప్రపంచమునెడి కలలో

నిన్నును నీ చదువువల్లను ఫలితమేమియును లేదు గనుక యిక పెక్కు మాటలను చదువులను నీవు చాలించుమని భావము॥ మౌనవానిర హంభావో మోక్ష (శ్రీ)ముక్తిమత్సరః అని శృతి వున్నది. 143

కం. కలరాజు సకల సంప - త్కలితుండై తాను మేలు కన - లేడెచటన్ - కలనిన్నువాని విధమున - దలపుము దలచితివె చాలు - ధన్యచరిత్రా ॥ ౧౪౪

తా. శిష్యా! సుకృతమైన జీవితము గలవాడా! నీకలలో ఒక రాజువచ్చి సకలసంపత్తులనెడి అష్టైశ్వర్యములను పొందుచుండెను. అట్టి సమయములో నీవు మేలుకొనగా ఆ రాజును అతడు పొందిన అష్టై శ్వర్యములను ఎచ్చటకు పోయెను? అనగా యేమియు కనుపించక మటు మాయగా పోయెను. నీ కలలో కనుపించిన రాజువిధముగా ఈ ప్రపంచ మనెడి కలలో నిన్నును, నీ సర్వసంపదలను యేమియు లేనివని తలంచు చుంటివేని నీ జీవితము సార్థకము గలవాడవని భావము॥ 144

కం. ఏ నిర్ణయమును జేయడు - నేనని మహాత్ముడెపుడు - నేననువాడే నానావిధాలవదురును - నేనను తనవంటివారి - నెప్పుడు గనిగన్ ॥ ౧౪౫

తా. శిష్యా! నేననెడి అహంకారము లేని మహాత్ముడు అవునని గాని, కాదనిగాని, వున్నదనిగాని, లేదనిగాని జనులతో వాదోపవాదము లనే ఏ నిర్ణయమును జేయక నిమిత్తమాత్రుడై యుండును. నేనను అహంకారము గలిగినవాడు అనేక విధములుగా యిది అవునని, యిది కాదని, యిది తప్పని, యిది ఒప్పని తనవంటివారగు నేననువారితో వాదోపవాదములు జేయుచు నిర్ణయానిర్ణయములు తెలుపుచుండునని భావము॥ 145

కం. మలుకలు లేవీతోవను చులకనగా దెలియవచ్చు -
సుజనుల కెల్లన్ - తలుపదగు దీనినెప్పుడు - మలకలతోవలకు బోక -
మాన్యచరిత్రా॥ ౧౪౬

తా. శిష్యా! ఈ అచల పరిపూర్ణబోధ వినుటకు బోధాపద్ధతి
ఆచరించుటకు ఏవిధమగు చిక్కులును లేవు. గాన సజ్జనులగువారలు
బహుతేలికగా యీ అచలపరిపూర్ణబోధను తెలియవచ్చును. దాని
యందు తలపుంచి నడువవచ్చును. శ్రమతమాదులుగలిగెడి ద్వైతా
ద్వైతవిశిష్టాద్వైతములగు మార్గములకుపోవక ఎల్లప్పుడు బహుసులభ
ముగా ఈ అచలపరిపూర్ణబోధను ఆచరించవచ్చునని భావము॥ 146

కం. నామాటనమ్మవేమో నీ మానసమెరుగకంటి నేనీ
మాటన్ - నామాటపథ్యమైనను - యేమారకు దీన్నినీవి - కెప్పటి
కప్పు ॥ ౧౪౭

తా. శిష్యా! నేను నీకు బోధించెడి యీ అచలపరిపూర్ణబోధ
నమ్ముదువో లేదో నీమనస్సు యెట్టిదో యెరుగక యీ యదార్థ
బోధను నీకు బోధించితిని, నే బోధించిన యీ అచల పరిపూర్ణబోధ
జననమరణములనే రోగముకు అవుషధమువంటి మంత్రములును, పత్య
మువంటిది యీ బోధగాన, నీకు హితవుగా యుండినయెడల ఏ సమ
యమునన్నైనను దీనిని మరచిపోకుండా స్మరించుచుండుమని భావము॥ 147

కం. సిద్ధాంతోక్తులయివినీ - బుద్ధికి దెలసుండి చదువ-జోకుము
వీటెన్ - బద్ధుల వినుమనవారలు - యుద్ధమునకు కాలుదువ్వ -
చుందురు పెలుచన్॥ ౧౪౮

తా. శిష్యా! నీవు బుద్ధిమంతుడవని నామనస్సులో తెలసి నీకు
యీ అచలపరిపూర్ణబోధయైన బృహద్వాశిష్టసిద్ధాంత వాక్యములు
వుపమానవుపమేయములతో నీకు చక్కగా తెలియునటుల వినిపించితిని,

గొప్పదైన యీబోధను మెప్పుడును వినువబోకుము. సంసారమునందు బద్ధత్వమునొందిన (బద్ధులైయుండిన) శుద్ధసంసారులగు పామరజనులకు యీ గ్రంధమునందుగల అచలపరిపూర్ణ బోధను వినుమనినవారలు కల హామునకు కాలుద్రువ్వుచు తిట్టుదురు. గాన అట్టివారలకు వినిపించ వలదని భావము॥ 148

కం. ముద్దుగ ఈ గ్రంధంబును - పెద్దల ముందర వచింప - పిరిదు వియకుమీ - దిద్దెదరు తప్పులున్నను - వద్దనకను దిద్దనివ్వు - వరకీర్తినిధీ॥ ౧౪౯

తా. శిష్యా! ప్రపంచములో కీర్తిగల శిష్యుడా, పెద్దలగు అచల గురుస్వాములవద్ద ప్రేమతో యీగ్రంధము చదువుటకు భయ పడి మానివేయకుము. వారలు ఈ గ్రంధమునందు ఏమైనా లోపము లుండిన యడల వాటిని సవరణ చేయుదురు. తప్పులు మీరలు దిద్ద నక్కరలేదని వారలకు వ్యతిరేకముగా సమాధానము చెప్పకూడదని భావము॥ 149

కం. నేనుగల మేను లేదని - మేనున నీవుండి యిట్లు - మిడుకు టమేలా - మేనును విడి చను వినియెదు - మానుగనీవనక యున్న - మాయ వెనుమీ॥ ౧౫౦

తా. శిష్యా! నేను అని పలికెడి యెరుక ఈ మేనులో వుండి పలుకుచు మేను లేదని నేను వున్నవాడనని పలుకుచుండుట విపరీతమగు మాట. ఏమంటివా ఈ మేనును విడచి నీవువేరై మేను అశాశ్వితము నేను శాశ్వితుడను అని పలికిన సమ్మతించెదను. అట్లాగు పలుకలేవు గాన నీ శరీరముతో పాటు నీవున్నా మాయ వేయని సిద్ధాంతముగా జెప్ప వచ్చునని భావము॥ 150

కం. కట్టెలు పిడుకలు లేకను - యెట్టుంబలె నిప్పునిల్వ - కేగునో పుడమిన్ - అట్టుంబలెనే నీవును-యిట్టి శరీరంబులేక - నెం దుండువురా॥ ౧౫౧

తా. శిష్యా! కర్రెలు పిడకలు కలసి కాలిన యడల అగ్ని అందు వుండునుగాని ప్రత్యేక ప్రత్యేకముగా కాల్చిన యడల కర్రెలయొక్క నిప్పుగాని పిడకలయొక్క నిప్పుగాని వుండనేరదు, ఆలాగునే మేనును విడచి నేనుగాని నేనును విడచి మేనుగాని వుండనేరవు, అదిగాక మేను విడచి నేనుగాని నేను విడచి మేనుగాని పలుకుటగాని యే కార్యము లైనను చేయుటగాని జరగనేరదని భావము॥ 151

కం. తనువునే గానవంటె-ఘన సుఖ దుఃఖములు రెండు - గనుపడె నీవై - గనుక తనువు నీ వొక్కటె - వినరా నా మాట నిట్టి - వేరైన బడకన్॥ ౧౫౨

తా. శిష్యా! ఈ శరీరము నేనుకాను ఈ శరీరమునకు సర్వ సాక్షినై యుందును అనెదవు. ఈ శరీరము నీవుకాని యడల శరీరమే సుఖదుఃఖములు రెండును పొందవలెను, అట్లు పొందక నేను సుఖము పొందుచున్నాను. నేను దుఃఖము పొందుచున్నాను అనెదవుగాన ఈ శరీరమే నీవు. నీవే ఈశరీరము. ఈ రెండూ యెన్నటికి వేరుగావు. వేరని చెప్పెడిమాటలు వెర్రి (పిచ్చి) మాటలని అట్టిమాటలు నమ్మ వలదని భావము॥ 152

కం. ఎరుక లేనట్టి బయలున - బిరబిర నరుదెంచి యెవరు - బిలువందె తా - నరసి పరిపూర్ణమున్నది - యెరుకేగితె చాలులేని దెరుకని లేకన్॥ ౧౫౩

తా. శిష్యా! ఈ వృత్తి బట్టబయలునందు ఎవరు రమ్మనిపిలువ కనే, మూలములేనటువంటియెరుక తనకుతానే తొందరగావచ్చి అచల

పరిపూర్ణమున్నదని సద్గురుస్వాములచే విచారించిచూచి తాను లేనటు వంటివాడనని దెలిసి నేననే యెరుకలేక అహంకారము తనకుతాను లేకుండాపోవుటే చాలునని భావము ॥ 153

కం. తనువు నేగానవంటివి - వినుసుఖదుఃఖములు యెవరి - విర నాతోడన్ - వినజెప్పుము నే వినియెద - తనయాతప్పితివెనిన్ను - దండింతుజుమీ ॥ ౧౫౪

తా. కుమారా ! ఈ మేను నేనుగానని పలుకుచుంటివి నీవు యీ మేనుకానియెడల, నేననే యెరుకగాక నిందాస్తుతులు పుణ్యపాపములు, మంచిచెడ్డలు, కష్టసుఖములు అనుభవించువారు నీ శరీరములో నీవుగాక ఎవరువున్నారో, నేను వినునటుల స్పష్టముగా వినజెప్పుము. ఆలాగు జెప్పక యూరకేయుంటివేని నిన్ను కొట్టెదనని భావము॥ 154

కం. అందరిమాటలకురికే - వెందుకు నామాటనమ్మ - మిదె చాలును యీ - యందరులేని బయలుగని - యందున నీలేమి నెరిగి యరిగి తెసరిరా॥ ౧౫౫

తా. శిష్యా ! ఇతర మతవాదులుబోధించెడి బోధ వినుటకై నీవు అపేక్షించెదవెందుకు ? నేను నీకు బోధించిన యీ అచల పరిపూర్ణబోధను నీవు త్రికరణశుద్ధిగా నమ్మినట్టయిన యింతేచాలును. ఈ ప్రపంచము ప్రజలు అందరులేని ఈవుత్తబట్టబయలగు అచలపరిపూర్ణమునుచూచి, యీ వుత్తబట్టబయలులో నీవు లేనివాడవని యెరింగి, దృఢముగల్గి నేననే అహంకారము లేకుండా (కర్తృత్వము లేకుండా) పోతే చాలునని భావము॥ 155

కం. నాబోధ రుచికిరుచినిడు - నీబోధ నపేక్షచేత - నేర్చిన వారిన్ - యేబాధలుబాధింపవు - బాబూ యి నీవునేర్చి - పరియింపగదే ॥ ౧౫౬

తా. శిష్యా! నేను నీకు బోధించెడి యీ అచలపరిపూర్ణ బోధ యితరులు బోధించెడి బోధయందు గల్గెడి ఆనందముకంటె యెక్కువ రుచియై, ఆనందము కలుగజేయును, ఈ అచల పరిపూర్ణ బోధను ఆపేక్షతో (ఆప్యాయముగా) బోధ పొందినవారలు ప్రకృతి (సంసార) సంబంధమగు బాధలుగాని, ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములగు తాపత్రయాది బాధలుగాని పొందరు. నాయనా యీ యదార్థమగు బ్రహ్మవిద్యాబోధ పొంది యెల్లప్పుడు దీనిని పఠియింపుచుండుమని భావము ॥ 156

కం. తాము తనతప్పు నెరుగక - నా మాటలు తప్పులనుచు - నవ్వే జనముల్ - సామాన్యులనుచు దెలియుము - నీ మానసమందు లెన్న నిరుపమసుగుణా ॥ ౧౫౭

తా. శిష్యా! సుగుణములకు నీతో నెవ్వరిని పోల్చుటకు యలవి కానివాడా! ఇతరజనంబులగు మతవాదులెల్లరు తమయొక్క తప్పులు తాము తెలియక నా మాటలనెడి యీ అచల పరిపూర్ణ బోధను తప్పు యని కూయుచు నవ్వుచుందురు. అట్టివారలు ఈ బ్రహ్మవిద్యయందు సంపూర్ణముగా విచారించని సామాన్య మానవులుగాని పండితులు కానేరరని నీ మనస్సులో చక్కగా దెలియుమని భావము ॥ 157

కం. దప్పెప్పున జనినట్లుగ - నిప్పున చలిబాసినట్లు - నిజమోగి రమున్ - నొప్పగ దిన్నప్పుడెక్కుద - దప్పిన గతిబోధవిన్న - దప్పును బాధా ॥ ౧౫౮

తా. శిష్యా! తప్పులు వొప్పుచేత పోయినట్లును, అగ్నివలన చలిబాధ పోయినట్లును, నిజము విచారించగా (తెలియబడగా) అబద్ధము లేనట్లును, అన్నము తినినప్పుడు ఆకలిబాధ పోయినట్లును, యీ అచల పరిపూర్ణబోధ వినినయెడల యెరుకయొక్క ద్వయదోష (జనన మరణ ములు) బాధలు అన్నియు పోవునని భావము ॥ 158

కం. సాధనలు జెప్పి శిష్యుల - బాధలుపెట్టేటి గురుని - బాట వదలి యే - బాధలు లేనీబోధను - సాధుల సేవించివినుము - సద్గుణ శాలీ ॥ ౧౫౯

తా. శిష్యా! మంచిగుణములు గల్గిన శిష్యుడా! షణ్ముఖి ఖేచరి అంతర్ ఖేచరి, భూచరిమధ్యమ, జలాంధర మూలబంధ, ఓడ్యాణబంధ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధు లును యింకా అనేకములగు మంత్రలయ హఠయోగ ఎనుబదినాల్గు ఆసనములనే సాధనలును శిష్యులకుజెప్పి బాధలుపెట్టుచున్న గురువుల యొక్క బోధలును సాధికలును అన్నియు విడచి, యే శ్రమలు యే సాధనలు లేని ఈ అచలపరిపూర్ణ బోధను, రాజయోగమును శ్రీ అచల గురుస్వాములకు చతుర్విధ శుశ్రూషలుచే సేవించుచు, శ్రద్ధతో ఈ బోధను చక్కగా విని ఆచరించవలెనని భావము ॥ 159

కం. బోధలకెల్లను గురువగు - బోధసుమీ దీన్ని నీకు - బోధిస్తిని యీ బోధను వదలకు మెప్పుడు - సాధుజనస్తుత వివేక - సతతాశోకా॥ ౧౬౦

తా. సూక్ష్మాతిసూక్ష్మమైన తెలివిగల్గి దుఃఖము లేనివాడనై, సాధుజనులచే నుతింపబడుచుండెడివాడా! ద్వైతాద్వైతశైవశాక్తేయ వైష్ణవకాపాలిక బౌద్ధకుటీచక మహమ్మదీయ పారసీక క్రైస్తవ మొదలగు మతబోధల కన్నిటికి గొప్పదైనది ఈ అచల పరిపూర్ణ బోధయే గాని, యింతకంటె యెక్కువది యింకొకటి లేదు. అందుకై ఈ అచల పరిపూర్ణబోధను నీకు బోధించితిని. నీవు ఈ బోధను సామాన్యమైన దని యెంచక ఎల్లప్పుడు ఈ బోధను విడువవలదని భావము ॥ 160

కం. ఈ వికాసించు గురుడును - నా వద్దక కాసు లేదు-నన్నడు గకుపో - పోవయ్యా యనెటి శిష్యుడు-కేవల హీనాత్ములగుచు-కీర్తింప దగున్ ॥ ౧౬౧

తా. శిష్యా ! శిష్యుడు గురునియందు ప్రేమగలవాడై తనకు తాను మనస్సులో కలిగినంత ధనము గురునకు యివ్వకుండా శిష్యుని ధనము యిమ్మని అపేక్షించి అడిగెటి గురుడున్నూ, నావద్ద ఒకడబ్బు (లేక కానీ) యైనను లేదు. నన్ను అడుగవద్దు, నేను యివ్వలేదని ఏమీ అనుకోవద్దు. వేగిరమే వెళ్ళండి. మీకు ఆలస్యం అవుతుందని చెప్పేటి శిష్యుడును, యిట్టి గురుశిష్యులిద్దరును నిజముగా యిహాపరములు రెండింటిలోను అతినీచాత్ములని స్పష్టముగా చెప్పవచ్చునని భావము॥ 161

కం. దేవుడు తే తెమ్మనునా - జీవుడు లేదనుచు మదిని - సిడి ముడిపడునా - భావమున దెలసి యిద్దరు నా - నావిధమున నడువ వలయు - నందరు మెచ్చన్ ॥ ౧౬౨

తా. శిష్యా ! గుళ్ళయందుండెడి దేవుడు ప్రజలను ధనము (దక్షణ) పండ్లు, ఫలహారములు తెమ్మని కోరునా ? కోరడు, జనులు ధనము లేదని దక్షణ, పండ్లు, ఫలహారములు మొదలగునవి దేవునకు యిచ్చుటలో విసుగుదల కలవాడగునా ? కానేరడుగదా ! ఆలాగుననే ఆశ లేనివాడై గురుడును, గురునకు యేమైనా యిచ్చుటలో లోభత్వము లేక అనగా అరలేనివాడై ప్రేమగల్గి శిష్యుడును భావమునందును, బైటను ఒకేవిధముగా ప్రజలు అందరూ మెచ్చునట్లు గురుశిష్యులిద్దరూ నడువవలయునని భావము ॥ 162

కం. కోటివిధంబుల జెప్పిన-చేటొందలేటి తనదుపూర్వ - చేష్టలు విడకన్ - చాటున నేటునద్వైధము - గాటన మొనరించు నతని - కతు కునెబోధా ॥ ౧౬3

తా. శిష్యా ! శిష్యునకు అనేక పర్యాయములు అనేక విధములగు వుపమాన వుపమేయములతో యీ అచల పరిపూర్ణబోధను గురుడు చక్కగా బోధించినప్పటికి, ఈ బోధ ప్రబ్బత్వము పొందెడి తనయొక్క-

అహంకార మమకార అరిషడ్వర్గసంశయములతో కూడినవారై, జార చోరాదిపూర్వగుణములు విడువనేరక, గురునకు చాటుగను, ఎదురుగను రెండువిధములుగ దుష్ప్రవర్తనలచే ప్రవర్తించెడి గుణములుగల శిష్యులకు ఈ అచలపరిపూర్ణ బోధ వారిచెవులకు, మనస్సుకు అంట నేరదని భావము ॥ 163

కం. బంగారువంటి యీ బో - ధాంగీకరుణులను జేరి-యదివిని వారిన్ - భంగపరచదలచెటి యా - వెంగళులకు జెప్పకుమని - వేడెద నిన్నున్ ॥ ౧౬౪

తా. శిష్యా! పంచలోహములలో బంగారము యెంత విలువ, సౌందర్యము గలదో, అట్టి మేలిమి బంగారమువంటి ఈ అచలపరిపూర్ణ బోధను వినియెడి అచలగురుశిష్యులయొద్దకు, నిజము గ్రహించని మత వాదులుజేరి యీ పరిపూర్ణబోధను వారలచే విని, వారలను ఈ బోధ యందుండనీయక యెరుక మహాత్మ్యమైన బోధలనుబోధించి, చెరపదల చెటి నీచులకు ఈ పరిపూర్ణబోధను చెప్పవలదని స్తుతించుచుంటినని భావము ॥ 164

కం. సదమలగురు వెవరనినను - యిదిగో బయలిదిగో లేని - యీ గురు తెరిగే - టిదగు శరీరము దీనిని - వదలుమనుచు నీకు జెప్ప - వచ్చినవారే ॥ ౧౬౫

తా. శిష్యా! నిజమగు అచలగురుప్రభు లెవరనగా: యిదిగో వృత్తి బట్టబయలుని చూడుమని శిష్యులకు కనుసొంజ్ఞచే చూపించి, నేను చూపించగా నీవు ఏ గుర్తుచేత ఈ వృత్తి బట్టబయలు వుండగా గ్రహించితివో, అదియె మూలములేని గురుతెరిగే శరీరమని ఆ గురుతెరిగే (హం) నేననే ఎరుకను వదలుమని నీకు అతి సూక్ష్మముగా జెప్పి సూచన జేసినవారే యదార్థమును తెలిపిన నిజగురువులని భావము ॥ 165

పరమ తత్వ కందముల తాత్పర్యములనే భావార్ధములు.

కం. రోగపుచేష్టలుబోయిన - రోగముగలదనిన మాడ్కి - రోయకనిన్నున్ - నీగు ర్తెరుగుట మణగిన - నేగలనన వీడుమాట - నిశ్చయమటరా॥ ౧౬౬

తా. శిష్యా! తనకుగలిగిన వ్యాధియొక్క గుణములు పోయిన తర్వాత, యింకను వ్యాధి తనకుగలదని అనుకోవడముచే క్లేశించుట యెట్లో, అటులసర్వమును గు ర్తెరుగునట్టి నీవైన మెరుకపోయిన వెనుక నేను వున్నానని అనడము తప్పుడుమాటగాని ఆమాట నిజమైనమాట కాదని భావము॥ 166

కం. దిమ్ముతనపు శిష్యునిమది - నొచ్చినధన మివ్వడనుచు - నూహించిమదిన్ - యిచ్చకములాడబోకను - చెచ్చెర ఝూడించు వాన్ని - సద్గురుడై తే ॥ ౧౬౭

తా. శిష్యా! యదార్ధవాదియైన నిజగురుడు చాడీకోరు (లేక కుట్ర) మనస్సుగల శిష్యునిమనస్సు నొప్పిగల్గిన ధనము యివ్వడని తన మనస్సులో తలంచి ముఖప్రీతిగా అనగా వాళ్ళను పొంగించిమాట్లాడక వానితో మొగమాటము పోతుందని అనుకోక, వాడు యిచ్చే ధనము లెక్కచేయక, వాడి దుర్గుణములు ఖండించి త్వరితముగా వానిని అదమాయించునని భావము॥ 167

కం. గురుడు తననెంతమెచ్చిన - వరశిష్యుడు లొంగితిరుగ - వలయునుమదిలో - మురసి భయభక్తిలేకను - తిరిగిన చేటొదవు నిజము - తెలియగదోయీ॥ ౧౬౮

తా. శిష్యా ! శ్రీ సద్గురుస్వామి, శిష్యుని మంచియోగ్యుడని యెంతమెచ్చుకొనినను ఆ శిష్యుడు గురువాజ్ఞను దాటక, గురునకు వంగియే తిరుగవలయును. అట్లుగాక తాను మనస్సులో గురునకు తన యందు ప్రేమగల్గి మెచ్చుకొనెనని, తాను గొప్పవాడనని గర్వముతో సంతోషించుచు, గురునియందు భయమును, భక్తియును విడచి

ప్రవర్తించుచుండినయెడల తనకు బ్రహ్మవిద్యకుగల ప్రబుద్ధులయందు నాశనము గలుగుట నిజమని భావము॥ 168

కం. గురుశిష్యుల లక్షణములు - గురుశిష్యుల బోధరీతి - గురు గీతార్థం - బెరిగిన నరులకె మెప్పగు - నెరుగనియా మూఢనరుల - కిష్టతియానె॥ ౧౬౯

తా. శిష్యా ! శ్రీ సద్గురుమూర్తి తన అధికారాధేయములతో యేలాగు నడచుకొనవలయునో, శిష్యుడు పరునియందు అణుకువగల్గి ఏలాగు నడుచుకొనవలయునో, గురుశిష్యుల బోధయొక్క పద్ధతి యే లాగో గురుగీతలయందుండెడి అర్ధంబుల నెరింగిన గురుపుత్రులకే వారి వారి నడవడికలు తెలసి కుదిరి హితవుగాను గొప్పవిగాను యుండును. ఆ గురుగీతలలోనుండెడి అర్ధంబు నెరుంగని అజ్ఞానమానవులకు గురు శిష్యులయొక్క నడవడికలు యిష్టంబుగా యుండవని భావము॥ 169

కం. స్థిరముగ నిల్చెడైతె - పరుగెత్తక భ్రాంతినిల్వ - బడదా భువిలో - నరులు విమర్శించిన తా - నురుకుటమది యెందుకోస - మూహను కనరా ॥ ౧౭౦

తా. శిష్యా ! ప్రపంచములో భ్రాంతి యెల్లకాలములయం దుండునట్టిదైన ఆకలిగినభ్రాంతి పోకుండా యుండవలదా, యుండనేరదు, ఆ భ్రాంతిపోయి ఇంకొక భ్రాంతి కల్గుచుండును. భ్రాంతి శాశ్వతముగా యుండునదో పోవునదో యీ ప్రపంచకులగు జనులు పూర్తిగా విచా రించక తాము మనస్సులో అనేక భ్రాంతులు పొందుట యేమి లాభమో విచారించుము. అట్టి ప్రపంచభ్రాంతులను నీవు పొందకుమని భావము॥ 170

కం. తన సంతతిపైగల దయ - తన శిష్యునిమీదనుంచ - దగు గురుడెపుడున్-తన ధనము మనసు తనువులు-తనగురుని వటందు దల్చ - దగు శిష్యనకున్॥ ౧౭౧

తా. శిష్యా! (శ్రీ) సద్గురుస్వామి తన పుత్రపుత్రికాది సంతానముయందు ఎంత ప్రేమగలిగి అనురాగముతో సంరక్షించునో తన శిష్యులయందు అట్లాంటి ప్రేమగలిగి యెల్లప్పుడు యుండవలెను. శిష్యుడు తనధనము తన మనస్సు తన తనువులుమూడున్నూ తనగురునివని తలంచి ఆమాటయందు తాను స్వతంత్రముగా అనగా తన యిష్టానుసారముగా నడచుటమాని గురుని ఆజ్ఞతో అన్ని పనులు చేయుచు నేననే అభిమానరహితమై చరించవలయునని భావము॥ 171

కం. శూరత్వ మాత్మపనికై - వైరాగ్యము గురునిగొల్చు -
వర్తనకెపుడున్ - యీరీతి వృత్తిగల్గిన - నారీనరులేగి చొరరె - నరకములోనన్ ॥ ౧౭౨

తా. శిష్యా! నేననే అహంకారముగల్గి కేవలాత్మయగు అచల పరిపూర్ణబ్రహ్మమును తెలసినవాడనని - నిందాస్తుతులు నాకులేవు. వైరాగ్యపరుడనని, నేనుగనుక నాగురుని సేవించుచున్నాను. నావల్ల గురునకు యింత గొప్పకలిగినది నేనే గురుని పోషించుచున్నాను యని నాయంత గొప్పవాడు యెవడుకాడని అహంకారముగల్గి వూహించుచు గురు శేవ జేశెడి శిష్యులలో పురుషుడైనను (స్త్రీ) లయినను జననమరణ మనెడి నరకమును పొందుదురని భావము॥

ఇంకొక భావము ఎట్లాయంటె: తాననె ఆత్మను పరమాత్మలో ఐక్యము చేయగల శూరుల (ధీరుల) మని శరీర భ్రాంతిలేని వైరాగ్య పరులమని వూర్ధ్వకుండలిపైని సహస్రారకమలమందున్న గురుని సేవించుచు, ఆకఘాలకుహారమును భేదించి, ఐక్యము చేయగల్గినవృత్తి గల్గినవారలు (స్త్రీ)లుగాని, పురుషులుగాని అట్లు చనిపోయి మరల మాతృగర్భమను నరకములో జననము యెత్తకుండా యుండరని భావము॥ 172

కం. మనసున నొకటిదల్చు వా - క్కు నొక్కటిబలుకుచుండు కుటిలుడుమరితా - తనువున నొక్కటిజేయును-వినువానిని బోధదెల్ప - విహితమటోయీ ॥ ౧౭౩

తా. శిష్యా ! కుచ్ఛితస్వభావముగలవాడు మనస్సులో ఒక్కటి తలంచుచు, పలుకు వేరొక్కటి పలుకుచు, తనువు వేరొక విధముగాపనులు చేయుచుండును. అట్టివానికి ఈ అచల పరిపూర్ణబోధను వినుమని వినిపించుట మంచిదికాదు. ఏమనిన అట్టివారలు అధర్మప్రవర్త కులుగాన ఈ అచల పరిపూర్ణబోధ పొందినను వారలకు యీ బ్రహ్మ విద్యద్బోధ యేమియు ప్రయోజనము కాదని భావము॥ 173

కం. మనసున వాక్కునతనువున - పనియొక్కటె జరుపునట్టి - భక్తునికిదయన్-వినిపించుము వినుమని యీ-ఘనబోధను వానికతుక - గలదుడుగకుమీ ॥ ౧౭౪

తా. శిష్యా! మనస్సువలన గల్గిన సంకల్పమే వాక్కుచేత వచించును. వాక్కుచేత వచించినప్రకారము తనువుచేత పనులు చేయును. అనగా మనోవాక్కాయకర్మలు త్రికరణశుద్ధిగా పనులు చేయుచు గురుభక్తి గలిగినవానియందు కరుణతో యీ అచల పరి పూర్ణబోధను వినుమని వానికి ప్రేమతో బోధించుము. జననమరణ ములు రహితముచేయగల్గిన గొప్పదైన ఈ అచల పరిపూర్ణబోధ అట్టి వానికే మనస్సుకు అంటును. అట్లాంటివారికి బోధించుటకై సంశయ ముంచవలదని భావము ॥ 174

కం. మేలైన బోధవినుటకు - చాలా విఘ్నములువచ్చి - సమ కూడిన - యేలీలనవిడు సచ్ఛిష్యుడు - వాలాయము బోధయందె - వర్తించుజుమీ ॥ ౧౭౫

తా. శిష్యా! మంచిదై జన్మరాహిత్యము జేయుటకు గొప్పదైన ఈ అచల పరిపూర్ణబోధ వినుటకు గురుసేవ చేయుటకు, అనేక విధము లగు ఆటంకములు గృహమునందు కలిగినప్పటికి, మంచిశిష్యుడైనవాడు ఈ అచల పరిపూర్ణబోధను సద్గురుస్వాములను విడువక, తనకు సాధ్య మైనంతవరకు గురుసేవ జేయుచు, ఈ అచల గ్రంథములే చదువుచు లేక అయా గురుభక్తులచెంత జేరి ఈ పరిపూర్ణబోధను వినుచు ఆయా గ్రంథములయందు జెప్పిన ధర్మముల ప్రకారము నడచుకొనుచుండునని భావము॥ 175

కం. గురుడు తనయాజ్ఞలోపల - చరియింపగ గోరునట్టి - శిష్యున కెపుడున్ - దురితంబువృద్ధియై తా - నరకమునన్ గూలకున్నె - నరనుతచరితా ॥ ౧౭౬

తా. శిష్యా! ఈ జనులచేత స్తుతింపబడెడివాడా! శిష్యుడు తన గురుప్రభువును తన ఆజ్ఞానవర్తనలతో యుండవలయునని తలంచుచు ఆజ్ఞాపించెడి బుద్ధిగల్గి, గురుని తన యిష్టానుసారముగా నడుపు మనునట్టివానికి అంతకంతకు అహంకారము, దుర్మార్గము, యెక్కువై తాను గర్భనరకమున పుట్టకమానడు, ఎల్లప్పుడు ప్రాపంచక సంబంధ మగు శరీరసంబంధమగు బాధలు తప్పక కలుగును. గాన గురుని ఆజ్ఞానుసారము శిష్యుడు తిరుగవలయునుగాని, గురుని తన ఆజ్ఞాను సారముగా తిరుగుమనుట అధర్మము, విపరీతమని భావము॥ 176

కం. గురు కనుసాంజ్ఞనుగనుగొని - పరిచర్య యొనర్చుచుండు - భక్తుడు భక్తిన్ - పరిపూర్ణబోధ జెందును - పరమోదార ప్రచండ - బంగరుకొండా॥ ౧౭౭

తా. శిష్యా! శ్రీ సద్గురుస్వామి నోటితో పలుకనే ఆయన కనుసాంజ్ఞచే ఆయన భావమును తెలసి, గురుభక్తుడు భక్తితో

ఎల్లప్పుడు సేవ చేయుచుండును. అట్టివాడు గురుకరుణకు పాత్రుడై అచలపరిపూర్ణబోధ పొంది మర్మములు, ధర్మములు తెలిసి పరిపూర్ణ స్థితిని జెందును. అదియునుగాక, పరమునం దుదారస్వభావము గల్గి విలువ సౌందర్యము గొప్పతనముగల బంగారుకొండవంటి యౌదార్యము గలవాడా యని భావము॥ 177

కం. ప్రాకటముగ నిద్దుర యిక - యేకథలను వినినరాదు - యీబోధందున్ - రాకుండ దేమి చిత్రమో - ప్రాకృతనరమూక కెల్ల - పావనచరితా॥ ౧౭౮

తా. శిష్యా! ప్రపంచములో పవిత్రమైన జీవిత నడతగలవాడా-ప్రపంచ సంబంధమగు కుటుంబ సంబంధమగు యేగాథలువైనను లేక యితరమైన పురాణసంబంధమగు యేకథలువైనను ఈ జనులు వినిన యెడల నిద్దుర రానేరదు. ఈ అచలపరిపూర్ణబోధను ఈ ప్రపంచ సంబంధమగు ఈ జనులు వినియెడి సమయమునందు అది యేమి కారణమో కాని నిద్దురతప్పకుండా వచ్చునని భావము॥ 178

కం. క్రొత్త దంపతులకూటమి - నెత్తెరుగున లేమలంత - నిదురలుబోకన్ - మొత్తములై కనునటువలె - బత్తుల దిరిగేటిచిన్న - బాలలకగునే॥ ౧౭౯

తా. శిష్యా! నూతన దంపతులకు శోభనము చేయుచుండెడి సమయమున చిన్నవారలగు యితర బాలికలు నిదురపోకుండా గుంపులుగా జేరి అనేకవిధములుగా గదిలోయున్న నూతన దంపతులను జూచుచు నవ్వుకొనుచు హేళన చేయుచునుందురో అటువలెనే, భక్తిజ్ఞానమార్గములలో తిరిగెడి చిన్నపిల్లలవంటి ఈ మానవులు ఈ అచల పరిపూర్ణబోధ నెరుంగనివారలై ఈ బోధాన్వితుల హేళనజేయుచు ఈ బోధను విని నవ్వుచుందురని భావము॥ 179

కం. మన సరయుక ప్రజలను విను-మని చదువకుబోధ బాధ -
యని యిండ్లల్లో-పనులన్ని యాది జేసుక - చనియదరా సమయ మంద-
సహ్యమున సుతా ॥ ౧౮౦

తా. శిష్యా, కుమారా! ఈ ప్రపంచమందుండెడి జనులయొక్క మనస్సు యెట్టిదో నీవు తెలియక, నేను అచలపరిపూర్ణవిచారణ చదివెద మీారలు వినుడని నీవు వారలనుకోరి యీాబోధ వినిపించిన యెడల, యీా పరిపూర్ణబోధ బాధయని వారలు తలంచి, ఆ సమయములోనే యిండ్లయందు పనులు యెక్కువగాయున్నవని త్వరితముగా చేయవలయునని యీాబోధను వినుటకు యిష్టము లేనివారలై వెళ్ళిపోవుదురని భావము॥ 180

కం. వీనుల వినడీబోధను - నేనే బ్రహ్మనని నిక్కి-నీల్గెటి వాడున్ - మాణిక్యము గానవచ్చిన - దానిని రాయనుచు దలచు-తార్కిku గతిన్ ॥ ౧౮౧

తా. శిష్యా! అహం బ్రహ్మాస్మియాది మహావాక్యముల బోధ పొందినవాడు నేనేబ్రహ్మమని పలుకుచు చాలతోనై నను యీా అచల పరిపూర్ణబోధను వినుడు. అతని భావము యెట్లాటిదంటే ? త్రోవను పోవువానికి దారిలో మాణిక్యమను రత్నము కాన్పించిన చేతితో అందుకొని అది యెంత విలువకాంతి గలదోయని విమర్శించకయే పలుగురాయిగా తలంచి కాళ్ళచే ఆ మాణిక్యమును తన్నుకొనిపోవునని భావము॥ 181

కం. ఒకరు విని మెచ్చవలెనని - సకల పురాణములు వేద - శాస్త్రశ్రౌత - ప్రకరణమును నేర్చువిద్య నికరంబీ బోధమెచ్చ - నేర్చునె సుమతి ॥ ౧౮౨

తా. శిష్యా! మంచిమనస్సు కలవాడా! ఈ జనులు యితరులు విని మెచ్చుకొని ఆనందించవలెనని, అష్టాదశపురాణములు భారత భాగవత రామాయణాది కథలు నాలుగు వేదశాస్త్రములు వాస్తుజ్యోతి షాదులగు అవిద్యాసంబంధమగు గ్రంథములు చదివి ప్రజలకు వినిపించి ఆనందింతురేకాని, నిజమైనటువంటిన్ని, బ్రహ్మవిద్యయైనటువంటిన్ని జననమరణములు పోగొట్టునదియగు ఈ అచలపరిపూర్ణబోధను నేర్చుకొని తాము ఆనందించలేరని భావము ॥ 182

కం. సాధారణముగ దెల్పకు మీ - ధరమానవులబిల్చి యీ-బోధను బల్ - మేధానిధి యాచించిన - బోధించుము వద్దులోభ - బుద్ధి సుబుద్ధీ ॥ ౧౮౩

తా. మంచిబుద్ధిగల శిష్యా! ఈ ప్రపంచమున సంసారమున తరితీపులు నొందెడి మనుష్యులను వినుమని ఈ అచల పరిపూర్ణబోధను తేలికగా జెప్పకుము. సూక్ష్మాతిసూక్ష్మమైన తెలివిగల్గిన యతడు ఈ అచలపరిపూర్ణమగు వస్తువును గురుసూచనచే గుర్తించి ఈ బోధయొక్క మర్మములు ధర్మములయందు సంచరించగలడు. అట్టివాడు బోధించుమని కోరినయెడల వానికి బోధించుటకై వెనుదీయక ఈ బోధను బోధించుమని భావము ॥

కం. ఏ బోధ శిష్యులకుగల - యాబాధల నణచివేసు - నదె సద్బోధా - ఆబోధ నొందియునినను - ఈబోధేసుమ్మీ దీన్ని - యిక విడువకుమీ ॥ ౧౮౪

తా. శిష్యా! ఈ ప్రపంచములో శిష్యులకుగలిగెడి ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికములచే గలిగెడి తాపములను, దుఃఖములును, జననమరణ పుణ్యపాప కష్టసుఖములతో నుండెడి బాధలన్నింటిని ఏ బోధ వినిన లేకుండా జేయుచున్నదో అదియే మంచిబోధ. ఆ బోధ

మేదియనిన ఈ అచలపరిపూర్ణ బోధయే. గాన నిజమగు యీ ఆ బ్రహ్మవిద్యోద్బోధను యెప్పుడు విడువవలదని భావము ॥ 184

కం. హెచ్చైన బోధ దెల్పే - సచ్చరితులకియ్యలేరు. జనుల ధనంబుల్ - గచ్చులకొట్టె దిచ్చుల - కిచ్చిన క్రియనిట్టి నృతతి నేమ ననోయీ ॥ ౧౮౫

తా. శిష్యా! ఇతర మతబోధలకంటె గొప్పదియు, యదార్థ మైనదియునైన ఈ అచల పరిపూర్ణ బోధను బోధించెడి యదార్థవాదు లగు అచల గురుస్వాములకు ఈ ప్రజలు ధనము యివ్వలేరు. అబద్ధపు మాటలను జెప్పుచు ప్రజలను మోసముచేసెడి వాచాడంబరులగు అనృతవాదులకు ధనము నొసంగుదురు. ఈ జనులయొక్క బుద్ధిని యేమనవచ్చునని భావము ॥ 185

కం. నీ మదికీ నిజబోధన్ - ప్రేమతో నాటించదలచి - పెక్కు విధములన్ - నే మొదలుబెట్టి జెప్పితి - దే మాత్రము రాత్రిబగలు - మేమారకుమీ॥ ౧౮౬

తా. శిష్యా! నేను నీయందు కరుణగల్గి, నిజమగు ఈ అచల పరిపూర్ణబోధ నీ మనస్సునకు చక్కగా పట్టుటకై అనేక విధములగు ఉపమాన ఉపమేయములతో బోధించితిని. నీవు చక్కగా గనుగొంటివి గదా! గావున ఈ అచల పరిపూర్ణబోధను రాత్రింబగళ్లు మరచిపోక అశ్రద్ధగల్గి విడిచిపెట్టక యెప్పుడు ఏ సమయమందైనను మననము జేయుచుండుమని భావము ॥ 186

కం. కమలంబులున్న కొలనుకు - భ్రమరము లేతెంచినట్లు - బాగుగ బోధన్ - తమమదిగోరి గురుని పద - కమలములనుగొల్వ సుజన - గణమే తెంచున్ ॥ ౧౮౭

తా. శిష్యా! కలువ తామర పుష్పములుండెడి చెరువులు, మడుగులకు, తుమ్మెదలు దూరదేశములగు అడవులయందుండినను, ఆ తుమ్మెదలు మధువును గ్రోల నపేక్షతో అచ్చోటికి యేతెంచి, ఆయా పుష్పముల యందుండెడి తేనియను గ్రోలినట్లు, అచల గురుమూర్తి తమకు దూరముగా యున్నప్పటికి సజ్జనులగు శిష్యులు ఈ అచల పరిపూర్ణ బోధ పొందుటకై తాము మనస్సున తలంచి సద్గురు పదకమలములను సేవించుటకై వెళ్ళుదురని భావము ॥ 187

కం. సురవరు డహల్యకోసము - మరులొందిన రీతినెపుడు - మరుగుదురజ్ఞుల్ - పొరుగూరి సాధులకు తమ - పురమునగల సాధులందు - బుద్ధి నిలువకన్ ॥ ౧౮౮

తా. శిష్యా! యెల్లతేనుగుగల్గిన దేవేంద్రుడు తనకు సౌందర్యవతియగు భార్యయైన శచీదేవి (యింద్రాణి) గలిగియుండియు, అరణ్యమునందుండెడి జడదారియైన గౌతమమహర్షి భార్యయగు అహల్యకొరకై మరులుపొంది కామోద్రేకుడై తిరిగినట్టుగా, ఈ అజ్ఞానులగు మూఢ మానవులు తమ పురమునందుండెడి గురువులయందు బుద్ధి నిలువక పొరుగూరి గురువులయందు ప్రేమగలవారై తిరుగుచుందురని భావము ॥ 188

కం. నేనీకు జెప్పబూనిన - ఈ నిజసద్బోధ మనసు - కిమిడిన వెనుకన్ - నీనాపని దీరునురా - వో నా ముద్దులకుమార - వో నగధీరా ॥ ౧౮౯

తా. పరమునందు ధీరతగల్గిన నాయొక్క ముద్దులకుమారుడా! నేను నీకు జెప్పబూనినటువంటి యదార్థమగు ఈ అచలపరిపూర్ణబోధను నీ మనస్సుకు అంటిన తర్వాత నీవు వినుటయు నేను జెప్పుటయు లేక

పోవును. అదియునుగాక – నీ – నా – అనెడి బేధబుద్ధితో కూడిన అహంకారమగు మెరుక లేకుండా పోవునుయని భావము ॥ 189

కం. త్ర్యక్షుని నిందించినయా-దక్షునిగని ప్రాణమిడిన-త్ర్యక్ష సతివలెన్ - ఈక్షితి తన దేశకుని ను - పేక్షించిజనులతా ను - పేక్షించదగున్ ॥ ౧౯౦

తా. శిష్యా! మూడు కన్నులు గలిగిన ఈశ్వరుని నిందించిన దక్షప్రజాపతినిజూచి, ఈశ్వరునికి భార్యయు దక్షప్రజాపతికి కుమార్తెయు నగు దాక్షాయని యనెడి పార్వతి తన భర్తను తండ్రి నిందించినాడని తండ్రివద్దనే ప్రాణములు విడచెను. అటువలె ఈ ప్రపంచములో తన సద్గురుస్వాములను నిందించిన జనులను తాను విడచిపెట్టవలయునని భావము ॥ 190

కం. గురుని కపరాధియగు నా నరనాథుని ద్రుపదునొంచు - నరునివిధమునన్ - ధర సచ్ఛిష్యవరుడు తన - గురుశత్రుని చేతనైతె - క్రొవ్వణచదగున్ ॥ ౧౯౧

తా. శిష్యా! తన సద్గురుస్వాములగు ద్రోణాచార్యులకు అపరాధము (పరాభవము) గావించిన ద్రుపదమహారాజును పరాభవము గావించిన అర్జునునివలె - యీ ప్రపంచములో గురుభక్తిగల్గిన సచ్ఛిష్యుడు (మంచిశిష్యుడు) తన సద్గురుస్వాములయొక్క శత్రువును తనకు చేతనైతే వాని గర్వము పరిహరించవలయునని భావము ॥ 191

కం. కాకులవలె కూకలిడె - లోకులకీ కలకు బెదరి - లోగుందకటన్ - మూకత్వమూను చాలు - వివేకుడవైయుంటివేని - విని నామాటా ॥ ౧౯౨

తా. శిష్యా! మంచిచెడ్డలను విచారించకయే ఒక కాకి అరచిన మిగతా కాకులన్నియు అరచుచుండెడి విధమున, యీ ప్రపంచములో అజ్ఞాన ప్రజలయొక్క నిందలకు స్తుతులతో గూడిన మాటలను విని,

ప్రపంచమనెడి కలకు యీ ప్రజల నిందల మాటలకు భయపడి నీ మన స్సులో విచారించుచు దిగులు పొందకుము. తెలివిగల్గినవాడవై నా మాటలనువిని వారలమాటలకు బదులుచెప్పక, మౌనమువహించి ధైర్య ముతో యుండుటే మంచిదని భావము ॥ మౌనము మూడు విధములు కలదు. అందు మొదటిది కాయకమౌనము, అనగా శరీరము కదలకుండా యుండుట, రెండవది వాచకమౌనము. యితరులు మాట్లాడిన మాట లకు సమాధానమివ్వక మాట్లాడకుండుట. మూడవది మానసిక మౌనము. తన మనస్సు ఏ సంకల్పాదులు చేయకుండుట ॥ 192

కం. పెద్దల నెవరినిజూచిన - ముద్దుగమాట్లాడి వారు ముద మునజెప్పె - సుద్దులకడ్డముజెప్పక - వొద్దికతో మ్రొక్కివినుమ - వో పుణ్యతమా ॥ ౧౯౩

తా. శిష్యా! పుణ్యవంతా! శ్రీమదచలగురు సాంప్రదాయకు లైన సద్గురుస్వాములగు పెద్దల నెవ్వరిని జూచినను చక్కగా వారికి భక్తితో నమస్కరించి వారలకు ఆనందము గలుగునటుల మృదువుగా మధురముగా మాట్లాడుము. వారు ప్రేమతో బోధించెడి యదార్థ వాక్యములగు ధర్మములను వినుచు వారలను ఎదుర్కొని వికటముగా మాట్లాడక పొందికతో పెద్దలయెడ అణకవగా యుండవలయునని భావము ॥ 193

కం. తనహిత వెరుగని మనుజుడు - వినడా ప్తజనోక్తి దుష్ట - వృత్తిగల సుమో - ధనుడు దశాశనుడు విహిత - జనవాక్యము వినక గాదె - సమసి రిరువురున్ ॥ ౧౯౪

తా. శిష్యా! తన శ్రేయస్సును తాను తెలియక మూర్ఖుడై చెడుప్రవర్తనగల్గి ప్రవర్తించెడి మనుష్యుడు తనకు ఆపదలో క్షేమ మునుకోరి హితమును బోధించెడి మనుజులయొక్క మంచిమాటలను కటువాక్యములుగా భావించి విననేరడు. అది యెటువలెనంటె! దుర్యో

ధనుడు, దశకంఠుడగు రావణబ్రహ్మ వీరలిద్దరు వారివారి బంధు మిత్ర సహోదరులు గురువులుజెప్పెడి మంచిమాటలు వినక, సర్వము నాశనము జేసుకొని వారు నశించినవిధముగా నగుదురనిభావము॥ 194

కం. ఎన్నో గ్రంధజలధులను - తిన్నగమధియించి చూస్తే -
తేలెనుసారం - బున్నఁజయనుగని వృషయగు నిన్నున్ నీ మేను
మృషని - నిలువకుమనుచున్ ॥ ౧౯౫

తా. శిష్యా! అనేక గ్రంధరాజములనెడి సముద్రములను తరచి బాగుగా చదివి విచారించితే, ఈ అచలపరిపూర్ణవిచారణ యదార్థమై జననమరణములు పోగొట్టునని తోచెను. అట్టి పరిపూర్ణవిచారణచే చెప్పబడిన ఈ పుత్తబట్టబయలును జూచి, లేనటువంటి నిన్నును నీ మేనును లేనివని గురుముఖమున తెలసి సర్వభ్రాంతిని విడువుమని భావము ॥ 195

కం. కనకసుసుగంధవాసన - తనకొనగాదలచి షట్పదము -
గొనదటులన్ - వినడులేనహామె బ్రహ్మం-చనిబల్కె- నృతతినిల్వనని -
యీబోధన్ ॥ ౧౯౬

తా. శిష్యా! సంపెంగ పుష్పముయొక్క సువాసనలతోకూడిన తేనిని తీసుకొనవలయునని తలంచిన (ఆరుకాళ్లుగల) తుమ్మెద ఆ పుష్పము యొక్క సువాసన తగిలినవెంటనే తాను నశించుదునని భయపడి ఆ పుష్పముచెంతకు పోవనేరక ఆ సువాసనను ఆ మధువును గ్రహించలేదు. అటువలెనే లేనటువంటి అహంకారముగల్గి నేనే బ్రహ్మంబని పల్కెడి మనుజుడు ఈ అచలపరిపూర్ణబోధవద్ద తనబోధ తాను నిలువ నేరమని తలంచి ఈ పరిపూర్ణబోధ సహించక వినక వెళ్ళిపోవునని భావము ॥ 196

కం. హద్దుసుమీ గురువాజ్ఞన - ముద్దుసుమీ గురుని సేవ - ముదమున జేయన్ - వద్దుసుమీ యిట్లుండుట - వద్దుసుమీ గురుని తోటి - వాదించుటమున్ ॥ ౧౯౭

తా. శిష్యా! గురుడు శిష్యుని యీ లేని ప్రపంచములో ధర్మముగా నడువుమని ఆజ్ఞాపించుట శిష్యుని క్షేమముకొరకై అనగా ఎరుకపోవుటకై జెప్పును. అట్లు గురుడు శిష్యునికి హద్దుగాకొన్ని ధర్మములు జెప్పినడుచుకొనుటుల ఆజ్ఞాపించునుగాని అన్యముగాదు. ప్రేమతో గురుమూర్తికి సేవలుజేయుట గుణత్రయములు, దుర్గుణములు విడచుట యగును. తాను పుట్టినందులకు గురుపాదము పట్టినందులకు ఫలితము యిదియే, యీలాగు చేయుటేముద్దుయగును. శిష్యుడు ఈ విధముగా నడచుటే యీ అచలపరిపూర్ణబోధకు తగినపద్ధతి. తనగురుమూర్తితో వాదించి యెదిరించి పలుకుట యిహపరములకు దూరమై చెడిపోవుటకే యనిభావము ॥ 197

కం. జంభాల పోతుగోరునె - సంభవ నాశములబాపు - చక్కని బోధన్-కుంబిని షండునకుండునె - రంభా సంభోగవాంఛ - రంభను గనినన్ ॥ ౧౯౮

తా. శిష్యా! శింబోతు (మేకపోతు) వలెగడ్డములు జడలుపెంచుకొని యుండెడివారు చావుపుట్టుకలు లేకుండా చేయగలిగిన యీఅచల పరిపూర్ణబోధను వినుటకు అయ్యదపొందుటకు సహించరు. అది యెటువలెనంటె నపుంసకునివద్ద అతిరూపవతియైన కుంభినీదేవియున్నను ఎట్లు వుపయోగములేదో అట్లు, మరియెట్లంటె నపుంసకుడు రూపలావణ్యములకు మిన్నయగు రంభనుజూచి ఆమె తనవద్ద వున్నప్పటికి ఆరంభతో సంభోగించి ఆనందించవలెనని అతనికి వాంఛ కలుగనేరనట్లని భావము॥

కం. పతిభక్తిగల యువతివలె - సతతము గురుభక్తిగలిగి - సచ్ఛిష్యుడిలన్ - స్థితిగుదుర సేవజేయును - (ప్రతిరహితాద్భుతచరిత) - పరమపవిత్రా ॥ ౧౯౯

తా. శిష్యా ! తనభర్తయందు భయభక్తులుగల్గి సేవించుచు మెలగుచుండెడి మహా పతివ్రతవలె, మంచిశిష్యుడు తన సద్గురుమూర్తి యందు భయభక్తి విశ్వాసములు గల్గి తనకు అచలపరిపూర్ణస్థితి పట్టు నంతవరకు ఆయనను సేవించుచు పరిపూర్ణబోధా లక్షణములను చక్కగా వినుచు పరమునందు పవిత్రుడై అతనితో పోల్చుటకు రెండవ వాడు లేనివాడై, పెద్దలకు ఆనందము గలుగునటుల నడవడికలు గల్గి మహోత్కృష్టమైన సుగుణములతో జీవితచరిత్రము గలవాడై యుండు నని భావము॥ 199

కం. జఠర జనితులైనను బహు - కఠిన మనస్కులకు ఘోర - కలుషాత్ములకున్ - శఠులకు జడమతుల కివకు - పరనాసక్తులకుబోధ - పట్టుమటంచున్ ॥ ౨౦౦

తా. శిష్యా ! తన గర్భమునందు పుట్టిన పిల్లలకైనను, యితరులగు బీదసాదలయందు దయాదాక్షిణ్యము లేని కఠినమనస్సుగలవారలకు, పంచ మహాపాతకములు చేయుచుండెడి మహా పాపాత్ములకు, పరుల కపకృతి చేయుచుండెడి దుష్టబుద్ధి గలవారలకు బుద్ధిహీనతచే వివేకజ్ఞానము లేనివారలకు, యీ గ్రంధము చదువుట వినుటయం దిష్టము లేనివారలకు, యీ అచలపరిపూర్ణబోధ నేను బోధించెద మీారలు యీ బోధను పొందుడని దయతో వారలకు యీబోధను బోధించ కూడదని భావము॥

పంచమహా పాతకములనగా- 1. బ్రహ్మహత్య, 2. శిశుహత్య 3. భ్రూణహత్య, 4. స్వర్ణఘాతుకత్వము, 5. మధుపానములని తెలసేది॥

కం. కర్పూరము నిప్పుగలసే - చొప్పున వెలిగవల కండ్ల - జూస్తుండగనే-తప్పున గనరా వట్లనె - యిప్పుడు నిను నన్ను బోధ - నెరుగుము బుద్ధిన్ ॥ ౨౦౧

తా. శిష్యా! హారతికర్పూరము అగ్నియు వెలిగి రెండును మనము చూచుచుండగా కానరాకుండా పోయినటుల, యీ అచలపరిపూర్ణ బోధను యిప్పుడు మన యిద్దరము విచారించిన తర్వాత (అనగా బోధానంతరము) హారతికర్పూరమువంటి నేనున్నూ, అగ్నివంటి నీవున్నూ యిద్దరము లేనివారమే యగుచున్నామని భావము॥ 201

కం. దీవించి యిస్తినే నీ - సేవించిన సేవమెచ్చి - చిత్తము లోనన్ - కావించుమెప్పుడు గానము - బావించిన ముఖ్యమనుచు - పావనశీలా ॥ ౨౦౨

తా. శిష్యా! నీవు నన్ను సేవించినసేవకు నామనస్సులో మెచ్చుకొని నీకు యెరుక నిరసనమైన పరిపూర్ణసిద్ధి కలుగునటుల దీవించి, యీ అచలపరిపూర్ణబోధ నీమనస్సుకు సంశయ విపర్యయములు లేకుండా అత్తునటులకొరత యుంచక సాంతముగా బోధించితిని. యీ అచలపరిపూర్ణ బోధకు యీగ్రంధము ముఖ్యముగాన యీగ్రంధరాజమును యెల్లప్పుడు విడువక జదువుచు లేక వినుచు మరువులేకుండా కంఠోపాటముగా పాడుచు జననమరణములు తొలగుటకు యియ్యది ముఖ్యమైనదని నీ మనస్సున తలంచుచుండుట మంచిదని భావము॥ 202

కం. అని గురుడు బోధజేసిన - విని శిష్యుడు హర్షమంది - వేడుకతోడన్ - తనగురునితోటి విజ్ఞా - పన మీరీతిగ నొనర్చె - పటువాక్ప్రౌఢిన్ ॥ ౨౦౩

తా. మృదుమధుర వాక్యములతో శ్రీసద్గురుస్వాములు బోధించిన అచలపరిపూర్ణబోధను శిష్యుండువిని, సంతోషాంతరంగుడై భయ

భక్తులుగల్గి సద్గురుమూర్తినిం జూచి మధుర వాక్యములతో తనమనస్సునందుండెడి సంతోషభరితమగు అంశములను గురుమూర్తితో యిట్లు చెప్పుకొనదొడగెనని భావము ॥ 203

కం. నా కొరకు కష్టపడితిరి - మీకై మీరిటురువచ్చి - మిము బొగడుటకా - కాకోదరేశుడో పం - డా కార్యము నా తలంబె - యచల మనస్కా ॥ ౨౦౪

తా. చలనములేని మనస్సుగలిగిన మిమ్ములను నేను కోరకనే మీకు మీరు యిచ్చటకు విచ్చేసి, నాకు జననమరణ ప్రవాహము తొలగుటకై ఈ అచల పరిపూర్ణబోధను బోధించి చాలా కష్టపడితిరి. మిమ్ము నేను స్తుతింపవలయుననిగాని, నా వలన మీరు లంచము పొంద వలయుననిగాని, లేక ఘనత పొందవలయుననిగాని యే యపేక్షయు లేని మహాత్ములగు మిమ్ములను స్తుతించుట యనే కార్యమునకు బ్రహ్మాదుల కైన యలవిగాదనగా నేను మీయొక్క గొప్పతనమును స్తుతించుట కెంతటివాడనని భావము ॥ 204

కం. తల్లివి దండ్రివి దాతవు - వల్లభుడవు బాంధవుడవు - వసుధీశుడవున్ - తెల్లమిగ దేవుడవు నీ - వల్లగదా యిట్టిబోధ - వర్తన వినుటల్ ॥ ౨౦౫

తా. స్వామీ! మాయాపిండమగు తనువును వినిపించి మంత్రపిండముగా జేసిన నాతల్లియు తండ్రియు మీరే-దాతవ్రాసిన వ్రాతను తుడచివేసిన బ్రహ్మయు, నా జన్మసార్థకమునకై సత్ప్రవర్తన ఆజ్ఞాపించి నడిపించే ప్రభువుయు, నా క్షేమముకోరి నా మంచిచెడ్డలను విచారించెడి బంధువుయు, నాకు భయభక్తివిశ్వాసము లుండుటకై మహారాజుయు రూపనామ క్రియరహితమైన నిజమగు దేవుడవు మీరలే అయి వున్నారు. గాన మీ కృపా కటాక్షముచేత జననమరణ రహితమగు

కం. ప్రకటమగు బట్టబయలున - సకలముతో లేక వచ్చి - చను దరఘడియన్ - వాకకోటి మాట్లానేరా - నొకవేళ్ళను లేనటంచు - నూహాబోఢమినన్ ॥ ౨౧౪

తా. స్వామీ! స్పష్టముగా కనబడుచున్న ఈ వృత్త బట్టబయలులో సర్వప్రపంచము ఎరుకవలన మూలములేకనే వచ్చి అనగా తనకుతానే పుట్టి ఒక అరఘడియకాలంలో మరల నశించిపోవుచుండును. అది ఎట్లాయంటె - కోటిమాటలు ఒక్క అరఘడియకాలంలో అనేకములుగా వచ్చి తమకుతాము ఎలాగునపోవునో ఆలాగే, ఈ వచ్చిపొయ్యే తరుణములో అనగా పుట్టి చనిపొయ్యేమధ్య ఒక సమయములో సద్గురువుల సేవించి ఆయన కరుణచేత నేను లేనివాడననే వూహా తనలో తోచితే ఆలాగు దృఢపడితె మరల నేననే ఈ యెరుక పుట్టనేరదని భావము ॥ 214

కం. లేని నే నెరుగకుండిన - మేనుండదు నేను నిల్వ - మేనుండక యీ - మేనగునాజోలోల్లని - దానిని గుర్తెరిగి నేను - తలగితె చాలున్ ॥ ౨౧౫

తా. స్వామీ! మూలములేనటువంటి నేను ఈ వృత్త బట్టబయలును యెరిగినా యెరుగకపోయినా ఈ మేను వుండనేరదు, ఈ మేను నేనులు వచ్చినవో హెచ్చినవో చచ్చినవో యెరుగని ఈ వృత్త బట్టబయలును నేను గుర్తెరిగి గుర్తెరిగిన యెరుకయనెడి నేను లేకపోతే చాలునని భావము ॥ 215

కం. మనము మన పెద్దలందరు - చనుదేరక మునుపు వారు - చనినన్ గల యీ ఘనమునుగని మనమేగిన - చనదుగదా మనను బోలి - సారవిచారా ॥ ౨౧౬

తా. స్వామీ! యదార్థ విచారణ జేసిన గురుదేవా! మనము మనపెద్దలగు తండ్రి తాత ముత్తవతాత మొదలగువారలు పుట్టకముందు వారలున్నప్పుడు, వారలు చనిపోయిన తర్వాత, గొప్పదియైన ఏ అచల పరిపూర్ణబ్రహ్మము అన్ని కాలములయందు శాశ్వితమై యున్నదో, యా వృత్తి బట్టబయలును చూచి మనము పోయినను మనవలె ఈ వృత్తి బట్టబయలు పోనేరదని భావము॥ 216

కం. మేనుమజ్జనని నేనే - మేనికి జనకుడను నేను - మేను లొకటియై - దేనందు సంచరింతుమొ - దానిని పరిపూర్ణమనుచు - దలచెదనయ్యా॥ ౨౧౭

తా. స్వామీ! ఈ స్థూల శరీరమె నాకు తల్లియైయున్నది, ఈ స్థూల శరీరమునకు నేను తండ్రినై యుంటిని, ఈలాగు నేను మేనులు రెండును వొక్కటేయైయున్నవి. నేను మేనులగు మేము యే వృత్తి బట్టబయలులో తిరుగుచుంటిమో దానినే అచల పరిపూర్ణ బ్రహ్మమని అదియే శాశ్వితమని మేము అశాశ్వితమని తలంచెదనని భావము॥ 217

కం. మేనున్నది నేలేకను - నేనెరుగను మేనులేక - నేనిల్వను యీ - మేనుకు నేనుకుమూలము - గానను మముమేమె సృజన - గావింతుమయా॥ ౨౧౮

తా. స్వామీ! ఈమేను నేను లేకుండా వుంటుందని నేను ఎరుంగను, మేనులేకుండా నేను వుండుటకు తావు యింకొకటిలేదు. యీ మేనుకు నేనుకు మూలము యింకొకటి వుండగా చూడలేదు. నేనుకు మూలము మేను. మేనుకు మూలము నేను. యిట్లు మాకు మేమే పుట్టించుకుందుము, గాని మమ్ములను పుట్టించువారు యింకొకరు వేరే లేరని భావము॥ 218

కం. నేనిల్ల జగము లేకను - శేనేగిన జగములేదు - నిజమిా జగమున్ - నేనును లేనప్పుడు గల - దానిని పరిపూర్ణమనుచు - దల పోయఁదగున్॥ ౨౧౯

తా. స్వామీ! ఈ ప్రపంచము (లేక మేను) లేకపోతే నేను వుండదు నేను వుండకపోతే ఈ ప్రపంచము వుండదు. నిజముగ మేననే ప్రపంచము నేను అనే యెరుక యివి రెండును లేనప్పుడు - అనగా పోయినప్పుడు యేమి వృత్తి బట్టబయలు వున్నదో అద్దానిని అచలపరిపూర్ణ బ్రహ్మముగా తలంతునని భావము॥ 219

కం. లేనినే మాయమైనను - మానవులది మరపుమూర్ఛ - మరణంబును గా - ధ్యా నిద్రయు నిర్నిద్రన - నేనవి విని మ్మృష్మని నమ్మ - నేర్తున వాటిన్॥ ౨౨౦

తా. స్వామీ! ఏ కాలమునయందు లేనటునంటిన్ని, మూలము లేనటువంటిన్ని, నేను లేకుండా మాయమైపోతే ఈ జనులు దానిని మరపుయనియు, మూర్ఛయనియు, చావుయనియు, తురీయమనియు, సమాధియనియు పోల్చి చెప్పుచుందురు. అట్టిమాటలు నేను నమ్మకుందును. ఏమనగా నేనే మాయమైనప్పుడు నాతో వచ్చిన ఈ అవస్థ లన్నియు మాయమని యదార్థములు కావని తెలిసి వీటిని నమ్మకుందు నని భావము॥ 220

కం. విను భాష్యములను త్రాళ్ళను - జనములు ననుగట్టి యుంచ - జనకనిలుతునా - చనుడొత్తు నాకు నేనై - కనుకనె నను నమ్మరెపుడు - ఘనులగువారల్॥ ౨౨౧

తా. స్వామీ! ఈ మనుజులు నన్ను ఈ దేహముయందు శాశ్వితముగా యుంచవలయునని భ్రాంతితో ఏనో గ్రంధములయందు జలధాతు వస్త్రధాతు కాష్టధాతు మొదలైన అనేక ధాతుకర్మలను,

లంబికాది యోగములును సవికల్ప నిర్వికల్ప సమాధులును రసకల్పక గంధకల్పక మూలికాది కాయకల్పములును అణిమాదిసిద్ధియోగము లును యిట్లు అనేక విధములగు యోగములు వ్రాసియుంచి నన్ను ఈ స్థూలదేహము యుండుంచుటకై ప్రయత్నించి చేయుచుందురు. నేను లేనిదాననుగాన నేను పోకుండా యుండనేరను. నిజమెరింగిన మహాత్ము లగు అచలపరిపూర్ణభావజ్ఞులు నన్ను నమ్మక విడచిపెట్టిరనిభావము॥221

కం. నానా భావలచేతను - నానావిధ శాస్త్రతతుల - నను నమ్మటకై - నేనే రచించిపెట్టితి - నానా దేశములయందు - నరరూప మునన్ ॥ ౨౨౨

తా. స్వామీ ! అనేకములగు భావలయందు అనేకవిధములగు శాస్త్రపురాణములయందు వేదములయందు, వుపనిషత్తులయందు గీతల యందు నేనే బ్రహ్మమని నన్ను యీ ప్రజలు నమ్ముటకై అనేక దేశ్య ములయందు మనుష్యాకారముతో నేనే ఆయా గ్రంథములు వ్రాసి ఈ మనుష్యులకు యిచ్చి భ్రమింపజేయుచుంటినని భావము॥ 222

కం. ఒకచోట నవ్వుదును వే-రొకచోటను మిడుకుచుందు - నొకచోటను నే - ప్రకటమగుదు లేకుందును - నొకచోటను యిట్టి చేష్ట-లుండునునాకున్ ॥ ౨౨౩

తా. స్వామీ! నేనని పలుకుచుండెడి యీయెరుక ఒక మేనులో యుండి నవ్వుచుండును. యింకొక మేనులోయుండి దుఃఖించుచుండును, యింకొక మేనుతో పుట్టుచుండును, యింకొక మేనుతో చచ్చును, యిన్నిలక్షణములు ఒక మేనియందే జరుగుచుండును. ఒక్క-యెరుకయే యిన్నివిధములుగా కనుబడుచున్నదని భావము॥ 223

కం. కావేటికాలువలవలె - నావల్లనె కల్పనాను - నానా విద్యల్ - యీవిశ్వమందు విశ్వము-నా వెంటనె వచ్చుపోవు - నా వలెనుసుమీ ॥ ౨౨౪

తా. స్వామీ ! కావేరీ మహానదికియుండెడి పిల్లకాలువలవలె నేననెడి యీ గుర్తెరిగే శరీరమగు యెరుకవల్లను సర్వచరాచర ప్రపంచము, ఎనుబదినాల్గులక్షల జీవరాసులు, ప్రపంచమునకు ఆధారమగు అరువదినాలుగు విద్యలు సర్వభాషలు. అకారాదిక్షకారాంత వర్ణములు (లేకమాత్రుకలు) సర్వమతములు సర్వకులములు సమస్తము పుట్టబడినవి, నేనని యెరుక పోవగా నాతోనే సర్వప్రపంచము అరువదినాలుగు విద్యలు సమస్తభాషలు వర్ణములు, మతములు, కులములు సమస్తము నావలె సూన్యమైపోవును యని భావము॥ 224

కం. నేనాడుదానవాదును - నేనే మగవాడనౌదు - నేనే నన్నున్ - నేనీవటంచు గూడుదు - నేనే నను జెరుపమనుప - నీగుదు సుమీ॥ ౨౨౫

తా. స్వామీ ! నేనే ఆడదానిగా పుట్టుచున్నాను. నేనే మగవాడుగా పుట్టుచున్నాను, నాకు నేనే యిట్లు స్త్రీ పురుషాది రూపములు యెత్తుచుందును, నేను మగవాడను నీవు ఆడదానవుయని భేదము కల్పించుకొని భ్రాంతిచే సంభోగించెదను, నన్ను నేనే బాగు చేసుకొనుచు నన్ను నేనే పాడుచేసుకొనుచు యీ కనబడెడి స్త్రీ పురుషస్వరూపము నాస్వరూపమని తెలియక నిజమును మరచి నాకంటె లేరని భ్రమించి మోహింపుచుందునని భావము॥ 225

కం. నేనుల మేనులకుప్పను - నేను బయల్ నన్నెరుగదు - నేచనుదొత్తున్ - మేనై నిమిషములోనిది - మానుగ నా వృత్తినేనే - మాయనుసుమీ ! ౨౨౬

తా. స్వామీ ! ఎనుబదినాల్గులక్షల స్థూలశరీరముల యందున్న నేనులును (అనగా జీవులును) యీ నేనులయందుండెడి మేనులును కల నేననెడి ఒక్క యెరుకయే అయివున్నది. అట్టియెరుకయగు నేను యీ వృత్తబట్టబయలును యెరుగదు. యీ వృత్తబట్టబయలగు అచలపరి

పూర్ణము నన్ను నెరుగదు. నేను తన్నూపోతూ యుంటాను. యీ మేనులు కూడా నావలె ఒక్కనిముషములోకనబడి మరొక్కనిముష ములో వెంటనేకనబడక మటుమాయగా పోవును. నాయొక్క సృష్టియు నేనును లేనివిధోగనుక యిటులమాయమై పోవుచుండుట నాకుసహాజ మని భావము॥ 226

కం. నేనుగాకొకటి శుద్ధ - జ్ఞానముగలదనుచుబల్కు - జ్ఞానుల
మాటల్ - పూసివినదగదు శుద్ధ - జ్ఞానంబననేనే నేను - లేనిది
యానే॥ ౨౨౭

తా. స్వామీ ! నేననెడి ఈ యెరుక కాకుండా దీనికంటె అతీత మైన యెరుక ఎచ్చటనోయుండి సృష్టిచేయుచున్నదని పలికెడి జ్ఞానుల యొక్క మాటలువిని నిజమని నమ్మవద్దు. శుద్ధజ్ఞానమనగా నేననేటి ఎరుకయే శుద్ధయెరుక, ఈ శుద్ధయెరుకవలన మలినయెరుకైన పంచ మహాభూతములు కల్పింపబడెను. ఈమలినయెరుక శుద్ధయెరుక కలసి మిశ్రమ యెరుకయై ద్వయదోషములతో కూడిన ముప్పదిమూడుకోట్ల దేవతలు ఎనుబదినాల్గులక్షల జీవరాసులు స్థావరములు, జంగమము లతో కూడిన ప్రపంచమాయెను, ఈ నేననేటిదానికంటె గొప్పదైన ఎరుక సృష్టిచేయుటకు యింకొకటి ఎచ్చటనులేదని భావము॥ 227

కం. నేమాత్రముండుననియెను - నా మాయలకూతలన్ని -
యరసినను త్రిస్ - యేమాయమరణమప్పుడు - యేమాయను గురుని
మాట - నేమాయెనయా॥ ౨౨౮

తా. స్వామీ ! ఈ మేనులు పోవునుగాని నేను అనెడి ఆత్మ (ఎరుక) వుంటుందని శాశ్వితమని నేను పలికిన పలుకులన్నియు అబద్ధ ములు, ఏమనగా నాకు సుషుప్తి కలిగినప్పుడు జననమరణము కలిగి నప్పుడు నేను అను ఆత్మ లేకుండాపోయెనుగదా నేను శాశ్వితమని

పలికిన మాటలన్నియు అబద్ధములు. గావున (శ్రీ) అచల గురుమూర్తి బోధించిన బోధరీత్యా ఆయనమాటయే నిజమాయెనని భావము॥ 228

కం. నేనన్న నహమహంబన-నేనుసుమీ యహమటంచు - నే నెపుడంటె - నేనపుడు పుట్టుటది జన - నేను గతించుటమటంచు - నీ వెరుగయ్యా॥ ౨౨౯

తా. స్వామీ! నేననియనినను, అహంకారమనియన్నను నేన నెడి ఒక్క ఎరుకయేగాని వేరుకాదు. నేనని పల్కితే అనగా అహం కారము గల్గితే నేను అను ఎరుక పుట్టుటయగును. అట్టి అహంకారము పోవుతే నేను అను యెరుక నశించుటయగును. గాన ఈ రహస్యము తెలియుడని భావము॥ 229

కం. నేనన నాల్గవదేహము-మేనన నాలోని మూడు, మేనులు సుమ్మీ - నేను మేననన దొక్కతే - కానిది తనమూలమరయ-గన రాదుసుమీ॥ ౨౩౦

తా. స్వామీ! నేనని యేది పలుకుచున్నదో అదియె మహా కారణ శరీరమగు నాల్గవశరీరము. మేననగా నేను అనుదానికి ఆవరణగా స్థూల సూక్ష్మకారణ శరీరములనెడి మూడు దేహములుగా యున్నది. యిట్టి నేను మేనులు కానటువంటిది శాశ్వితమైనది, రాకపోకలులేనిది ఈ పుత్తు బట్టబయలగు అచలపరిపూర్ణము. దీనియందు లేనటువంటి ఈ నేను మేనులు తాము ఎచ్చటనుండి వచ్చితిమోయని తమ మూల మును తాము విచారించగా లేనివేయగుచున్నవని భావము॥ 230

కం. అంగము లింగము గలసితె - లింగశరీరంబటంచు - లెక్కకువచ్చెన్ - లింగం భంగమునెఱపిన - లింగముశక్యానునేనే - లింగం బనినన్॥ ౨౩౧

తా. స్వామీ! మేను యనెడి అంగమును, లింగమనెడి నేనును కలసియుండుటే లింగశరీరమని చెప్పబడును. నే ననెడి లింగశరీరము అనగా మహాకారణశరీరము పోయినయడల అంగంబనెడి ఈ మేను లేకుండాపోవునని భావము॥ 231

కం. లింగమువిక్షేపంబన - నంగంబావరణమనిన - నగు నీ
రెండే - లింగశరీరము దీనికి - భంగము తనమూలమరయ - బడి
నప్పుడగున్ ॥ ౨౩౨

తా. స్వామీ! లింగశరీరమనగా విక్షేపశక్తియగును. ఇదియే నేను అను మహాకారణశరీరము. అంగము అనగా ఆవరణశక్తియంటే, స్థూల సూక్ష్మ కారణశరీరములగు మూడింటితో కలసిన ఈ మేను యగును. లింగము అంగము కలసి యీ రెండున్నూ ఒక లింగశరీరమనబడు యెరుకయే, ఈ లింగము తనయొక్క మూలము యేదియో యని విచారించగా తానే భంగమై లేకుండా మరల రాకుండాపోవునని భావము ॥ 232

కం. ఎరుకన మరుపనరానిది - పరిపూర్ణంబీశ్వరుడనబడు
నెరుకెరుకన్ - మరచిన జీవుండనబడు - నెరుకచలము నెరుగనరుగు -
నెరుక మరపునన్ ॥ ౨౩౩

తా. స్వామీ! సర్వమును ఎరుగుటయనే ఎరుకయు, సర్వమును మరచుటయనే మరపును, ఈ రెండును లేనిది కేవల అచల పరిపూర్ణంబనే ఈశ్వరుడు, ఎరుక మరపులుగల్గిన ఎరుకయే జీవుండు. అట్టి ఎరుక మరపులుగల్గిన ఎరుక (జీవుడు) అచల పరిపూర్ణమగు వృత్తి బట్టబయలును ఎప్పుడు గుర్తెరుగునో అప్పుడే ఎరుక మరపులు రెండును గల్గిన ఎరుకయనే జీవుండు మరల పుట్టకుండాపోవునని భావము॥ 233

కం. ఎరుకన సత్వగుణంబని - మరుపన తామసమటంచు - మరి యీ రెండున్ - సరియైన రాజసంబని - నరులెన్నిరి మూటివిడువ - నర్హముసుమీస్వామి ॥ ౨౩౪

తా. స్వామీ! సత్వగుణమే ఎరుకయనియు, తామసగుణమే మరుపుయనియు, యీ సత్వగుణము తామసగుణము కలసి రాజసగుణమనియు యీ జనులు చెప్పిరి. యిట్టి సత్వరజస్తమో గుణంబులగు త్రిగుణములు విడచుట గురుపుత్రులకు మంచిదని భావము ॥ 234

కం. నన్నెరుగనట్టి బయటన్ యెన్నడు లేనట్టి నేను యీ - విశ్వమునై - వున్నట్టులుండి నేలేం - దున్నదిగని నేనుపోతే - దుందణగుసుమీ ॥ ౨౩౫

తా. స్వామీ! నేనని పలుకుచుండెడి యీ యెరుక పుట్టినదో పెరిగినదో చచ్చినదో తెలియని ఈ వృత్తి బట్టబయలులో ఏ కాలమందును లేనటువంటి నేను ప్రపంచాకారముగా లేక మేనుగా వున్నట్టు కనబడుచున్న కాలములో, నేను లేనటువంటి అచల పరిపూర్ణమును సద్గురుమూర్తిద్వారా గుర్తించి, గుర్తించిన నేను లేకుండాపోతే ద్వయదోషమగు సర్వమును జననమరణములును తక్షణమే పోవునని భావము ॥

కం. ఈ యచలమొకటి బ్రహ్మని - మాయామయమైన విశ్వ - మంతయు నేనన్ - చానమెరుంగక నను నరు - లీయడ బ్రహ్మంబటంచు - లెక్కడనగుదున్ ॥ ౨౩౬

తా. స్వామీ! ఈ వృత్తి బట్టబయలగు అచల పరిపూర్ణమే బ్రహ్మమనియు మాయయై లేనిదే యున్నటుల కనబడుచున్న శరీర ప్రపంచమంతయు నేనే యనియు, ఈ యదార్థ విచారణయగు రహస్యంబు గురునిచే తెలియక, నేనే బ్రహ్మమని అహంబ్రహ్మమస్మాది నాల్గు మహా వాక్యములే సిద్ధాంతమని పలికెడి జనులయొక్క మాటలు విని నేనే నవ్వుకుందునని భావము ॥ 236

కం. భూమను భద్రాచలమని-రాములనుచు లేనినన్న - రక్షణ మునసే - మీమాటనెరి గుళిక్యని - నామాటను మరచి యునికి - నయమనితోచెన్ ॥ ౨౩౭

తా. స్వామీ! భూమను - ఈ వృత్తబట్టబయలును, భద్ర - శాశ్వితమై, అచల - చలనములేని అనగా చావుపుట్టుకలు లేనటువంటిదని, నేననెడి యెరుకయె ఆత్మారాములని శ్రీ సద్గురు వాక్యంబుచే అరక్షణములో నేను లేనివాడనని నాయదార్థము నేను తెలుసుకొని, నావలెనె మిమ్ములను మీమాటలను లేనివారని తెలసి, నేను లేనివాడనని నన్ను నేను మరచి అచలపరిపూర్ణస్థితిలో నుండుట యేదియో అదియే మంచిదై తోచెనని భావము॥ 237

కం. నాగురుడు నాకుదెల్పిన - యీ గురుబోధంత మీకు - యిప్పుడు నేనున్ - బాగుగ వినజెప్పితిసుమీ - యోగురువర్యయని శిష్యు - డూరకయున్నన్॥ ౨౩౮

తా. స్వామీ ! శ్రీ సద్గురుస్వాములు నాకుబోధించిన ఈ అచల పరిపూర్ణ బోధంతయు నామనస్సు కందినవాటివి మీకు ఈ సమయములో విన్నవించుకొంటినయ్యా గురుప్రభూ యని శిష్యుండు మాటలాడక అనగా సంకల్పాదికములు యేమియు లేకయుండెనని భావము॥ 238

కం. విని శిష్యుని వచనోక్తులు - మనమున హర్షించి గురుడు - మస్తకమున చై - య్యునిచి తొడమీద జేర్చుక - తనశిష్యుని మేను నిమిరి - తానిట్లనియెన్ ॥ ౨౩౯

తా. ఇట్లు వృత్తముండగు శిష్యరత్నము బోధించిన అచల పరిపూర్ణ బోధకు శ్రీ సద్గురుస్వాములు మదిలో సంతోషముప్పొంగగా, శిష్యుని శిరోభాగంబగు సహస్రారమున తన దక్షిణహస్తంబు నునిచి,

పరిపూర్ణ సిద్ధి గలిగి యెుకక నిరసనయగునటుల దీవించి తన వామాంక మున కూర్చుండ నియమించి, శిష్యునియందు కరుణగలవారై మేను నిముకుచు మరి యేమేమి యూ చెప్పవోణగెనని భావము॥ 239

కం. నీవంటి గట్టివాడిక - భూవలయమునందు ముందు - బుట్టడు వెనుకన్ - నేవినలే దున్నాడం - చీ వేళ్ళకునిన్నె చూస్తి - నిటభళి శిష్యా ॥ ౨౪౦

తా. శిష్యా! ఈ అచల పరిపూర్ణబోధను నీవలె విచారించి బోధింపగల్గిన శిష్యుడు యీ ప్రపంచములో ముందు పుట్టడు, వెనుక పుట్టినవాడున్నాడని నేను వినలేదు, యిప్పుడు నీవలె యీ అచల పరి పూర్ణ బోధను బోధింపగల్గినవాడు దృఢము గల్గినవాడు కలడని విని యుండలేదు గాన యీ రోజున యిచ్చట నిన్నే జూచితినని భావము॥ 240

కం. చందురుని చీమ ముద్దా - డిందని నట్లిపుడు నీవు - యీ సద్బోధన్ - జెందితివి నీకు సరి జగ - మందెవ్వరు లేరు నిన్ను - మది మెచ్చితిరా ॥ ౨౪౧

తా. శిష్యా! స్వచ్ఛమై శాంతమై కనులపండువై యెుప్పు పున్నమనాటి చంద్రుని చీమ ముద్దుబెట్టుకొనిన యెంత గొప్పయగు ఆనందమగునో, అటువలె నీవిప్పుడు చంద్రునివంటి యీ అచలపరిపూర్ణ బోధకు తగినవాడవై తెలుసుకొంటివి, నీతో సమానులగు వారలు యీ ప్రపంచమున నెవ్వరును లేరని నామనస్సునందు నిన్ను మెచ్చితి నని భావము॥ 241

కం. అని మెచ్చి యేమి యిచ్చెద-నని గురుదక్షణ నటంచు - నతడడిగిన - నన్ననిపల్కె - శిష్యరత్నము - విని యిదియిక ముట్టబోక విహరించుమనన్॥ ౨౪౨

తా. (శ్రీ) సద్గురుమూర్తి యిట్లు జెప్పుచు శిష్యునింజూచి శిష్య రత్నమా, నీవు బోధించిన ఆచల పరిపూర్ణ బోధాలక్షణంబులు మాకు ఆనందమైనది, మాకు గురుదక్షణ యేమి యిచ్చెదవని పలికిన శిష్యుడు నేనే గురుదక్షణగా మీకు ధారయైతినని యెను. అట్లు పల్కిన శిష్యుని (శ్రీ) సద్గురుస్వామి జూచి నేననెడి యెరుకను నాకు యిప్పుడు ధార బోసితివిగాన, యే కార్యములయందైనను నేననెడి కర్తృత్వము నీకు మరల పూనక అనగా నాకు ధారబోసిన నేననే అహంకారమగు యెరుకను మరల పూనక యీ ప్రపంచమునందు దిరుగుచుండుమని భావము ॥ 242

కం. విని శిష్యుడు గురుమూర్తిని - గనుగొని చిత్తరువు ప్రతి మగా నిలుచున్నన్ - తన శిష్యుని హస్తములన్ - గొని దగ్గర దీసు కొని కొడుకా యనుచున్ ॥ ౨౪౩

తా. ఇట్లు (శ్రీ) సద్గురుస్వాములకు నేను యెరుక ధారబోసిన శిష్యుడు నేననే యెరుక లేకపోవుటచే, మేను చలించుటకు అవకాశము లేదు గనుక, చిత్రకారునిచే చిత్రింపబడిన బొమ్మవలె నిలుచుండగా అట్టి శిష్యుని సద్గురుమూర్తి జూచి దయగల్గినవారై కుమారా యని బిలిచి చేతులతో దగ్గర దీసుకొని కూర్చుండ నియమించి మరల యేమియో చెప్పదొణగెనని భావము ॥ 243

కం. చెప్పదొణంగెను మునుతా - జెప్పని ముచ్చట్లు కొన్ని సేమముకోరకై - యొప్పులకుప్పా వో మా - యప్పాయని దువ్వు కొనుచు - నతి దయతోడన్ ॥ ౨౪౪

తా. (శ్రీ) సద్గురుస్వాములు శిష్యునియొక్క క్షేమము కోరిన వారై యిదివరలో బోధించనటువంటి సంగతులు మరికొన్ని శిష్యునకు చెప్పదలంచి సుగుణములరాసి యనందగు ఓ శిష్యతిలకమా యని

మేను నిమురుచు దయతో యేమేమియో చెప్పబోవు చున్నారని భావము॥ 244

కం. ఒప్పకుమీ పరబోధల - తప్పకు మీబోధ నెపుడు - దలచుట మదిలో - రొప్పకుమీ సచ్ఛిష్యుల - చెప్పకుమీ - దీన్ని దుష్ట - చెనటుల కెపుడున్ ॥ ౨౪౫

తా. శిష్యా! ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతవాదులు క్రైస్తవమును బౌద్ధమహమ్మదీయ మొదలుగాగల మతస్తుల బోధలను ఏవేళనైనా వినబోకుము, నేను నీకు బోధించిన యీ అచల పరిపూర్ణ బోధను నీమనస్సులో యెల్లప్పుడు విడువక తలంచుచుండుము. మంచి బుద్ధిమంతులైన శిష్యులను ఏకాలమందైనను దూషించి నిందించకుము. దుష్టబుద్ధిగల్గిన జనులకు యీ అచల పరిపూర్ణబోధ యెన్ని విధములకైన వినిపింప వలదని భావము॥ 245

కం. కూడకుమీ దుర్జనులను - వీడకుమీ సాధుమనుజ - వితతి స్నేహం-బోడకుమీ గురుసేవకు - పాడకుమీ పరులనింద, పాటల రీతిన్ ॥ ౨౪౬

తా. శిష్యా! దుష్టబుద్ధులతో మెలగెడి జనులయొక్క స్నేహము కలలోనైనా చేయకుము. మంచిబుద్ధులతో మెలగెడివారల స్నేహము ఎప్పటికిని విడచిపెట్టబోకుము. శ్రీ సద్గురుస్వాములవారి సేవచేయుటకు యెప్పుడూ వెనుకదీయకుము. యితర జనులు నీవంటివారు కారని నీవు గొప్పవాడవని తలంచి వారలను నిందించి దూషించవలదని భావము॥ 246

కం. మీరకుమీ గురువాజ్ఞను - చేరకుమీ దుష్టులంత - చేరినచోటన్ - దూరకు మీబోధనువిని - యూరకుమీ సాధుజనుల యందునతప్పుల్ ॥ ౨౪౭

తా. శిష్యా ! శ్రీ సద్గురుస్వాములవారి యాజ్ఞకు ఎప్పుడు ఎదురుచెప్పినటువబోకుము దుష్టబుద్ధిగల జనులుయుండెడి చోటున నీవు చేరబోకుము. నీవు ఈ పరిపూర్ణబోధను విని ఈబోధ మంచిది. కాదని నిందించకుము. శ్రీ అచల గురుస్వాముల నెవ్వరినిజూచియైనా వారలయందుండెడి నేరములను వెతుకుచు వారలను నిందించకుమని భావము॥ 247

కం. జనులవలె జరుపుపనులను - ననునీను జనవితతులిట్లు - నడువకుమెపుడున్ - నినునీవుబొగడుకోకుము - నినుబోలరటంచు జనుల - నిందించకుమీ ॥ ౨౪౮

తా. శిష్యా! ఈ ప్రపంచమందుండెడి జనులు అందరు యేయే కార్యములు ఏలాగు చేయుచుందురో అటువలె నీవును చేయుము, నన్నును నిన్నును ఈ లోకులగు జనులు దూషించునటుల దుష్ప్రవర్తనతో నడువబోకుము. నిన్ను నీవు గొప్పవాడనని పొగడుకొనకుము. యితరజనంబులు నీవంటి గొప్పవారు కారని అనగా విచారణపరులు గారని గర్వించి వారల నిందించవలదని భావము॥ 248

కం. శ్రద్ధబోదందునిలి ప - శ్రద్ధను నీనేర్పుచేత - ఝాడించితివా - బద్ధత్వమంతబాయును - బుద్ధికిసరిపడితె దీన్ని - బూనగదోయీ ॥ ౨౪౯

తా. శిష్యా ! నీవు ఈ అచల పరిపూర్ణబోధయందె శ్రద్ధ వహించి, అశ్రద్ధయను బద్ధకము, నిద్దురలు నీదగ్గర జేరనీయకుండా, నీ నేర్పుచేత విడచిపెట్టితివేని, యీ ప్రాపంచక సంబంధమగు బంధములు మనస్సుయందుండెడి బంధములు అన్నియు నిన్ను విడచిపోవును నీకు తను మనోసంబంధమగు బంధములన్నియు విడచుటకు వుద్దేశ్యము నీ బుద్ధియందున్న యెడల ఈ అచల పరిపూర్ణబోధను ఎల్లప్పుడు విచారించుచుండుమని భావము ॥ 249

కం. సంశయమె జన్మహేతువు - సంశయమె గురునిమాట - చవిగొననియదీ - సంశయమె కీడువాదవును - సంశయమెడ బాస్తి లేని - చాలునువత్సా ॥ ౨౫౦

తా. శిష్యా! ఈ జన్మలో యీ యచల పరిపూర్ణబోధ వలన నాకు జన్మరాహిత్యమగునో కాదో యనెడి సందేహమున్నా, యితరములగు సందేహములును నీకు నేమి కలిగినా, యదియే జన్మము కలుగుటకు కారణమైయున్నది. అట్టి సందేహములచే శ్రీ అచల గురుమూర్తిబోధ వినుటకు యిష్టములేకుండా జేయును. సర్వకార్యములకు సందేహమున్నయడల ముప్పు తప్పకుండా కలుగజేయును. అట్టి సంశయములు నీవు విడచితివేని నీకు యెందును లోపమురాదని భావము॥ 250

కం. నరులంత మెచ్చనడువను - హరిహర విధిశతమఖాము - రాదులకైనన్ -తరముగాదనగ మనకిక - తరమానవశమెచూడు - ధాత్రీశపుత్రా॥ ౨౫౧

తా. శిష్యా! ఈ ప్రపంచములో జనులు యావన్మంది మెచ్చుకొనునటుల తిరుగుటకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులును సూర్యచంద్రయింద్రాది దేవతులకైనను వశముగాదని పలుకగా, మనము యీ ప్రపంచమందుండెడి జనులకందరకు మంచివారముగా మెచ్చుకొను నటుల నడచుటవశ మెట్లగును కానేరదు, గాన నిందాస్తుతులు విడచి సహించి యుండవలయునని భావము ॥ 251

కం. అందరిని చణకుచుందురు - కొందరు దుర్మార్గవృత్తి- కుటిల జనంబుల్ - యెందరి నొగిచ్చికరుచుచు - మందలవలె కోతులుండు - మాడిక్కనిద్రా॥ ౨౫౨

తా. శిష్యా! ఈ ప్రపంచములో దుర్మార్గవృత్తులు గల్గిన దుష్ట మానవులు ఎవ్వరిని జూచినను ఓర్వలేక సజ్జనులయందు యేమియో నేరములు కల్పించి నిందించుచు దూషించుచుందురు. అది యెటువలె నంటే, జనులు పోయ్యేడి మార్గములలో కోతులు గుంపులుగా గూడి వారి మార్గముల వారు పోవుచు వచ్చుచుండెడి బాటసారుల నందరిని ఎదిరించి పండ్లికలించి పైబడి కరచుచుండెడి విధముగా తెలియుమని భావము ॥ 252

కం. ఈ చెప్పిన గురుబోధను - తా చెవినిడి బయలుగాంచి - తన లేమినిజం - బై చనియె శిష్యుడప్పుడు - లేచెను గరుడవలమాట - లేదా మీాదన్ ॥ ౨౫౩

తా. ఈ విధముగా అచల గురుమూర్తి బోధించిన అచల పరిపూర్ణబోధ యందుండెడి ధర్మములు మర్మములు శిష్యుడు శ్రవణానందముగా విని, యీ వృత్తి బట్టబయలగు అచలపరిపూర్ణము గుర్తెరిగి గుర్తెరిగిన తాను అనగా నేను అను యెరుక లేనిదని దృఢభావముతో శిష్యుడు లేచి నిలువంబడినప్పుడు, (శ్రీ) అచల గురుస్వామి మాట్లాడక నిర్వాసనా మానముచే పరిపూర్ణ స్థితియందుండెనని భావము ॥ 253

కం. శరధికరి తురగసితకర - (౧౭౮౪) పరిమితమైనట్టి శాలివా-హనశకమం - దురచిస్తి మాఘపౌర్ణమి - వరకివి దుందుభియనేటి - వత్సరమపుడున్ ॥ ౨౫౪

తా. శాలివాహన శకమునందు 1784వ సంవత్సరమునకు సరియైన దుందుభినామ సంవత్సరమున మాఘశుద్ధ పౌర్ణమీ నాటికి ఈ గ్రంథము వ్రాయుట సమాప్తమయినదని పద్యముయొక్క భావార్థము.

శాలివాహన శకమునందు 1880వ సంవత్సరమునకు సరియైన విలంబినామ సంవత్సరమున వైశాఖశుద్ధ పౌర్ణమినాటికి ఈ గ్రంథము భావార్థములు వ్రాయుట పూర్తియైనదని భావము ॥ 254

కం. పదియిరువ్నై యైదులు యీ-సదమలకందములు వీట్ని - (౨౫౦) సదయామతులై - ముదమున మీరవినెదరని - మదిలోపల దలచిచేస్తి - మానవులారా॥ ౨౫౫

తా. ఓ జనులారా! రెండువందలఏబది కందపద్యములలో జనన మరణబాధ తొలగుటకై అచలపరిపూర్ణ బోధను యోగ్యులగు బుద్ధివంతులై మీరలు వినియెదరని నామనస్సునందు తలంచి, యీపద్యముల గ్రంథము మీకు అందజేసితినిగాన, నాకుగల్గిన సదుద్దేశ్యమువలె మీరలు సదుద్దేశ్యముతో ఈగ్రంథమును చదువుచుండుడని భావము॥ 255

కం. ఎవరీపద్యము లన్నియు - వివరింతురో వారికెల్ల - విద్యావిద్యల్ - దవిలి బాధింపవెన్నడు - భవనాశస్థితులులేక - బ్రబలుదు రెపుడున్॥ ౨౫౬

తా. ఏ జనుడు ఈకందపద్యములన్నియు విచారణచేయుచు పఠించుచుండునో అట్టివానికి అవిద్యాసంబంధమగు ప్రపంచ భ్రాంతులును, విద్యాసంబంధమగు దేహిదేహ (నేనుమేనుల) భ్రాంతులును వారిని బాధింపక పుట్టుచావులు గలుగక బ్రహ్మవిద్యాపరులై యుందురని భావము॥ 256

కం. అర్థము దెలియక గ్రంథము - వ్యర్థంబని నిందసేయు - వర్థులమాటల్ - వ్యర్థములని ఈగ్రంథం - బర్థము సద్గురునివలన - బాగుగవినుడీ॥ ౨౫౭

తా. ఓ జనులార ! ఈ గ్రంథము యొక్క భావార్థములను తెలుసుకొననేరక గ్రంథము పనికిరానిదని నిందించి కూయుచుండెడి పరమార్థమునకు వ్యర్థులై చెడెడిమానవుల మాటలను విశ్వసించక ఈ గ్రంథముయొక్క భావార్థములను శ్రీ అచలగురుస్వాములచే బాగుగా శ్రద్ధగలిగి వినుడని భావము॥ 257

కం. పాటసుమీ భక్తులకిది - బాటసుమీ బోధజెంద - భ్రమ
రాకుండన్ - కోటసుమీ కందములను - తోటసుమీ దీన్ని తొలగ -
దోషియకవినుడీ॥ ౨౫౮

తా. ఓ జనులారా ! అచలగురుభక్తులు యెల్లరును బాహాట
ముగా ఈ పద్యములు చదువవచ్చును. ఈ పరిపూర్ణబోధకు ఈ
గ్రంధము ఒక రాజబాటవలే చులకనగా యుండును. ఈ అచల పరి
పూర్ణబోధ యే భ్రమలను గలుగకుండా జేయును. ఈ గ్రింధము
నందుండెడి కందపద్యములు పరిపూర్ణబోధకు బందోబస్తుగా కోటవలె
దిట్టముగా యుండును. అనేక చెట్ల సమూహముతో యుండెడి తోటవలె
అనేక అంశములతో కూడినదిగావున ఈగ్రింధరాజమును విడచిపెట్టక
చక్కగా పరిశోధించి చదువుడని భావము॥ 258

కం. పరమహంసాశ్రమధరుని - పరిపూర్ణపుబోధ వాని - పనులు
సమమె - వార్నెరిగెరుగక నుతి నిందలు - గరపిన తత్ఫలము ప్రజలకగు-
నిజముఃజుమా॥ ౨౫౯

తా. ఓ జనులారా ! పరమహంసాశ్రమధారియైన అనగా జీవ
హంసభావము విడచి పరమహంసస్వరూపులైనవారియొక్కయు, అచల
పరిపూర్ణబోధ పొందినవారియొక్కయు ప్రివర్తనలు సమముగా యుం
డును, గాన వారలిద్దరినిచూచియు వారిస్థితి నెరుగక, ప్రజలు వారలను
జేసెడిస్తోత్రము చే సుకృతఫలితము పొందుదురు. వారిని నిందించి దూషిం
చుటచే దుష్కృతమగు ఫలితము పొందుదురయని భావము॥ 259

కం. ప్రితిదినము జదివి యెవరీ - ప్రితి నర్చన చేతురట్టి - ప్రజ
లకు బోధ - స్థితి కుదురగలదు గురుకృప - కతిపాత్రిలు వారివారి -
కష్టము గలదే॥

తా. ఓ జనులార! యేమనుజుడు ఈగ్రంధరాజమును నిత్యము
చదువుచు పూజింపుచుండునో, అట్టి మనుజునకు ఈ అచలపరిపూర్ణబోధ

యొక్క స్థితి యేదియో అది కుదురును. ఆ మనుజుడు (శ్రీ) అచల గురు స్వాములవారి కరుణకు పాత్రుడై బాహ్యాంతర సంసార సంబంధమగు ప్రతిబంధకములనంటక జననమరణరహితుడై యుండునని భావము॥ 260

కం. ఇతర మెఱుంగని సతమం - దతిమృషయై కానుపించునట్టి -
మనము యీ - కృతి గురుశిష్యులు వారలు - యితరేతర వాగ్విలాస
మిది మృషలుసుమీ ॥ ౨౬౧

తా. ఓ జనులారా! తనను తానెరుగక, తనకు అన్యమైన యెరుక ప్రపంచముల నెరుగక, రాకపోకలులేక శాశ్వితమైయున్న ఈ వృత్తి బట్టబయలునందు మూలము లేనటువంటిదై యున్నటుల కనబడుచున్న నీవున్నూ, నేనున్నూ, యీ గ్రంథకర్తలగు గురుశిష్యులు వాదోపవాదములు లేక ప్రశ్నోత్తరువులచే సంభాషించిన సంభాషణలును యివి అన్నియు లేనివేనని అనగా కలలో ముచ్చట్లు వంటివని భావము ॥ 261

ఇతి (శ్రీ) మద్భాగవత కృష్ణదేశిక విరచిత క్షరాక్షరోపాది ద్వయదోష
రహిత పరమతత్వ కందములకు (శ్రీ) భూమానంద
దువ్వాడ నారాయణమూర్తి విరచిత తాత్పర్య
భావార్థములు సమాప్తము.

శ్రీ మద్భాగవతకృష్ణ సద్గురు పరబ్రహ్మణేనమః

## శ్రీమత్ ఫీల్‌ఖానా శంకరరాయకృత దండకం.

శ్రీ సద్గుణోపేతులై శ్రీ చిదుల్లాసులై నిత్యనిర్లేపవ్య నిస్సంశయాత్యంత మహాత్మ్యమున్ జెంది శ్రీ భాగవత వంశదుగ్ధాబ్ధి చంద్రస్థితిన్ మించు శ్రీ సద్గురుస్వామి కృష్ణాఖ్య ధీరోత్తమా నా - మనోవిత్తమా చిత్తమానందమున్ బొందగా ప్రాణులం బ్రోచు దేవా - యనంత ప్రభావా సుమంత్రానుభావా పరశ్వాఖ్య రామాంఘ్రిసేవా - నివాసైక భావా — భువిన్నేను మీ వారిలో వాడనై మిమ్ము సేవింతు భావింతు ధ్యానింతు పూజింతు - పూర్వంబునం మీ రనేక ప్రజా సంఘమున్ జ్ఞానదీపంబు గల్పించి గుర్వంఘ్రి గొల్పించి లక్ష్యంబు దాల్పించి యుద్వృత్తమంబెల్ల నిర్మూలముం వేష్క-గావించి యుండంగ తద్వార్త లాలించి మీ పాద సాన్నిధ్యముం గాంచి హర్షించి యర్చించి యుండంగ - నానాజన శ్రేణి జూడంగ నన్నుండ జేరంగ నే మించి - యోరోరి ఫీల్‌ఖానయర్ పేరె లర్వంగ నాంపల్లిలో నుందువా - శంకరా భిక్ష్యరాయా భవన్మాన సాయాస మేమయ్య నీ యాత్మలో నున్న భావంబిక న్ దాచగా నేటికిన్ దెల్పరా - నిల్పరా చిత్తమున్ గూల్పరా యాశ్వరం స్వల్పరాగంబులం బూనగా నేటికం చాడగన్ భక్తి సాష్టాంగమున్ జేసి-యో స్వామి నిష్కా-మిచామీ కరాభాసమీచీన గాత్రా - పవిత్రా భవత్రాసజైత్రా - విచిత్రాతి చారిత్ర మీసత్కృపాదృష్టి సంలబ్ధికై వచ్చియున్నాను నన్నెట్లు రక్షించెదో - యీ దృగ్గోచరానేక రూపంబులెల్లన్ సుఖాద్యంత దుఃఖంబులన్ దేహసంబంధమున్ జీవసంబంధమున్ నిత్యమందున్ నిజంబంచు నే నమ్మి యున్నాను నే నెవ్వడో - యా దృగ్గోచ రవ్యక్తవస్తువ్రజం బెప్పుడున్

నిత్యమో కాదో - భావింపగా దీన లాభంబు చేకూరుటల్
చూడగా నెన్నడో ప్రేమ బోధింపవే యాత్మ శోధింపవే ప్రీతి
సంధింపవే డింపవే శంక - పొందింపవే తాల్మి - నొందింపవే
తెల్వి నందింపవే చేతికిన్ - నీ ప్రసాదార్థము న్నాదు నిక్షే
పమా బ్రహ్మదేవోపమా జ్ఞాన దృగ్దీపమా యింక తత్త్వోప
దేశంబు గావింపుమా ద్రుంపుమా క్లేశమున్ దెంపుమా జన్మ
పాశంబులన్ మంత్రమూర్తిన్ దయాసారవర్తిన్ దిగంత స్థకీర్తి
సదాభంజితార్తిన్ త్రిజ్ఞానేక్షణ ప్రాప్తితో మూడు నేత్రంబులన్
మించువౌశంకరా పావనా శంకరాశంఖచక్రాంక హస్తంబులన్
మించు దామోదరా సల్లలామోదరా నిత్య సత్యాధికారత్వ
మున్ బూను భాషా విలాసాతితీక్షా నివాసా జనాశ్చర్య చర్యా
హిమాహార్య ధైర్యా మహౌదార్యధుర్యా అనిందాముకుందా
సనందా మరిందావకధ్యానమున్ మీసమస్తాగ మామోఘవా
క్యంబులన్ స్తోత్రమున్ జేయగన్ రెండు వేల్కాల్కు లున్నట్టి
దర్వీకర స్వామికైనం వశంబే-మహీ దేవతాముఖ్య నే నెంత
వాడన్ నరుండన్ జఘుండన్ ఖలుండన్ విటుండన్ శఠుండన్
కుబుద్ధిన్ దురాచారుడన్ నీచుడన్ తామసుండన్ నృశంసుండ
నత్యంత చోరుండనయ్యా మృషాభాషణుండన్ విషాదంబులన్
జెందు దుర్మార్గ శీలుండనౌ పాపకృత్యుండ నేమందు నో దేవ-
నాచిత్త సందేహమున్ బాపవే శీషన్ మందున్ భవత్పాద
ముల్ మోపవే నీ దయాదృష్టియుం జూపవేయోపవేనాదు
తప్పుల్ ప్రపంచోపకారా - స్మరాకార ధీరా - అహంకార
దూరాసుధీరాజరాజా మహారాజ యోగానుకారా-వికారార్తి
ఘోరాంధకారాళి సూరా - దోరావిన్ పరాకీ మొరాలింప
రాదా యటం చామహాభాగునిం చిత్తసింహాసనంబందు పొం
దించి యా వాహనంబున్ వెసంజేసి గంగాంబు రేఖా ఘటశ్రేణి

తో పాద్య మర్ఘ్యంబు శుద్ధాచమానంబు స్నానంబు వస్త్రోప
వీతంబులున్ గంధమాల్యంబులున్ భూషణ ప్రాతమున్ దీప
మున్ ధూపమున్ మంచి నైవేద్యమున్ దక్షిణా స్వీత తాం
బూలమెల్లన్ సమర్పింపుచున్ జుట్టుగావచ్చి వేడ్కన్ నమస్కార
ముల్ చాల పన్నెండుగావించి భక్తిన్ చతుర్ముఖ శిష్యోపలన్
జేసి బద్ధాంజలివ్యక్త-హస్తుండనై నిల్చియున్నట్టి - నా విన్నపం
బెల్ల నాలించి-ప్రేమన్ విలోకించి తామిట్లు భాషించిరో - వత్స
నీప్రశ్న మేలైనదా నీప్రకారంబుగా-నీకలక్షోణిలో దెల్పమం
చాడగా నెవ్వరున్ లేరు సద్వ్యాఘృతంబింపు శ్వానాళికిన్ గాని
చందాన సాధూక్తులున్ సొంపుగావంచు తామందు రేమందు నీ
విందు విచ్చేయుటల్ పొందుగా మెచ్చితోనాకు యీపెంపు బో
ధింపుదున్ రక్తిబోధింపుదున్ యుక్తి రెట్టింపుదున్ వింటివా -
వత్స లోకాచలంబున్ చలంబీయుగంబున్ విమర్శించి యీ
రెంటి యాద్యంతమెల్లన్ గురుశ్రీకటాక్షంబున్ దానెరుంగన్
మదోన్మత్త మాతంబున్ సింహామున్ స్వప్న మందున్విలోకించి
తానాశమున్ బొందుచందాన మాయావికారంబు నిర్మూల
మైపోవునీరీతియున్ గానకన్ తాము వేరొండురీతిన్ పరీక్షించితే
తద్వివేకంబె హీనంబగున్ తాల్మి నాలింపుమంచన్న తత్పాద
ధూళిన్ తలందాల్చి విజ్ఞాపనంబల్లనన్ జేసితిన్ దేశికాయీచలం
బెట్టిదో యాచలంబేమియుం లేని వస్తువ్రజంబెట్టిదో వీనిపుట్టించు
వాడువ్వడో స్వామి యీరెండు నెందుండునో యేడకుంబోవునో
ప్రశ్నలుంచేయు నేనెవ్వడో నేడు నిత్యాది సందేహామున్ దెల్పి
డెందంబునంటంగ వేర్వేర నేర్పాటుగా నానతియ్యంగ దేయంచు
ప్రార్థింప-నిట్లానతీ సాగిరోయన్న - యష్టాంగ యోగంబులున్
లెస్సగా నష్టసిద్ధుల్ మతప్రక్రియాజాలముల్ జూడగానన్నియున్
నిత్యమంచున్న వారందరున్ - శాస్త్రజాలంబనే తాలముల్ పె

క్కలుంగల్గి జీవేశ్వరవ్యక్తమైనట్టి ప్రాకారమా దుర్గమంబా మహాద్వారభాగంబుకుం మ్రొక్కుచుకాని - తద్వారముం దగ్గమున్ జేయుచుంవచ్చి యా నిత్య వస్తుక్రమం బంతయున్ గాంచి నల్లానె - యా తాళముల్ గూర్పగా తీర్పగా జాలు ధీమంతుడే సద్గురుండౌను పాటింపగా నాతడే నామరుద్దేను చంచత్తమో భానుబల్ తాళిమిన్ బూను విశ్వప్రియుండౌను - వేరెవ్వరైనన్ వెసందియ్యబోతే అసాధ్యంబు తానొక్కటిందియ్యబోతే బడున్ తాళముల్ కోటిలక్షల్ సహస్రంబు తియ్యంగ కేలాడ దెవ్వారికిన్ నొచ్చి వేసారియున్ నిల్వకన్ బారియున్ బుద్ధినిన్ దూరియున్ తెల్వినే మారియున్ - తాము నేదారియున్ బట్టకన్ గుందుచున్ చచ్చుచున్ బుట్టుచున్ భ్రాంతులై యుందురా మేలు వీక్షింపరా భూమిలో నింక వింటే - అహం బ్రహ్మమస్యాది భాష్యోక్తమా నీ మహా వాక్యముల్ బట్టువారందరున్ మాయ వేకాని వేరొండగాదయ్య - వీక్షించుమీ వియ్యడన్ తండ్రి - యింకన్ మరిన్ దెల్పుదున్ కరి - యష్టాంగ యోగంబులన్ ముద్రలున్ గాంచి యజ్యోతి ముఖ్య ప్రలక్ష్యంబులన్ జూచి యానా నిదే బ్రహ్మమంచున్ లయాతీతమంచున్ స్థిరాపూర్ణమంచున్ భవక్షేమనాశ ప్రదూరం బటంచున్ పునర్జన్మ నిహేంన్తు వంచున్ నిరంతం బమాయ స్ఫుటంబంచు నేతత్ప్రభావచ్ఛటాపూర్ణమం చుబ్బియద్దృష్టత నృష్టవాక్యంబుపై జ్ఞప్తి లేకన్ ప్రవర్తించు వారందరున్ మాయలో జేరువారే తలంపంగ నా జ్యోతియే యాదిగాగల్గు వస్తువ్రజంబెల్ల బైలంచనంతంబటంచున్ మదిన్నమ్మి విభ్రాంతియున్ వీడియున్ మాయ యైనట్టి నేనంచు నల్లంబులో నమ్మి నాకెంతయున్ మీదుగా నిండియుండే నిరాకార నిర్లక్ష్య నిర్వంచనాద్యంత శూన్యంబునా బట్టబైలై స్వత

క్కలుంగల్గి జీవేశ్వరవ్యక్తమైనట్టి ప్రాకారమౌ దుర్గమంబౌ మహాద్వారభాగంబుకుం ముక్కుటేకాని - తద్వారము దగ్గమున్ జేయుచుం వచ్చి యా నిత్య వస్తుక్రమం బంతయున్ గాంచి నట్లానె - యా తాళముల్ సూర్పగా తీర్పగా జాలు ధీమంతుడే సద్గురుండౌను పాటింపగా నాతడే నామరుద్ధేను చంచత్తమో భానుబల్ తాళిమిన్ బూను విశ్వప్రియుండౌను - వేరెవ్వరైనన్ వెసందియ్యబోతే అసాధ్యంబు తానొక్కటెందియ్యబోతే బడున్ తాళముల్ కోటిలక్షల్ సహస్రంబు తియ్యంగ కేలాడ దెవ్వారికిన్ నొచ్చి వేసారియున్ నిల్వకన్ బారియున్ బుద్ధినిన్ దూరియున్ తెల్వినే మారియున్ - తాము నేదారియున్ బట్టకన్ గుందుచున్ చచ్చుచున్ బుట్టుచున్ భ్రాంతులైయుందురౌ మేలు వీక్షింపరౌ భూమిలో నింక వింటే - అహం బ్రహ్మమస్యాది భాష్యోక్తమౌ నీ మహా వాక్యముల్ బట్టువారందరున్ మాయయేకాని వేరొండుగాదయ్య - వీక్షించుమీ వియ్యడన్ తండ్రి - యింకన్ మరిన్ దెల్పుదున్ కుర్రి - యష్టాంగ యోగంబులన్ ముద్రలున్ గాంచి యజ్యోతి ముఖ్య ప్రలక్ష్యంబులన్ జూచి యానా నిదే బ్రహ్మమంచున్ లయాతీతమంచున్ స్థిరాపూర్ణమంచున్ భవక్షేమనాశ ప్రదూరం బటంచున్ పునర్జన్మ నిర్హేతు వంచున్ నిరంతం బమాయ స్ఫుటంబంచు నేతత్ప్రభావచ్చటాపూర్ణమం చుబ్బియదృష్టత న్నష్టవాక్యంబుపై జ్ఞప్తి లేకన్ ప్రవర్తించు వారందరున్ మాయలో జేరువారే తలంపంగ నా జ్యోతియే యాదిగాగల్గు వస్తువ్రజంబెల్ల బైలంచనంతంబటంచున్ మదిన్నమ్మి విభ్రాంతియున్ వీడియున్ మాయయైనట్టి నేనంచు నల్లంబులో నమ్మి నాకెంతయున్ మీదుగా నిండియుండే నిరాకార నిర్లక్ష్య నిర్వంచనాద్యంత శూన్యంబునా బట్టబైలై స్వత

స్సిద్ధమై నిత్యమై సత్యమై - సర్వకర్తృత్వ భోక్తృత్వమం
తృత్వ యంతృత్వ రక్షత్వశిక్షత్వముల్ లేనిదై యున్న దానిన్
గురూక్త ప్రకారంబునన్ దానెరుంగన్ మరిం దాను నేనంచు
భాషించు వాక్యాళితో తాన లేకుంటె పై మాట బల్కంగ రా -
దెన్న డెట్లంటె గాఢాంధకారంబు విశ్వాససంసిద్ధకిం క్రొమ్మెక్కి తా
నాశ్రయించన్ సహస్రాంశు ముందున్ నిలంబోయి తామేమి
లేనట్లు తా నేమియున్ లేకపోతే గణింపంగ తారాకముందున్న
చందాననే యెప్పుడున్నట్లుగా నుండు యీ తెల్వి రీతిం ప్రవర్తిం
చకన్ తమ్ము తామెప్పుడున్ జూచుచున్ నిక్కుచున్ నీల్గు
చున్ విగ్రవీగంగ నున్నట్టివారిన్ గనంజోలినీ కేలనా మాటలన్
నమ్మి నీవున్నదున్నట్లు మున్నున్నదె నిశ్చయంబంచు సందేహ
మున్ మానుమా - లేక నే తత్ప్రకారంబునన్ నీవు వర్తింపవై
తేని నానా పురాణేతిహాసాధన్ శాస్త్రికశబ్దాంబు వీచీ మహా
బుద్బుదగ్రాహ బిందుచ్ఛటాయుక్తి చే గానవై నట్టిబల్ సుళ్ళలో
జిక్కబోయ్యేవు మున్నెన్నబదే నాల్గులక్ష ప్రజన్మంబులన్ బడ్డ
ఖేదంబులన్ వెర్రిమోదంబులన్ దెల్వి లేదా మహాచింత గాదా
మనభ్రాంతిబోదా యమర్యాదగాదా పరీక్షించరాదా సదా
యాసమింకేల నోయన్న - నీకింతగా సత్కృపాదృష్టితో జెప్పి
నన్ జుల్కగా నందరున్ దెల్పు వాక్యంబు లట్లెంతయున్ న్నేడు
సామాన్యరీతిన్ విచారింతువో యాసరక్షేత్రమందున్ సుబీ
బీజంబులన్ గూచున్ చందంబులన్ నాదు సల్లాపముల్ నిష్ఫల
ప్రాయమున్ జేయకోయయ్య యీ నెయ్యమయ్యో వృధారీ
తిగాతోచెనా సేయుమాలోచనన్ జక్కగా నెట్లుగా నేర్ప
డున్, నీకు నేనధన్ కామంబునన్ ఖ్యాతి లాభాభిరామంబునన్
ధీ ప్రతిష్ఠా లలామంబునన్ లంచమున్ గాంచు సామంబునన్ దె
ల్పుటల్ గాదు నా సద్గురు శ్రేష్ఠుడున్ నీచమార్గంబు తామా

నతీలేదురా రాజమార్గం బనుష్టింపగా జేసినారయ్య వారంత
వారెవ్వరున్ లేరు భూమండలిన్ వారికిన్ సాటివారేరి దా-
మింటికిన్ సాటిమిన్నే - సముద్రంబుబోలన్ సముద్రంబె యి
బ్భూమికిన్ పాటి యిబ్భూమియే కాని యింకొక్కటిం లేని చం
దాన తాముండి కారుణ్య సంశీలురై - యానతీజాలు వాక్యంబు
లన్ కొందరాలింప రారీతి యెట్లంటె - లోకంబునన్ వ్యాఘ్ర
మున్ జేరి నన్నీవు భక్షించుమంచే రవంతైన భక్షింపదా తానె
తావచ్చి భక్షించునేగాని బల్మిం ప్రబోధింపగాబుట్టునే తెల్వి
చాలామనశ్శుద్ధియున్ గల్గి యత్యాతురుండైన ధీశాలి కేలబ్ధమా
గాక సందేహియౌ వానికిన్ పెక్కురీతుల్ విజృంభించు శా
స్త్రంబులున్ సత్యమంచుండు నెవ్వండొ యా దేవతాభ్రాంతి
లోనుండు నెవ్వండొ పల్మారువాదించు నెవ్వండొ - గుర్వం
ఘ్రిసంపూజనల్ సేయుడెవ్వండొ - తానెట్టులన్ బల్కునో
తద్విధానంబుగా బల్కు నెవ్వండొ నారీజనభ్రాంతు డెవ్వండొ
విజ్ఞాన విభ్రాంతు డెవ్వండొ సద్భక్తి విభ్రాంతు డెవ్వండొ వై
రాగ్యమే శ్రేష్టమంచాడు నెవ్వండొ - బల్ మోక్షవిభ్రాంతు
డెవ్వండొ - బద్ధుండ నంచుండు నెవ్వండొ - యెంతో భయం
బొందు నెవ్వండొ - బైలై ప్రవర్తింతు నంచుండు నెవ్వండొ-
నిత్యంబదే నైతినంచుండు నెవ్వండొ - నిత్యానుభావం బికం
గావలె న్నెంచుటంచుండు నెవ్వండొ నేనేన వేరొండు
లేదంచు భాషించు నెవ్వండొ - లోకంబునన్ నామతం బెక్కు
వంచుండు నెవ్వండొ అద్వైత విభ్రాంతు డెవ్వండొ - యా
ద్వైత విభ్రాంతు డెవ్వండొ - ఆకర్ణన భ్రాంతుడెవ్వండొ -
బల్ మన్నన భ్రాంతుడెవ్వండొ దుర్బుద్ధి యెవ్వండొ-యిత్యా
దులా వారికిన్ జెప్పరాదంచు నిర్దేశముంజేసి- రా- విన్మ నేడో
కక్కైనన్ - సదాభ్రాంతియుం బుట్టకుండన్ నిజంబెవ్వరుం సూచ

తన్ జేతురోయంచు నత్యంత మాసక్తియున్ గల్గి సందేహముల్ లేకబల్ సూక్ష్మబుద్ధిన్ విజృంభించియున్ సూచనన్ జేయుచుండం గనేయింగితంబింతయుంగాంతలై నన్ భువిన్ పూరుషప్రాణులైనం తదీయాశయంబింతయున్ గాంచుసనాసన్మశ్రేణికిన్ ద్వాదశాబ్దంబులన్ తన్మనోనిష్ఠలెల్లన్ పరీక్షించి - యీ రాజమార్గంబు బోధింతురంచున్ - వసిష్ఠుండు - సాందీపుడున్ - భూమిపుత్రి - పితృస్మృతలేకుండు - ప్రహ్లాదుడున్ - నారదుండున్ - మరిం దేవకీపుత్రుడౌ యాదిగాగల్గువారందరున్ బల్కిరౌ చాలవిద్యకశూన్యం బవిద్యైక శూన్యంబునై నట్టి మార్గంబాగిన్ దులన్ భంబంబుచోరస్థితిన్ వచ్చినన్ జెప్పరాదంచు బోధించి కారుణ్యదృష్టిన్ విలోకించినన్ చెంతకున్ జేరరావించి వేడ్కన్ చతుస్సాధనస్ఫూర్తియున్ గల్గువాడంచునుల్లంబులో మెచ్చి యిట్లాడెనో వత్సనీచిత్తమున్ నిశ్చలంబందగా నిన్నిచందంబులన్ జెప్పతిన్ దీనికన్నన్ పరంబెద్దియున్ లేదు - లేదయ్య నాసద్గురుస్వామిపాదంబులానయ్యయుంచున్ త్రిదీక్షావిధిన్ గల్గగా జేసియున్ హస్తమస్త ప్రసంయోగమున్ జేసియున్ సుప్రసాదంబులున్ మూడు గల్పించి వేడ్కన్ చతుర్వేదయుక్తంబులౌ! నాల్గువాక్యంబులెల్లన్ కటాక్షించి తర్వాత సంపూర్ణబోధాస్థితిన్ ద్వాదశీషోడశీదారలన్ వేడ్క మేల్కొల్పి-పన్నెండులో నున్న యధబంన్ దేచూడుమయ్యా స్వతస్సిద్ధమై నిత్యమై సత్యమై వృత్తియున్ లేనిదై పూర్ణన్ మయ్యున్నదంచున్ కనన్ జేసి తర్వాతతామిట్లు భాషించిరోయప్ప-నీవిప్పుడున్ చూచుటెల్లన్ దయన్నేసచూపించుటెల్లన్ వెసం షోడశీమంత్రరీతిన్ భువిన్ దాన నన్నం విచారం బొంకితైనయున్ లేక తానున్నదంచెంతయున్ దెల్పినీరీతిదా దెల్పుచున్ బల్కనీమాయ మేలాఘవంబందులన్ బుట్ట లేదబ్ధికిన్ మీనమల్ బుట్టకన్ మించి తామేమి లేనట్లు నీవెప్పుడున్ మూలమున్

శ్రీమద్భాగవతకృష్ణ దేశికస్వాములవారి స్తోత్రం

## భక్తిపూర్వకముగా చేయబడిన సీసపద్యములు.

సీ. గురుపుత్రులార మద్గురుమూర్తి స్తోత్రంబు రచియింపగా బూనునా వచనములను - విన వేడ్క గలిగిన వినరయ్య వినిపింతు తప్పులుండిన వాటి దాచబోక - దిద్దవలసినది మీ దేశికేంద్రునిమీద మీకు భక్త్యున్నట్టె నాకుగలదు-గాని మీవలె నేను కవిత జేయగజాల చాల నంచని విడజాల తోచి - నట్లు జేయుదు మీరంద రభయమిడిన - ననుచు విజ్ఞాపనమొనర్చి యాజ్ఞగొంటి భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్ర ॥ ౧

సీ. శ్రీకాంత తోబుట్టువేకదా యనజాలు మోమునచిరునవ్వు మొలకలెత్త - అరవిందములక్రిందు పసుపజాలిన గొప్పకనులందు కరుణ దాగడగలుకొనగ - కోటిమన్మథులైన దీటుగానటువంటి సుందరత్వము మేనుసందడింప - అజ్ఞానసంతతి మోహాతిరేకమడంచు పలుకుల నమృతంబు జిలుకుచుండ - నభయవరదానములు చేతినాశ్రయింప - వచ్చి కనుపించు కనెదనా వాంచదీర భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్ర ॥ ౨

సీ. సారమోపసిడి జల్తారంచుధోవతి కటిభాగమునజేరి కాంతులీన - పగడాలడాలును నగజాలుకుళ్ళాయి తలమీద గూర్చుండి ధాటుజేయ- అతిచిత్రపట వినిర్మితమైన కవచంబు అద్దినట్లుగ మేనునావరింప - పాటలద్యుతిగల్గు పంచతో జతగూడి ముతుకదుప్పటిమీవ మురుపుజూప - కామధేనువు భుజమెక్కి గంతులిడగ - వచ్చికనుపించు కనెదనా వాంచదీర - భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా ॥ 3

సీ. మంచిగంధము కుంకుమనుగూడి నొసలందు మూడు రేఖలు
గల్గి ముద్దుగుల్క - రజితసూత్రాన్విత రమ్యప్రవాళ హారము కంధర
ప్రదేశమున వ్రేల-మిళితమై యొక వ్రేల మేలిమిబంగారు వుంగరంబులు
రెండు చెంగలింప-స్మరసతి కుచముతో సరిదూగుమారేడు బుర్ర
హస్తమునందు విర్రవీగ-గురుని పేరు వచింపుచు పురముదిరిగి - వచ్చి
కనిపించు కనెదనా వాంచదీర భాగవతవంశ భవకృష్ణయోగిరాజ - ధీవి
శారద మానుక దేశికేంద్రా॥ ౪

సీ. కుంభినీధవుడైన గోవిందుడిలమీద జంభ భేదికియను జన్మ
డగుచు - అదితిగర్భమున కశ్యపునకు వామనమూర్తియై జన్మించి
ముదముతోడ - యాచకాగ్రణి వేషమమరదాలిచి తమ కులధర్మమనె
కదా బలిని జేరి - యాచించె నొకటి రెండడుగుల మేదినీతలమును ద్విజు
లది దలచి కాదె - భిక్షమెత్తగబూనిరి బిడియమేల - భిక్షమే బ్రాహ్మణ
కులాని కక్షయమగు - భాగవతవంశ భవకృష్ణయోగిరాజ - ధీవిశారద
మామక దేశికేంద్రా॥ ౫

సీ. ఈజోలెతోగదా యిన్నాళ్ళు మీతండ్రి తాతముత్తాలు
ఖ్యాతిగొనుట - యీజోలెతోగదా యిన్నాళ్ళు మీరంత శుభశోభ
నములను చూరగొనుట - యీజోలెతోగదా యిన్నాళ్ళు మీరైన
భూసురోత్తములచే పొగడబడుట - యీజోలెతోగదా యికనైన
మీరలు బ్రతికినన్నిదినాలు మెతుకుదినుట - గాన యీ జోలెమంచిదే
మానకయ్య - భిక్షమే బ్రాహ్మణకులాని కక్షయ మగు భాగవతవంశ
భవకృష్ణయోగిరాజ ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౬

సీ. గ్రంథమొక్కటి నీవు కందార్ధములతోటి చేసినావని వింటి
చెప్పవయ్య-అధ్యాత్మలల్లి నీవఖిల దేవతలను స్తుతిజేస్తివట వాటిజూప
వయ్య - నిఖిలవేదాంతార్థవివహంబు కొద్దిలో యిమిడిస్తివట వాటి

నివ్వవయ్య-యీయన్నిటికి అర్థమే మెనా కెరిగించి పుట్టుచావులను బోగొట్టవయ్య - జన్మ మరణములనుజెంద చేతగాక - చాటుజొచ్చితి మన్నించు సదయహృదయ - భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ - ధీ విశారద మామక దేశికేంద్రా॥ ౭

సీ. నన్నేలనే కదా నారాయణుఁడువల్ల జానకమ్మకు నీవు జననమగుట - నాకుజెప్పనే కదా నయమైన గ్రంథముల్ చేసి నీవవి యెల్ల వ్రాసికొనుట-నాకు జూపనే కదా నానావిధములైన యోగముల్ సాధించి బాగుపడుట-నాకోసమే కదా శ్రీకారమాదిగా సర్వయుక్తవణఁ-ముల్ చదువుచుంట-ముక్తినాకిచ్చుటకే కదా యుక్తిజేసి-యనుదినము కోపగించి నా మనసుగనుట - భాగవతవంశ భవకృష్ణయోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౮

సీ. నీవు జూపితెగదా నే జూడకన్నది యైదుముద్రలను లక్ష్యములమూటి-నీవు నేర్పితెగదా నే నేర్చుకున్నది యష్టాంగ యోగముల్ స్పష్టముగను-నీవు దెల్పితెగదా నేదెల్సుకున్నది యష్టతనువులవాటికవలిదాని-నీవుజేయగగదా నిరుపమానాఖండ పరిపూర్ణమునుగని భ్రాంతి విడుట-నీవు నాపాలివేల్పవై నెగడితగద - నేను యిటువంటివన్నియు నేర్చుకొనుట-భాగవతవంశ భవకృష్ణయోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా ॥ ౯

సీ. తనయునిగానిన్ను గనిపెంచినట్టినీ తలిదండ్రిభాగ్యంబు తరమె పొగడ-వల్లభునిగానిన్ను వరియించినట్టినీ యిల్లాండ్ర భోగంబు నెన్న దగునె-సఖునిగాగానినిన్ను సరసోక్తులాడునీ స్నేహితులశిరి జెప్పనౌనె-గురునిగానిన్నుగైకొని సేవగావించు శిష్యుల ఫలము చర్చింపవశమె-శేషభాషాపతులకైన దోషదూర - భూరివేదాంతశాస్త్రవిచార సార - భాగవతవంశభవకృష్ణ యోగిరాజ-ధీవిశారద మామక దేశికేంద్రా ॥౧౦

సీ. నఖశిఖపర్యంత మఖిలావయవపూర్తి మూర్తివౌనిన్నతి మోదమునను - ధ్యానించిపిల్చి రత్నస్థగితాసనమునునుంచి పాద్యార్ఘ్యములనొసంగి - యాచమనాభ్యంజనాదులు గావించి వస్త్రమాల్యాది సద్వస్తువులిడి-ప్రతిపూల్ ధూపదీపాన్నముల్ తాంబూలములు దక్షిణాతిరిక్తములును - మంత్రపుష్పనతినుతులొనరింతు పుచ్చుకొనుము-తక్కువెక్కువలేమియు దలచబోక-భాగవతవంశ భవకృష్ణయోగిరాజ-ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౧౧

సీ. నీపాదతీర్థంబు నేగ్రోలుచుండేటి వారి కేగద మోక్ష వైభవంబు - నీత్రిప్రసాదంబునే రుచిగొనుచుండువారి కేగద మోక్ష వైభవంబు-నీపూజనము నిత్యనేమంబుగా జేయువారి దేకద మోక్ష వైభవంబు-నీ నిజతత్వంబు నీచేనెరింగిన వారిదేకద మోక్షవైభవంబు నిన్నుగని నన్నుయరి చేటి నిష్టబూను - వారిదేగత యామోక్షవైభవంబు-భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౧౨

సీ. ఈగురుస్తోత్రంబు నెవ్వరాలించిన వారికిభాగ్యంబు వచ్చుటరుదె - యీగురుస్తోత్రంబు నెవ్వరు వ్రాశిన వారికి స్వర్గంబు వచ్చుటరుదె - యీగురుస్తోత్రంబె నెవ్వరు నేర్చిన వారికి మోక్షంబు వచ్చుటరుదె - యీగురుస్తోత్రార్థ మెవ్వరు జేసిన వారికి భ్రాంతులు వదలుటరుదె-గాన యీగురునుతి నతికాంక్షతోడ - చదివెను జన్మమరణముల్ సమసిపోవ - భాగవతవంశభవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౧౩

సీ. ఈ గురుస్తోత్రంబు యింపుతో జదివిన వారాపదలబట్టి వంచగలరు - యీగురుస్తోత్రంబు యింపుతో వ్రాసినవారంతకునిబట్టి వంచగలరు-యీగురుస్తోత్రంబు యింపుతో నేర్చినవారు మిత్తినిబట్టి వంచగలరు - యీగురుస్తోత్రార్థ మింపుతో జేసినవారు మనసును బట్టి వంచగలరు-గాన యీగురునుతి నతికాంక్షతోడ - చదివెదను జన్మమరణముల్ సమసిపోవ - భాగవతవంశభవకృష్ణ యోగిరాజ - ధీవిశారద మామక దేశికేంద్రా॥ ౧౪

ఇతి శ్రీమదాంధ్రాధిరాజమహారాజ రాజయోగేంద్ర చంద్రులగు శ్రీమద్భాగవత కృష్ణదేశికస్వామిస్తోత్రం సమాప్తః సీసపద్యములు సంపూర్ణము.

---

## కీర్తన.

ఈదారితో సాటిదేదారి గాదయ్యా - ఏదారి దొరికెనాను కాధార మానుమనసు ॥ప॥౧॥ సారామాదీక్షితయ్య సారాముదీనికి యే-ఘోరాము లేదు వట్టి నేరాములెన్నవచ్చే ॥ఈ॥౨॥ దేహదేహము లుగాని దేశాముజూపియువల - దేహదేహముల దీసె దేశికోత్తములు మెచ్చే॥ఈ॥౩॥ మోదాముజెంది జనులు పాదముబెట్టుటాకు - వేదాము జదివి వట్టి వాదము జేసెరిందు॥కీ॥౪॥ జ్ఞానాజ్ఞానముల నెరిగేజ్ఞానాని కన్నపైది - యీ నేను జెప్పేమాట దీనాగడ తేరవచ్చు ॥యీ॥ ౫॥ చలనాము లేనిదొకటి చలియించేదొకటి మీరీ-చలనామె లేక నిశ్చల నామె తెలిసిపోరు॥ఈ॥౬॥ యెరుకామరుపుల నెరిగేయెరుకాకు దొరు కనట్టి-పరిపూర్ణబోధ దీనినెరిగితె తిరిగిపుట్ట॥ఈ॥౭॥ యెంతో చదివిన వారలంతా మీకెరుకే నాచే - రంతూజేయించి విన సంతోషమైన దేమొ॥యీ॥౮॥ వాలాయముగను భాగవత కృష్ణదానుచే యీ - జాలామాంబికవిని జన్మమరణములాబాసె॥యీ॥౯॥

కీర్తన సంపూర్ణము.

---

## మంగళహారతి.

గురునకు మంగళమనరమ్మా - మ-ద్గురుమూర్తిని గనుగొనరమ్మా ॥ప॥తరుణులార యీతనిభక్తితో మరయుచు మొరికిన మోక్షము చేకురు ॥గు॥౧ క్షరపురుషుండనరాదమ్మా — అ క్షరపురుషుండనగాదమ్మా - క్షరపురుషాక్షర పురుషుల కావలి - బురుషోత్తము డనబరగినమాయీ॥౨॥ క్షేత్రజ్ఞుండనగాదమ్మా — యీ క్షేత్రమతం

డనగాదమ్మా - క్షేత్రిజ్ఞుని తత్ క్షేత్రింబును యే - మాత్రము దగులక పాత్రుడైన యీ॥ గు॥ ౩॥ స్మరణరూపుడనరాదమ్మా - వి - స్మరణ రూపుడనగాదమ్మా - స్మరణలేక విస్మరణగానక త - త్స్మరణ విస్మరణ లెరుక లేని యీ॥గు॥౪॥ దేహీయనుట కనరాదమ్మా - యీ - దేహ మతండన గాదమ్మా అహంభావనకంటు సొంటులగు - దేహీ దేహముల తెరువుబోని యీ॥ గు॥ ౫॥ పిండరూపుడనరాదమ్మా-బ్రహ్మాండరూపు డనగాదమ్మా-పిండాండ బ్రహ్మాండభాండముల-నిండియుండి యవిరెండు గాని యీ॥గు॥ ౬॥ జ్ఞానియనుట కనరాదమ్మా - అజ్ఞాని యనుటకది లేదమ్మా - జ్ఞానాజ్ఞానములోన నొక్కటియు - తానుగాక శూన్యానికి మీరిన॥గురు॥౭॥ యోగియనుట కనరాదమ్మా - మరి - భోగియనుట కనరాదమ్మా - యోగిభోగి వుద్యోగములంటని - భాగవతాన్వయ భవకృష్ణుండనే ॥ ౮ ॥ మేలుకీడులదిగాదమ్మా - కాలకూటమునకన్న మిక్కిలగు - జాలమూంబవె తక్షణములో బాపిన॥గు॥ ౯

## మంగళహారతి.

మామక గురునకు మంగళం-బ్రహ్మాండనగునకు మంగళం ।ప।
మానరహితునకు మంగళం - అసమాన చరితునకు మంగళం ॥౧॥
ద్వంద్వశూలునకు మంగళం - నిర్ద్వంద్వ ఖేలునకు మంగళం ॥౨॥
శూన్యశూన్యునకు మంగళం-బహుమాన్యమాన్యునకు మంగళం ॥౩॥
శబ్దలోపునకు మంగళం నిశ్శబ్దరూపునకు మంగళం ॥౪॥ భేదముక్తునకు మంగళం --నిర్భేదిస్తునకు మంగళం ॥౫॥ త్రిపుటిదూరునకు మంగళం - నిస్త్రిపుటిసారునకు మంగళం ॥౬॥ బుధ్యతీతునకు మంగళం - నిర్బధ్యపేతునకు మంగళం ॥౭॥ గళితతాపునకు మంగళం - నిర్గళితపాపునకు

మంగళం ||౮|| గోప్యగోప్యునకు మంగళం - అప్రాప్యప్రాప్యునకు మంగళం||౯|| దేవసేవ్యునకు మంగళం - నిర్భావభావ్యునకు మంగళం||౧౦|| దీనభరణునకు మంగళం - అభి - మానహరణునకు మంగళం ||౧౧|| కృష్ణనామునకు మంగళం - దుస్తృషభీమునకు మంగళం||౧౨|| జాల మేశునకు మంగళం - స్మృతి - జాలనాశునకు మంగళం||౧౩|| మామక గురునకు మంగళం - బ్రహ్మాండనగురునకు మంగళం ||౧౪||

ఇతి శ్రీమద్రాజాధిరాజ రాజమహారాజ యోగీంద్ర చంద్రులగు శ్రీమద్భాగవత కృష్ణదేశికాచల పాండిత్య స్వగురుపరమగురు పరమేష్టి గురుసద్గురు జగద్గురు నిజగురు పరబ్రహ్మ చరణారవిందార్పణమస్తూ ॥

శ్రీమత్ ఫీల్ ఖానా శంకరప్రభువు మహారాజుకీ జై.
జై బోలో శ్రీ సద్గురుప్రభువు మహారాజుకీ జై.
సర్వం శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు.

